# వ్యాఖ్యావళి

ఆంధ్రజ్యోతి నుంచి ఎంచి సంకలించిన సంపాదకీయాలు

(1963-1994)

నండూరి రామమోహనరావు



లిఖిత ప్రచురణలు

దుర్గయ్యవీధి, ఏలూరు రోడ్, విజయవాడ - 520 002.

# VYAAKHYAAVALI

A Collection of Editorials

By

**Dr. Nanduri Ramamohana Rao**

Published by
**Likhita Prachuranalu**
Vijayawada - 520 002

First Edition
November 1997

**Price : Rs. 60 .00**

Cover Design
**Chandra**

Composed at
**Fontline Graphics**
Baghlingampally
Hyderabad - 500 044
Ph : 7660000

Printed at
SWAMY OFFSET PRINTERS
Vijayawada

Sole Distributors
**Pallavi Publications**
Eluru Road,
Vijayawada - 520 002



ఆంధ్రజ్యోతి వ్యవస్థాపకులు కీర్తిశేషులు **శ్రీ కె.ఎల్.ఎన్. ప్రసాద్‌గారి స్మృతికి**

# సంపాదకీయ సూచిక

# ముందు మాట

దిన పత్రికలకు ప్రతిదినం సంపాదకీయం తప్పనిసరి. ఇంగ్లీషు దినపత్రికలైతే రోజుకు రెండు, మూడు, నాలుగు వరకు సంపాదకీయాలు వ్రాయడం పరిపాటి.

దిన పత్రికలే కాదు; వారపత్రికలు, మాసపత్రికలు కూడా సంపాదకీయాలు వ్రాయడం పరిపాటి అయింది.

అయితే తెలుగు పత్రికల సంపాదకీయాలను చాలా తక్కువ మంది మాత్రమే చదువుతారనే ప్రథ వున్నది. ఎంత తక్కువ మంది చదువుతారని ప్రశ్నిస్తే, రకరకాల అభిప్రాయాలు వినవస్తాయి. నూటికి ముగ్గురు, నలుగురి కంటె ఎక్కువమంది చదవరని ఒక సర్వేలో తేలిందట. అయితే ప్రతి పత్రిక, ముఖ్యంగా ప్రతి పత్రికా సంపాదకుడు తమ సంపాదకీయాలను మాత్రం నూటికి పది, పదిహేను మంది వరకు విధిగా చదువుతారని, పైగా లొట్టలు వేసుకుంటూ చదువుతారని, నూటికి ముగ్గురో నలుగురో చదివేది ఇతర పత్రికల సంపాదకీయాలను మాత్రమేనని సగర్వంగా చెప్పుకోవడం కూడా వింటూ వుంటాము.

మొత్తం మీద పత్రికా సంపాదకీయాలను తక్కువ మందే చదువుతారన్న మాట కాదనలేము. దిన పత్రిక ప్రధానంగా వార్తలు ప్రచురించే పత్రిక. ప్రధానంగా వార్తల కోసమే వార్తా పత్రికలు చదువుతారు.

అయితే, దిన పత్రిక ప్రచురించే వార్తలను మాత్రం అన్నింటిని అందరూ చదువుతారా? తెలుగు పత్రికలు సుమారుగా పదహారు, లేదా పద్దెనిమిది పేజీలు ప్రచురిస్తాయి. ఇంగ్లీషు పత్రికలు 20 నుంచి 32 వరకు పేజీలు ప్రచురిస్తాయి. మరి, పత్రిక చదివే ప్రతి వారూ రోజూ అన్ని పేజీలలో అన్ని వార్తలూ చదువుతారా?

చదవరు. ఎవరికి అవసరమైన వార్తలను వారు చదువుతారు. ఎవరికి ఆసక్తి కలిగించే వార్తలను వారు చదువుతారు. మిగతావాటిని హెడ్డింగులు మాత్రం చూసో, అవికూడా చూడకుండానో వదిలేస్తారు.

అలాగే సంపాదకీయాలు కూడా. ప్రతి సంపాదకీయాన్ని ప్రతి పాఠకుడు చదవడు. సంపాదకీయ విషయం తమ ప్రయోజనాలకు సంబంధించినదో, తమకు అవసరమైనదో, ఆసక్తి కలిగించేదో అయితే చదువుతారు. విషయం ఆసక్తి కరమైనదైనా, రచన ఆసక్తికరంగా లేకపోతే చదవరు. విషయ వివరణ స్పష్టంగా లేకపోతే చదవరు. శైలి,బాగా లేకపోతే

చదవరు. సంపాదకుడు ఎంతబాగా వ్రాయగలిగితే అంత ఎక్కువమంది చదువుతారు. ఒక్కొక్కసారి విషయం సమకాలిక ప్రాధాన్యం కలిగింది కాకపోయినా, తమకు నేరుగా సంబంధించింది కాకపోయినా, రచనఎంత ఆసక్తికరంగా వుంటే అంత ఎక్కువమంది చదువుతారు.

మొత్తం మీద ప్రతి పాఠకుడు ప్రతి సంపాదకీయాన్ని చదవడన్నది మాత్రం నిజం. అంత మాత్రాన పత్రికకు సంపాదకీయం అనవసరం కాబోదు. ఎక్కువమంది చదవనంత మాత్రాన సంపాదకీయ ప్రాధాన్యం తగ్గబోదు. వార్తల ప్రాధాన్యం వార్తలదే; సంపాదకీయాల ప్రాధాన్యం సంపాదకీయాలదే. ఆ రోజు వచ్చిన ముఖ్యమైన వార్త గురించి, మరునాడు తమ పత్రిక సంపాదకుడు ఏమని వ్యాఖ్యానించాడు, దానిపట్ల ఏ దృక్పథం అవలంబించాడు అనేది తెలుసుకొనడానికి పాఠకులు సంపాదకీయం చదువుతారు. సంపాదకుని అభిప్రాయాలు సహేతుకంగా లేకపోయినా, వివరణ విస్పష్టంగా లేకపోయినా విసుక్కుంటారు. తమ అభిప్రాయాలకు, విశ్వాసాలకు పూర్తిగా విరుద్ధంగా వున్న సందర్భాలలో ఆగ్రహిస్తారు కూడా. ఒక వార్త గురించిగాని, ఒక సంఘటన గురించిగాని తమకు స్పష్టమైన అవగాహన కలగని సందర్భాలలో, అటువంటి అవగాహనను ఆ సంపాదకీయం కలగజేస్తే సంతృప్తి చెందుతారు. తమ అభిప్రాయాలతోను, విశ్వాసాలతోను ఆ సంపాదకీయం కూడా ఏకీభవిస్తే, తమ అభిప్రాయాలు, విశ్వాసాలు సరైనవే నన్న మాట అని సంతోషపడతారు.

ఇంతకీ, సంపాదకీయాలను ఎక్కువమంది చదివినా, తక్కువమంది చదివినా, పత్రికలలో సంపాదకీయాలు తప్పనిసరి. వ్రాయదగిన విషయం, వ్యాఖ్యానించవలసిన విషయం వున్నా, లేకపోయినా, సంపాదకీయం లేకుండా, ముఖ్యంగా ఏ దినపత్రిక వెలువడదు - వారానికి ఒక రోజు తప్ప. కొన్ని దిన పత్రికలైతే, వారానికి ఏడు రోజులూ సంపాదకీయాలు వ్రాస్తాయి.

ఎవరికి నచ్చినా, నచ్చకపోయినా, ఎవరి ప్రతిస్పందన ఎలా వున్నా, సంపాదకుడు తన అభిప్రాయాలను నిష్కర్షగా, నిస్సంకోచంగా వ్యక్తం చేస్తాడు, చేయాలి. అలా వ్యక్తం చేసిన సంపాదకీయానికే విలువ. నీళ్లు నములుతూ వ్రాసిన సంపాదకీయానికి నీటి మూట కంటె ఎక్కువ విలువ వుండదు. చెప్పడానికేమీ లేదనిపించే విషయం మీద వ్రాసినప్పటికీ, ఏదో విలువైన విషయాన్ని సరికొత్త కోణంనుంచి చెప్పడానికి, ఆసక్తికరంగా చెప్పడానికి సంపాదకుడు ప్రయత్నించాలి. దీనికోసం సంపాదకుడు వార్తకు సంబంధించిన అనేక వివరాలను అప్పటికప్పుడు సేకరించాలి. దాన్ని అన్ని కోణాలనుంచి చర్చించాలి. అతని

వ్యాఖ్య సహేతుకంగాను, తర్కబద్ధంగాను వుండాలి. భాష నిర్దుష్టంగాను, వివరణ నిర్దిష్టంగాను వుండాలి. శైలి ఆమూలాగ్రం చదివించేదిగా వుండాలి. ఆవేశంతో వ్రాసినా బాధ్యతాయుతంగా వుండాలి. ఒక సమస్యపై లేదా, సంఘటనపై ప్రజలలో అత్యధిక సంఖ్యాకుల అభిప్రాయం ఒకానొక విధంగా వున్నప్పటికి, అది సమంజసంగా లేదని తాను అభిప్రాయపడినప్పుడు ప్రజాభిప్రాయ ప్రవాహానికి ఎదురీదడానికి సంపాదకుడు వెనుదీయరాదు.

సంపాదకీయ రచన ఇంత శ్రమతో, బాధ్యతతో, బహువిషయ పరిజ్ఞానంతో, బహుముఖ పాండిత్యంతో కూడినది కనుకనే కొన్ని పత్రికలు, కొందరు సంపాదకులు తమ సంపాదకీయాలను అప్పుడప్పుడు సంపుటాలుగా వెలువరించే ఆనవాయితీ వున్నది. ముఖ్యంగా బ్రిటిష్ పత్రికలు. "హిందూ" దినపత్రిక తన శత వార్షికోత్సవ సందర్భంగా ఏడాదికొకటి చొప్పున నూరు సంపాదకీయాలను ఎంచి, ఒక సంపుటంగా ప్రచురించింది. తెలుగులో ఒకప్పుడు, అంటే స్వాతంత్ర్యోద్యమ కాలంలో, కృష్ణాపత్రిక సంపాదకీయాలకు ఒక ప్రత్యేకత, ఒక విశిష్టత వుండేవి. వాటిని పురస్కరించుకుని ముట్నూరి కృష్ణారావుగారి కొన్ని సంపాదకీయాలను వారి నిర్యాణానంతరం సంపుటీకరించడం జరిగింది. నార్ల వెంకటేశ్వరరావుగారు తాము ఆంధ్ర ప్రభ, ఆంధ్ర జ్యోతి పత్రికలలో వ్రాసిన సంపాదకీయాలనుంచి కొన్నింటిని ఎంచి "మూడు దశాబ్దాలు" పేరుతో ఒక సంపుటంగా ప్రచురించారు. సీనియర్ జర్నలిస్టు ఎ.బి.కె. ప్రసాద్‌గారు తాము పని చేసిన వివిధ పత్రికలనుంచి సంపాదకీయాలను తీసి సంపుటం తర్వాత సంపుటంగా ప్రచురించారు. ఈ మధ్యనే వారు సాహిత్య విషయాలపై వ్రాసిన సంపాదకీయాలన్నింటిని చేర్చి "నిబద్ధాక్షరి" (సాహిత్యకీయాలు) పేరుతో సంపుటంగా ప్రచురించారు. ఇక నేను, "ఆంధ్రజ్యోతి"లో వ్రాసిన రాజకీయేతర లఘు సంపాదకీయాలతో "అనుపల్లవి" అనే సంపుటాన్ని, మరణించిన ప్రముఖ వ్యక్తులపై వ్రాసిన సంపాదకీయాలతో (వీటిని ఒక మిత్రుడు సంతాపకీయాలు అని చమత్కరించారు) "చిరంజీవులు" అనే మరొక సంపుటాన్ని కొన్నేళ్ళ క్రిందట ప్రచురించాను.

ఇప్పుడు కొందరు మిత్రుల ప్రోత్సాహంతో ప్రచురిస్తున్న ఈ సంపుటంలో ఆంధ్రజ్యోతిలో 1962లో వ్రాయడం మొదలు పెట్టిన నాటి నుంచి, 1994లో సంపాదకుడుగా రిటైర్ అయ్యే వరకు నేను వ్రాసిన వేలాది సంపాదకీయాల నుంచి నూరింటిని ఎంచి చేర్చాలను కున్నాను. అయితే 1962 ప్రాంతాల నుంచి సుమారుగా 1976 వరకు వ్రాసిన వాటిలో ఇంతకు ముందు సంపుటాలలో రాని వాటిని సేకరించడం వివిధ కారణాలవల్ల

సాధ్యం కాలేదు. అయినప్పటికి, ఈ సంపుటపు సమగ్రతకోసం ఇంతకుముందు ప్రచురించిన అనుపల్లవి, చిరంజీవులు సంపుటాలనుంచి కొన్నింటిని మాత్రం తిరిగి తీసుకుని, ఈ సంపుటంలో చేర్చి "సంపాదకీయ శతి" ని పూర్తి చేశాను. అక్కడక్కడ పునరుక్తులనిపించిన మాటలను, వాక్యాలను తొలగించడం, భాష విషయంలో ఎడనెడ కొద్ది పాటి మార్పులు చేయడం, రెండు మూడింటి శీర్షికలలో చిన్న మార్పులు చేయడం తప్ప, మిగిలినదంతా యథాతథంగా పునర్ముద్రించడం జరిగింది. చారిత్రిక ప్రాధాన్యం మాత్రమేకాక, సమకాలిక ప్రాధాన్యం దృష్టినుంచి కూడా వీటిని ఎంచి పునఃప్రచురించడం జరిగింది. ఇంతేకాక, జర్నలిజం విద్యార్థులకు, నవతరం జర్నలిస్టులకు కూడా ఈ సంపుటం ఉపయోగపడగలదని ఆశిస్తున్నాను.

ఈ సంపాదకీయాలను తమ పత్రిక నుంచి ఎంచి తీసి పుస్తక రూపంలో పునఃప్రచురించుకొనడానికి అనుమతించిన "ఆంధ్రజ్యోతి" ప్రధాన సంపాదకులు, ప్రచురణ కర్త శ్రీ కె. జగదీశ్ ప్రసాద్‌గారికి నా కృతజ్ఞత.

హైదరాబాదు — నండూరి రామమోహనరావు

నవంబరు, 1997

# స్వామి వివేకానంద

ఆయనది అర్షవాణి. ఆయన సందేశం నిత్య నూతనమైంది; విశ్వజనీనమైంది. ఆయన తాత్త్విక దృష్టి ఎంత ప్రాచీనమైనదో అంత ఆధునికమైంది; అంత హేతుబద్ధమైంది. అందులో దుర్బలతకు, నిరాశకు, మూఢవిశ్వాసానికి, సంకుచితత్వానికి తావులేదు.

ఉత్తర దిగంతంనుంచి కారు మేఘాలు క్రమ్ముకుని వస్తూ, భారత జాతి స్వాతంత్ర్యాన్ని, ఆత్మగౌరవాన్ని సవాలు చేస్తున్న తరుణంలో స్వామి వివేకానంద శతజయంతిని మనం జరుపుకొంటున్నాము. చైనా దురాక్రమణ కారణంగా దేశం నిద్రమత్తును వదలించుకుని పునశ్చైతన్యవంత మవుతున్న సమయంలో ఈ ఉత్సవాలు నేటినుంచి యావద్భారతంలో ప్రారంభమవుతున్నాయి. భారత దేశం ఒక కొత్త సందేశం కోసం, ఒక కొత్త విశ్వాసంకోసం అన్వేషిస్తున్న సమయమిది. ఆ సందేశం, ఆ విశ్వాసం స్వామి వివేకానంద జీవితంలో, ఉపదేశాలలో మనకు లభించ గలదు.

రాష్ట్రపతి రాధాకృష్ణన్ మద్రాసు రామకృష్ణ మఠం వారికిచ్చిన సందేశంలో తెలిపినట్టు వివేకానంద వ్యక్తిత్వంలో హైందవ సన్యాస ధర్మం, సంఘ సంస్కరణోత్సాహం, దేశభక్తి - ఈ మూడు ప్రధాన లక్షణాలు కానవస్తాయి. ఆయన హిందూ మతాన్ని గ్రుడ్డిగా ఆరాధించలేదు. అందులో దైహిక, మానసిక దౌర్బల్యానికి దారి తీసే దుర్ల క్షణా లన్నింటిని తిరస్కరించాడు. హిందూసంఘ పతనానికి కారణమైన వర్ణ వ్యవస్థను, అస్పృశ్యతను, ఇతర మూఢాచారాలను త్రోసివేశాడు. హిందూ మతంలో ఏది సజీవమైనదో, ఏది చైతన్యవంతమైనదో దాన్నే ఆయన స్వీకరించాడు. అది ఆయనకు ఉపనిషత్తులలో, భగవద్గీతలో లభించింది. జ్ఞానయోగంపై ఆయన ఉపన్యాసాలు ఆయనకు అపరశంకరుడనే బిరుదు ప్రసాదించాయి. న్యూటన్, డార్విన్ వంటి శాస్త్రజ్ఞుల సిద్ధాంతాలను వేదాంతానికి అన్వయించడానికి జరిగిన బృహత్ప్రయత్నం వాటిలో కనిపిస్తుంది.

ఆయన కేవలం జ్ఞానయోగి మాత్రమేకాడు; కర్మయోగి కూడా. నిజమైన జ్ఞానం నిష్కామ కర్మలో పర్యవసిస్తుందని ఆయన నమ్మకం. ఈ నమ్మకంతో ఆయన పతనమై, నిద్రాణమై వున్న భారతదేశాన్ని మేల్కొలిపి, పునరుద్ధరించడానికి నిర్విరామకృషి చేశాడు. సంఘసేవకు, మానవ సేవకు మించిన మతం లేదని ఉద్బోధించాడు. సర్వమానవ సమానత్వాన్ని ప్రబోధించాడు. తాను సోషలిస్టునని ఒకానొక సందర్భంలో ఆయనే చెప్పుకున్నాడు. సంఘానికి అట్టడుగున పడివున్న జనబాహుళ్యాన్ని వెలుగులోకి, వికాసంలోకి తీసుకురావడానికి గల సాధనాలలో సోషలిజం మెరుగైనదని ఆయన విశ్వసించాడు.

రాజకీయాల జోలికి ఆయన అంతగా వెళ్లకపోయినా, జాతి పునర్నిర్మాణానికి స్వాతంత్ర్య

సాధన అవసరమని ఆయన భావించక పోలేదు. ముందుగా శక్తి సంతరించుకొనాలని ఆయన బోధించాడు. దైహిక, మానసిక దార్ఢ్యం, నిర్భయత్వం ఈ రెండు ఆయన తాత్త్విక చింతనకు మూలసూత్రాలు.

అమెరికా, యూరప్‌లలో ఆయన జరిపిన విస్తృత పర్యటనల కారణంగా ఆ దేశాల జీవన విధాన ప్రభావం ఆయనపై విశేషంగా పడింది. భౌతికాభివృద్ధిని అలక్ష్యం చేసిన దేశం పారభౌతికాభివృద్ధిని సయితం సాధించలేదని, పాశ్చాత్య దేశాలవలె తాను కూడా భౌతిక సమృద్ధిని సాధించిననాడే భారత వర్షం నైతిక పునరుజ్జీవనం పొందగలదని ఆయన విశ్వసించాడు.

ఆయన జీవితం నలభై వసంతాలైనా పూర్తిగా చూడకుండా ముగిసిపోయినా ఆ స్వల్పకాలంలో ఆయన ఎవ్వరు చేయలేని మహత్కార్యాలనేకం సంకల్పించి సాధించాడు. ఆసేతు శీతాచలం ఎన్నో సార్లు పర్యటించి తన దివ్యవాణిని వినిపించాడు. ఆర్తజన సేవకు అంకితమైన రామకృష్ణమిషన్ ఆయన సృష్టి. "న కర్మణా న ప్రజయా ధనే న త్యాగేనై కే అమృతత్వ మానశుః" అనే ఆర్యోక్తికి ఆయన జీవితం పరమోదాహరణం. ప్రధాని నెహ్రూ మాటలలో ఆయనవలె భారత జాతిని ప్రభావితం చేసిన వ్యక్తులు బహు కొద్దిమంది. ఆ కారణం చేతనే ఆయన అమృతుడు.

*(జనవరి 18, 1963)*

# నెహ్రూ వీలునామా

**ప**దేళ్ళ క్రిందట నెహ్రూ వ్రాసిన వీలునామాలోని కొన్ని భాగాలను శ్రీమతి విజయలక్ష్మి పండిట్ నిన్న రాత్రి వెల్లడించారు. అది ఆయన తనకు తాను తైలవర్ణాలతో చిత్రించుకున్న రూపచిత్రం వంటిది; తన జీవిత దృక్పథాన్ని తానే వర్ణించుకున్న మనోజ్ఞ కావ్యం వంటిది. అది భారతీయులు కలకాలం భద్రపరచు కొనవలసిన జాతీయపత్రం.

వ్యక్తిగా నెహ్రూపై వ్యాఖ్యానించిన పెక్కుమంది అభిప్రాయంలో ఆయన రాజకీయాలలో ప్రవేశించి వుండకపోతే, గొప్ప కవిగాప్రశస్తి పొంది వుండేవారు. ఆయన "ఆత్మకథ", "డిస్కవరీ ఆఫ్ ఇండియా" మొదలైన గ్రంథాలలో కొన్ని కొన్ని భాగాలు వచనంలో వ్రాసినవైనా సుకుమార కావ్య సౌందర్యంతో తొణికిసలాడుతాయి. గోరఖ్‌పూర్‌విచారణ సందర్భంలో ఒకసారి ఆయనే స్వయంగా చెప్పుకున్నట్టు, మాటలకు ఆయన ఎంతో విలువనిస్తారు. శుష్క శబ్దాడంబరం కోసం కాదు; తన భావాలకు, తన ఆవేశానికి సరియైన వాహికలుగానే పదాలపై ఆయనకు అభిమానం.

నిన్న ప్రకటించిన వీలునామాలో సయితం వ్యక్తికి, శైలికి ఇదే అవినాభావం ప్రస్ఫుటమవుతుంది. ఆయన విశ్వాసాలలోని సౌందర్యమే ఆయన భాషలో వ్యక్తమవుతుంది.

నెహ్రూకు మతాలపై నమ్మకంలేదు. సగుణోపాసన, దానికి సంబంధించిన పూజా పురస్కారాలు, మూఢ విశ్వాసాలు, దేవాలయాలు, కర్మకాండ ఆయన నెప్పుడూ ఆకర్షించలేదు. మంత్రతంత్రాలు, జ్యోతిషం - మొత్తంపై హేతువిరుద్ధమైన వాటి నన్నిటిని ఆయన త్రోసిపుచ్చారు. అవి మానవుడిని అకర్మణ్యుడుగా చేస్తాయని, మానవులు అలౌకిక శక్తులపై కాక స్వయం కృషిపైనే ఆధారపడాలని ఆయన విశ్వసించారు. అంతమాత్రాన ఆయన నాస్తికుడు సయితంకాదు. తాను అజ్ఞేయవాది ("అగ్నాస్టికొ") నని, దైవ ప్రసక్తితో తనకు ప్రమేయంలేదని ఆయన చెప్పుకున్నారు.

ఈ విషయంలో గాంధీజీకి నెహ్రూ పూర్తిగా విరుద్ధం, అయినా, వారిరువురి గాఢానుబంధానికి ఈ మతభేదం అడ్డురాలేదు. అత్యధిక సంఖ్యాకులు మతానికి ప్రథమ ప్రాధాన్యమిచ్చే ఈ దేశంలో నెహ్రూ వంటి మత ప్రమేయ రహితుడి పట్ల ఇంతగాఢానురాగం ఏర్పడడం కూడా ఒక విధంగా విచిత్రమే. అయితే, అన్ని మతాలకు మూలమైన మానవ వాదాన్నే తన మతంగా, అహరహ ప్రజాసేవనే తన పూజా పురస్కారాలుగా, ప్రాజెక్టులు, కర్మాగారాలనే తన దేవాలయాలుగా భావించి తాను భారతీయుడైనందుకు, భారత ప్రాచీన సంస్కృతికి వారసుడైనందుకు గర్వించిన నెహ్రూపట్ల ఈ అనురాగంలో ఆశ్చర్యమేముంది?

భారత భూమిపట్ల ఆయన అనురాగం సర్వతోముఖమైనది. ఆ ప్రేమను ఆయన తన రచనలలో, ఉపన్యాసాలలో, చేతలలో పెక్కుసార్లు పెక్కు విధాలుగా వ్యక్తం చేశారు.

ఈవిశాలదేశంలోని కోటానుకోట్ల మానవులను, వారి విభిన్న భాషలను, సంస్కృతులను, వారి భూత భవిష్యద్వర్తమానాలను ఆయన ప్రేమించారు. ఆఖరికి ఈ దేశపు నదీనదాలను, అరణ్యాలను, పర్వత శిఖరాలు, మైదానాలను అన్నిటిని ఆయన ప్రేమించారు.

తాను జీవించి వున్నప్పటి వలెనే మరణానంతరం కూడా ఈ దేశంతో తాదాత్మ్యం ,చెందాలనే వాంఛను ఆయన తమ వీలునామాలో వెల్లడించారు. తన భౌతికావశేషాలను గంగానదిలోనేకాక, వివిధ ప్రాంతాలలోని సస్యక్షేత్రాలలో కూడా వెదజల్లాలని ఆయన కోరారు.

గంగను మనం నీటికి పర్యాయపదంగా వ్యవహరిస్తాము. కనుక నెహ్రూ కోరికకు అనుగుణంగానే ఆయన చితాభస్మం దేశంలోని నదులన్నిటిలో నిమజ్జనం చేయబడుతున్నది. ఆంధ్ర ప్రదేశ్‌లో కూడా మూసి, కృష్ణా, గోదావరి, తుంగభద్రలలో వచ్చే సోమవారం అస్థి నిమజ్జనం జరుగనున్నది. అనాదిగా మన చరిత్రకు సాక్షి భూతాలుగా ప్రవహిస్తున్న ఈ నదులవలెనే, జవహర్‌లాల్ స్మృతి సయితం మన జాతిలో నిరంతరం ప్రవహిస్తూనే వుంటుంది.

*(5 జూన్, 1964)*

# ఫిడేలు నాయుడుగారు

ఆయనది రాళ్ళను కరిగించే విమల గాంధర్వం. మన కది ఇక మీద వినబడదు.

ఆయన చేతిలో కమాను ఫిడేలు తీగలపై నాట్యం చేసేది. ఒకసారి కోకిల కాకలీ స్వనాన్ని, మరొకసారి సముద్రాల నిర్నిద్ర ఘోషను ఆ తీగలు పలికించేవి. అవి ఇక శాశ్వతంగా మూగపోతాయి.

ఆయన అంధ గాయకుడు. ఆయన కళ్ళకు బాహ్య ప్రపంచం లేదు. అవి తమలోకి తాము చూచుకొనేవి. వాటికి ఏవేవో ధ్వని ప్రపంచాలు, స్వర సముద్రాలు కనబడేవి. వాటినుంచి ఆయన మనోహర శబ్దాలను ఏరి తెచ్చేవారు. ఆ గాన మాధుర్యాన్ని ఆస్వాదించే భాగ్యం ఇకపై రసజ్ఞ లోకానికి లేదు.

ఇరవై యేళ్ళ క్రిందటి మాట. రాజమండ్రిలో దేవులపల్లి కృష్ణశాస్త్రి గారికి జరిగిన సన్మాన సభలో ద్వారం వెంకటస్వామి నాయుడుగారు ఫిడేలు వాయించారు. తమ వాయు లీనంలో లీనమైన శ్రోతల నుద్దేశించి "నేను విద్యాధికుడిని కాను, ధనాధికుడిని కాను; నాకేమీ లేదు; ఉన్నదల్లా ఈ కర్రముక్క ఒక్కటే. దీని ఆధారంతోనే ఈ భవజలధిని ఈదడానికి ప్రయత్నిస్తున్నాను." అని నాయుడు గారన్నారు. అంతటి ప్రతిభాశాలిలోని ఈ సహజ వినమ్రత శ్రోతలచేత నిజంగానే కంట తడి పెట్టించింది.

ఆయనకు సంగీతమే విద్య, సంగీతమే ధనం. ఆ విద్యాధనాన్ని ఆయన దాచుకోలేదు. ఎందరో శిష్య ప్రశిష్యులకు దాన్ని దానం చేశారు. అలనాటి మోహినివలె తమ సంగీతామృతాన్ని పంచిపెట్టి లక్షలాది శ్రోతల రసపిపాసను తీర్చారు.

ఒక అర్ధ శతాబ్దిగా నాయుడిగారి పేరు దక్షిణ భారతమంతటా సుపరిచితమైంది. తెలుగువారికి త్యాగరాజు తరవాత మరొక సంగీతకారుడు లేడన్న కొరతను ఆయన కనబడ నివ్వలేదు. ఎన్ని వందల గాన సభలలోనో, ఎందరు దిగ్గంతులవంటి పండితుల చేతనో ప్రశంసలు పొందారు; ఎన్నో బిరుదులు, సత్కారాలు పొందారు. భారత ప్రభుత్వం ఆయనను "పద్మశ్రీ" బిరుదుతో గౌరవించింది. ఇటీవలనే ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వం ఆయనను ఆస్థాన గాయకుడుగా మన్నించింది. ఆ విధంగా ఆంధ్ర, కేంద్ర ప్రభుత్వాలు తమ్ము తామే గౌరవించుకున్నాయి.

పూర్వం పిల్లల మర్రి పిన వీరభద్రకవి "వాణి నా రాణి" అని చెప్పుకున్నాడట. ఆ తరువాత "నాదాన్ని నా దాన్ని చేసుకున్నా" నని చెప్పుకోగలిగిన ఘనత నాయుడుగారిదే. ఆయన సాధనమైన వాయులీనం భారతీయ వాద్యం కాదు. అయినా, ఆయన దానిపై అపూర్వ ప్రావీణ్యాన్ని ప్రదర్శించడం చూచి యెహూదీ మెనూహిన్ వంటి పాశ్చాత్య విద్వాంసులే

ముగ్ధులైపోయారు. ఆయన ప్రతిభను పదే పదే కీర్తించారు.

డబ్బైయేళ్ళ పరిపక్వ వయస్సులో ఆయన రాలిపోయారు. ఆయన ధన్యజీవి. సముఖంలో కూర్చుని వారి గానం వినడానికి మనమిక నోచుకోలేకపోయినా, టేపులలో, గ్రామొఫోను రికార్డులలో ఆయన మిగిల్చి వెళ్ళిన సంగీత సంపద ఎంతో దేశంలో వుంది. దాన్ని పదిలంగా, పదికాలాలపాటు పరిరక్షించుకొనడం మన పవిత్ర విధి. ఎందరెందరో వ్యక్తులవద్ద చెల్లా చెదురుగా వున్న నాయుడుగారి కృతులను సేకరించి వాటిని జాతీయ నిక్షేపంగా భద్రపరచడం మన ప్రభుత్వం చేయవలసిన పని. ఆ విధంగా చేయడమే నాయుడుగారి స్మృతికి మన మర్పించదగిన జోహారు.

*(నవంబరు 26, 1964)*

# చైనాలో షేక్స్పియర్

**సాం**స్కృతిక విప్లవం పేరిట చైనాలో రెడ్ గార్డులు షేక్స్పియర్, హ్యూగో మొదలైన ప్రసిద్ధ రచయితల గ్రంథాల ప్రతులను వేలాదిగా దగ్ధం చేశారట. ఇది ప్రపంచ చరిత్రలోనే అపూర్వమైన "సాహిత్య దహనం"గా శ్రీ కె.పి.ఎస్. మీనన్ మొన్న న్యూఢిల్లీ సభలో వర్ణించారు.

షేక్స్పియర్‌ను విమర్శుల కతీతుడుగా మాత్యూ ఆర్నాల్డ్ కీర్తించాడుగాని ఆయనను టాల్‌స్టాయ్, బెర్నార్డ్ షాల వంటి వారు కొందరు విమర్శించకపోలేదు. నైతిక దృష్టినుంచి చూస్తే షేక్స్పియర్ రచనకు విలువ లేదని వారి విమర్శ: అయితే చైనీస్ రెడ్ గార్డుల దృష్టిలో షేక్స్పియర్ కేవలం బూర్జువా రచయిత.

మరి ఈ బూర్జువా రచయితనే కమ్యూనిజం ప్రవక్త మార్క్స్ అమితంగా అభిమానించేవాడు. ఇంగ్లండు చరిత్రను షేక్స్పియర్ నాటకాలనుంచే తాను ఎక్కువగా తెలుసుకొన్నానని ఆయన అనేవాడట. తన పరిశోధనలతో అలసి సొలసి పోయిన తర్వాత, ప్రతి సాయంకాలం కాలక్షేపానికి తన కుమార్తెలతో "షేక్స్పియర్ ఆట" (ఏ వాక్యం ఏ నాటకంలోనిదో కనిపెట్టడం) ఆడుకునేవాడట.

మరి మార్క్స్ అనుయాయులమని చెప్పుకుంటున్న రెడ్ గార్డులకు షేక్స్పియర్ ఎందుకు పనికి రాలేదో? మరి కొన్నాళ్ళు పోతే వారు మార్క్స్ రచనలనే తగలబెట్టినా ఆశ్చర్యం లేదు.

సూర్యుని మీద దుమ్ము చల్లితే, చల్లిన వారి కళ్ళలోనే పడుతుంది. షేక్స్పియర్ రచనలను దగ్ధంచేస్తే షేక్స్పియర్ కేమీ నష్టంలేదు. ప్రపంచంలో సాహితీ ప్రియులున్నంత కాలం ఆయన రచనలు నిత్యనూతనంగా భాసిస్తూనే వుంటాయి. వాటిని నిషేధించడం వల్ల ఆ మేరకు నష్టపడేది చైనావారే.

*(నవంబరు 27, 1966)*

# నూతన దృక్పథం

**మా**నవుడు కొన్ని లక్షల సంవత్సరాలుగా భూమండలంపై నివసిస్తున్నాడు. అన్ని లక్షల సంవత్సరాలలోను అతడు సాధించిన వైజ్ఞానిక ప్రగతి ఒక ఎత్తు, కడచిన నూరు, నూటయాభై సంవత్సరాలలో ఆతడు తెలుసుకోగలిగినది మరొక ఎత్తు.

ముఖ్యంగా ఈ శతాబ్దంలో మానవ విజ్ఞానం అమిత వేగంతో, అత్యాశ్చర్యకరంగా పెరిగిపోతున్నది. అందులోను-ప్రపంచ ప్రసిద్ధ ఖగోళ శాస్త్రవేత్తలలో ఒకరైన హార్లో షాప్‌లీ ఇటీవల ఒక వ్యాసంలో పేర్కొన్నట్టు - మానవ విజ్ఞానం రెండు విభిన్న దిశలలో విభ్రాంతికరంగా పురోగమిస్తున్నది.

ఒకటి-తలెత్తి, కనులువిప్పి చూస్తే కనబడే అనంత విశ్వానికి సంబంధించిన విజ్ఞానం.

రెండవది - స్థూలదృష్టితోగాని, యంత్రపరికరాల సహాయంతోగాని ఏ విధంగాను చూడడానికి వీలులేని పరమాణు ప్రపంచానికి సంబంధించిన విజ్ఞానం.

ఒకటి అతి స్థూలజగత్తుకు, రెండవది అతి సూక్ష్మజగత్తుకు సంబంధించినవి. ఈ రెండు దిశలలోను మానవుడు ముఖ్యంగా ఈ ఇరవైయవ శతాబ్దిలో కనుగొన్న రహస్యాలు ఎట్టి అద్భుత పరిణామాలను సాధ్యం చేయనున్నవో ఊహించడమైనా కష్టం.

17 నెలల క్రిందట అమెరికన్ రోదసీ యాత్రికుడు రిచర్డ్ గార్డన్ తన జెమినీ-1 రోదసీ నౌకనుంచి తీసిన కొన్ని ఛాయాచిత్రాల ద్వారా నక్షత్రాలెలా ఉద్భవించినవనే విషయం తెలియవచ్చునని శాస్త్రజ్ఞులు తలపోస్తున్నట్టు నిన్నటి ఒక వార్త తెలుపుతున్నది. “ఓరియన్” నక్షత్రమండలం మనకు 40 కోట్ల కాంతి సంవత్సరాల దూరంలో వున్నది. దాన్ని 12 కోట్ల కాంతి సంవత్సరాల వ్యాసంగల ఒక “ధూళిమేఘం” ఆవరించి వున్నట్టు రిచర్డ్ గార్డన్ తీసిన ఫోటోలు చూపిస్తున్నాయట. వేరు వేరు స్థలాలలో ఆ “ధూళిమేఘం” చిక్కదనాన్ని బట్టి ఒక కొత్త నక్షత్రం ప్రభవించడానికి అది ముడి పదార్థంగా ఉపయోగిస్తున్నదని, దీన్నిబట్టి నక్షత్రగోళాలు ఏ విధంగా ఆవిర్భవిస్తాయో తెలియరావచ్చునని శాస్త్రజ్ఞులు భావిస్తున్నారు.

ఈ విశ్వ రహస్యాలన్నీ ఎంత త్వరలో మానవ కరతలామలకాలు కాగలవో చెప్పలేముగాని, ఇప్పటికి తెలియవచ్చిన విషయాలను బట్టి కూడా మనం కొన్ని శతాబ్దాలుగా పెంచుకున్న మూఢ విశ్వాసాలనేకం పటాపంచ లవుతున్నాయి. భూమి, దానిపై జీవరాశి, అందులో మానవుని స్థానం, అతనిపై పరిసరాల ప్రభావం, ఇవేకాదు మన పైన ఆకాశంలోని చంద్రుడు, గ్రహాలు, సూర్యుడు, ఇతర గోళాలు మొదలైన వాటిపట్ల మనం పెంచుకున్న పెక్కు నమ్మకాలు సడలిపోతున్నాయి.

ఈ పురాతన విశ్వాసాలే కాదు. విజ్ఞాన పురోగతిలో ఒక్కొక్క నూత్న విషయం ఆవిష్కృతమౌతున్న కొద్దీ మొన్నటి శాస్త్రవేత్తల సిద్ధాంతాలను నిన్నటి శాస్త్రవేత్తలు, నిన్నటివారి

పరిశోధనా ఫలితాలను నేటివారు ఖండించి వేస్తున్నారు. దీన్ని నిజానికి ఖండన మండనల దృష్టితో చూడరాదు; మానవ విజ్ఞాన పురోగతిగానే పరిగణించాలి.

ఉదాహరణకు కాంతికంటె వేగంతో (సెకండుకు లక్ష ఎనభై ఆరువేల మైళ్లు) ఏదీ ప్రయాణం చేయలేదని మహా మేధావి ఐన్‌స్టీన్ విశ్వసించాడు. ఒకటి ఒకటి రెండు అన్నట్టు, తిరుగులేని శాస్త్రీయసత్యాలలో ఇదొకటిగా మనం భావిస్తూ వచ్చాము.

అయితే, కొలంబియా యూనివర్సిటీకి చెందిన డాక్టర్ జెరాల్డ్ ఫేన్‌బర్గ్ ప్రతిపాదించిన ఒక నూత్న సిద్ధాంతాన్ని బట్టి కాంతికంటె వేగంగా, ఆ మాటకు వస్తే "పరిమితిలేని" వేగంతో (ఇన్‌ఫినిట్ స్పీడ్) పయనించే పరమాణు కణాలు (పార్టికల్స్) వుండవచ్చునట. వాటికి ఆయన "టాక్యాన్స్" అనే పేరు పెట్టాడు.

కొంతకాలం క్రిందటి వరకు జీవరాశి భూగోళానికే పరిమితమని, మరెక్కడా వుండడానికి వీలులేదని శాస్త్రజ్ఞులు నమ్మేవారు. కాని, ఈ నమ్మకం ఇప్పుడు సడలిపోతున్నది. విశ్వంలో కోటాను కోట్ల నక్షత్రాలున్నాయి. సూర్యుని కున్నట్టే వాటికి కూడా గ్రహాలుండవచ్చు. ఒక్కొక్క నక్షత్రం చుట్టూ ఒక్కొక్క గ్రహంలో జీవరాశి వున్నా, మన భూమిని పోలిన గ్రహాలు, జీవరాశి కలిగినవి కొన్ని కోట్లు వుండడానికి వీలున్నది.

ఇంతేకాదు, మన భూమిపై జీవరాశి ప్రాణవాయువు (ఆక్సిజన్) ఆధారంగా ఆవిర్భవించింది. బహుశా ఇతర గ్రహాలలో తద్భిన్నమైన మూల ద్రవ్యాల ఆధారంతో పరిణామం చెందిన జీవరాసులున్నాయేమో. మన భూమిపై జీవరాశిలో మానవుడు పరిపూర్ణ పరిణామం చెందిన వాడుగా కనబడుతున్నాడు. సుదూర గ్రహాలలో ఇంతకంటె ఉన్నత పరిణామం చెందిన జీవులున్నారేమో, వారి నాగరికత మనదానికంటె పరిణతి చెందినదై వుండవచ్చునేమో. వీటిని కేవలం ఊహాగానాలుగా త్రోసివేయ వీలులేదని శాస్త్రజ్ఞుల భావన.

చంద్రగోళానికి మానవుడు చేరడానికి ప్రస్తుతం సన్నాహాలు జరుగుతున్నాయి. ఇది మరి రెండు మూడేళ్ళలోనే సాధ్యం కావచ్చు కూడా. అది సాధ్యమైతే సౌర కుటుంబంలోని ఇతర గ్రహాలకు ప్రయాణాలు కూడా త్వరలోనే సాధ్యం కావచ్చు.

చంద్రుడు మనకు అతి సమీపంలో వున్న గోళం. అక్కడికి వెళ్ళి రావడం అయిదారురోజుల పని. ఇతర గ్రహాలను చేరడం సాధ్యమైతే అది కొన్ని నెలలపని, కాని, విశ్వాంతరాళంలో అనేక కాంతి సంవత్సరాల దూరంలోగల గోళాలను చేరడం సాధ్యం కాకపోవచ్చు. కనీసం ఇది ఈనాడు శాస్త్రవేత్తలు వెలిబుచ్చుతున్న నిరాశ.

కాని, డాక్టర్ ఫేన్‌బెర్గ్ కనిపెట్టిన "టాక్యాన్స్" పరమాణుకణాలు నిజంగా వుంటే, అవి కాంతికంటె వేగంగా పోగలిగితే, వాటి శక్తిని వినియోగించుకుని రోదసీ నౌకలను అమితవేగంతో నడపగల్గితే, సుదూర గోళాలను చేరడం సాధ్యమేమో. ఈ ఆలోచనను డాక్టర్ ఫేన్‌బెర్గ్ స్వయంగా వెల్లడించాడు.

అణుకేంద్రంలో వున్నవని డాక్టర్ ఫేన్‌బెర్గ్ చెబుతున్న "టాక్యాన్స్" కణాలు నిజంగా వున్నవా లేదా అని శాస్త్రవేత్తలు అనుమానిస్తున్నారు. వాటిని కనుగొనడానికి చేసిన ప్రయత్నాలింతవరకు ఫలించలేదు. కాని 1930 ప్రాంతంలో పి.ఎ.ఎమ్. డిరాక్ అనేశాస్త్రజ్ఞుడు కేవలం గణితశాస్త్ర సహాయంతో ఊహించిన "పాజిట్రాన్" వంటి విలక్షణ అణుకణాలు (యాంటీ మేటర్) నిజంగా వున్నవని ఆ తర్వాత శాస్త్రవేత్తల పరిశోధనలలో తేలింది. అదే విధంగా, కాంతికంటె వేగంగా పయనించే "టాక్యాన్స్" కణాలను కూడా శాస్త్రవేత్తలు నెమ్మదిగా కనిపెట్టడం సంభవమేమో.

ఏమైనా, నిన్న మొన్నటి వరకు శాశ్వత సత్యాలుగా శాస్త్రవేత్తలే భావించిన సిద్ధాంతాలు సయితం నూతన పరిశోధనల ఫలితంగా పూర్వపక్షమై పోతున్నాయి. కాగా, కొన్ని వేల, వందల సంవత్సరాలనాటి వేదాలపై, బైబిల్‌పై, పురాణాలపై, ధర్మ శాస్త్రాలపై ఆధారపడిన మన విశ్వాసాలు, సిద్ధాంతాలు పూర్వపక్షం కావడంలో ఆశ్చర్యంలేదు.

జగత్తు పరిణామశీలమైనది. దేనికి స్థిరత్వంలేదు. అణువునుంచి బ్రహ్మాండంవరకు ప్రతిది పరిణామం చెందుతున్నది. ఒకే ఒక ప్రోటాన్‌తో కూడిన హైడ్రోజన్ అణువునుంచి అతి సంకీర్ణమైన స్థూలజగత్తు యావత్తు పరిణామం చెందింది. ఒకే జీవకణం కలిగిన ప్రాణినుంచి మానవునితోసహా జీవరాశి అంతా రూపొందింది. ఈ పరిణామం ఇంకా అనంత ముఖాలుగా కొనసాగుతున్నది.

అయినప్పుడు, కొన్ని వేల ఏళ్ళనాటి విశ్వాసాలను శాశ్వత సత్యాలుగా పట్టుకుని ప్రాకులాడడం అవివేకం కాదా? మన పూర్వులు ఆనాటి తమ పరిమిత విజ్ఞానం ఆధారంగా తమ విశ్వాసాలను సృజించుకున్నారు. వాటికి ఈనాటి వైజ్ఞానిక పురోగతితో పొసగదు. వాటిని ప్రక్కకునెట్టి, ఈనాటి శాస్త్రీయ విజ్ఞానానికి తగు కొత్త విశ్వాసాలను సృజించుకోవాలి. ఒక నూతన దృక్పథాన్ని - కేవలం తాను, తన భూమి సర్వసృష్టికి కేంద్రమన్న విశ్వాసాన్ని విడనాడి - మానవుడు పెంపొందించుకోవాలి. విజ్ఞానశాస్త్ర విస్తరణపై ఆధారపడిన నూత్న మతాన్ని, నూత్న వేదాంతాన్ని సృజించుకుని తాను సయితం పురోగమించాలి.

*(ఫిబ్రవరి 18, 1968)*

# ముందుచూపు

అమెరికన్ అంతరిక్ష నౌక అపోలో-8 చంద్రమండలాన్ని చుట్టి దిగ్విజయంగా తిరిగి వచ్చింది. కొందరు ప్రసిద్ధ శాస్త్రవేత్తలు సయితం ఈ ప్రయోగాన్ని వృథా చర్యగా విమర్శిస్తున్నా, మానవుని మేధ సాధించిన ఈ అపూర్వ సాంకేతిక విజయాన్ని ప్రపంచం వేనోళ్ళ కీర్తిస్తున్నది.

మొన్నటి అపోలో యాత్ర ముందు అసంఖ్యాకంగా ఉత్పత్తి అయిన, అవుతున్న వైజ్ఞానిక నవలా సారస్వతమంతా వెలవెల పోక తప్పదు. అక్కడ ప్రాణికోటిని, మానవాతీత జీవులను ఊహిస్తూ ఎన్నో నవలలు వచ్చాయి. అయితే, అవన్నీ ఇటీవల ఖగోళ విజ్ఞానం చెందిన పురోగతిని ఆధారం చేసుకుని, అంతకంటె ఎక్కువగా కల్పనను ఆధారం చేసుకుని వ్రాసినవే.

కాని, ఒక మహా రచయితకు మాత్రం ఈ సందర్భంలో జోహారు లర్పించక తప్పదు. అతడు ఫ్రెంచి రచయిత జూల్స్ వెర్న్. అతడు 1828 నుంచి 1905 వరకు జీవించినవాడు. తన కాలంలో వైజ్ఞానిక సారస్వతాన్ని అధ్యయనం చేసిన వాడే గాని, ప్రత్యేకించి శాస్త్రవేత్త కాడు. పైగా అతడు విద్యాలయాలలో చదివింది విజ్ఞాన శాస్త్రం కాదు, న్యాయశాస్త్రం. తన రచనా జీవితాన్ని కూడా శాస్త్రీయ రచనలతో ప్రారంభించలేదు: పద్య నాటకాలు, సంగీత నాటకాలతో ప్రారంభించాడు. మధ్యలో కొన్ని యాత్రా కథలు వ్రాసి పేరు తెచ్చుకొనడంతో అతనికి 1860 ప్రాంతాల నుంచి వైజ్ఞానిక కథా సారస్వతం మీద అభిరుచి పుట్టి వ్రాయడం మొదలుపెట్టాడు.

జూల్స్ వెర్న్ వచన రచయిత అయినా, కవి పద వాచ్యతకు అన్ని విధాలా అర్హుడు. కవి అనే పదానికి అసలు అర్థం ద్రష్ట, క్రాంతదర్శి, ఋషి, సర్వజ్ఞుడు. వేదాలలో ఈ అర్థంతోనే కవి శబ్దాన్ని ఉపయోగించారు. "నా నృషిః కురుతే కావ్యమ్" అని మన పూర్వులు భావించారు. కవి భవిష్యత్తును ఊహించగలడని కూడా వారు భావించారు. రాముని జననానికి ముందే వాల్మీకి రామాయణ గాథను వ్రాశాడనడంలో అర్థం ఇదే.

జూల్స్ వెర్న్ కూడా ఆగామి వైజ్ఞానిక పురోగతిని ఊహించి అనేక నవలలు వ్రాశాడు. ఆ రోజులలో జలాంతర్గాములు లేవు. విమానాలు లేవు. టెలివిజన్ లేదు. రోదసీ నౌకలు లేవు. కాని అన్నిటిని శాస్త్రీయంగా ఊహించి అతడు నవలలు వ్రాశాడు. సాగర గర్భంలో జలాంతర్గామిలో అరవై వేల మైళ్ళ యాత్ర, బెలూన్‌లో ఎనభై రోజులలో భూప్రదక్షిణం, భూమి నుంచి చంద్రుని వద్దకు రోదసీ నౌకలో యాత్ర, భూమి కేంద్ర స్థానానికి అవరోహణ మొదలైన సాహసాలను అతడు వాటిలో వర్ణించాడు. అవి వైజ్ఞానిక నవలలైనా డ్యూమాస్ నవల లంతటి ఆసక్తి కరంగా వ్రాయడం అతని ప్రత్యేకత.

ముఖ్యంగా "ఫ్రం ది ఎర్త్ టు ది మూన్" అనే జూల్స్ వెర్న్ నవల ఇటీవల పలువురిని ఆకర్షించింది. దానికి, అపోలో-8 యాత్రకు అనేక సామ్యాలున్నాయి. దానిలో కూడా రోదసీ నౌక

ముగ్గురు యాత్రికులతో బయలుదేరి చంద్రుని చుట్టూ పరిభ్రమిస్తుంది. అది కూడా గంటకు 25 వేల మైళ్ళ వేగంతో ప్రయాణిస్తుంది. దాని ప్రయోగం కేప్ కెనెడీకి 160కిలో మీటర్ల సమీపం నుంచి జరుగుతుంది. అది తిరిగి వచ్చి దిగిన స్థలం కూడా పసిఫిక్ మహా సముద్రమే. ఆ సంఘటన కూడా డిసెంబర్‌లోనే జరుగుతుంది. అపోలో నౌక పొడుగు పన్నెండడుగులు కాగా, వెర్న్ నౌక పన్నెండడుగుల ఎత్తు. అపోలో బరువు 12,392 పౌనులు కాగా వెర్న్ నౌక బరువు 12,230 పౌనులు. వెర్న్ వర్ణించిన చంద్రగోళం పరిస్థితులకు, మొన్నటి చంద్ర గాముల వర్ణనలకు కూడా సరిపోయింది.

ఈ సామ్యాలు విచిత్రంగా లేవా? జూల్స్ వెర్న్ 103 సంవత్సరాల క్రిందట - 1865లో తన నవల వ్రాశాడు. "రవి కాననిచో కవి కాంచునే కదా!" అనే లోకోక్తిని అతని రచనలు రుజువు చేస్తున్నాయి. ఇరవైయవ శతాబ్దంలో మనం జూల్స్ వెర్న్ నవలలనే జీవిస్తున్నామని ఒక ప్రఖ్యాత శాస్త్రవేత్త అన్నాడు. ఆ వాక్యంలోని సత్యాన్ని మొన్నటి అపోలో యాత్ర మరొకసారి రుజువు చేసింది. జూల్స్ వెర్న్ మానవ భవిష్యత్తు లోనికి తొంగి చూచాడు. అతనిది ముందు చూపు; వెనుక చూపు కాదు. ముందుకు దారి చూపడం కంటె సాహిత్యానికి పరమ ప్రయోజనం మరేముంది?

*(డిసెంబర్ 30, 1968)*

# తండ్రులు, తనయులు

తండ్రి నుంచి తనయునికి వారసత్వంగా ఆస్తి రావచ్చు; మంచి గుణాలు, చెడ్డ గుణాలు రావచ్చు. కాని, విజ్ఞానశాస్త్రాలలో ప్రతిభ కూడా వారసత్వంగా వస్తుందా?

ఏమో, రావచ్చు, అలా వచ్చిన సందర్భాలు చరిత్రలో అనేకం వున్నాయి.

యురేనస్ గ్రహాన్ని మొదటగా కనుగొన్న సర్ విలియం హెర్షెల్ ప్రఖ్యాత ఖగోళ శాస్త్రవేత్త. ఆయన కుమారుడు సర్ జాన్ హెర్షెల్ మరొక ప్రఖ్యాత ఖగోళవేత్త.

"నాచురల్ సెలెక్షన్" సిద్ధాంతాన్ని ప్రతిపాదించిన చార్లెస్ డార్విన్ కుమారులలో ఒకడైన సర్ ఫ్రాన్సిస్ డార్విన్ ప్రముఖ వృక్షశాస్త్రజ్ఞుడు. రెండవ కుమారుడు సర్ జార్జి డార్విన్ ఖగోళ-గణిత శాస్త్రవేత్త.

ఇటువంటి ప్రసిద్ధ ఉదాహరణలు మరికొన్ని విజ్ఞానశాస్త్ర చరిత్రలో కనిపిస్తాయి. కాని నోబెల్ బహుమతులు కూడా వారసత్వంగా వస్తాయా?

ఇందుకుకూడా ఉదాహరణలున్నాయి. అణువులో ఎలక్ట్రాన్‌లను మొదటగా కనుగొన్న సర్ జె.జె. థామస్‌కు 1906లో ఫిజిక్స్ నోబెల్ బహుమతి లభించింది. ఆయన తనయుడు సర్ జార్జి థామ్సన్ ఎలక్ట్రాన్లకు తరంగ (వేవ్) లక్షణాలున్నాయని నిరూపించినందుకు 1937లో నోబెల్ బహుమతి పొందాడు.

రేడియో యాక్టివిటీని మొదటిసారిగా కనిపెట్టినందుకు మదాంక్యూరీ తన భర్త పియర్ క్యూరీతో కలిసి 1903లో ఫిజిక్స్ నోబెల్ బహుమతి పొందింది. రేడియంను కనుగొన్నందుకు ఆమె 1911లో మరొకసారి విడిగా నోబెల్ బహుమతిని పొందింది. ఇలాగే క్యూరీ దంపతుల కుమార్తె ఐరిన్ జోలియో-క్యూరీ, ఆమె భర్త ఫ్రెడరిక్ జోలియో-క్యూరీ కృత్రిమ పద్ధతిలో రేడియో యాక్టివిటీని సాధించినందుకు 1935లో కెమిస్ట్రీ నోబెల్ బహుమతి పొందారు.

ఇవి పాత ఉదాహరణలు. నోబెల్ బహుమతుల వారసత్వానికి సరికొత్త ఉదాహరణ మొన్ననే జరిగింది. ఈ ఏడాది ఫిజిక్స్‌లో నోబెల్ బహుమతి పొందినవారిలో ఒకరు డేనిష్ శాస్త్రవేత్త ఆగే బోర్. ఈయన తండ్రి జగత్ప్రసిద్ధుడైన నీల్స్ బోర్. అణువు స్వరూపాన్ని మొదటగా నిర్ధారణ చేసిన నీల్స్ బోర్ 1922లో నోబెల్ ఫిజిక్స్ బహుమతి పొందాడు. అదే సంవత్సరంలో జన్మించిన ఆగే బోర్ అణు కేంద్రం గురించిన పరిశోధనలకు ఈనాడు నోబెల్ బహుమతి సంపాదించుకున్నాడు.

జీవుల వారసత్వ లక్షణాలను నిర్ణయించేవి "జీన్స్" అని శాస్త్రవేత్తలు కనుగొన్నారు. నోబెల్ బహుమతులు వారసత్వంగా రావడానికి ఏ "జీన్స్" కారణమో ఎవరైనా కనుగొంటే, ఆయనకు మరొక నోబెల్ బహుమతి ఇవ్వవచ్చు!

*(అక్టోబరు 9, 1975)*

# చరిత్రకు భాష్యకారుడు

మానవజాతి చరిత్రలో ఎన్నో మహా నాగరికతలు ఆవిర్భవించాయి, కొంత కాలం వర్ధిల్లాయి, కాలగర్భంలో అంతరించాయి.

ఎందువల్ల ఇలా జరిగింది? ఏ నాగరికత ఎల్లకాలం ఎందుకు వర్ధిల్లలేదు?

అసలు ఏ నాగరికత అయినా ఎందుకు, ఎలా అవతరిస్తుంది; ఎందుకు, ఎలా వర్ధిల్లుతుంది? ఎందుకు, ఎలా అంతరిస్తుంది?

ఆరువేల ఏళ్ళు వెనుకకు పోయి చూస్తే, మానవ చరిత్రలో ఈజిప్షియన్, సుమేరియన్, అక్కేడియన్, బాబిలోనియన్, సింధు, చైనీస్, గ్రీక్ - ఇలాగ ఎన్నో నాగరికతలు పరిఢవిల్లినట్టు కనిపిస్తుంది. ఇవి దేనికది స్వతంత్రంగా ఆవిర్భవించాయా? లేక ఒక దాని నుంచి ఒకటి ఉత్పన్నమైనాయా? వీటి మధ్య పరస్పర సంబంధాలు ఎటువంటివి?

ఇట్టివే, కొన్ని మౌలిక ప్రశ్నలను తనకు తాను వేసుకొని, వాటికి తార్కికమైన సమాధానాలు చెప్పడానికి ఒక జీవితకాలాన్ని వెచ్చించిన మహామనీషి మొన్న కన్ను మూసిన ప్రొఫెసర్ ఆర్నాల్డ్ టాయిన్‌బీ. మొత్తం మానవ చరిత్రను ఆయన కూలంకషంగా మథించాడు. ఎన్నో విస్మృత నాగరికతలను అధ్యయనం చేశాడు నలభై ఏళ్ళపాటు ఏకదీక్షగా సాగిన ఆ అధ్యయనం ఫలితమే ఆయన పన్నెండు సంపుటాలలో రచించిన బృహద్గ్రంథం "ఎ స్టడీ ఆఫ్ హిస్టరీ".

టాయిన్‌బీ కేవలం చారిత్రక సంఘటనలను తేదీల వారీగా వ్రాసుకుపోయిన వట్టి చరిత్ర కారుడు కాడు. చరిత్రకు ఆయన గట్టి భాష్యకారుడు. మొత్తం 28 నాగరికతలను, వాటి అభ్యుదయ, పతనాలను ఆయన అధ్యయనం చేశాడు. హారంలో దారంవలె దాగి అయా నాగరికతలను ఏకసూత్రంతో బంధిస్తున్న చారిత్రిక సత్యాన్ని అన్వేషించాడు.

ఒక జాతి జన్మత: మిగిలిన జాతుల కంటె గొప్పది కావడం వల్లనే గొప్ప నాగరికతను సృష్టించ గలుగుతుందని కొందరు చరిత్రకారుల వాదన. దీన్ని టాయిన్‌బీ త్రోసిపుచ్చాడు.

ఒక జాతి తన భౌతిక పరిసరాలు తన సుఖమయ జీవితానికి అనుకూలంగా వున్నప్పుడే గొప్ప నాగరికతను సాధించగలుగుతుందని మరి కొందరన్నారు. దీన్ని కూడా ఆయన తిరస్కరించాడు.

జర్మన్ తత్త్వవేత్త, చరిత్రకారుడు స్పెంగ్లర్ వలె కొందరు నాగరికతలకు కూడా - వ్యక్తులవలె - శైశవ, యౌవన, వృద్ధాప్య దశలుంటాయని విశ్వసించారు. దీన్ని సయితం టాయిన్‌బీ నిరాకరించాడు.

ఏ సమాజమైనా, తన ప్రాకృతిక పరిసరాల నుంచి, లేదా, ఇతర సమాజాల నుంచి వచ్చే సవాళ్ళను విజయవంతంగా ఎదుర్కొనడానికి చేసే ప్రయత్నంలోనే నాగరికత అన్నది

ఆవిర్భవిస్తుందని టాయిన్‌బీ సిద్ధాంతం. దీనికి ఆయన "ఛాలెంజ్ అండ్ రెస్పాన్స్" (సవాలు-జవాబు) అని పేరు పెట్టాడు. అంటే పరిస్థితులు అనుకూలంగా కాక, ప్రతికూలంగా వున్నప్పుడే నాగరికతా సృష్టికి ప్రేరణ కలుగుతుందని ఆయన వాదం. ఈ సిద్ధాంతానికి నిరూపణగా ఆయన ప్రాచీన, అర్వాచీన చరిత్ర నుంచి ఇచ్చిన అనేకోదాహరణలలో ఆయన ప్రతిభా వైదుష్యాలు అచ్చెరువు కలిగిస్తాయి.

టాయిన్‌బీపై విమర్శలు రాకపోలేదు. కొన్ని వైరుధ్యాలకు ఆయన లోనైనాడని ఒక విమర్శ. ఆయన సాధారణీకరణ (జనరలైజేషన్) కొన్ని చోట్ల మితిమీరినదని మరొక విమర్శ. మతం పట్ల ఆయన విశ్వాసంపై వేరొక విమర్శ. ఏమైనా ఆయన పాండిత్య వైభవాన్ని కాదన్న వారు లేరు.

చరిత్రకారులు సాధారణంగా జోస్యం చెప్పకుండా వుండలేరు. టాయిన్‌బీ మొదటి, రెండవ ప్రపంచ యుద్ధాలను గురించి ముందుగానే ఊహించి చెప్పాడట. సుమారు ఇరవై ఏళ్ళ క్రిందట - ప్రాక్పశ్చిమ సైనిక కూటాల మధ్య ప్రచ్ఛన్న యుద్ధం తీవ్రంగా వున్న సమయంలో - ఆయన ఇండియాలో పర్యటిస్తూ ఒక ప్రసంగంలో క్యాపిటలిజమ్, కమ్యూనిజమ్‌లు ఎన్నటికైనా సహజీవనం చేయక తప్పదని చెప్పాడు. దీనికి సమర్థనగా మధ్య యుగాలలో పరస్పర విద్వేషంతో ఘర్షించిన ఇస్లామ్, క్రైస్తవ మతాలు ఈనాటి సహజీవనం నెరపడాన్ని ఆయన ఉదాహరించాడు. ఆయన మాటలు ఆనాడు ఆశ్చర్యం కల్గించినా, ఈనాటి పరిణామాలను బట్టి ఆయన సరిగానే ఊహించినట్టు అనుకోవాలి.

తన "స్టడీ ఆఫ్ హిస్టరీ"లో ఇండియాను గురించి కూడా టాయిన్‌బీ ఒక ఊహాగానం చేశాడు. ఇండియా ఎదుర్కొంటున్న పెద్ద సవాలు జనాభా పెరుగుదల అని, దాన్ని భారతీయ నాయకులు పాశ్చాత్య మానవతా పద్ధతులలో ఎదుర్కొన లేకపోతే ఇండియాను కమ్యూనిజం లోగొనక తప్పదని ఆయన భావన.

ప్రొఫెసర్ టాయిన్‌బీ సిద్ధాంతాలు, జోస్యాలు ఎట్టివైనా, వాటిలో కొన్నిటితో ఏకీభవించ లేకపోయినా, ఒక మౌలిక చరిత్ర కారుడుగా ఆయన ప్రతిభా పాండిత్యాలకు జోహారు లర్పించని వారుండరు.

*(అక్టోబర్ 25, 1975)*

# శుష్కవివాదం

మహాభారత యుద్ధం నిజంగా జరిగిందా, లేదా? జరిగితే, ఎప్పుడు జరిగింది?

ఇటీవల ఈ ప్రశ్నలు మన పండిత లోకాన్ని విశేషంగా ఆకర్షిస్తున్నాయి. పత్రికల ద్వారా వాదోపవాదాలు జరుగుతున్నాయి, కాని, ఎవరి వాదాలు వారివే అవుతున్నవితప్ప, నిగ్గుతేలడం లేదు; తేలగలదని ఆశించడం కూడా అనవసరం.

నిజానికి ఈ వివాదం చాలా కాలంగా వున్నదేతప్ప, కొత్తది కాదు. అసలు మన పూర్వులకు - పాశ్చాత్యులకున్నట్టుగా చారిత్రిక దృక్పథమే లేదు. ఉన్నది పౌరాణిక దృక్పథం మాత్రమే. అందువల్లనే. మన పూర్వ చరిత్రలో పెక్కు అంశాలు ఈనాటికి కూడా సందిగ్ధంగానే మిగిలిపోయాయి, అయినప్పుడు, మహాభారత చారిత్రిక సత్యాసత్యాల విషయం అగమ్యగోచరంగా వుండిపోవడంలో వింత లేదు.

మహాభారత యుద్ధం క్రీస్తుపూర్వం అయిదు వేల ఏళ్ళనాడు జరిగిందని, మూడువేల ఏళ్ళనాడు జరిగిందని, 1400 సంవత్సరాలనాడు జరిగిందని. 900 సంవత్సరాలనాడు జరిగిందని విభిన్న వాదాలు ఇదివరకు నుంచి వున్నవే. ప్రస్తుత వివాదంలో ప్రవేశించిన పండితులు కూడా ఈ వాదాలను అటు తిప్పి, ఇటు తిప్పి పునరుద్ఘాటించడం తప్పితే కొత్తగా చేసిందేమీ కనబడదు.

ఈ వివాదాన్ని కొత్తగా ఈ మధ్య రేకెత్తించినవారు చరిత్రకారుడు శ్రీ డి.సి. సర్కార్. ఆయన మహాభారతాన్ని చాలవరకు కల్పితంగా కొట్టివేశారు. ఆ యుద్ధం జరిగివుంటే, అది రెండు తెగల మధ్య జరిగిన చిన్న కలహమై వుంటుందని, ఆ ఉదంతాన్ని తర్వాత తరాలవారు గోరంతలు కొండంతలుగా పెంచివేశారని ఆయన వాదం. దీన్ని పురావస్తు శాస్త్రవేత్త శ్రీ సాంకాలియా సమర్థించారు.

సనాతనవాదుల వాదం ప్రకారం మహాభారత యుద్ధం క్రీస్తుపూర్వం 3100 ప్రాంతంలో జరిగివుండాలి. దీనికి వారు ఏవేవో జ్యోతిష విషయాల ఆధారాన్ని చూపిస్తున్నారు. కాని, ఇది నిజమైతే బుద్ధుడిని క్రీస్తుపూర్వం 1800 ప్రాంతానికి జరపవలసి వస్తుందని, హరప్పా, మొహెంజొదారోల వద్ద బయల్పడిన చారిత్రిక విషయాలకు కూడా ఈ వాదం విరుద్ధమైనదని చరిత్రకారుల వాదం. క్రీస్తు పూర్వం 1400 ప్రాంతంలో ఆ యుద్ధం జరిగినదన్న వాదం కూడా నిలవదని, బహుశా క్రీస్తుపూర్వం 1000-900 ప్రాంతంలో జరిగి వుండవచ్చునని పురావస్తు శాస్త్రవేత్తల అభిప్రాయం.

ఏమైనా, ఇది శుష్క వివాదంగా కనబడక మానదు, మహాభారతం యథాతథంగా జరిగిందని నమ్మే ఛాందసులను ఎన్ని చారిత్రిక నిరూపణలైనా మార్చలేవు. ఇక చారిత్రికులైనా.

ఇప్పటికంటె స్పష్టమైన ఆధారాలు లభించేవరకు దాని కాలనిర్ణయాన్ని చేయబూనడం అనవసరం.

ఈ వాదోపవాదాలు ఎలా వున్నా, ఒక గ్రంథంగా మహాభారతానికి భారతీయ జీవనంపై, సంస్కృతిపై, సాహిత్యంపై. చింతనపై కల ప్రభావాన్ని ఎవ్వరు కాదనలేరు. అది సుమారు ఎనిమిదివేలకు పైగా శ్లోకాలతో ప్రారంభమై లక్ష శ్లోకాలకు పెరిగిన గ్రంథం. అందువల్ల, దానిలో ఏ కొద్దిగానో చారిత్రిక యాథార్థ్యం వుండవచ్చునేమోగాని, మిగిలినదాన్ని కల్పిత కథగానే పరిగణించాలి. అలా కల్పిత కథగా పరిగణించినంత మాత్రాన దాని విలువతగ్గదు. సాహిత్యంగా దాని విలువ దానికి వుంటుంది. యథార్థంగా జరిగింది కనుకనే, దానికి ఆ విలువ వచ్చినదనడం పిడివాదం. యథార్థంగా జరగకపోయినా, సామాజిక దృక్పథంపై, చింతనపై ప్రభావాన్ని నెరపిన గ్రంథాలు ప్రపంచంలో ఎన్నిలేవు? వాటి కోవకు చెందినదే మహాభారతం.

*(నవంబర్ 2, 1975)*

# సాంఘిక దురాచారం

శాసనాలు చేసినంతమాత్రాన ఏ సాంఘిక సంస్కరణ ప్రయత్నం విజయవంతం కాబోదు. దాని ఆవశ్యకతను ప్రజలు గుర్తించాలి. దానికి సంబంధించిన మానసిక చైతన్యం వారిలో ప్రస్ఫుటించాలి. వారి నుంచి పూర్తి సహకారం రావాలి.

అతి బాల్య వివాహాలు ఈనాడు ఎక్కడైనా చెదురు మదురుగా జరుగుతున్నవేమోగాని, ఒక పెద్ద సాంఘిక సమస్యగా పరిగణించదగినంతగా జరగడంలేదు. ఈ పరిణామం సాధ్యం కావడానికి శారదా శాసనం ఒక్కటే కారణమని అనుకోలేము. బాల్య వివాహ దురాచారాన్ని రూపుమాపడానికి ఎందరో మహామహులైన సంఘ సంస్కర్తలు కృషిచేశారు. వారి కృషి ఫలితంగా ప్రజలలో వాటిపట్ల కలిగిన ఏవగింపు ఈ దురాచార నిర్మూలనకు ముఖ్యకారణం.

అదేవిధంగా తరతరాలుగా మన సమాజాన్ని బాధిస్తున్న మరొక దురాచారం వరకట్నం. దీన్నికూడా నిషేధిస్తూ శాసనాలు లేకపోలేదుగాని, ఇది నిర్మూలన కాలేదు సరిగదా. నానాటికి పెనుభూతంవలె పెరిగిపోతున్నది.

మొన్న హైదరాబాదులో ఒక సభలో ప్రసంగిస్తూ ఒరిస్సా ముఖ్యమంత్రి శ్రీమతి నందినీ శతపథి స్త్రీల అభ్యున్నతికి అవరోధాలుగా నిలిచిన రెండే రెండు ముఖ్య సమస్యలు విద్యావిహీనత, వరకట్నపు దురాచారం అని పేర్కొన్నారు. నిజమేగాని, మొదటిదాని కంటె రెండవదే జటిల సమస్య.

ఒకప్పటి సంగతి ఏమైనా, ఈనాడు స్త్రీ విద్యావశ్యకత గురించి వ్యతిరేకాభిప్రాయం దాదాపుగా లేదు. ఈనాడు అది ప్రయత్నపూర్వకంగా సాధించవలసిన సంస్కరణ కాదు. అవకాశాలు లేకపోవడమే స్త్రీలలో విద్యావ్యాప్తి చురుకుగా జరగకపోవడానికి కారణం. మొత్తం జనాభాలోనే నూటికి 70 మంది విద్యాశూన్యులైనప్పుడు తరతరాలుగా పురుషులకంటె అన్ని విధాలుగా వెనుకబడిన స్త్రీలు విద్య విషయంలోకూడా వెనుక బడి వుండడంలో ఆశ్చర్యం లేదు.

వరకట్నపు దురాచారం మాత్రం ఇందుకు భిన్నమైన సమస్య. దీని నిర్మూలనకు ప్రజలే సిద్ధంగా లేరనడం సత్యదూరం కాదు. వరకట్నం పుచ్చుకొనడం, ఇవ్వడం కూడా ప్రతిష్ఠకు, సంఘంలో గౌరవానికి సంబంధించిన విషయాలుగా చెల్లుతున్నాయి. కట్నం అసలు తీసుకొనకపోవడం నలుగురిలో చిన్నతనంగా వరునివైపువారు భావించినట్టే, అది వరునివైపు ఏదో లోపానికి సూచనగా వధువువైపువారు, ఇతరులు భావించడం సర్వ సామాన్యంగా జరుగుతున్నది. దీన్నిబట్టే ఎంత హెచ్చుకట్నం ఇస్తే. తీసుకుంటే అంత ఘనంగా భావించడంకూడా వున్నది. ఈ భావాల నిర్మూలనకు మొదటగా ప్రయత్నం జరగాలి, ప్రచారం జరగాలి.

దీనితో ముడిపడిన సమస్య అసలు వివాహాలను జరిపే తీరు. ఎంత వైభవంగా, ఎంత

ధనవ్యయం చేసి వివాహం జరిపిస్తే అంత ఘనతగా పరిగణించడం మన సమాజంలో పరిపాటి. నిరాడంబరంగా వివాహం జరపడానికి సంఘం హర్షించదు. ఇందువల్ల ఎంత శక్తిహీనుడైనా అప్పోసప్పో చేసి ఘనంగా వివాహం జరిపినట్టు అనిపించుకోవలసివస్తున్నది. ఇంతేకాదు, వివాహ సమయంలో బంధుమిత్రులు వధూవరులకు చదివించే కానుకల హెచ్చు తగ్గులు కూడా ప్రతిష్ఠకు సంబంధించిన విషయంగా పట్టించుకునే స్థితికి మన సంఘం దిగజారిపోయింది.

ఈ దురాచారాల నిర్మూలనకు శాసనాలు అవసరమే కావచ్చు. కాని, అంతకంటె ముఖ్యంగా వీటిపట్ల ఏహ్యభావాన్ని ప్రజలలో కలిగించడం ముఖ్యం. వీటిపట్ల యువతీ యువకులు ఎదురుతిరిగేటట్టు చేయడం ముఖ్యం. శాసనాలు మాత్రమే దీన్ని సాధించలేవు.

*(నవంబర్ 11, 1975)*

# చార్లీ చాప్లిన్

సినిమా అనేది అప్పటికింకా సాంకేతికమైన ఒక వింత మాత్రమే. దానికొక వ్యాకరణంగాని, శిల్పంగాని ఇంకా ఏర్పడలేదు. ఒక కళగా అది ఇంకా రూపురేకలు దిద్దుకోలేదు. అసలు సినిమా ఎన్నటికైనా ఒక ప్రత్యేక కళగా రూపుదాల్చగలదన్న ఆలోచన కూడా ఎవరికీ కలగని రోజులవి.

ఆ ప్రారంభ దినాలలో సినిమాను ఒక కళగా తీర్చిదిద్దడానికి, దానినొక ఉత్తమ వినోద సాధనంగా మలచడానికి కొందరు ప్రతిభావంతులు ప్రయత్నించారు. వారిలో ఒకరు మొన్న తన 88వ ఏట అస్తమించిన చార్లీచాప్లిన్. కర్ణుడులేని భారతం లేదన్నట్టు, చాప్లిన్ లేని ప్రపంచ చలనచిత్ర కళను ఊహించలేము. దాని మూల పురుషులలో, మార్గదర్శకులలో ఆయన ఒకడు. హాలీవుడ్ ప్రపంచ చలనచిత్ర రాజధానిగా అభివృద్ధి కావడానికి తోడ్పడిన వారిలో కూడా ఆయన ఒకడు.

బౌలర్ టోపీ, ముక్కుకింద మీసకట్టు, బిగుతుకోటు, వదులు పంట్లాము, చిరిగిన బూట్లు, చేతిలో కర్ర - ఇదీ ఆయన వేషం. రెండు దశాబ్దాల పాటు తాను నిర్మించిన ప్రతి చిత్రంలో ఇదే వేషంతో నిరుద్యోగిగా, భగ్న ప్రేమికుడుగా, "దగాపడిన తమ్ముడు"గా, ఎవరికీ అక్కరలేని అప్రయోజకుడుగా, ఒక చోట స్థిరనివాసం లేని దేశద్రిమ్మరిగా, నా అనేవారు లేని అనాథుడుగా - ఇంకా రకరకాల "అల్పజీవి" పాత్రలను చాప్లిన్ ధరించి, తన అపూర్వ హాస్య నటనతో ప్రపంచ వ్యాప్తంగా కోట్లాది ప్రజలను పొట్ట చెక్కలయ్యేటట్టు నవ్వించాడు.

అయితే, అతడు కేవలం హాస్యనటుడే కాదు. అతనివి కేవలం హాస్య చిత్రాలే కావు. అతని హాస్యంలో "కిడ్", "సిటీలైట్స్" చిత్రాలలో వలె కరుణరసం కూడా తొణికిసలాడేది. "మోడరన్ టైమ్స్" చిత్రంలో వలె యంత్ర నాగరికతపై విమర్శ వుండేది. "గ్రేట్ డిక్టేటర్"లో వలె ఫాసిజంపై దాడి వుండేది. "ముష్యూర్ వెర్డూ" చిత్రంలో వలె నేరాలకు ఆస్కారమిచ్చే ఆధునిక సంఘ వ్యవస్థపై నిశిత విమర్శ వుండేది. "లైమ్‌లైట్" చిత్రంలో వలె నవ్వించే శక్తిని కోల్పోయిన హాస్య నటుని పాత్ర ద్వారా స్వీయ కథాచ్ఛాయలు వుండేవి. మొత్తంపై అన్ని చిత్రాలలో ఒక ఆశావాదం, మానవతావాదం అంతర్వాహినులుగా వుండేవి.

అతనిది అసాధారణ ప్రతిభ, అనితర సాధ్యమైన కళాకౌశలం, ప్రపంచంలోని ఉత్తమోత్తమ చిత్రాలను పదింటిని ఎన్నిక చేయవలసివస్తే వాటిలో చాప్లిన్ చిత్రాలలో కనీసం ఏ రెండింటినో చేర్చక తప్పదు. చలనచిత్రాల చరిత్రలో అతడిని మించిన నటుడు లేడని ఇప్పటికి కూడా విమర్శకులు అభిప్రాయపడతారు. ఆయన మరణం అసంఖ్యాకులైన ఆయన అభిమానులకు తీరని విచారం కలిగిస్తుంది.

*(డిసెంబర్ 27, 1975)*

# ఏ పద్ధతి అనుసరణీయం?

మన రాజ్యాంగపు భవితవ్యంపై కొంత కాలంగా వున్న అనుమానాలకు, జరుగుతున్న ఊహాగానాలకు ప్రధాని ఇందిరా గాంధి మొన్న ఫ్రెంచి వార్తా సంస్థకు ఇచ్చిన ఇంటర్వ్యూలో స్వస్తి చెప్పారు.

ఇప్పటి "క్యాబినెట్ పద్ధతి" ప్రభుత్వ స్వరూపం ఆచరణయోగ్యంగా లేదని ప్రధాని భావిస్తున్నారా? అమెరికాలోవలె అధ్యక్ష పద్ధతి ప్రభుత్వం మన దేశానికి కూడా అనుసరణీయమని ఆమె అభిప్రాయపడుతున్నారా?

మన రాజ్యాంగ స్వరూపం మారాలని, అది కాలానుగుణంగా, ప్రజాభిప్రాయానికి అనుకూలంగా పరివర్తన పొందాలని ఇటీవల ప్రధాని, న్యాయశాఖ మంత్రితోసహా కొందరు కేంద్ర మంత్రులు స్పష్టంచేస్తూ వుండడంవల్ల దేశంలో ఈ రకమైన అనుమానాలకు, ఊహాగానాలకు ఆస్కారం కలిగింది.

అయితే, ఎన్ని లోపాలు వున్నప్పటికీ, ఇప్పటి "క్యాబినెట్ పద్ధతి" ప్రభుత్వమే మన దేశానికి, మన పరిస్థితులకు సరిపోతుందని ప్రధాని ఇప్పుడు స్పష్టం చేయడంతో దేశంలో అధ్యక్ష పద్ధతి ప్రభుత్వాన్ని ఆమె వాంఛిస్తున్నారన్న ఊహాగానాలకు ఇక స్వస్తి జరగాలి.

అమెరికాకు అధ్యక్ష పద్ధతి ప్రభుత్వం సరిపోయి వుండవచ్చు. దాదాపు రెండువందల సంవత్సరాలుగా అది అక్కడ అమలులో వున్నమాట వాస్తవమే. కాని, ఆ పద్ధతిలో కూడా ఎన్నో లోపాలు లేకపోలేదు. అమెరికా అధ్యక్షుడిని సరాసరి ప్రజలే ఎన్నుకున్నా, ఆ ప్రజలే సూటిగా ఎన్నుకున్న కాంగ్రెసుకు ఆయన కాని, ఆయన మంత్రి వర్గం కాని ప్రత్యక్షంగా బాధ్యత వహించనక్కరలేదు. ఇందువల్ల, అక్కడ ఒక్కొక్కప్పుడు ద్వంద్వ ప్రభుత్వం ఏర్పడే అవకాశం లేకపోలేదు, అధ్యక్షునికి, కాంగ్రెసుకు సంఘర్షణలు ఏర్పడిన సందర్భాలు కూడా లేకపోలేదు.

అంతేకాదు, ఆ పద్ధతిలో మరొక విపరీత పరిస్థితి కూడా గర్భితమై వున్నది. చాలా సందర్భాలలో అధ్యక్షుడు ఒక పార్టీ ప్రతినిధి అయితే, కాంగ్రెసులో మెజారిటీ మరొక పార్టీది అవుతుంది. అయినా, అప్పుడు దేశాన్ని పరిపాలించేది మెజారిటీ పార్టీ ప్రతినిధి కాదు. ఇందువల్ల, అక్కడ ఒక్కొక్కప్పుడు రాజకీయ పరిస్థితి స్పష్టంగా వుండదు. మరొకప్పుడు రాజ్యాంగ సంక్షోభమే ఏర్పడవచ్చు. ఏర్పడిన సందర్భాలు అనేకం లేకపోలేదు కూడా.

కాగా, మన దేశానికి "క్యాబినెట్ పద్ధతి" ప్రభుత్వం అన్ని విధాల ఆచరణ యోగ్యమని ఎన్నో దేశాల రాజ్యాంగాలను, రాజ్యాంగ సంప్రదాయాలను పరిశీలించిన పిమ్మటనే మన రాజ్యాంగ రచయితలు నిర్ణయించారు. కొన్ని లోటుపాట్లు వున్నప్పటికి. ఈ పద్ధతి ఇప్పటివరకు జయప్రదంగా అమలు జరుగుతున్నది. ఈ పద్ధతిలో పార్లమెంటును ప్రజలే సరాసరి ఎన్నుకుంటారు. దానిలో

మెజారిటీ ఏ పార్టీకివస్తే, ఆ పార్టీ ప్రభుత్వాన్ని ఏర్పరచడం జరుగుతుంది. ప్రధాని తన పార్టీకి, పార్లమెంటుకు, ప్రజలకు ప్రత్యక్షంగా బాధ్యత వహించవలసి వుంటుంది. దీనిలో డొంకతిరుగుళ్ళు లేవు. అస్తవ్యస్తపు పరిస్థితి వుండదు; పరస్పర వ్యతిరేక సందర్భాలు, సన్నివేశాలు వుండవు.

అయితే, ఈ పద్ధతి జయప్రదం కావడం ఏదో ఒక పక్షంపైనే ఆధారపడి లేదు. పార్లమెంటరీ ప్రజాస్వామ్యమనే శకటానికి ప్రభుత్వపక్షం, ప్రతిపక్షం జోడెడ్లవంటివి. ఇవి రెండూ పరస్పర సమన్వయంతో, పరస్పర సానుభూతితో, క్రమశిక్షణతో, బాధ్యతాయుతంగా నడిచినప్పుడే పార్లమెంటరీ ప్రజాస్వామ్య శకటం ఒడిదుడుకులు లేకుండా, సాఫీగా నడుస్తుంది. అలా కాక, ఒకటి ఏటికి, మరొకటి కోటికి లాగితే, అవి పరస్పరం శత్రువులుగా భావించి, పరస్పర నాశనాన్ని కోరితే, మిగిలే ప్రజాస్వామ్య శకట శకలాలె.

దురదృష్టవశాత్తు, కడచిన సంవత్సరంలో మనప్రతిపక్షాలు ఈ ప్రాథమిక ప్రజాస్వామ్యధర్మాన్ని పాటించలేదు. అందువల్లనే, దేశంలో అరాజక పరిస్థితులు ఏర్పడే లక్షణాలు పొడసూపగా, వాటిని నిరోధించడానికి తీవ్ర చర్యలు గైకొనవలసి వచ్చింది.

తప్పులేదు. అవసరమైనప్పుడు దేశ కాల పరిస్థితులనుబట్టి రాజ్యాంగాన్ని సవరించుకోవచ్చు. చట్టరూపంలో వున్న ఆయా దేశాల రాజ్యాంగాలు కేవలం ఆచరణలో అనేక మార్పులు, చెర్పులు పొందాయి. అయితే, చీటికీ మాటికీ రాజ్యాంగాన్ని మార్చితే, దానిలో నిక్షిప్తమైవున్న మౌలికమైన విలువలు సన్నగిల్లే ప్రమాదం వుంది. రాజ్యాంగాన్ని ఎప్పుడు మార్చినా, అది దానికి మరింత విలువను, మరింతగా పరిపుష్టిని సమకూర్చగలిగి వుండాలి. మొన్న ప్రధాని చెప్పినట్టు. ఈ మార్పు విషయమై న్యాయవాదులే కాదు. అధ్యాపకులే కాదు. ఇతర మేధావి వర్గాలే కాదు - ప్రజలలోని అన్ని వర్గాలవారు ఈ మార్పులను గురించి చర్చించాలి. నిగ్గుతేల్చాలి. సుదీర్ఘంగా చర్చించి, సహేతుకమైన నిర్ణయాలు చేసేదే నిజమైన ప్రజాస్వామ్యం.

*(జనవరి 23, 1976)*

# బాలల సాహిత్యం

మనకున్న బాలవాఙ్మయం రాజకుమారులు, రాజకుమార్తెలు, మాంత్రికులు, వారి ప్రేమలకు, సాహసాలకు, మాయలకు సంబంధించిన కథలు, లేదా, భారత, భాగవతాది పురాణాలనుంచి సేకరించి వ్రాసిన కథలు.

ఈనాటికీ బాలసాహిత్యం పేరుతో ఇవే ఎక్కువగా వెలువడుతున్నాయి. కేవలం ఉబుసుపోకకు చదువుకొనడానికి తప్ప మరి దేనికీ పనికిరాని ఇట్టి సాహిత్యమే ఎక్కువగా వస్తున్నది.

ఈ విధమైన సాహిత్యం అసలే రాకూడదని మా అభిప్రాయం కాదు. కాని, పిల్లల మనస్సులకు ఉల్లాసాన్ని చేకూర్చడానికి ఉద్దేశించిన సాహిత్యంతోపాటు, వారి మనస్సులకు వికాసాన్ని కలిగించగల రచనలు ఎందుకు రావడంలేదన్నదే మా బాధ.

ఇది వైజ్ఞానిక యుగం. ఈ యుగ ప్రభావం మన నిత్య జీవితంపై విశేషంగా పడుతున్నది. కాని, మన బాల వాఙ్మయాన్ని పరికిస్తే అసలు ఈ యుగంలో మనం నివసిస్తున్నామనే విషయమే పిల్లలకు తెలియకుండా జాగ్రత్త పడుతున్నామా అనిపిస్తుంది.

ఈనాడు రైళ్ళు, బస్సులు, కార్లు, సైకిళ్ల మొదలైన ప్రయాణ సాధనాలు లేనిదే రోజుగడవదు. టెలిఫోన్, టెలిగ్రాఫ్, రేడియో, సినిమా - ఇట్టి సాంకేతిక పరికరాలు లేనిదే పూట గడవదు. ఒకప్పుడు పాశ్చాత్య సామ్రాజ్యాల స్థానంలో ఈనాడు ఎన్నో స్వతంత్ర దేశాలు అవతరించాయి. దేశాల మధ్య, జాతుల మధ్య సంబంధాలు పెరుగుతున్నాయి. ఈ సంబంధాల ప్రభావం మన నిత్యజీవితంపై పడుతున్నది. శాఖోపశాఖలుగా విస్తరించిన విజ్ఞానశాస్త్రాలు అపారవేగంతో పురోగమిస్తున్నాయి. మానవులు చంద్రమండలంలోనికి వెళ్ళి తిరిగివచ్చారు. దూరగ్రహాలను చేరడానికి ప్రయత్నిస్తున్నారు.

ఈ విధంగా, మనకళ్ళ ఎదుట ఎన్నెన్నో అపూర్వ సంఘటనలు జరిగిపోతున్నాయి. వీటిని గురించి తెలుసుకోవాలన్న కుతూహలం బహుశా ప్రతి బాలునికి, ప్రతి బాలికకు సహజంగా వుంటుంది. ఈ కుతూహలాన్ని తీర్చగల ప్రాథమిక సాహిత్యం - బేసిక్ లిటరేచర్ - మనకు ఏపాటిగా వున్నదని ప్రశ్న వేసుకుంటే, దాదాపుగా లేదనే సమాధానం వస్తుంది.

మన రచయితలు ఈ విధమైన సాహిత్యం జోలికిపోరు. ఇట్టి సాహిత్య సృష్టి శ్రమతో కూడినపని, బహుశా దీనిపట్ల ఆదరం తక్కువ అని, దీనికి ప్రతిఫలం కూడా తక్కువ అని భయం కూడా వుండవచ్చు. ప్రచురణకర్తలు కూడా ఇట్టి సాహిత్యాన్ని ప్రచురించడానికి ముందుకురారు. వారికి కూడా బహుశా రచయితలకున్న భయాలవంటివే వుండవచ్చు. కనుకనే, మనకు బాలవాఙ్మయం అనగానే జానపద సాహిత్యాన్ని పోలినదే ఎక్కువగా వస్తున్నది.

రాష్ట్రపతి శ్రీ ఫక్రుద్దీన్ అలీ అహ్మద్ మొన్న మద్రాసులో ఒక సభలో ప్రసంగిస్తూ

బాలబాలికలను బాధ్యతాయుతులైన పౌరులుగా తీర్చిదిద్దగల సాహిత్యం ఎక్కువగా రావాలని, అట్టి సాహిత్య సృష్టికి రచయితలు కృషిచేయాలని విజ్ఞప్తిచేశారు. ఈ విజ్ఞప్తి సఫలం కావడానికి కేవలం రచయితల కృషి మాత్రమే చాలదు. లాభార్జనే ప్రధానమైన ప్రయివేట్ రంగంపై పూర్తిగా ఆధారపడి కూడా ప్రయోజనంలేదు. ప్రభుత్వం కూడా తన వంతు బాధ్యతను నెరవేర్చాలి.

ఈ బాధ్యతను అకాడమీల ద్వారా నిర్వహించవచ్చు. ఇటీవల మన రాష్ట్రంలో బాలల అకాడమీని నెలకొల్పారు. బాలల మనోవికాసానికి దోహదం చేయగల సాహిత్యాన్ని విరివిగా, చౌకగా, ఆకర్షణీయంగా ప్రచురించి, అందచేయడానికి ఈ అకాడమీ ఎందుకు కృషి చేయరాదు? ఇందుకోసం ఒక ప్రత్యేక సంస్థను ఎందుకు నెలకొల్పరాదు?

ఏమిటి, ఎవరు, ఎప్పుడు, ఎక్కడ, ఎందుకు - వీటిని ప్రశ్నా పంచకంగా పేర్కొంటారు. తమ చుట్టూవున్న ప్రపంచాన్ని చూస్తున్నప్పుడు ప్రతిబాలునిలో, బాలికలో సహజంగా ఉదయించే ప్రశ్నలివి. వీటికి సమాధానాలు చెప్పి బాల బాలికల కుతూహలాన్ని తీర్చగల సాహిత్యం మనకు సమృద్ధంగా రావాలి. కుతూహలాన్ని సకాలంలో, సక్రమంగా తీర్చకపోతే, అది ఆసలే అణగారిపోతుంది. ఇట్టి కుతూహలం లేని బాలబాలికలు బాధ్యతాయుతులైన పౌరులుగా వికసించలేరు.

*(ఏప్రిల్ 20, 1976)*

# జటిల సమస్య

మన దేశం నుంచి అన్యదేశాలకు సైంటిస్టులు, ఇంజనీర్లు, డాక్టర్లు ఎందుకు వలసపోతున్నారు? వారి వలసను అరికట్టే మార్గం ఏది? ఇవి నేడు భారత ప్రభుత్వాన్ని, దేశక్షేమాన్ని కాంక్షించేవారిని ఆందోళన పరుస్తున్న ప్రశ్నలు.

1971 నాటి అంచనా ప్రకారం మొత్తం 30 వేల మంది భారతీయ శాస్త్రవేత్తలు, సాంకేతికవేత్తలు అన్యదేశాలలో స్థిరనివాసం చేస్తున్నారు. తిరిగి వీరిలో కూడా ఎక్కువమంది అమెరికాలో వున్నారు. అసలు మనదేశం నుంచి మేధావుల వలస ఎక్కువగా అమెరికాకే జరుగుతున్నది.

అమెరికాలో జీతాలు ఎక్కువ. జీవన ప్రమాణం ఎక్కువ. పరిశోధనలకు, వృత్తికి సౌకర్యాలు ఎక్కువ. ఇంతేకాదు. అమెరికా పారిశ్రామిక స్థాయి ఎందరు శాస్త్రవేత్తలను, సాంకేతిక నిపుణులనైనా ఇముడ్చుకోగలిగినంత ఎక్కువగా వున్నది. అది తయారు చేసుకుంటున్న శాస్త్రవేత్తలు, సాంకేతిక నిపుణులు దానికి చాలడంలేదు. అందువల్ల ఎక్కడెక్కడి వారిని అది ఆకర్షిస్తున్నది. ముఖ్యంగా ఇండియానుంచి మరీ ఎక్కువగా ఆకర్షిస్తున్నది. 1970లో అమెరికా దిగుమతి చేసుకున్న అన్య దేశాల ఇంజనీర్లలో సంఖ్య రీత్యా మనవారిదే (నూటికి 23 మంది) అగ్రస్థానం; డాక్టర్లలో మనవారిది (నూటికి 12 మంది) ద్వితీయ స్థానం.

ఒక విధంగా ఇది మనకు గర్వకారణమే. మన ప్రతిభా పతాకాన్ని మనవారు అమెరికా మొదలైన అభివృద్ధి చెందిన పెక్కు దేశాలలో ఎగురవేయడం సంతోషించవలసిన విషయమే. కాని, మిగిలిన అన్ని విధాలుగాను ఇది మనకు శోచనీయమైన, నష్టదాయకమైన విషయం. శాస్త్రవేత్తల, డాక్టర్ల, ఇంజనీర్ల, ఇతర నిపుణుల విద్యాబుద్ధులకు, శిక్షణకు మనం ఎంతో ఖర్చు చేస్తున్నాము. చివరికి వారిలో పలువురు మన దేశానికి కాక, అన్యదేశాలకు, అందులోను అభివృద్ధి చెందిన దేశాలకు ఉపయోగపడడం జరుగుతున్నది.

ఐక్యరాజ్యసమితికి చెందిన "అంక్టాడ్" సంస్థ వేసిన ఒక అంచనా ప్రకారం మన దేశం నుంచి ఒక డాక్టరు వలస వెడితే మనకు 330 వేల రూపాయల నష్టం కలుగుతుంది. ఆ డాక్టరు వెళ్లింది అమెరికా అయితే, ఆ దేశానికి 51 లక్షల 65 వేలు లాభం చేకూరుతుంది. అలాగే ఒక సైంటిస్టు వెడితే మనకు 172 వేలు నష్టం. అమెరికాకు 18 లక్షల 75 వేలు లాభం కలుగుతుంది. ఈ విధంగా 1970లో 3141 మంది మన డాక్టర్ల, సైంటిస్టుల రాకవల్ల అమెరికాకు కలిగిన లాభం 656 కోట్ల రూపాయలకు పైగానే.

అయితే, ఈ విధంగా లాభనష్టాల బేరీజు వల్ల ప్రయోజనం లేదు. మేధావుల వలసను అరికట్టే మార్గాలను, వలస వెళ్ళిన వారిని తిరిగి రప్పించే మార్గాలను ఆలోచించాలి. సైంటిస్టుల

"పూల్" ఏర్పాటు చేశారు. స్వయం జీవనోపాధికల్పనకు బ్యాంకుల సహాయాన్ని ప్రకటించారు. మరెన్నో చర్యలను ప్రకటించారు. కాని, వీటివల్ల ఆశించిన ఫలితాలు కలగలేదు. ఇప్పుడు కొత్తగా మేధావులు, ముఖ్యంగా కొన్ని రకాల సాంకేతిక శాఖలలో నిపుణులైనవారు వలస వెళ్ళకుండా కొన్ని ఆంక్షలను విధించడానికి ప్రభుత్వం ఆలోచిస్తున్నది.

ప్రస్తుత దశలో ఇది అభిలషణీయమే కావచ్చుగాని, మరొక విషయాన్ని కూడా ఆలోచించవలసి వున్నది. సి.ఎస్.ఐ.ఆర్. సంస్థ వేసిన ఒక అంచనా ప్రకారం మన దేశంలో ఆరు లక్షల మందికి పైగా గ్రాడ్యుయేట్లు, డిప్లొమా పొందినవారు నిరుద్యోగులుగా వున్నారు. వీరిలో గుమాస్తాలుగా, ప్యూన్లుగా పని చేయడానికి సిద్ధపడే ఇంజనీర్లు సయితం వున్నారు. అంటే మన పారిశ్రామిక స్థాయి ఇంత మంది విద్యాధికులను ఇముడ్చుకోలేనంత తక్కువగా వున్నదనే కాదా దీని అర్థం?

విదేశాలకు మేధావుల వలస మితిమీరి జరగకుండా క్రమబద్ధం చేయవచ్చు. మనకు కొరతగా వున్న కొన్ని శాఖలలో నిపుణుల వలసను అసలే నిషేధించవచ్చు. విదేశాలకు వెళ్లినవారు తమ ఆర్జనలో కొంత భాగాన్ని స్వదేశానికి పంపివేయాలన్న కట్టడిచేయవచ్చు. వారి వలసను అభివృద్ధి చెందిన దేశాలకుకాక, వర్ధమాన దేశాల వైపు మళ్లించవచ్చు. ఇట్టి చర్యలు సమంజసమేమో గాని, మన నిపుణులు నిరుద్యోగానికైనా సిద్ధపడి స్వదేశానికే పూర్తిగా అంటిపెట్టుకుని వుండాలనడం ఎంతవరకు సబబు?

*(ఏప్రిల్ 24, 1976)*

# ఛాందస పండితులు

మన దేశంలో ఛాందస పండితులకు కొరత లేదు. ఆధునిక శాస్త్రజ్ఞులు కొత్తగా ఏ సిద్ధాంతాన్ని ప్రతిపాదించినా, ఏ కొత్త వైజ్ఞానిక విషయాన్ని కనుగొన్నా, అది మన ప్రాచీన మహర్షులకు కొన్ని వేల ఏళ్ళనాడే తెలుసునని వీరు నమ్ముతారు. ఇతరులను నమ్మించడానికి ప్రయత్నిస్తారు.

ఇటువంటి వారిలో ఒకరు శ్రీ బానీ దేశ్‌పాండే, సాపేక్ష సిద్ధాంతం కొన్నివేల ఏళ్ళనాడే వ్యాసుడికి తెలుసునని ఆయన తన "యూనివర్స్ ఆఫ్ వేదాంత" అనే గ్రంథంలో వ్రాసినట్టు ఒక వార్త తెలుపుతున్నది.

ఈ శతాబ్దపు ప్రారంభ సంవత్సరాలలో ఒకానొక చారిత్రిక సన్నివేశంలో సాపేక్ష సిద్ధాంతం వెలువడింది. ఐన్‌స్టయిన్ కాకపోతే, మరొకరైనా ఆ సిద్ధాంతాన్ని ఆ సమయంలో ప్రతిపాదించేవారే, భౌతిక శాస్త్రంలో ఎదురైన కొన్ని చిక్కు సమస్యలను పరిష్కరించడం తప్పనిసరి అయిన క్లిష్ట ఘట్టంలో దాని ప్రతిపాదన జరిగింది. ఎంతటి మహామేధావికైనా అంతకు నూరేళ్ళ ముందు ఆ సిద్ధాంతం ఊహకైనా అంది వుండేది కాదు. విజ్ఞానశాస్త్ర క్రమ పరిణామ ఫలితమే సాపేక్ష సిద్ధాంతం.

ఈ ప్రాథమిక విషయాన్ని తెలుసుకొనకుండా కొన్ని వేల ఏళ్ళనాడే వ్యాసుడు సాపేక్ష సిద్ధాంతాన్ని ప్రవచించాడనడం మూర్ఖత్వానికి పరాకాష్ఠ. ఒక విధమైన జాత్యహంకారానికి నిదర్శనం. వ్యాసుడనేవాడు వుంటే గింటే, ఆయన ఎంతటి మేధావి అయినా, ఆ నాటి తాత్విక, వైజ్ఞానిక శాస్త్రావసరాలను బట్టి - పూర్తిగా గణిత శాస్త్ర ప్రాతిపదికపై ఆధారపడిన సాపేక్ష సిద్ధాంతం జోలికి పోవలసిన అవసరమే ఆయనకు వుండేది కాదు.

ఏ ఆధునిక శాస్త్రజ్ఞుడు ఏ కొత్త విషయం కనుగొన్నా, అది మన శాస్త్రాలలో ఇదివరకే వున్నదని వాదించే వారు ఆ ఆధునిక శాస్త్రజ్ఞుడు ఆ కొత్త విషయాన్ని కనుగొనక ముందే దాన్ని త్రవ్వి ప్రపంచాన్ని ఎందుకు ఆశ్చర్యచకితం చేయలేక పోతున్నారు? ఈ ఛాందస పండితులవల్ల మన దేశం వైజ్ఞానికంగా, ఇతర విధాలుగా ఒక్క అంగుళం ముందుకు పోలేదు సరిగదా, వారిని నమ్ముకుంటే కొన్నివేళ ఏళ్ళు వెనుకకు పోవడం మాత్రం ఖాయం.

*(మే 30, 1976)*

# చెట్ల పెంపకం

**జా**తీయ ప్రాధాన్యంగల కార్యక్రమాలలో ఒకటిగా చెట్ల పెంపకానికి ఇప్పుడు గుర్తింపు లభించింది. మహారాష్ట్ర ప్రభుత్వం ఈ కార్యక్రమాన్ని చాలా భారీ ఎత్తున అమలు చేయబోతున్నది. బొంబాయి, పూనా మొదలైన పెద్ద నగరాలలో, పట్టణాలలో ఈ ఏడాదిలో లక్షలాది మొక్కలు నాటడానికి అది పథకాన్ని సిద్ధం చేసింది.

ఆంధ్రప్రదేశ్ కూడా ఇందుకు సమాయత్తం కావడం ముదావహం. రాష్ట్ర అటవీశాఖ జంటనగరాలలోను, ఇతర పట్టణాలలోను చెట్ల పెంపకం కార్యక్రమాన్ని ప్రోత్సహించడానికి ముందుకు వచ్చింది. ప్రభుత్వ రంగ పరిశ్రమలు, సంస్థలు, పాఠశాలలు మొదలైనవాటికి ఉచితంగాను, ప్రయివేటు సంస్థలకు నామమాత్రమైన ధరలకు సప్లయి చేయడానికి అది ఇప్పటికి 128 వేల మొక్కలను సిద్ధం చేసిందట.

అడవుల ప్రాధాన్యాన్ని, వృక్ష సంపద పరిరక్షణ అవసరాన్ని ఈనాడు కొత్తగా నొక్కి చెప్పనక్కర లేదు. మానవుల మనుగడ, జంతుకోటి మనుగడ వృక్షాలపైన పూర్తిగా ఆధారపడి వున్నది. ఆహారానికే కాదు. కలప, వంట చెరకు మొదలైనవాటికే కాదు. ఆఖరికి మనం పీల్చే ప్రాణవాయువు కోసం కూడా చెట్లపైనే ఆధారపడుతున్నాము.

అయినా, నాగరికత పెరుగుతున్న కొద్దీ, జనాభా పెరుగుతున్న కొద్దీ ప్రపంచంలో అడవుల విస్తీర్ణం తగ్గిపోతున్నది. వ్యవసాయ భూమిని, నివాస భూమిని విస్తరించడానికి, ఇంకా ఇతరావసరాలకు మానవుడు అడవులను నరికివేస్తున్నాడు. ఇప్పుడు ప్రపంచంలో నూటికి 30 వంతుల భాగమే అడవుల క్రింద వున్నదట. మూడువందల ఏళ్ళనాడు అమెరికా ఖండంలో సగానికి సగం వున్న అటవీ భూమి ఇప్పుడు నూటికి 25 వంతులకు తగ్గిపోయింది.

మన దేశంలో కూడా ప్రపంచపు సగటు కంటె తక్కువగా - నూటికి 23 వంతులు మాత్రమే - అడవులున్నాయి. ఈ అటవీ విస్తీర్ణాన్ని కనీసం నూటికి 33 వంతులకైనా పెంచాలన్నది జాతీయ లక్ష్యం.

వృక్షాలవల్ల, అడవులవల్ల ఇంతకు ముందు పేర్కొన్న ఉపయోగాలేకాక, ముఖ్యమైనవి మరికొన్ని వున్నాయి. అడవులు వర్షపాతానికి దోహదం చేస్తాయి. భూసారం నష్టమైపోకుండా కాపాడుతాయి. అంతేకాక, పారిశ్రామిక నాగరికత పెరిగిపోతున్న ఈ రోజులలో వాతావరణ కాలుష్యాన్ని హరించి వేయడానికి కూడా వృక్షసంపద తోడ్పడుతుంది.

మన దేశంలో కొన్ని కొన్ని ప్రాంతాలు తరచుగా అనావృష్టికి గురికావడానికి ఒక ముఖ్యకారణం అడవులు తగినంత విస్తీర్ణంలో లేకపోవడమేనని పరిశోధకులు తేల్చారు. దేశంలో సాగుకు పనికివచ్చే భూమి ఏడాదికి ఒక శాతం చొప్పున ఎడారిగా మారుతున్నదట. ఈ విధంగా

భూసారం నష్టం కావడానికి కూడా అడవులను అనాలోచితంగా కొట్టివేయడమే కారణమని చెబుతున్నారు.

ప్రకృతిలో సహజ సిద్ధంగా ఒక సమతూకం - బ్యాలెన్స్ - వున్నది. దాన్ని చెడగొట్టడం ఎన్ని అనర్థాలకు దారి తీయగలదో గుర్తించిన తర్వాత, ఇకనైనా ఆ సమతూకాన్ని పునరుద్ధరించడానికి చర్యలు గైకొనడం అవసరం. ఒక చెట్టును పడగొడితే పది మొక్కలను నాటేటట్టుగా ఒక పద్ధతి ప్రకారం ఈ కార్యక్రమాన్ని అమలు చేయాలి.

ఇందుకు రాష్ట్ర అటవీశాఖ ప్రారంభించిన కృషి మెచ్చదగినది. అయితే, ఈ కృషి వెనుకటి వనమహోత్సవాలవలె నీరుకారి పోకుండా, ఆరంభ శూరత్వంగా మిగిలి పోకుండా జాగ్రత్తపడాలి.

*(జూన్ 11, 1976)*

# మురికివాడలు

భారతీయ నగరాలలో సుమారు 30 శాతం వరకు ప్రజలు మురికివాడలలో వారేనట. ఒక అధికార నివేదికలో వెల్లడైన ఈ విషయం విస్మయం, విచారం కలిగ..

నానాటికి జనాభా పెరుగుతున్నది. దీనితోపాటు పట్టణాలలో, నగరాలలో జన పెరుగుతున్నది.

ముఖ్యంగా, పంచవర్ష ప్రణాళికలను ప్రారంభించిన తర్వాత నగరాల జనాభా మరింత వేగంగా పెరుగుతున్నది. మన ప్రణాళికలు ఎక్కువగా పట్టణాలను, నగరాలను దృష్టిలో పెట్టుకొని రూపొందించినవి కావడమే ఇందుకు కారణం.

గ్రామాలలో పనిపాటులు దొరకవు; దొరికినా ఏడాది పొడుగునా దొరకవు. జీవనోపాధి లభించదు. సాధారణ పౌర సౌకర్యాలకు కూడా మన గ్రామాలు నోచుకోలేదు. కనుక, గ్రామీణ ప్రజలకు పట్టణాలు, నగరాలు ఎంతో ఆకర్షణీయంగా కనిపిస్తాయి. నగరాలకు తరలి వెడితే ఏదో బావుకోవచ్చు ననిపిస్తుంది. ఏదో ఉద్యోగం దొరకక పోతుందా అని ఆశ కలుగుతుం. దీని ఫలితంగా ప్రజలు నగరాలకు ఎగబడతారు.

"బ్యాక్ టు విలేజెస్" (గ్రామాలకు తిరిగి వెళ్ళండి) అని గాంధీజీ తరుచుగా అంటూ వుండేవారు. మరిపెక్కు విషయాలలో వలెనే ఈ విషయంలో కూడా గాంధీజీ బోధనలను మనం పెడచెవిని పెట్టాము. "బ్యాక్" అంటే వీపు అని కూడా అర్థం. కనుక, గ్రామాల వైపు వీపు త్రిప్పి నగరాలకు అభిముఖంగా వెళ్ళడం మాత్రమే జరిగింది.

ఇందువల్ల నగరాలపై ఒత్తిడి పెరుగుతున్నది. ఏటేటా లక్షలాది ప్రజలు నగరాలకు తరలివెడుతున్నారు. ఈ విధంగా వచ్చే వారందరికి పనిపాటులు దొరకవు. కనీసపు పౌర సౌకర్యాలను కల్పించడం కూడా సాధ్యం కాదు. దీని ఫలితంగా ఘోరమైన పేదరికానికి, అశుభ్రతకు, అనారోగ్యానికి, అవిద్యకు ఆలవాలమైన మురికివాడలు ప్రతి నగరంలోనూ పెరుగుతున్నాయి. వీటి ప్రభావం తక్కిన నగర ప్రాంతాలపై కూడా సహజంగా పడుతుంది. ముఖ్యంగా మురికివాడలు నేరాలకు, నేరమనస్తత్వానికి నిలయా లవుతున్నాయి.

ఇది ప్రపంచంలో అన్ని దేశాలలోను వున్న సమస్యే. కాని, అభివృద్ధి చెందిన దేశాలలో కంటె వెనుకబడిన దేశాలలోనే ఎక్కువగా నగరాల పెరుగుదల జరుగుతున్నది. ప్రస్తుతం ప్రపంచంలో పది లక్షలకు పైబడిన జనాభాగల నగరాలు 191 వుంటే, వాటిలో 101 నగరాలు వర్ధమాన దేశాలలోనే వున్నవట. ఇందుకు కారణం ఈ దేశాలలో నగర జీవనం కంటె గ్రామ జీవనం మరింత దుర్భరంగా వుండడమే కావచ్చు. ఇప్పటి అంచనాలనుబట్టి మన దేశంలో మరి 30-35 ఏళ్ళలో జనాభా రెట్టింపు కాగా, నగరాల జనాభా మూడురెట్లు కాగలదట. దీనితోపాటు

మురికివాడల సంఖ్య కూడా పెరగగలదని వేరే చెప్పనక్కరలేదు.

దీన్ని పరిష్కారం లేని సమస్యగా భావించి నిస్పృహ చెందనక్కరలేదు. దూర దృష్టితో, సమన్వయ దృక్పథంతో కూడిన ప్రణాళికల ద్వారా ఈ సమస్యను పరిష్కరించుకో వలసివున్నది. ప్రస్తుతపు మురికివాడల స్థానంలో తీర్చిదిద్దిన టౌన్‌షిప్‌లను నిర్మించడం అవసరం. అయితే, ఇంతకంటె ముఖ్యం అసలు గ్రామాలనుంచి నగరాలకు ప్రజల వలసను అరికట్టడం. ఉన్న మురికివాడలను బాగుచేస్తుండగా కొత్త మురికివాడలు బయలుదేరకుండా చూచుకోవాలి. గ్రామాలలో మంచినీరు, విద్యుచ్ఛక్తి, విద్య, వైద్యం, పార్కులు మొదలైన సౌకర్యాలతోపాటు జీవనోపాధి మార్గాలను అధికం చేయాలి. పరిశ్రమలు నగరాలలో, నగరాలచుట్టూ కేంద్రీకృతం కాకుండా చూడాలి. మొత్తంపై గ్రామాలకు, నగరాలకు మధ్య కనీసపు పౌర సౌకర్యాల విషయంలో వ్యత్యాసాలను తొలగించాలి. లేకపోతే నగరాలకు గ్రామీణుల వలసను, నగరాల జన సమ్మర్దాన్ని, మురికివాడల పెరుగుదలను అరికట్టడం ఎన్నటికి సాధ్యం కాదు.

*(జూన్ 25, 1976)*

# మహత్తర విజయం

సరిగా ఏడేళ్ళనాడు మానవుడు చంద్రమండలంపై తొలిసారిగా అడుగుపెట్టాడు. నేడు ఒక రోదసీ నౌక అంగారక గ్రహంపై దిగి తన నూతన పరిసరాలను పరిశోధిస్తున్నది.

మొదటి దాని వలె రెండవది సమస్త ప్రపంచాన్ని సంభ్రమానందాలలో ముంచెత్తుతున్న సంఘటన. దానివలె ఇది మానవ చరిత్రలో మరొక సువర్ణాధ్యాయాన్ని ప్రారంభిస్తున్న సంఘటన. దానివలె ఇది అమెరికా మాత్రమే కాక, సర్వమానవాళి తనదిగా సంభావించుకొనదగు మహత్తర విజయం.

ఏడు లక్షల ఏళ్ళనాడు మానవుడు దాదాపుగా జంతుప్రాయుడు. ఏడువేల ఏళ్లనాడు అతడు అప్పుడప్పుడే నాగరిక జీవన పథంలో తప్పటడుగులు ప్రారంభించిన పాంథుడు. ఏడు వందల ఏళ్ళనాడు భూమి గురుత్వాకర్షణ శక్తిని తాను అధిగమించగలగడం అతనికి ఊహకైనా అందని విషయం. ఏడు దశాబ్దాల నాడు చంద్రమండలయాత్ర, గ్రహాంతర యానం అతనికి ఊహ వీథులలోనే సాధ్యమైన విషయాలు.

మానవుని తొలి నివాసం తక్కిన జంతువుల వలె తరుశాఖలపై. ఆ తర్వాత అతడు నేలకు దిగి, వెనుక కాళ్ళను నడకకు ఉపయోగించుకున్నాడు. ముందుకాళ్ళను చేతులుగా ఉపయోగించుకున్నాడు. నిప్పు చేయడం నేర్చాడు. రాళ్ళతో, ఎముకలతో పనిముట్లు తయారుచేశాడు. జంతువులను మచ్చిక చేశాడు. భూమిని దున్ని పంటలు పండించాడు. మహానగరాలను నిర్మించాడు. మహాసామ్రాజ్యాలను స్థాపించాడు. లలిత కళలను సాధన చేశాడు. ప్రకృతిని పరిశోధించి శాస్త్రవిజ్ఞాన సహాయంతో దాన్ని జయించడం నేర్చుకున్నాడు. అణువును ఛేదించి దాన్ని లోక కల్యాణానికి, లోక వినాశానికి కూడా ఉపయోగించగల శక్తి సామర్థ్యాలను సంపాదించాడు. భూమి గురుత్వాకర్షణ శక్తిని అధిగమించి పోగల రోదసీ నౌకలను రూపొందించాడు.

ఇది మానవ నాగరికత కథ. ఈనాడు మానవుడు చంద్రలోకాధినేత. మరి కొద్ది కాలంలోనే సుదూర గ్రహాలను తన పాదాక్రాంతం చేసుకొనడానికి ఆయత్తు డౌతున్న ధీశాలి.

అతని ఆ మహా ప్రయత్నంలో భాగమే నేడు అంగారక గ్రహంలో దిగి పరిశోధనలు జరుపుతున్న అంతరిక్ష నౌక. అమెరికా పదకొండునెలల క్రిందట ప్రయోగించిన వైకింగ్ 80 కోట్ల కిలోమీటర్ల దూరం ప్రయాణం చేసి మొన్న అంగారక ఉపరితలంపై సురక్షితంగా దిగింది.

ఇప్పటివరకు భూమిని మినహాయించి, ఏ ఇతర గ్రహం పైన జీవరాశి చిహ్నాలు గోచరించలేదు. పెక్కువిషయాలలోభూమిని పోలినది కనుక, అంగారక గ్రహంపై ఏ రూపంలోనైనా జీవు లుండవచ్చునన్న నమ్మకం ఆధారంగానే వైకింగ్‌ను ప్రయోగించడం జరిగింది. అంగారకునిపై

జీవరాశి కలదని వెల్లడైతే అది మానవాళి మొత్తం దృక్పథాన్నే మార్చివేయగల విప్లవాత్మక సంఘటన కాగలదు. అయితే ఒకవేళ అంగారకుడు నిర్జీవగ్రహమని తేలినప్పటికి, అన్య లోకాలలో ప్రాణికోటికై అన్వేషణ కొనసాగుతూనే వుంటుంది.

ఈ అన్వేషణ శాస్త్రజ్ఞులు కేవలం ఉబుసు పోకకు సాగిస్తున్నదిగా భావించడం పొరపాటు. మానవుడు తొలుత నిప్పును కనిపెట్టినప్పుడు, లోహాలను త్రవ్వి తీసినప్పుడు, విద్యుచ్ఛక్తి స్వభావాన్ని పరిశోధించ బూనినప్పుడు. అణుస్వరూపాన్ని అవగాహన చేసుకో యత్నించినప్పుడు అతడు వాటి భవిష్యదుపయోగాలను ఊహించుకొని వుండడు. అదే విధంగా నేటి గ్రహాంతర పరిశోధన పరమార్థం ఈనాడు మన ఊహలకు అందనిది. మానవుడు అభివృద్ధి పథంలో నిత్య పథికుడు.

*(జూలై 22, 1976)*

# అణువులో గందరగోళం

**ప**దార్థ స్వరూపాన్ని తెలుసుకొనడానికి ప్రయత్నిస్తున్న కొద్దీ అది మరింత గహనంగా తయారౌతున్నది. శాస్త్రజ్ఞులకు మతిపోతున్నది.

అనగనగా అణువు. దాని కేంద్రంలో ప్రోటాన్లు. న్యూట్రాన్లు. కేంద్రం చుట్టూ ఎలక్ట్రాన్లు.

ఇంత సుఖంగా అణువు కథ ప్రారంభమైంది, కాని, పరిశోధనలు సాగినకొద్దీ ఈ కథ ముదురు పాకాన పడింది. అణుకేంద్రంలో అసంఖ్యాకంగా చిన్న పార్టికిల్స్ బయట పడ్డాయి. వీటితోనే అణువు ఏర్పడిందని అనుకున్నారు.

పదేళ్ళ క్రిందట ఈ ఊహను తారు మారు చేస్తూ ఒక శాస్త్రవేత్త క్వార్క్‌లనే మరింత చిన్న శకలాలతో అణుకేంద్రంలోని పార్టికిల్స్ ఏర్పడ్డాయని ప్రతిపాదించాడు. అతడు మూడు రకాల క్వార్క్‌లను ఊహించాడు.

ఇప్పుడు నాల్గవ రకం క్వార్క్‌ను (దానికి "చార్మ్" అని పేరు పెట్టారు) అమెరికన్ శాస్త్రవేత్తలు కనుగొన్నట్టు ఒక వార్త తెలుపుతున్నది.

అణువే చిన్నది. దాని కేంద్రం ఇంకా చిన్నది. ఆ కేంద్రంలోని పార్టికిల్స్ మరింత చిన్నవి. ఆ పార్టికిల్స్‌కు కారణమైన క్వార్క్స్ ఇంకా చిన్నవి

మరికొన్నాళ్ళకు మరొక శాస్త్రవేత్త ఈ క్వార్క్స్ నిర్మాణానికి కారణమైన మరింత చిన్న శకలాలను కనుగొనవచ్చు. ఆ తర్వాత వాటికి కారణమైన ఇంకా చిన్న శకలాలు బయటపడవచ్చు. ఈ విధంగా పదార్థాన్ని విశ్లేషించుకుంటూ పోతే అసలు పదార్థమే మిగలక పోవచ్చు.

అప్పుడు మిగిలేది శూన్యం. బహుశా మూడు రకాల (పాజిటివ్. నెగిటివ్, న్యూట్రల్) శూన్యాలలోనుంచి పదార్థం పుట్టుకు వచ్చిందని శాస్త్రజ్ఞులు సిద్ధాంతం చేయవచ్చు. ఈ విధంగా చివరికి న్యూక్లియర్ సైన్సు (అణు కేంద్ర శాస్త్రం) నాగార్జునుడి శూన్య వాదంలో కలిసిపోనున్నదా?

*(ఆగస్టు 22, 1976)*

# జీన్ - జీనీ

"అరేబియన్ నైట్స్" కథలు చదివిన వారికి "జీనీ" అనే మాట తెలిసే వుంటుంది. జీనీ (Genie) అంటే భూతం.

జీనీ వేరు. జీవశాస్త్రంలో వచ్చే "జీన్" వేరు. ప్రాణికోటిలో వారసత్వంగా సంక్రమించే లక్షణాలను - కను ముక్కు తీరు. జుట్టురంగు మొదలైన వాటిని - నిర్ణయించే సూక్ష్మకణం జీన్. ఇది డి. ఎన్.ఎ. అనే సేంద్రియ రసాయనిక పదార్థంతో తయారౌతుంది.

ప్రస్తుతం కొందరు ప్రపంచ మేధావులను. మానవహితైషులను కలవర పెడుతున్న ఒక ప్రశ్న ఇది: "జీన్" "జీనీ"గా పరిణమించనున్నదా? మానవజాతి స్వయం వినాశానికి కారణం కానున్నదా?

అమెరికాలో పనిచేస్తున్న భారతీయ శాస్త్రవేత్త డాక్టర్ హరగోవింద ఖొరానా, ఆయన సహచరులు ఇటీవల లేబరేటరీలో కృత్రిమంగా "జీన్"ను సృష్టించడంలో కృతకృత్యులు కావడం ఈ భయాందోళనలకు కారణ మౌతున్నది.

ప్రాణికోటిలో పరిణామానికి కారణం "నేచురల్ సెలెక్షన్" అని 1859లో చార్లెస్ డార్విన్ ప్రతిపాదించిన సిద్ధాంతం జీవశాస్త్రంలో ఒక పెద్ద మలుపు.

మెండెల్ ప్రాణులలో వారసత్వ లక్షణాలను నిర్ణయించే సూత్రాన్ని 1866లో కనుగొనడం మరొక పెద్ద మలుపు.

వారసత్వ లక్షణాలను నిర్ణయించే "జీన్స్"పై 1906 ప్రాంతంలో టి.హెచ్. మోర్గన్ చేసిన పరిశోధనలు మరొక ముందడుగు.

డి.ఎన్.ఎ. అనబడే పదార్థంతో తయారైన జీన్స్ స్వరూప స్వభావాలను వాట్సన్, క్రిక్ అనే ఇరువురు శాస్త్రవేత్తలు 1953లో నిర్ధారణచేయడం వేరొక పెద్ద మలుపు.

డాక్టర్ ఖొరానా తన సహచరులతో కలిసి 1970లో కృత్రిమంగా జీన్‌ను సృష్టించడం ఇంకొక అద్భుత సంఘటన.

ఇప్పుడు ఆయనే కృత్రిమంగా సృష్టించిన జీన్‌ను ఒక ప్రాణి (బాక్టీరియమ్) జీవకణంలో ప్రవేశపెట్టి దాన్ని విజయవంతంగా పనిచేయించడం అన్నిటికంటె పరమాద్భుతం.

కృత్రిమంగా జీన్‌లను సృష్టించడం సృష్టికి ప్రతిసృష్టి చేయడమే. సూక్ష్మాతి సూక్ష్మమైన స్థాయిలో జీవరహస్యాన్ని ఛేదించడమే. ఇది అణు విచ్ఛేదనంతో, లేదా మానవుడిని చంద్రమండలానికి పంపడంతో పోల్చదగిన మహత్తర సంఘటన.

అయితే, ప్రతి వైజ్ఞానిక విజయంతో పాటు కొన్ని నైతిక సమస్యలు కూడా ఉత్పన్నమౌతాయి. ప్రకృతి తనకు తానుగా సృష్టించిన జీన్‌కు మానవుడు ప్రతిసృష్టి చేయడం గొప్ప విజయమే. కాని, అది నైతికంగా వాంఛనీయమా అని ప్రశ్నించే అవకాశం వున్నది.

ప్రాణులలో ఒక్కొక్క లక్షణాన్ని ఒక్కొక్క జీన్ నిర్ధారణ చేస్తుంది. ఏది దేన్ని నిర్ధారణ చేస్తుందో తెలుసుకుని, దాన్ని కృత్రిమంగా సృష్టించగలిగితే, క్యాన్సర్ వంటి భయంకర వ్యాధులను నివారించవచ్చు. వారసత్వంగా వచ్చే పెక్కు వ్యాధులను రాకుండా చేయవచ్చు. వైద్యశాస్త్రం రీత్యా ఇది మానవులకు మహోపకారం కాగలదు.

ఇంతేకాదు. వారసత్వంగా సంక్రమించే లక్షణాలను మనం ఇష్టం వచ్చినట్టుగా మార్చగలిగిన శక్తిని సాధించిననాడు ఐన్‌స్టయిన్ వంటి మహా మేధావులను సృష్టించవచ్చు. కోరితే మహాకళాకారులను, మహా బలశాలులరను, ఇంకా ఎవరినైనాసరే సృష్టించవచ్చు.

కాని, ఇదే సమయంలో ఒక జంతువు జీన్‌లను మరొక జంతువులో, లేదా మానవునిలో ప్రవేశపెట్టడం ద్వారా కొన్ని వికృత రూపాలను సృష్టించవచ్చు కూడా. అంతదూరం పోకుండానే, భయంకర వ్యాధులకు కారణం కాగల సూక్ష్మ జీవులను సృష్టించవచ్చు. మానవ ద్వేషి అయిన ఒక శాస్త్రవేత్త చేతిలో, లేదా హిట్లర్‌ను పోలిన నియంత చేతిలో ఈ సాంకేతిక ప్రక్రియ పడితే ఇంతే జరగవచ్చు.

కాని, ఇది ఈనాడు కేవలం ఊహాగానం స్థాయిలోనే వున్నది. ఇది ఇప్పటిలో సాధ్యం కాదని డాక్టర్ ఖొరానా సహచరులు హామీ ఇస్తున్నారు. తమ శాస్త్ర ప్రయోగాలను అపార్థం చేసుకోరాదని, తమ పరిశోధనల ఫలితాలను ఎవరూ దుర్వినియోగం చేయగల అవకాశాలు లేనే లేవని వారు అభయ మిస్తున్నారు.

"జీన్" మానవాళికి "జీనీ" కాబోదని ఆశించాలి. డాక్టర్ ఖొరానా వంటి శాస్త్రవేత్తలు సాగిస్తున్న పరిశోధనలు మానవ సంక్షేమానికే తోడ్పడగలవని కూడా కోరుకోవాలి.

*(సెప్టెంబర్ 1, 1976)*

# అవార్డులు, బిరుదులు

భారతరత్న, పద్మవిభూషణ్ మొదలైన అవార్డుల ప్రదానాన్ని నిలిపివేయడానికి నిశ్చయించినట్టు ప్రధాని శ్రీ మొరార్జీ దేశాయి మొన్న లోక్‌సభలో ప్రకటించారు. ఇవి అవార్డులు కావని, బిరుదులేనని జనతాప్రభుత్వం అభిప్రాయపడుతున్నది. ప్రభుత్వం బిరుదు లివ్వరాదని భారత రాజ్యాంగం నిషేధిస్తున్నది కనుక, భారతరత్న మొదలైన వాటిని ఆపివేయాలన్న నిర్ణయానికి అది వచ్చింది.

ఇటీవలి వరకు అధికారంలో వున్న కాంగ్రెసు ప్రభుత్వం మాత్రం భారతరత్న, పద్మవిభూషణ్ మొదలైన వాటిని బిరుదులుగా కాక, అవార్డులుగానే పరిగణించింది; అవార్డులుగానే ఉద్దేశించి వాటిని బహూకరించింది. అందువల్ల తాను భారత రాజ్యాంగ నిబంధనకు వ్యతిరేకంగా వెడుతున్నట్టు అది భావించలేదు.

అవార్డు అంటే బహుమతి. రాజ్యాంగం నిషేధించింది బిరుదులనే కాని, బహుమతులను కాదు. వివిధ రంగాలలో విశిష్టసేవచేసి, సుప్రసిద్ధులైన వారిని సన్మానించే సదుద్దేశంతో వారికి జాతీయ స్థాయి బహుమతులను అప్పటి కాంగ్రెసు ప్రభుత్వం ఏర్పాటు చేసింది. అయితే, ఇదివరలో కొన్ని సందర్భాలలో మేము మా సంపాదకీయాలలో పేర్కొన్నట్టు అప్పటి ప్రభుత్వం చేసిన పొరపాటు ఒకటి వున్నది. భారతరత్న, పద్మ విభూషణ్, పద్మ భూషణ్, పద్మశ్రీ - ఈ పదాలు బిరుదాలుగా ధ్వనిస్తున్నాయి తప్ప బహుమతులుగా స్ఫురించడంలేదు. ఉదాహరణకు నోబెల్ బహుమతి పొందిన వ్యక్తి తన పేరుముందు నోబెల్ అని తగిలించుకొనడు. అదే విధంగా అమెరికాలో ప్యులిట్జర్ బహుమతి పొందినవాడు తన పేరు ముందు ప్యులిట్జర్ అనే మాటనుగాని, మనదేశం లోనే జ్ఞానపీఠ్ అవార్డు పొందిన వ్యక్తి తన పేరు ముందు జ్ఞానపీఠ్ అనిగాని తగిలించుకోరు. ఆ బహుమతుల పేర్లు బిరుదులుగా ఉపయోగించడానికి అనువుగా లేకపోవడమే ఇందుకు కారణం.

కాని, పద్మవిభూషణ్, పద్మశ్రీ మొదలైనవి బిరుదులుగా ఉపయోగించడానికి వీలుగా వున్నవి తప్ప, అవి బహుమతులన్న విషయం స్ఫురింపజేసే విధంగా లేవు.వాటిని స్వీకరించినవారిలో కొందరు అవి కేవలం అవార్డులని తెలియక కొంత, తెలిసి కొంత వాటిని బిరుదులుగా వాడుకొనడం జరిగింది. ఈ విధంగా వాడడం తగదని ఇదివరకటి కాంగ్రెసు ప్రభుత్వం ఎన్నో సార్లు హెచ్చరించక పోలేదు, నిషేధించక పోలేదు. అయితే, దాని హెచ్చరికను, నిషేధాన్ని పెక్కుమంది పాటించలేదు. ప్రభుత్వం కూడా చూసీ చూడనట్టు వూరుకున్నది.

అందువల్ల ఈ అవార్డులు కొనసాగినంతకాలం వాటిని బిరుదులుగా వాడుకొనడం కొనసాగుతూనే వుంటుందన్న ఉద్దేశంతో జనతా ప్రభుత్వం వాటిని ఆపివేయ దలచినట్టు

భావించాలి. అయితే, ఇంత మాత్రాన ఈ అవార్డుల వెనుక గల సదుద్దేశాన్ని శంకించనక్కరలేదు. కొన్ని సందర్భాలలో ఈ అవార్డులను అనర్హులకు ఇచ్చి వుండవచ్చు, అర్హులకు ఇవ్వకపోయి వుండవచ్చు. అయినప్పటికీ మొత్తంపై జాతీయ జీవనంలోని వివిధ రంగాలలో సుప్రసిద్ధులైన వారిని ప్రభుత్వం గౌరవించ దలచడంలో తప్పులేదు. అందువల్ల బిరుదులుగా వాడుకొనడానికి వీలులేని జాతీయ బహుమతులను కొత్తగా ఎందుకు ఏర్పాటు చేయరాదు?

వెనుకటి ప్రభుత్వం చేసిన మరొక తప్పిదం ఈ అవార్డులను రాష్ట్ర ప్రభుత్వాల సిఫారసుతో తనకు తానుగా నిర్ణయించి ప్రదానం చేయడం. ఇందువల్ల తన అనుకూలుర పట్ల అభిమానం చూపడానికి ప్రభుత్వం కూడా వీటిని దుర్వినియోగం చేసిందన్న ఆరోపణకు ఆస్కారం కలిగింది. అలాకాక బహుమతులకు అర్హులను నిర్ణయించడానికి ఒక నిష్పాక్షిక,స్వతంత్ర సంఘాన్ని ఏర్పాటు చేసి దాని సిఫారసులపై ఆధారపడి ప్రభుత్వం అవార్డులను ప్రదానం చేసివుంటే ఈ నింద వచ్చివుండేదికాదు. ఇప్పుడైనా కేంద్ర ప్రభుత్వం ఈ విధంగా ఎందుకు చేయరాదు?

*(జూలై 15, 1977)*

# తెలుగు శబ్ద సాగరం

తెలుగుకు గల వ్యాకరణ దీపం చిన్నదని వెనుకటికి చెళ్ళపిళ్ల వారు బాధ పడ్డారు. వ్యాకరణ దీపమేకాదు - తెలుగుకుగల నిఘంటు దీపం కూడా చిన్నదే. ఇది మరింతగా బాధ పడవలసిన విషయం.

తెలుగు భాషకు అనేక విధాలుగా సేవ చేసిన సి.పి. బ్రౌన్ చక్కని నిఘంటువులు కూడా మనకు అందించిపోయాడు. అవి నేటికీ ఉపయుక్తంగానే వున్నాయి.

ఆ తర్వాత బహుజనపల్లివారి "శబ్ద రత్నాకరం" వచ్చింది. సూర్యరాయాంధ్ర నిఘంటువు, శబ్దార్థ చంద్రిక మొదలైన తెలుగు నిఘంటువులు,కొన్ని ఆంగ్లాంధ్ర నిఘంటువులు వెలువడ్డాయి. కాని, ఇవేవీ సమగ్రమైనవి కావు; ఆధునికావసరాలకు తగినట్టివి కావు; శాస్త్రీయమైన పద్ధతులలో కూర్చినట్టివి కూడా కావు. సర్వసమగ్రమైన ఆధునిక నిఘంటువులను ఇంకా మనం సంతరించుకోవలసే వున్నది.

బహుశా నేటి ప్రపంచ భాషలలో అమితవేగంగా వృద్ధి అవుతున్నట్టిది ఇంగ్లీషు భాష. దానిలో ప్రతి ఏడాది వందలాదిగా పదాలు వచ్చి చేరుతున్నాయి. లేదా సృష్టి అవుతున్నాయి. అందువల్ల ఇంగ్లీషు డిక్షనరీలను ఇంచుమించుగా ఏడాదికొకసారి. రెండేళ్ళ కొకసారి "అప్ డేట్" చేసుకోవలసి వస్తున్నది.

మనలో గమనించేవారు లేరుగాని, తెలుగులో కూడా ఇదే విధంగా బహుశా వందలాది పదాలు కొత్తగా వచ్చి చేరుతూనేవుండి వుండాలి. ఈ పదాలను సేకరించి అందజేసే నిఘంటువులు మనకు లేనేలేవు.

సైన్సు, టెక్నాలజీలలోనే కాదు. అన్ని విషయాలలోను విజ్ఞానం విపరీతంగా పెరిగిపోతున్నది. ఇందువల్ల భాషలు కూడా పెరుగుతున్నాయి. ఈ పెరుగుదల నిఘంటువులలో కూడా కనబడాలి.

ఇంతేకాదు, మన రాష్ట్రంలో తెలుగును ఉన్నత విద్యాస్థాయిలో సయితం బోధన భాషగా చేయడం జరిగింది. మరికొద్ది కాలంలో దాన్ని పూర్తిస్థాయిలో అధికారభాషగా చేయడం కూడా జరుగనున్నది. ఈ నూతనావసరాలకు తగిన విధంగా నిఘంటువులు రూపొందవలసి వున్నది.

ఇప్పటివరకు తెలుగులో పాఠ్య గ్రంథాలను మాత్రమే తయారుచేస్తున్న తెలుగు అకాడెమీ తెలుగు నిఘంటువును రూపొందించే బాధ్యతను స్వీకరించనున్నట్టు ఇటీవల విద్యామంత్రి తెలియజేశారు. "తెలుగు శబ్ద సాగరం" పేరుతో రానున్న ఈ నిఘంటువు రచనకు మూడేళ్ళు పడుతుందట. పది లక్షలు వ్యయం కాగలదట. దానిలో సాహిత్యానికి సంబంధించిన పదాలేకాక, పత్రికలలో వస్తున్న పదాలు, సైన్సుకు, టెక్నాలజీకి సంబంధించిన పదాలు, మాండలిక పదాలు, వృత్తి పదాలు మొదలైనవన్నీ చేర్చుతారట.

ఇది తప్పకుండా హర్షించదగిన ఆలోచన. తెలుగులో ఇదివరకే వాడుకలో వున్న, కొత్తగా వాడుకలోకి వచ్చిన పదాలన్నిటిని ఒకే సంపుటంలో చేర్చి అందజేయడం వల్ల విద్యార్థులకు, రచయితలకు, తదితరులకు ఎంతైనా ప్రయోజనకరంగా వుంటుంది.

ఇంగ్లీషు భాషతో మనకు గల అవసరాలు ఇప్పటిలో తొలగిపోయేవికావు కనుక, ఇప్పటివరకు ప్రామాణికమైన, నిర్దుష్టమైన ఇంగ్లీషు - తెలుగు నిఘంటువులు లేవు కనుక, అటువంటి దాన్ని తయారు చేసే బాధ్యతను కూడా తెలుగు అకాడెమీ చేపట్టడం అవసరం. అలాగే, ఇంగ్లీషులో వస్తున్నట్టుగా సైన్సు, టెక్నాలజీ, రాజకీయాలు, అర్థ శాస్త్రం, భూగోళం మొదలైన వివిధ విషయాలకు సంబంధించిన చిన్నచిన్న నిఘంటువులను విడివిడిగా తయారు చేయడం వల్ల ముఖ్యంగా విద్యార్థులు ఎంతో ప్రయోజనం పొందుతారు.

నిజానికి ఇవి విద్యార్థులకే కాదు. ఇతరులకు కూడా చాలా ఉపయోగపడతాయి. తెలుగులో రిఫరెన్సు పుస్తకాలు చాలా తక్కువ. పారిశ్రామిక రంగంలో బేసిక్ పరిశ్రమలు ఎంత అవసరమో వాఙ్మయరంగంలో బేసిక్ లిటరేచర్‌గా పరిగణించదగిన రిఫరెన్సు పుస్తకాలు అంత అవసరం. సాహిత్యం, రాజకీయశాస్త్రం, అర్థ శాస్త్రం, భౌతిక, రసాయన శాస్త్రాలు, వైద్య శాస్త్రం ఇత్యాది వివిధ విషయాలలో ఇటువంటి రిఫరెన్సు పుస్తకాలు తెలుగు అకాడమీ, సాహిత్య అకాడమీ వలె ప్రభుత్వ సహాయం పొందుతున్న సంస్థలు నిర్వహించాలి. ఈ పనులు ఎంత త్వరగా జరిగితే మన భాషాభివృద్ధికి అంతగా దోహదం జరుగుతుంది.

*(ఆగష్టు 28, 1977)*

# దీర్ఘ నిరీక్షణ

రోదసీ ప్రయోగాలపట్ల ఒక పదేళ్ళనాడు, లేదా ఏడెనిమిదేళ్ళనాడు వున్న ఆసక్తి, కుతూహలం ఈనాడు మచ్చుకైనా లేవు. తొలిసారిగా కృత్రిమ ఉపగ్రహం భూప్రదక్షిణం చేసినప్పుడు, తొలి మానవుడు రోదసిలోనికి ఎగసినప్పుడు, లేదా చంద్రమండలంపై దిగి నడిచినప్పుడు కలిగిన ఆసక్తిలో పదవవంతుకూడా ఈనాడు ఎంత గొప్ప రోదసీ ప్రయోగం జరిగినా కలగడం లేదు. ఈ ప్రయోగాలు సర్వసాధారణమై పోవడమే ఇందుకు కారణం.

ఈసారి మానవులు అంగారక గ్రహంపై దిగినా ప్రపంచం పెద్దగా ఆశ్చర్యచకితం కాకపోవచ్చు. చంద్రమండల యాత్రకు, అంగారక యాత్రకు ఏమంత తేడా వున్నదని అనిపించవచ్చు.

ఇకపై నిజంగా ప్రపంచాన్ని సంభ్రమాశ్చర్యాలలో ముంచెత్తగల విశేషం ఒకటే ఒకటి వున్నది. అది విశ్వాంతరాళంలో, ఎక్కడో, ఏ సుదూర నక్షత్రానికి చెందిన గ్రహంలోనో మనలను పోలిన, లేదా మనకంటె అధికులైన బుద్ధి జీవులున్నారన్నది. ఇది రుజువైతే నిజంగా అద్భుత విశేషమే కాగలదు. కనీసం ఇతర గ్రహాలలో ఏదో విధమైన ప్రాణికోటి వున్నదని వెల్లడైనా చాలు. అది మన ఆలోచనా సరళినే పూర్తిగా మార్చివేయగల సంఘటన కాగలదు.

దూర లోకాలలో అటువంటి మేధా జీవులుంటే వారు భూ మండలంపైన వున్న మనలను కనుగొనడానికి దోహదకరంగా అమెరికా ఇంతకుముందు "పయొనీర్" పేరుతో రెండు రోదసీ నౌకలను విశ్వాంత రాళంలోనికి పంపించింది. ఇప్పుడు మరి రెండు రోదసీ నౌకలను - క్రిందటి నెల 20వ తేదీన "వాయేజర్-2"ను, ఈ నెల 5వ తేదీన "వాయేజర్-1"ను - ప్రయోగించింది. ఈ రోదసీ నౌకలు 1979లో గురుగ్రహాన్ని, 1980 నాటికి శనిగ్రహాన్ని, 1986 నాటికి యురేనస్ గ్రహాన్ని సమీపించి, ఇంకా ముందుకు తమ ప్రయాణం సాగిస్తాయి. క్రమంగా సౌరగ్రహ మండలాన్ని దాటిపోయి విశ్వాంతరాళంలో ప్రవేశిస్తాయి.

అన్నిటికంటె విశేషం ఏమిటంటే వాయేజర్ నౌకలు భూ మండలంనుంచి - అందులోను అమెరికా అధినేత జిమ్మీ కార్టర్ నుంచి - అన్యలోకవాసులకు "అమూల్య" సందేశాలు తీసుకుపోతున్నాయి. మానవుడు ఎంత అసంబద్ధతతో కూడిన ఆశాజీవి అయిందీ ఈ ఒక్క విషయం వల్లనే గ్రహించవచ్చు.

వాయేజర్ నౌకలు మనకు సమీపంలోని నక్షత్రాన్ని చేరుకొనడానికి 40 వేల సంవత్సరాలు పడుతుంది. ఆ నక్షత్రానికి మన భూమిని పోలిన గ్రహం వున్నట్టయితే, దానిలో మనలను పోలినవారు వున్నట్టయితే, వారికి అమెరికావారి ఇంగ్లీషు భాష అర్థం అయితే... ఇన్ని "అయితే" లమీద ఆధారపడింది ఈ వాయేజర్ నౌకల ప్రయోగం. అక్కడివారు మనకు ఆ నౌకలలోనే తిరుగుటపాలో ప్రత్యుత్తరం పంపిస్తే మరొక 40 వేల ఏళ్ళలో అవి భూమికి తిరిగివచ్చి మనకు దాన్ని అందజేస్తాయి. చాలా సుదీర్ఘ నిరీక్షణే. ఈ లోగా ఎవరుంటారో, ఎవరు పోతారో? అయినా మానవుడు ఆశాజీవి కదా?

*(సెప్టెంబరు 8, 1977)*

# శనివారం రాత్రి

అది ప్రళయరాత్రి, నింగి, నేల ఏకమై శోకించిన రాత్రి.

ఝంఝూనిలం జగద్భయంకరంగా గర్జిస్తూ విలయతాండవం చేసిన రాత్రి.

ఆకాశం వికటాట్టహాసం చేసిన రాత్రి.

లక్షలాది ప్రజల హృదయకుహరాలలో ఆశాజ్యోతిని ఆర్పి వేయడానికి భయాల చీకట్ల గుంపులు కుట్ర చేసి గుసగుసలాడిన రాత్రి.

మృత్యురాక్షసి పగలబడి నవ్విన రాత్రి. జీవిత కన్య హృదయ భేదకంగా రోదించిన రాత్రి.

ఆ రాత్రి ఆంధ్రధాత్రి ఏడ్చింది. మొత్తుకుంది. మొరపెట్టుకుంది. తనను ఇంతటితో వదలి పెట్టమని వేడుకుంది.

అయినా, వాయువుకు దయ కలగలేదు. దాని మనసు కరగలేదు. నిమిషాలు, గంటలు గడుస్తున్నకొద్దీ దాని ప్రతాపం పెరిగింది. ఇంకా, ఇంకా గర్జించింది, గాండ్రించింది, ఓండ్రించింది, ఘీంకరించింది, సకిలించింది, ఇకిలించింది, మూలిగింది, నీలిగింది, ఒక క్షణం అలసిపోయి శాంతించింది. మరుక్షణంలో ద్విగుణీకృతంగా విజృంభించింది, ప్రచండంగా వీచింది, లాగి ఫెళ్ళున కొట్టింది, ఆగి ఛెళ్ళున చరిచింది.

వేలాది పెంకుటిళ్ళను కూలగొట్టి కాళ్ళతో కసితీరా తాడించింది. తాటాకు కొంపలను గాలిపటాల వలె ఎగురవేసి వినోదించింది.

నిండు ప్రాణాలను నిలువునా తీసింది. పసికందులను ముక్కు పచ్చలారని వారే అని దయతలచలేదు. అబలలను, అనదలను కనికరించలేదు. వృద్ధులను, యువకులను ఎవరినీ వదలిపెట్టలేదు. వేలాది ప్రజలను తన కరాళదంష్ట్రల మధ్య కసితీరా నమిలి కబళించింది.

ఇక పంటలలో! దేశానికి  ఆంధ్ర ప్రదేశ్ అన్నపూర్ణ, ఆంధ్రప్రదేశ్‌కు కోస్తాజిల్లా ప్రాంతం ధాన్యాగారం. ఈ ఏడాది ఈ ధాన్యాగారం బంగారంగా మారిపోతుందని రైతులు ఆశపడ్డారు. ఈ నాలుగు జిల్లాల్లో ఎటు చూసినా కోత కోసిన పొలాలు, కోతకోయని పొలాలు, పచ్చని తివాచీ వలె లక్షలాది ఎకరాలలో పరుచుకున్న పొలాలు, నవ్వుతున్న పొలాలు, నిండుచూలాలి వలె సగర్వంగా తలెత్తి నిలబడిన పొలాలు, ఆకొన్న నోటిముందు సిద్ధాన్నం వలె కలకలలాడిన పొలాలు, ఏ షరాబూ ఖరీదు కట్టలేని పొలాలు.

అన్నిటిని వాయువు, వరుణుడు కలిసి పొట్టన పెట్టుకున్నారు.

అది ఒకానొక ప్రళయరాత్రి కథ. శనివారం రాత్రి కథ.

ఆ కథ కంచికి వెళ్ళి తెల్లవారిన తర్వాత ఏమి మిగిలింది?

దివి నుంచి భువికి పారిన మిన్నేరు మిగిలింది. లక్షలాది ప్రజల కన్నీరు మిగిలింది.

ఎక్కడ చూచినా మొదలంట కూలిన చెట్లు, రోడ్డుకు అడ్డంగా పడిపోయిన విద్యుత్ స్తంభాలు, నేలమట్టమై పోయిన వేలాది తాటాకు పాకలు, పూరి కొంపలు, పెంకుటిళ్ళు, సహాయం కోసం కేక వేయడానికైనా వ్యవధి లేక, కేకపెట్టినా విననివ్వని హోరుగాలిలో ఎక్కడికక్కడ మరణించిన వేలాది మానవుల పీనుగుల కుప్పలు.

ఇంకా ఏమి మిగిలింది? ఏమి మిగిలిందయ్యా, ఏమి మిగిలింది? ఏమీ మిగలలేదు. పట్టణాలలో, పల్లెటూళ్ళలో, సముద్రతీర ప్రాంతాలలో, ప్రాణాలరచేత పట్టుకుని క్షణమొక యుగంగా గడిపిన ఆ ప్రళయరాత్రి బాధామయ జ్ఞాపకాలు తప్ప ఏమీ మిగలలేదు...

అయినా శిశిరం తర్వాత వసంతం, చీకటి తర్వాత వేకువ, నిరాశ తర్వాత ఆశ.

మోడైన మ్రానులను చిగిరింపజేయడానికి వసంతాన్ని తీసుకురావాలి. నిరాశా తమస్సులను తరిమి వేయడానికి ఆశాజ్యోతులను వెలిగించాలి.

ఇది మనలో అదృష్టవంతులైన వారందరి బాధ్యత, రాష్ట్ర ప్రభుత్వం బాధ్యత, కేంద్ర ప్రభుత్వం బాధ్యత.

కష్టాలకు, నష్టాలకు లోనై, సమస్తాన్ని కోల్పోయిన వారి కన్నీటిని తుడవడానికి అందరు కదిలిరావాలి. ఇదే, ఇవాళ మేము, బరువెక్కిన గుండెతో, మా పాఠకులకు విన్నవించగలిగింది.

*(నవంబర్ 22, 1977)*

# ఫిల్మోత్సవ్

అంతర్జాతీయ చలన చిత్రోత్సవాలు ప్రతిసారి న్యూఢిల్లీలోనో, బొంబాయిలోనో జరగడం రివాజు. ఈ సారి - మొదటిసారిగా - దక్షిణాదిన, మద్రాసులో ఇవి జరుగుతున్నాయి.

ఇందులో ఒక ఔచిత్యం లేకపోలేదు. భారతీయ చలన చిత్ర పరిశ్రమకు మొదటి రాజధాని బొంబాయి, రెండవ రాజధాని మద్రాసు. ఇంతేకాదు, ఉత్పత్తి అయ్యే చిత్రాల సంఖ్యను బట్టి చూసినా బొంబాయికి తీసిపోదు మద్రాసు.

అంతర్జాతీయ చలన చిత్రోత్సవాల ప్రాముఖ్యాన్ని గురించి వేరే చెప్పనక్కర లేదు. వీటికి దేశీయ చిత్ర నిర్మాణ ధోరణులపై అపారమైన ప్రభావం వుంటుంది. ఈనాడు ప్రపంచంలో చలన చిత్రాలను నిర్మించే దాదాపు ప్రతి దేశంలోను అంతర్జాతీయ చిత్రోత్సవాలు జరగడం పరిపాటి అయింది.

ఉదాహరణకు ఇండియాలో మొట్టమొదటి అంతర్జాతీయ చలన చిత్రోత్సవం 1952లో జరిగింది. అప్పటివరకు మన చిత్ర నిర్మాతలకు, దర్శకులకు, నటీనటులకు, ఇతర సాంకేతిక నిపుణులకు అమెరికన్ చిత్రాలతో, లేదా బ్రిటిష్ చిత్రాలతో మాత్రమే పరిచయం. కాని, మొదటిసారిగా 1952 నాటి చిత్రోత్సవ సందర్భంలో మన వారికి ఇతరేతర దేశాల చలన చిత్ర వినూతన, విశిష్ట ధోరణులతో పరిచయం కలిగింది.

ఆనాటి చిత్రోత్సవానికి ఇటలీ నుంచి రోజెలినీ, డీ సికాల నియో రియలిస్టు చిత్రాలు వచ్చాయి. సోవియెట్ యూనియన్ నుంచి సోషలిస్టు రియలిజంతో కూడిన చిత్రాలు వచ్చాయి. జపాన్ నుంచి ఆకీరా కురొసావా వంటి ప్రముఖుల చిత్రాలు వచ్చాయి. ఫ్రాన్స్, తదితర యూరోపియన్ దేశాల నుంచి ఉత్తమ చిత్రాలెన్నో వచ్చాయి. వీటన్నిటి ప్రభావం, ముఖ్యంగా ఇటాలియన్ చిత్రాల ప్రభావం మన చిత్ర నిర్మాతలపై, దర్శకులపై పడింది. దాని ఫలితంగా వారి ఆలోచనా రీతులలో మార్పు వచ్చింది. ఒక నూతన దృక్పథంతో సత్యజిత్‌రాయ్ వంటి ఒక ఉత్తమ దర్శకుడు భారతీయ చలన చిత్ర రంగంలో ఆవిర్భవించడానికి ఆనాటి చిత్రోత్సవం ప్రత్యక్ష కారణం. కాగా, శాంతారామ్, బిమల్‌రాయ్ వంటి పూర్వపు దర్శకులలో నూత్న చైతన్యం కలగడానికి కూడా ఆ చిత్రోత్సవమే కారణం.

ఆ తర్వాత మరి కొన్ని సార్లు మనదేశంలో అంతర్జాతీయ చలన చిత్రోత్సవాలు ఏర్పాటు కావడం, ప్రపంచ చలన చిత్ర కళలో సుప్రసిద్ధులైన బెర్గ్‌మన్, ఫెలినీ, ఆంటోనియానీ, త్రుఫా వంటి పలువురు మహామహుల చిత్రాలతో, లాటిన్ అమెరికన్, పశ్చిమ ఆసియన్ చిత్రాలతో, మన యువతరం ప్రభావితం కావడం జరిగింది.

దీని ఫలితం ఈనాడు భారతీయ చలన చిత్రరంగంలో సుస్పష్టంగా కానవస్తున్నది.

బెంగాలీ, హిందీ, మరాఠీ, కన్నడం, మలయాళం, తమిళం, గుజరాతీ భాషలలో మేధావులు, భావుకులు అయిన యువ దర్శకులెందరో కొత్త తరహా చిత్రాలను నిర్మిస్తున్నారు. వారు ఎన్నుకుంటున్న ఇతివృత్తాలు యథార్ధ జీవితంపై కొత్త వెలుగులు ప్రసరిస్తున్నాయి. తమ పూర్వపు తరంవారు చూడలేకపోయిన, లేదా చూపించడానికి సాహసించలేకపోయిన జీవిత కఠోరసత్యాలను ఈ కొత్త తరం దర్శకులు తమ కొత్త తరహా చిత్రాలలో చూపిస్తున్నారు. ప్రజలలో కొత్త ఆలోచనా ధోరణులను మేల్కొల్పడానికి ప్రయత్నిస్తున్నారు. సినిమాను సాంఘిక ప్రయోజనం - అభ్యుదయ భావాత్మకమైన ప్రయోజనం - కల ఒక శక్తి మంతమయిన కళా ప్రక్రియగా తీర్చిదిద్దుతున్నారు. మన దేశంలో కడచిన సుమారు ఇరవై ఏళ్లుగా జరిగిన అంతర్జాతీయ చలన చిత్రోత్సవాల ప్రత్యక్ష ఫలితాలలో దీన్ని ముఖ్యమైనదిగా పేర్కొనక తప్పదు.

ఇంతవరకు మన తెలుగు చిత్ర పరిశ్రమ వివిధ ప్రపంచ దేశాలలోను, వివిధ భారతీయ భాషా ప్రాంతాలలోను కానవస్తున్న ఈ నూతన చలనచిత్ర రీతుల నుంచి మడికట్టుకున్నట్టు దూరంగా వుండిపోయింది. అవే ఇతివృత్తాలతో, ఒకే ఫార్ములాతో, చూసిన చిత్రాలనే తిరిగి చూస్తున్నామా అనిపించేటట్టుగా, మన నిర్మాతలు ఒకే తరహా చిత్రాలు తీస్తున్నారు. ఇప్పుడిప్పుడు కొద్దిగా మార్పు వస్తున్న మాట నిజమే. కాని, ఈ మార్పు తక్కిన భారతీయ భాషలలో వస్తున్న నూతన రీతి చిత్రాల మధ్య కంటికి ఆనేటంత స్ఫుటంగా రావడం లేదు.

మొదటిసారిగా మద్రాసులో అంతర్జాతీయ చలనచిత్రోత్సవం జరుగుతున్నది. సుమారు 35 దేశాల నుంచి 80 చిత్రాలు ప్రదర్శనకు రావడమేకాదు; వీటిలో అధిక భాగం అన్యదేశాల చిత్రోత్సవాలలో ఉత్తమోత్తమ చిత్రాలుగా ఎన్నికైనట్టివి. ఇన్నింటిని రెండు వారాల స్వల్ప వ్యవధిలో చూసే అవకాశం మన తెలుగు నిర్మాతలకు, దర్శకులకు, తదితరులకు కలుగుతున్నది. ఈ ఉత్సవ ప్రభావం వీరిపై తప్పక వుండగలదని భావించడం దురాశ గాని, పేరాసగాని, అడియాసగాని, కాదని నమ్ముతున్నాము.

*(జనవరి 6, 1978)*

# ఎన్నికల చట్టం

లోక్‌సభ, శాసన సభల ఎన్నికలలో ఎన్నో అవకతవకలు జరుగుతూ వుంటా ప్రత్యక్ష సత్యమే. ఈ అవకతవకలు కేవలం ఎన్నికల చట్టంలోని లోపాల వల్లనే జరుగుతు చెప్పలేము. చట్టాన్ని ఎంత కట్టుదిట్టంగా రూపొందించినా కొన్ని అవకతవకలు జరుగక పోవు.

ఇది నిజమైనప్పటికి, ఇంత మాత్రాన చట్టంలోని లోపాలను సవరించరాదనిగాని, చట్టంలోని నిబంధనలను మరింత కట్టుదిట్టంగా రూపొందించరాదని గాని మా అభిప్రాయం కాదు. చట్టాన్ని సాధ్యమైనంత నిర్దుష్టంగా రూపొందించడం, దాని నిబంధనలను కఠినంగా అమలు జరపడం అవసరమే.

ఈ దృష్టితోనే వివిధ రాజకీయ పక్షాల నాయకులు, తదితరులు మన ఎన్నికల చట్టంలో కొన్ని సంస్కరణలను అప్పుడప్పుడు సూచించడం జరిగింది. వీటిలో కొన్నింటిని ఇప్పుడు ఎలెక్షన్ కమిషన్ అంగీకరించిందని తెలుస్తున్నది.

చాలా కాలంగా పలువురు సూచిస్తున్న ఒక సంస్కరణ కనీసపు ఓటింగ్ వయస్సుక సంబంధించినది. ప్రస్తుతపు రాజ్యాంగ నిబంధన ప్రకారం 21 ఏళ్ళలోపు వారికి ఓటింగ్ హక్కు లేదు. ఈ కనీసపు వయఃపరిమితిని 18 ఏళ్ళకు తగ్గించాలని పలువురు కోరుతున్నారు. శ్రీ జయప్రకాశ్ నారాయణ్ 1975లో నియమించిన తార్కుండే కమిటీ ఈ మేరకు ఒక సిఫారసు చేసింది. మొత్తంపై అప్పటిలో ప్రతిపక్షాలు ఈ సంస్కరణను తరుచుగా కోరుతూ వుండేవి. కాంగ్రెసు ప్రభుత్వం మాత్రం ఇందుకు వ్యతిరేకిస్తూ వుండేది. ఇందువల్ల ఓటర్ల సంఖ్య విపరీతంగా పెరిగిపోతుందని, ఎక్కువ పోలింగ్ కేంద్రాల ఏర్పాటు మొదలైన వాటివల్ల వ్యయ భారం పెరుగుతుందని, పైగా 18-21 సంవత్సరాల మధ్య వయస్సు గలవారు విద్యార్థులై వుంటారు కనుక, విద్యాలయాలు రాజకీయ విభేదాలతో కలుషితం కాగలవని అది వాదించేది, కాని, ఈ వాదనలో పస లేదని, ఇందువల్ల పార్లమెంటరీ ప్రజాస్వామ్యానికి ఒనగూడే ప్రయోజనంతో పోల్చితే ఇబ్బందులు లెక్క పెట్టదగినవి కాదని ఎన్నడో తేలిపోయింది. ఆనాటి ప్రతిపక్షాలు ఇప్పుడు అధికారంలోకి వచ్చినందున ఈ సరికే ఈ సంస్కరణలను అమలు చేసి వుండ వలసింది. ఏమైనా ఎలెక్షన్ కమిషన్ ఇప్పుడు ఈ సూచనను ఆమోదించింది. అందువల్ల దీన్ని సాధ్యమైనంత త్వరలో అమలు చేయడం మంచిది. ఇందుకు ప్రతిపక్షంలో వున్న కాంగ్రెస్ అయినా అభ్యంతరం చెప్పదనే ఆశించవచ్చు.

అన్నింటికంటె ముఖ్యమైన మరొక సంస్కరణను ఎలెక్షన్ కమిషన్ ఆమోదించినట్టు తెలుస్తున్నది. అది లోక్‌సభను రద్దు చేయడమో, కొత్త ఎన్నికల తేదీని ప్రకటించడమో జరగగానే

అధికారంలో వున్న కేంద్ర ప్రభుత్వం అపద్ధర్మ ప్రభుత్వంగా వ్యవహరించాలన్నది. అదే రాష్ట్రాలలో అయితే, రాష్ట్ర ప్రభుత్వాలను రద్దు చేసి రాష్ట్రపతి పాలన విధించడం మంచిదని ఎలెక్షన్ కమిషన్ సూచన.

సాధారణంగా ఎన్నికలకు ముందు రాష్ట్ర ప్రభుత్వాలు, లేదా కేంద్ర ప్రభుత్వం ప్రజల అభిమానం సంపాదించడం కోసం విచ్చలవిడిగా డబ్బు ఖర్చు పెట్టడంజరుగుతుంది. క్రిందటి సంవత్సరం ఉత్తర రాష్ట్రాలలో ఎన్నికలు జరిగినప్పుడు కాంగ్రెసు ప్రభుత్వాలు ఎంతో ధనం ఈ విధంగా దుర్వ్యయం చేసినట్టు ఆరోపణలు వచ్చాయి. అలాగే ఎన్నికలలో రాష్ట్ర ప్రభుత్వాలు అధికార దుర్వినియోగం ద్వారా ఓట్లను సంపాదించడానికి యత్నిస్తూ వుంటాయన్న ఆరోపణలు చాలా తరుచుగా వింటూ వుంటాము. ఇట్టి ఆరోపణలకు ఆస్కారం లేకుండా చేయడానికి పై సంస్కరణ అవశ్యం అమలు చేయదగినదే. ఇదే విధంగా ప్రభుత్వ యంత్రాంగాన్ని ఎన్నికలలో దుర్వినియోగం చేయడానికి వీలు లేకుండా ఎలెక్షన్ కమిషన్ మరికొన్ని సూచనలు చేసింది. ఇవన్నీ కేంద్ర ప్రభుత్వం చట్టం సవరణ సందర్భంలో తప్పక పరిశీలించదగినవి.

పోతే, తార్కుండే కమిటీ చేసిన ఒక సూచనను ఎలెక్షన్ కమిషన్ తిరస్కరించిందట. ఈ కమిషన్ ప్రస్తుతం ఏకసభ్య సంఘంగా వుంటున్నది. ఇందువల్ల కమిషన్ పై ప్రభుత్వపు ఒత్తిడి, దుష్ప్రభావం పడడానికి, కమిషన్ పాక్షిక దృష్టితో వ్యవహరించడానికి వీలున్నదని అనుమానాలు తరచుగా వ్యక్తమౌతూ వుంటాయి. కనుకనే, కమిషన్‌లో ఒకరికంటె ఎక్కువ మందిని సభ్యులుగా నియమించాలని తార్కుండే కమిటీ చేసిన సూచనను జనతా పార్టీ కూడా అంగీకరించింది. కాని, కారణం తెలుపకుండానే, ఇది ఆచరణ సాధ్యం కాదని ఎలెక్షన్ కమిషన్ త్రోసివేసిందట. అయినప్పటికి ఇది ప్రభుత్వం తప్పక పరిశీలించ వలసిన సంస్కరణ.

కాని, కొన్ని రాజకీయ పక్షాలు తరుచుగా చేసే ఒక సూచనను - ఎన్నికలలో ఇప్పటివలె కాక ప్రిఫరెన్షల్ ఓటింగ్ పద్ధతిని ప్రవేశ పెట్టాలన్నదాన్ని - ఎలెక్షన్ కమిషన్ తిరస్కరించిరది. ఈ తిరస్కృతి సమర్థించదగిందే. ఓటర్ల సంఖ్య తక్కువగా, విద్యావంతుల సంఖ్య ఎక్కువగా వుండే దేశాలలో ఇది ఆచరణ సాధ్యమే గాని, నూటికి దాదాపు 70 మంది నిరక్షరులు, కోట్లకు పైగా ఓటర్లు గల మన దేశంలో - విద్యావంతులను సయితం తికమక పెట్టే ఈ పద్ధతి ఆచరణ సాధ్యం కాదు. కనీసం మరి కొన్నేళ్ళవరకు ఈ సంస్కరణను వాయిదా వేయడం మంచిది.

*(జనవరి 24, 1978)*

# హర్షదాయకం

స్త్రీల వివాహం వయస్సును పదిహేను సంవత్సరాలనుంచి పద్ధెనిమిది సంవత్సరాలకు, పురుషుల వివాహం వయస్సును పద్దెనిమిది సంవత్సరాల నుంచి 21 సంవత్సరాలకు పెంచుతూ పార్లమెంటు మొన్న బిల్లును ఆమోదించడం - ఆలస్యంగా జరిగినా హర్షదాయకం.

ఒకప్పుడు ముక్కుపచ్చలారని వయస్సులోనే బాలికలకు వివాహం చేయడం జరిగేది. అది కూడా కొన్ని సందర్భాలలో కాటికి కాళ్లుచాచుకు కూర్చున్న మూడుకాళ్ల ముదుసలితో జరిగేది. కాలంతీరి, అతడు కాలధర్మం చెందగానే, ముక్కుపచ్చలారని వయస్సులోనే - అచ్చటా ముచ్చటా తీరని వయస్సులోనే - ఆమె పుస్తెకాస్తా పుటుక్కుమనేది. 1832కి పూర్వమైతే, ఆమె భర్త భౌతికకాయంతో పాటు సహగమనం చేయవలసివచ్చేది, విలియం బెంటింక్ పుణ్యమా అని, ఆ తరువాత సహగమనం నిషేధించబడింది కాబట్టి, బతికినంత కాలం ఆమె నిర్బంధ వైధవ్యం అనుభవిస్తూ జీవచ్ఛవంవలె గడపవలసి వచ్చేది.

"అష్టవర్షా భవేత్కన్యా" అన్న చాదస్తపు విశ్వాసం వల్లనేమి, అప్పటి సాంఘిక, రాజకీయ పరిస్థితులవల్ల నేమి స్త్రీలకు బాల్య వివాహాలు జరిగేవి.

ఈ సాంఘిక దురాచార నిర్మూలనకు ఈశ్వరచంద్ర విద్యాసాగర్, కందుకూరి వీరేశలింగం పంతులు వంటి సంఘసంస్కర్త లెందరో తమ జీవితాలను అంకితంచేసి పోరాడారు.

తుదకు శ్రీ హరవిలాస్ శారదా కృషి వల్ల 1929లో బాల్య వివాహాలను నిషేధిస్తూ అప్పటి కేంద్ర శాసనసభ ఒక శాసనాన్ని ఆమోదించింది. ఆ శాసనం ప్రకారం కనీసం 14 సంవత్సరాలు వస్తేకాని స్త్రీకి, పద్దెనిమిది సంవత్సరాలు వస్తేకాని పురుషునికి వివాహం చేయకూడదు. నిజానికి, పధ్నాలుగు సంవత్సరాల వయస్సు కూడా చాలా తక్కువే. అయినా, అప్పటికి "గ్రుడ్డిలో మెల్ల" గా దాన్ని పరిగణించడం జరిగింది.

అయినా, రజస్వలానంతరం స్త్రీకి వివాహం చేస్తే, ఎక్కడ పుట్టిమునిగిపోతుందోనని, లేదా మేనమామలు ఎక్కడ ఏట్లో ఇల్లు కట్టుకోవలసివస్తుందోనని - శాసనం అమలులో వున్నా - అది వర్తించడానికి అవకాశం లేని యానాం మొదలైన చోట్లకు వెళ్లి యథా ప్రకారంగా బాల్య వివాహాలు జరిపించేవారు జరిపిస్తూనే వుండేవారు.

క్రమక్రమంగా సాంఘిక చైతన్యం పెరగడం, స్వాతంత్ర్యం రావడం, మహిళలలో కూడా జాగృతి కలగడంతో బాల్య వివాహాల సంఖ్య తగ్గుతూ వచ్చింది.

కాగా, స్త్రీ వివాహానికి కనీసపు వయస్సు పధ్నాలుగు నుంచి పదిహేనుకు పెంచుతూ 1949లో "శారదా బిల్లు"కు పార్లమెంటు ఒక సవరణను ఆమోదించింది. నిజానికి, పధ్నాలుగు సంవత్సరాల వయస్సుకు, పదిహేను సంవత్సరాల వయస్సుకు చెప్పుకోదగిన తేడా లేదు.

అందువల్ల, ఆ సవరణ వల్ల పెద్ద ప్రయోజనం లేదని కూడా చెప్పవచ్చు.

అయినా, స్త్రీ వివాహం వయస్సు పదిహేను నుంచి పద్దెనిమిది సంవత్సరాలకు పెంచడానికి దాదాపు మూడు దశాబ్దాలు పట్టింది. మేము ఇంతకు పూర్వమే పేర్కొన్నట్లు, ఆలస్యంగా జరిగినా, అది వాంఛనీయమైన పరిణామం! హర్షదాయకమైన మార్పు.

వివాహ వయఃపరిమితి పెంపువల్ల స్త్రీ పురుషులిద్దరు శారీరకంగాను, మానసికంగాను కొంతవరకు పరిపక్వత పొందిన తరుణంలో వివాహం చేసుకొనడానికి అవకాశం లభిస్తుంది.

అంతేకాదు - పదిహేను సంవత్సరాల వయస్సులో వివాహం జరిపితే స్త్రీకి చదివే చదువుకు ఆటంకం కలుగుతుంది. అదే విధంగా పురుషునికి కూడా పద్దెనిమిది సంవత్సరాల వయస్సు చదువుకునే సమయం. "వివాహో విద్య నాశాయ..." అన్న సామెత వుండనే వున్నది కదా!

అందువల్ల, స్త్రీ వివాహం వయస్సును పద్దెనిమిదికి, పురుషుని పరిణయ వయఃపరిమితిని 21కి పెంచడం సమంజసంగా వున్నది.

ఇందువల్ల, అన్నింటికంటె ముఖ్యమైన మరొక ప్రయోజనం కూడా వున్నది. నిజానికి, హెచ్చుగా ఆ ప్రయోజనాన్ని ఆశించే మొన్నటి సవరణ జరిగింది కూడా.

నానాటికీ హెచ్చుతున్న జనాభా పెరుగుదల రేటును అరికట్టడానికి స్త్రీ పురుషుల వివాహ వయస్సును పెంచాలని కొంత కాలంగా ఆందోళన జరుగుతున్నది. పదిహేను, పదహారు సంవత్సరాల వయస్సు నుంచే స్త్రీ సంతానాన్ని కనడం ప్రారంభించడంవల్ల జనాభా విపరీతంగా పెరగడమే కాక, ఆమె ఆరోగ్యానికి కూడా భంగం, అందువల్ల వివాహం వయస్సును పెంచడం అటు కుటుంబ సంక్షేమానికి, ఇటు ఆమె సంక్షేమానికి కూడా దోహదం కాగలదు.

ఇక ఈ శాసనంలో పోలీసులకు మితి మీరిన అధికారాలిచ్చారన్న విమర్శ వున్నది. ఈ విమర్శకు కూడా పెద్దగా అవకాశం లేదు ఎవరైనా ఈ శాసనాన్ని ఉల్లంఘించినట్లు పోలీసులు భావిస్తే, అట్టి వారిని అరెస్టు చేయవచ్చు. అయితే, ఆ అధికారాన్ని పోలీసులకు ఈ శాసనం సరాసరి ఇవ్వడంలేదు. ఈ శాసనం కింద పోలీసులు ఎవరినైనా అరెస్టు చేయదలచినప్పుడు, అందుకు సంబంధించిన సమాచారాన్ని వారు మేజిస్ట్రేటు ముందు వుంచాలి; ఆయన ఆదేశం పైనే అరెస్టు చేయాలి. అందువల్ల, ఈ శాసనం ద్వారా తమకు సంక్రమించిన అధికారాన్ని పోలీసులు దుర్వినియోగం చేసే అవకాశం చాలా తక్కువ.

*(మార్చి 5, 1978)*

# ఎవరెస్టుపై ఒంటరిగా....

**భూ**మిపై అత్యున్నత స్థలం ఎవరెస్టు శిఖరం. నింగిని తాకడానికి నేల తన సుదీర్ఘ హస్తాంగుళులను పైకి చాచిన చోటు.

చుట్టూ ఎటు చూచినా మైళ్ళ కొలది దూరం పరచుకున్న నిశ్శబ్ద, నిర్జన హిమగిరి శిఖరాలు. ఆకాశం విరిగిపడి ముక్కలు ముక్కలైపోయినట్టు స్ఫురింపజేసే మంచుకొండలు. వాటి మధ్య సమున్నతంగా, సగర్వంగా ఎవరెస్టు శిఖరం.

ఇరవై తొమ్మిదివేల అడుగులకు పైగా ఎత్తున ఆ శిఖరంపై, ఆ శిఖరం కంటె ఎత్తుగా నిలబడి పైన ఆకాశాన్ని, క్రింద భూలోకాన్ని వీక్షించడం ఒక మహానుభవం. ఒంటరిగా అక్కడ నిలబడడం మరింత అద్భుతానుభవం.

ఈ అపూర్వానుభవాన్ని సాధించిన ఘనత మొన్న ఒక ఆస్ట్రియన్ పర్వతారోహకునికి దక్కింది. అతడు ఎవరెస్టు శిఖరాన్ని ఏకాకిగా అధిరోహించి, ఏకాకిగా దానిపై నిలబడి సరికొత్త రికార్డును స్థాపించాడట.

భూమిపై గల పర్వత శిఖరాలన్నిటిలోకి ఎవరెస్టు అత్యున్నతమని తెలిసిననాటి నుంచి దాన్ని అధిరోహించడానికి ఎన్నో ప్రయత్నాలు జరిగాయి. ఆ ప్రయత్నాలలో కొందరు ప్రాణాలు కోల్పోయారు కూడా. అటువంటి ఎనిమిది విఫల ప్రయత్నాల తర్వాత ఇరువురు సాహసికులు - టెన్సింగ్ నోర్కే, ఎడ్మండ్ హిలరీ - 1950 మే 28వ తేదీన ఎవరెస్టును విజయవంతంగా అధిరోహించారు. అంటే ఆ మహాద్భుత సంఘటన జరిగి వచ్చే ఆదివారంనాటికి సరిగా 25 సంవత్సరాలు. రజతోత్సవం జరపవలసిన సంఘటన.

ఎంతటి వింత అయినా ఒక్కసారికే వింత. ఆ తర్వాత ఎవరెస్టును అన్ని వైపుల నుంచి ఎందరెందరో అధిరోహించారు. వారిలో భారతీయులతో సహా దేశ దేశాల వారున్నారు. ఇప్పటికి ఎవరెస్టును తమ పాదాక్రాంతం చేసుకున్న వారి సంఖ్య అరవైకి పైమాటే. వారిలో కొందరు మహిళలు కూడా వున్నారు.

అందువల్ల, క్రమంగా ఎవరెస్టు అధిరోహణ వార్త ఒక వార్తగా తన విలువను కోల్పోయింది. అది అతిసాధారణ సంఘటన అయిపోయింది.

అయితే, ఎప్పటికప్పుడు ఏదో కొత్త దనాన్ని, ఏదో అపూర్వతను సాధించడంలోనే తన జీవితానికి సాఫల్యం కలదని మానవుడు భావిస్తాడు. గానుగెద్దువలె తిరిగి గాడిలోనే తిరగడం అతని ప్రకృతికే విరుద్ధం. ఎవ్వరూ చేయని పని, చేయలేని పని చేయడంలోనే అతనికి ఒక చరితార్థత.

కనుకనే, ఇటీవల ఈ నెలలోనే ఒక ఆస్ట్రియన్ పర్వతారోహక బృందంలోని ఇరువురు

సాహసికులు తమ వెంట ఆక్సిజన్ తీసుకువెళ్ళకుండా ఎవరెస్టును అధిరోహించి, ఒక కొత్త రికార్డు నెలకొల్పారు. సుమారు అయిదున్నర మైళ్ళ ఎత్తున వున్న ఎవరెస్టును ఆక్సిజన్ తీసుకుపోకుండా ఎక్కడం అసాధ్యమన్న నమ్మకాన్ని వారు పటాపంచలు చేశారు. వారి తర్వాత మరొక ఆస్ట్రియన్ పర్వతారోహకుడు మొన్న ఎవరి సహాయం లేకుండా తానొక్కడే ఎవరెస్టు శిఖరం అధిరోహించిన ఘనతను సాధించాడు. ఇక అతని తర్వాత ఈసారి ఎవరెస్టును అధిరోహించబోయే వారు ఇంకా ఏమేమి అపూర్వతలను, ఏయే విధాలుగా సాధించడానికి యత్నిస్తారో చూడాలి. కాని ఎవరెస్టు శిఖరారోహణ ఎంత పాతబడి పోయినా సరే, ఇటువంటి అపూర్వతలకు బహుశా అంతు వుండదనే చెప్పవచ్చు.

మానవుడు సంకల్పించుకోవాలే గాని, అతడు ఎక్కలేని ఎత్తులు లేవు. సాధించలేని సాహస కార్యాలు లేవు. శూన్య రోదసిలోనికి అతడు ఈనాడు అంగలు వేస్తున్నాడు. దూరాన మిలమిల మెరిసే చుక్కల వద్దకు నిచ్చెనలు వేస్తున్నాడు. అనంత విశ్వపు అంచులను చూడడానికి ఉత్సహిస్తున్నాడు. అణువులలోని పరమాణు శకలాలకు మూలమైన పదార్థ తత్వాన్ని కనుగొనడానికి ప్రయత్నిస్తున్నాడు. అతనికి ఎవరెస్టు అధిరోహణలో సరికొత్త విజయాలను సాధించడం ఒక లెక్కకాదు.

*(మే 21, 1978)*

# అనాగరిక పద్ధతి

ఒక మనిషి ఏదో తాత్కాలికావేశంలో మరొక మనిషిని హత్య చేసినందుకుగాను మరణ దండన విధించడం సమర్థనీయమా? అది అనాగరిక చర్యకాదా? మరణ దండన చట్టబద్ధమైన హత్యతో సమానం కాదా? ఆ పద్ధతిని పూర్తిగా రద్దుచేయడం సముచితం కాదా?

చాలాకాలంగా వివిధ దేశాలలోని మానవతా వాదులు ఇటువంటి ప్రశ్నలు వేస్తున్నారు. మరణశిక్షా పద్ధతిని గురించి తమ ప్రజలు, ప్రభుత్వాలు తిరిగి తిరిగి ఆలోచించేటట్టు చేస్తున్నారు. ఇటీవల పాకిస్తాన్ మాజీ ప్రధాని భుట్టోకు ఆ దేశపు సుప్రీంకోర్టు మరణ దండన విధించిన సందర్భంగా ఈ ప్రశ్నలు మరొకసారి వివిధ దేశాల ప్రజల, ప్రభుత్వాల ఆలోచనలలో మెదులుతున్నాయి.

పూర్వకాలంలో దాదాపు అన్ని దేశాలలోను శిక్షాస్మృతి కఠినంగా, కర్కశంగా వుండేది. కంటికి కన్ను, పంటికి పన్ను - ఐ ఫర్ ఐ, టూత్ ఫర్ టూత్ - అనే పద్ధతిని అనుసరించేవారు. ఇంతేకాదు. సంఘంలో నేరస్థుడి హోదానుబట్టి శిక్ష హెచ్చు తగ్గులుండేవి. హిందూ సమాజంలో కులవ్యత్యాసాలనుబట్టి కూడా శిక్ష హెచ్చు తగ్గులుండేవి.

కాని, క్రమంగా మానవతావాదం, ప్రజాస్వామ్యభావాలు బలపడినకొద్దీ శిక్షాస్మృతిలోని కాఠిన్యం కూడా తగ్గుతూ వచ్చింది. చట్టం ముందు అందరూ సమానులే – ఈక్వాలిటీ బిఫోర్ లా – అనే పద్ధతి అమలులోకి వచ్చింది. నేరస్థులపట్ల, నిందితులపట్ల ప్రభుత్వాలు, సమాజం వ్యవహరించే తీరు ఇప్పుడు ఆదర్శప్రాయంగా వున్నదని కాదు. మన శిక్షాస్మృతిని, న్యాయచట్టాన్ని, ముఖ్యంగా కారాగారాలలో పరిస్థితులను ఇంకా ఎంతగానో సంస్కరించవలసిన అవసరంవున్నది. అయినప్పటికి పూర్వకాలపు కఠోరశిక్షలతో, నిరంకుశ శాసనాలతో పోల్చితే ఇప్పటివి గుడ్డిలో మెల్ల అన్న దొకటే సంతృప్తి.

కాని, దాదాపు పూర్తిగా పూర్వపు అమానుష పద్ధతులను తలపించే శిక్షా విధానం ఒకటి మాత్రం మానవ సమాజంలో ఇంకా మిగిలివున్నది. అది మరణదండన. ఈ అనాగరిక పద్ధతి చరిత్రకు అందని ప్రాచీన కాలం నుంచి నేటి వరకు సభ్యసమాజాలను వెన్నాడుతూనే వున్నది.

ఉరిశిక్ష పద్ధతిని రద్దుచేయాలని కోరేవారు ఈ క్రింది విషయాలను తమ వాదానికి సమర్థనగా చూపిస్తారు :

1. ఒక మనిషి నిజంగా హత్య చేశాడా లేదా అని నిర్ధారణకు రావడంలో న్యాయస్థానాలు పొరపడవచ్చు. నిందితుడిని ఉరితీస్తే తమ పొరపాటును సవరించుకునే అవకాశం న్యాయస్థానాలకు వుండదు.
2. మరణ దండన భయం వున్నంతమాత్రాన హత్యా నేరాలు తగ్గవు, తగ్గడంలేదు.

తాత్కాలికోద్రేకంలో హత్యలు చేసేవారు చేస్తూనే వుంటారు.

3. నేరస్థుడిని ఉరి తీయడం వల్ల అతనిలో పశ్చాత్తాప భావానికి, హృదయపరివర్తనకు, నూత్న జీవితారంభానికి అవకాశం లేకుండా చేసినట్టు అవుతుంది.
4. ప్రాణం తీసిన వాడి ప్రాణం తీయడం చట్టబద్ధంగా సమాజం తన పగ తీర్చుకోవడమే. వ్యక్తిగతమైన పగకు, సమాజపరమైన పగకు తేడా ఏముంది?
5. మరణ దండన చట్టబద్ధమైన హత్యే.
6. అది మానవత్వపు విలువలకు వ్యతిరేకమైన పద్ధతి.

ఈ వాదాలను కాదనడం కష్టం. మొత్తంపై ఆధునిక కాలంలో మరణశిక్షా పద్ధతిలోని అనాగరికతను గ్రహించి సుమారు 30 పైగా దేశాలు - బ్రిటన్, స్వీడన్, కెనడా మొదలైనవి - దాన్ని రద్దుచేశాయి. అమెరికాలో కూడా 43 రాష్ట్రాలలో మరణ శిక్షా పద్ధతి లేదు, కాని, ప్రపంచంలోని అధిక సంఖ్యాక దేశాలలో అది ఇంకా అమలులోనే వున్నది. ఇండియాలో దాన్ని రద్దు చేయించడానికి పార్లమెంటులోపల, వెలుపల ఎన్నో ప్రయత్నాలు జరిగాయిగాని, అవి ఏవీ ఫలించలేదు.

మరణదండన పద్ధతిలోని అమానుషత్వం ఇటీవల భుట్టోకు విధించిన ఉరిశిక్షవల్ల మరొకసారి ప్రపంచం దృష్టికి వస్తున్నది. తన పరిపాలనా కాలంలో భుట్టో ఎన్నో అక్రమాలు చేసి వుండవచ్చు. కాని, అతడిని పదవీచ్యుతుడిని చేసిన సైనిక నియంత జియా ఉల్ హక్ తన అధికారానికి భుట్టో అడ్డంకిని శాశ్వతంగా తొలగించుకొనడానికే అతనిపై హత్య కుట్రనేరాన్ని మోపాడని పలువురు అనుమానిస్తున్నారు. పాకిస్తాన్‌లో సైనిక ప్రభుత్వం వున్నందున న్యాయస్థానాల స్వేచ్ఛా ప్రతిపత్తి సయితం శంకించదగినదిగా కనిపిస్తున్నది. ఒకవేళ అవి స్వేచ్ఛ కలిగిన వైనప్పటికి, భుట్టోఅప్పీలును విచారణ చేసిన సుప్రీంకోర్టులో ముగ్గురు జడ్జీలు అతడిని దోషిగా పరిగణించగా, మరి ముగ్గురు నిర్దోషిగా భావించడం, ప్రధాన న్యాయమూర్తి ఓటు కూడా కలుపుకుంటే తప్ప అతడు దోషి అనే తీర్పుకు అవకాశం కలగకపోవడం ముఖ్యంగా గమనించదగింది. ఈ పరిస్థితులన్నిటిని దృష్టిలో పెట్టుకునే అమెరికా ప్రెసిడెంట్ కార్టర్, బ్రిటిష్ ప్రధాని కెలహాన్, భారత రాష్ట్రపతి శ్రీ సంజీవరెడ్డి వంటి ప్రపంచ ప్రభుత్వాధినేతలు పలువురు భుట్టోకు ప్రాణభిక్ష పెట్టవలసిందిగా జనరల్ జియాకు విజ్ఞప్తి చేశారు. ప్రపంచం నలుమూలల నుంచి వస్తున్న ఈ విజ్ఞప్తులను పాక్ సైనిక నియంత పెడచెవిని పెట్టబోడనే ఆశించాలి.

ఇదే సమయంలో అసలు మరణ దండన ఎంత వికృతమైన, హేయమైన, అమానుషమైన శిక్షా విధానమో వివిధ దేశాల ప్రజలు, ప్రభుత్వాలు గ్రహించి దాన్ని రద్దు చేయడానికి చర్యలు గైకొంటే అది మరింతగా సంతోషించదగు విషయం కాగలదు.

*(ఫిబ్రవరి 11, 1979)*

# అసాధారణ రచయిత

చలంగారిని పోలిస్తే ఒక నిర్నిద్ర సముద్రంతో పోల్చాలి. ఒక మహా జలపాతంతో పోల్చాలి. ఒక ఝంఝూనిలంతో పోల్చాలి.

చలంగారి అస్తమయంతో ఒక సముద్రం స్తంభించినట్టు, ఒక జలపాతం నిశ్చలమై పోయినట్టు, ఒక ఝంఝూనిలం శాంతించినట్టు.

అరవై ఏళ్ళనాడు గుడిపాటి వెంకటచలం గారు ఆంధ్ర సాహిత్యంలో ఒక సుడిగాలి వలె, ఒక పెద్ద వరదవలె ప్రవేశించారు. సంఘంలో, సాహిత్యంలో, ప్రజల ఆలోచనలలో తరతరాలుగా పేరుకుపోయిన కశ్మలాన్ని కడిగి వేశారు. చెత్తా చెదారం, దుమ్మూ దూగర ఎగర గొట్టారు. కొత్త గాలులకు తలుపులు తెరిచారు, కొత్త భావాలకు లాకులు ఎత్తివేశారు.

ఒక గొప్ప రచయిత ప్రవేశం తర్వాత ఏ సాహిత్యం యథాతథంగా మిగలదు. దాని స్వరూపం మారిపోతుంది. దాని స్వభావం మారిపోతుంది. సాహిత్యంపై అతడు తన ప్రభావాన్ని ఎన్నటికి చెరగని విధంగా ముద్రిస్తాడు.

చలంగారు చేసిన పని అదే. తెలుగు వచన స్వరూపాన్ని, రచన స్వభావాన్ని పూర్తిగా మార్చివేశారు. సమకాలిక రచయితలపైన, తరువాత తరం వారిపైన తన ప్రభావ ముద్ర వేశారు.

ఆనాడు ఆయనను గురించి రెండే రెండు అభిప్రాయాలు. విమర్శిస్తే అతి తీవ్రంగా విమర్శించడం, లేదా అంతే గాఢంగా అభిమానించడం. మరొక అభిప్రాయానికి - ఫరవాలేదు బాగానే వ్రాస్తాడు అనో, లేదా ఏమి వ్రాశాడు లెద్దూ అనో చప్పరించి వేయడానికి - వీలులేని రచనలు ఆయన చేశారు.

"చలం ఏమిటి, ఇలా వ్రాస్తాడు? ఇంత పచ్చి బూతులా? ఇంత బరి తెగింపా? అవినీతిని, విశృంఖలత్వాన్ని బోధిస్తున్నాడే! సంఘాన్ని, ముఖ్యంగా వివాహ వ్యవస్థను కూకటి వేళ్ళతో సహా కూలద్రోయడానికి యత్నిస్తున్నాడే! హిందూ సంప్రదాయాన్ని, ఆచారాలను, విశ్వాసాలను, కులభేదాలను మంట గలుపుతున్నాడే!" - ఆయనను ద్వేషించిన వారి విమర్శ ఇది.

కాని ఈ విమర్శలకు చలంగారు చలించలేదు. తాను నమ్మిన సిద్ధాంతాల కోసం సంఘానికి, వ్యక్తులకు ఏది శ్రేయస్కరమని తాము భావించారో ఆ విలువల కోసం ఆయన పుంఖానుపుంఖంగా రచనలు చేస్తూనే పోయారు.

"సెక్స్‌తో సహా అన్ని విషయాలలోను స్త్రీకి పురుషునితో సమానమైన హక్కులుండాలి. యుగయుగాలుగా పురుషుడికి స్త్రీ బానిసగా పడి వుంది. పురుష సమాజం స్త్రీని అణగద్రొక్కి వేసింది. ఆమె ఒక వ్యక్తి అని, ఆమెకొక వ్యక్తిత్వం వుంటుందని, ఆమెకు కూడా సొంత

ఇష్టానిష్టాలు, అభిరుచులు, స్వేచ్ఛానురక్తి వుంటాయని ఊహించలేదు. కేవలం పిల్లలను కని, వంట చేసిపెట్టే మరబొమ్మగానే స్త్రీని పురుషుడు పరిగణించాడు. ఇది అన్యాయం. పురుషునికున్న స్వేచ్ఛ స్త్రీకీ వుండాలి. అప్పుడుగాని ఆమె వ్యక్తిత్వం పరిపూర్ణత్వం చెందదు" అని చలంగారు ఆనాడు ఘోషించారు. కాలానికి ఎదురీదుతూ, గొప్ప ఆత్మ విశ్వాసంతో, అచంచల ధైర్య సాహసాలతో ఆయన తన భావాలను ప్రచారం చేశారు. తన మొత్తం సాహిత్యాన్ని తనసాంఘిక విశ్వాసాలకు అంకితం చేశారు.

ఎన్ని రచనలు? ఒక పెద్ద ఉప్పెన వలె చలం గారి రచనలు ఆంధ్రదేశంపై విరుచుకు పడ్డాయి. ప్రేమలేఖలు, మ్యూజింగ్స్, దైవమిచ్చిన భార్య, శశాంక, చిత్రాంగి, పురూరవ, మైదానం, బ్రాహ్మణీకం, అమీనా, అరుణ - ఇంకా ఇంకా ఎన్నో అసంఖ్యాకమైన నవలలు, నాటకాలు, కథలు, ఇతర రచనలతో, వాటిలోని అసాంప్రదాయిక భావాలతో ఆయన తెలుగువారిని ఉక్కిరి బిక్కిరి చేశారు.

తన భావాలను కాదంటూ, తన వచన శైలిని ఎవరైనామెచ్చుకుంటే ఆయన సహించేవారు కారు. "నా భావాలనుంచి, నా ఆవేశాల నుంచి నా శైలిని విడదీయవద్దు. అవి పరస్పరాశ్రితాలు అని ఆయన అనేవారు. అయినా తెలుగులో వ్యావహారిక వచనాన్ని తీర్చిదిద్దిన కొద్ది మందిలో ఒకరుగా ఆయన చరిత్రలో నిలిచిపోతారు. ఒకసారి ఆప్యాయంగా కబుర్లు చెబుతున్నట్టు, మరొకసారి అదలిస్తున్నట్టు, ఒకసారి మృదువుగా, మరొకసారి తీక్షణంగా వుండేది ఆయన భాష. తెలుగుదేశపు ప్రకృతిని అంతఅందంగా, అనురక్తితో వర్ణించిన ఆధునిక రచయిత మరొకరు లేరనడం అతిశయోక్తికాదు. ఆయన ఛందోబద్ధంగా వ్రాయలేదుగాని, వచనంలోనే కవితా సౌరభాన్ని గుబాళింప జేసేవారు.

తొలినుంచి ఆయనలో ఒక ద్వైదీభావం వుండేది. ఒకటి హేతువాదం, రెండవది విశ్వాస వాదం. చివరకు రెండవదే గెలిచింది. ముప్పదేళ్ళనాడు ఆయన ఆంధ్రదేశాన్ని వదలి ఆరవ దేశానికి మహాభినిష్క్రమణం చేశారు. తిరువణ్ణామలైలో స్థిర నివాసం ఏర్పరచుకున్నారు. జీవిత ప్రథమార్థంలో నిరీశ్వర వాదిగా, లేదా అజ్ఞేయవాదిగా పేరు పొందిన చలంగారు మలి దశలో పూర్తిగా ఈశ్వర వాదిగా మారి పోయారు. అదొక విచిత్ర పరిణామం.

చలంగారిని తెలుగువారు చిరకాలం జ్ఞాపకం పెట్టుకుంటారు కాని, హేతువాదం నుంచి భగవ ద్విశ్వాసానికి మారిన చలంగారిని కాదు. సంఘ దురాచారాల మీద, మూఢ విశ్వాసాల మీద, కులం మీద, మతంమీద ధ్వజమెత్తి. స్త్రీల స్వేచ్ఛ కోసం, వారికి సాంఘిక న్యాయం కోసం పరితపించిన మానవతావాదిగా చలంగారిని జ్ఞాపకం పెట్టుకుంటారు. సమకాలికుల ఆలోచనా ధోరణిని సమూలంగా మార్చి వేయడానికి కలంపట్టిన అసాధారణ రచయితగా ఆయనను కలకాలం జ్ఞాపకం పెట్టుకుంటారు.

*(మే 6, 1979)*

# ప్రకృతిపై దాడి

మన దేశంలో రాను రాను ఋతువులు మారిపోతున్నాయన్న మాట తరచుగా వినబడుతూ వుంటుంది. ఒకప్పుడు మన పూర్వులు సంవత్సరాన్ని ఆరు ఋతువులుగా విభజించారు. ఈ రోజులలో ఈ ఋతు భేదాలకు అర్థం లేకుండా పోతున్నది.

దీనికొక కారణం ప్రకృతిపై, తమ సహజ పరిసరాలపై మానవులు జరుపుతున్న దాడి. వ్యవసాయ యోగ్యమైన భూమి కోసం, పారిశ్రామిక విస్తరణ కోసం మనం ఒక పద్ధతి ప్రకారం అరణ్యాలను నిర్మూలించుకుంటూ పోతున్నాము. ఒకప్పుడు మన దేశం కీకారణ్యాలకు ప్రసిద్ధి. జనాభా పెరుగుదలతో అరణ్యాల విస్తీర్ణం క్రమంగా తగ్గిపోతున్నది. ఇప్పుడు మన దేశ విస్తీర్ణంలో నూటికి 23 వంతులు కూడా అరణ్య ప్రదేశం లేదు. పారిశ్రామికంగా అభివృద్ధి చెందిన పాశ్చాత్య దేశాలలో కూడా ఇంతకంటె ఎంతో ఎక్కువ శాతం అరణ్య ప్రదేశం వుంటుంది. అలావుండేటట్టు వారు జాగ్రత్త పడతారు కూడా. శీతోష్ణస్థితిని సమతూకంలో వుంచడానికి కనీసం నూటికి 33 వంతులైనా అరణ్య ప్రదేశం వుండాలని శాస్త్రవేత్తల అంచనా.

విచక్షణా రహితంగా అడవులను కొట్టి వేస్తూ పోవడం వల్లనే మన దేశంలో వర్షపాతం అనిశ్చితంగా తయారైంది. కురిస్తే కుండపోతగా అధిక వర్షాలు, లేకపోతే అనావృష్టి క్రమంగా భూసారం నశించి పోవడానికికూడా అరణ్యాల నిర్మూలనే కారణం.

మన దేశంలో అనాలోచితంగా, విచక్షణారహితంగా అరణ్యాల నిర్మూలన జరుగుతున్నదన డానికి ఒకకొత్త ఉదాహరణ కేరళలోని "సైలెంట్ వ్యాలీ" జలవిద్యుత్పథకం. కేరళ ప్రస్తుతం విద్యుచ్ఛక్తి కొరతతో అవస్థ పడుతున్న రాష్ట్రం కాదు. విద్యుచ్ఛక్తి ఉత్పత్తి ఎక్కువై బాధపడుతున్న రాష్ట్రం. ఉత్పత్తి అవుతున్న విద్యుత్తును ఏమి చేసుకోవాలో తెలియక తమిళనాడు, కర్ణాటక రాష్ట్రాలకు విక్రయిస్తున్న రాష్ట్రం. అయినప్పుడుకేవలం 120 మెగావాట్ల జల విద్యుచ్ఛక్తిని ఉత్పత్తి చేయడానికి గాను సైలెంట్ వ్యాలీ అరణ్యం నిర్మూలనకు కేరళ రాష్ట్ర ప్రభుత్వం ఉద్యమిస్తున్నది. ఇందుకు ప్రధాని శ్రీ మొరార్జీ దేశాయి ఈ మధ్యనే అనుమతి మంజూరు చేయడం కూడా జరిగింది.

సైలెంట్ వ్యాలీ ఉష్ణ మండలారణ్యం. ఇటువంటి అరణ్యాలు ప్రపంచంలో చాలా అరుదుగా - అత్యధిక వర్షపాతం, తగినంత ఉష్ణం కలిగిన ఉష్ణమండల ప్రదేశాలలో పెరుగుతాయి. కొన్ని లాటిన్ అమెరికన్, ఆఫ్రికన్ దేశాలు, ఆగ్నేయాసియా దేశాలు వీటికి ప్రసిద్ధి. ఇవి సాధారణమైన అరణ్యాలు కావు.ప్రకృతి వింతలలో ఒకటిగా వీటిని "ఇకాలజీ" శాస్త్రవేత్తలు పేర్కొంటారు. ఇవి ఊహించలేనంత దట్టంగా పెరుగుతాయి. అక్కడ ప్రత్యక్షమైనంత జీవకోటి వైవిధ్యం మరెక్కడా కనబడదని చెబుతారు. ఏ ఒక్క అరణ్యాన్ని తీసుకున్నా వేలాది రకాల వృక్ష, జంతుజాతులు

సాక్షాత్కరిస్తాయి. అపురూపమైన రంగుల పూలచెట్లతో, వింతగొలిపే జంతువులతో అలరారే ఈ అరణ్యాలలో ప్రకృతి తన సృజన శక్తి నంతా కేంద్రీకరించిందేమోనన్న భావం కలుగుతుంది. సూర్యరశ్మిని కూడా చొరనివ్వనంత దట్టమైన ఈ అరణ్యాలలో కొన్నిచోట్ల వెలుగును వెతుకుతూ చెట్లు 200 అడుగుల ఎత్తువరకు కూడా పెరుగుతాయి.

ఇటువంటి అపురూపపు అడవులలో సైలెంట్ వ్యాలీ ఒకటి. దానిపేరే సూచిస్తున్నట్టుగా అది కొన్ని లక్షల ఏళ్లుగా నిశ్శబ్ద గంభీరంగా నిలబడి వున్నది. దాన్ని కొద్దిపాటి విద్యుచ్ఛక్తి ఉత్పత్తి పేరిట నాశనం చేయడానికి, అరుదైన వృక్ష, జంతు సంతతిని నిర్మూలించడానికి పూనుకొనడం ప్రకృతిపై క్షమార్హం కాని అత్యాచారం జరపడమే. దాని నిర్మూలన వల్ల ప్రకృతిలోని సమతూకం చెడిపోవడమే కాక ఇండియా పశ్చిమ తీరానికి- ఇప్పుడు తూర్పు కోస్తాకు వలె - తుపానులప్రమాదం హెచ్చుతుందని కూడా నిపుణులు హెచ్చరిస్తున్నారు.

అడవుల పెంపకాన్ని ప్రోత్సహించడం భారత ప్రభుత్వపు కార్యక్రమాలలో ఒకటి. ఇందుకు విరుద్ధంగా లక్షలాది ఏళ్ళనాటి ఒక నిత్యహరిత మహారణ్యాన్ని నిర్మూలించడానికి ప్రధాని అనుమతించడం విచారకరం. కేరళ ప్రభుత్వం తన పథకాన్ని విరమించుకోగలదనే ఆశించాలి.

*(జూన్ 28, 1979)*

# సంపూర్ణ సూర్యగ్రహణం

**వ**చ్చే శనివారంనాడు మధ్యాహ్నం ఒక అపురూప దృశ్యాన్ని మనం తిలకించబోతున్నాము. అది సంపూర్ణ సూర్యగ్రహణం.

సూర్య బింబాన్ని చంద్రబింబం పూర్తిగా కప్పి వేస్తుంది. చంద్రుడి నీడ భూతలంపై ప్రసరించి ఆకస్మికంగా చీకటి కమ్ముకుంటుంది. పట్టపగలు ఆకాశంలో శుక్ర, బుధ గ్రహాలు, కొన్ని నక్షత్రాలు సాక్షాత్కరిస్తాయి.

సూర్యగ్రహణాలు సర్వ సాధారణమే. కాని, సంపూర్ణ సూర్య గ్రహణం అరుదుగా వస్తుంది. అదైనా ఎన్నడూ సుమారు ఏడు నిమిషాలకంటె ఎక్కువసేపు వుండదు. మూడు నాలుగు నిమిషాలసేపు నిలిచే సంపూర్ణ గ్రహణాలే ఎక్కువ. ఈసారి ఫిబ్రవరి 16వ తేదీన ఇండియాలో పశ్చిమాన కర్ణాటకలోని గోకర్ణం నుంచి తూర్పున పూరి వరకు సుమారు 1500 కిలోమీటర్ల పొడవున, 125 కిలోమీటర్ల వెడల్పున సన్నని భూమార్గంలో కనబడనున్న సంపూర్ణ సూర్యగ్రహణం కొన్నిచోట్ల 44 సెకండ్ల సేపు నుంచి కొన్ని చోట్ల రెండు నిమిషాల 50 సెకండ్ల వరకు మాత్రమే వుంటుంది.

కనుకనే కడచిన నెలరోజులుగా ఈ అపురూప అసాధారణ సంఘటనపట్ల ప్రపంచ శాస్త్రవేత్తలు, మన దేశంలోని సామాన్య ప్రజలు కూడా అమిత కుతూహలం కనబరుస్తున్నారు. ఈ దృశ్యాన్ని ఇప్పుడు చూడలేనివారు తమ జీవిత కాలంలో మరి చూడలేకపోవచ్చు. కనుకనే దానికి అంత ప్రాధాన్యం.

సంపూర్ణ సూర్యగ్రహణం మహాద్భుత దృశ్యమైనా అది ప్రకృతిలో జరిగే అనేక సహజ సంఘటనలలో ఒకటి. సూర్యగ్రహణం అమావాస్యనాడే వస్తుంది. కాని, ప్రతి అమావాస్యకు సూర్యగ్రహణం రాదు. సూర్యుడు, చంద్రుడు, భూమి ఒకే వరుసలో, ఒకే సమతలంలో వున్నప్పుడే సూర్యగ్రహణం వస్తుంది. ఇక చంద్రుడు సూర్యబింబాన్ని పూర్తిగా కప్పి వేయగలిగిన స్థానంలో ఉన్నప్పుడే సంపూర్ణ సూర్యగ్రహణం సంభవిస్తుంది. ఇది ఇప్పుడు కాదు, కొన్ని వేల సంవత్సరాలనాడే ఖగోళ పరిశీలకులు కనుగొన్నారు.

అయినా, ఈ సహజ భౌతిక సంఘటనపట్ల ఇప్పటికి కూడా అనేక దేశాలలో అనేక మూఢ విశ్వాసాలు కొనసాగడం ఆశ్చర్యం కలిగిస్తుంది. మన దేశంలో సరేసరి. ఒక మహోన్నత నాగరికతకు వారసులమైన మనలో నేటికి కూడా సూర్య, చంద్ర గ్రహణాల గురించి అనేక నిరాధార విశ్వాసాలు ప్రచారంలో వున్నాయి. సూర్య, చంద్రులను గ్రహణ సమయంలో రాహు, కేతువులు గ్రసిస్తారని, పూజలు పురస్కారాలు, జప తపాలు, శుచి స్నానాలు చేయాలని, గర్భిణీ స్త్రీలు ఆ సమయాలలో బయటికి రాకూడదని, ఇంకా ఎన్నెన్నో నమ్మకాలను ఇప్పటికీ అక్షరాలా నమ్మేవారు వుండడం ఆశ్చర్యం. సాధారణ జ్యోతిష పండితులు సరే.

ఇట్టివే కొన్ని విశ్వాసాలను, విశ్వాసపరమైన విధి నిషేధాలను సెక్యులర్ ప్రభుత్వ సంస్థ అయిన ఆకాశవాణి సయితం ఇప్పటి సూర్యగ్రహణ సందర్భంలో పని కట్టుకుని ప్రచారం చేయడం మరింతగా ఆశ్చర్యం. అంతేకాదు, ఖండించదగింది కూడా.

ఇకపోతే, రానున్న సూర్యగ్రహణం గురించి భారతీయ విజ్ఞాన శాస్త్రవేత్తలు కూడా రకరకాలుగా ప్రచారం చేయడం విచారకరం. కొన్నాళ్ల క్రిందట స్కైలాబ్ పతన సందర్భంలో వలె వీరి నేటి ప్రకటనలు ప్రజలను గందర గోళంలో ముంచెత్తుతున్నాయి. ఒక్కొక్క సారి భయభ్రాంతులను చేస్తున్నాయి. ఇదీ ఖండించదగిందే. కొందరు సూర్యగ్రహణాన్ని అసలు ఎట్టి పరిస్థితులలోను చూడరాదంటున్నారు. కొందరు కొన్ని జాగ్రత్తలు గైకొని కొన్ని పరికరాల సహాయంతో చూడవచ్చునంటున్నారు. వీరి విభిన్న ప్రకటనలు అయోమయం కలిగిస్తున్నాయి.

మామూలుగా ఎండను కొంత ఎక్కువ సేపుచూస్తేనే కళ్ళు చీకట్లు కమ్ముతాయి. ఇక సూర్యబింబాన్ని నేరుగా చూడడం దృష్టికి ఎంత హానికరమో వేరే చెప్పనక్కరలేదు. ఇది గ్రహణ సూర్యబింబానికి కూడా వర్తిస్తుంది. పాక్షిక సూర్యగ్రహణాన్ని చూడదలచినవారు విధిగా కొన్ని పరికరాల సహాయంతోనే చూడాలి. నేరుగా చూడరాదు. కాని, రెండు, మూడు నిమిషాలసేపు మాత్రమే వుండే సంపూర్ణ సూర్యగ్రహణం వేరు. మనకు ఆ క్షణాలలో కనబడేది సూర్యబింబం కాదు. దాన్ని పూర్తిగా అచ్ఛాదించి వేసిన కారునల్లని చంద్రబింబమే. దాన్ని ఆ కొద్ది క్షణాలలోమాత్రమే నేరుగా చూడడం హానికరం కాదు. ఇక సూర్యబింబం చుట్టూ ఆవరించి వుండే కొరోనా కాంతి పున్నమి వెన్నెలకంటె తక్కువగా వుంటుందని అంటున్నారు.

సంపూర్ణ సూర్యగ్రహణం రావడానికి ముందు క్షణాలలోసూర్యుని కప్పి వేస్తున్న చంద్రుడి నీడ గంటకు 1060 మైళ్ళ మహావేగంతో భూమిపై ప్రసరిస్తూ పోతుందని, ఆ దృశ్యం పరమాద్భుతంగా, ఒక్కొక్క సారి భయావహంగా వుంటుందని శాస్త్రజ్ఞులు చెబుతున్నారు. కాని అది అసాధారణదృశ్యమైనా కేవలం చంద్రుడి నీడ మాత్రమేనని గుర్తుంచుకుంటే ఎట్టి భయానికి ఆస్కారం లేదు.

ఇక వైజ్ఞానిక ప్రయోగ, పరిశోధనలకు సంపూర్ణ సూర్యగ్రహణం అమూల్య సంఘటన. సూర్యుని ఆవరించి వుండే కొరోనా అనబడే తేజోవలయం మామూలుగా సూర్యకాంతిలో కనబడదు. కాని సంపూర్ణ గ్రహణ సమయంలో ఆ కొద్ది క్షణాలపాటు అది తెల్లని ముత్యాల రాశివలె పరమ రమణీయంగా దర్శనమిస్తుంది. దానిని, దానికి దిగువ సూర్యబింబానికి మరింత చేరువగా క్రోమోస్ఫియర్ అనబడే వర్ణావరణాన్ని పరిశోధించడానికి శాస్త్రజ్ఞులకు సంపూర్ణ గ్రహణం అవకాశమిస్తుంది. అదే సమయంలో ఆకస్మికంగా చీకటి ఆవరించిన ఆ క్షణాలలో మానవులపై, జంతువులపై, మన వాతావరణంపై దాని ప్రభావాన్ని పరిశోధించడానికి కూడా అది అనువైన సమయం.

అన్నిటిలోకి ముఖ్యమైన పరిశోధన మహాశాస్త్రవేత్త ఐన్‌స్టయిన్ ప్రతిపాదించిన సాపేక్ష సిద్ధాంతంపై జరుగుతుంది. సూర్యునివంటి బృహద్గోళాల సమీపంలో కాంతి కిరణాలు కూడా

వంపు తిరుగుతాయని ఆయన 1915లో ప్రతిపాదించాడు. దీన్ని 1919 లో సర్ ఆర్థర్ ఎడింగ్టన్ మొదలుకుని ఎందరో ప్రయోగాల ద్వారా రుజావు చేశారు. ఇప్పుడు పైన పేర్కొన్న అనేక ప్రయోగాలు చేయడంతోపాటు దీన్ని కూడా - సూర్యబింబ సమీపంలోని నక్షత్ర కాంతి సూర్యాకర్షణ క్షేత్రంలో వంపు తిరగడాన్ని - మన దేశంలో మన శాస్త్రజ్ఞులు మొదటిసారిగా తిలకించబోతున్నారు.

పాక్షిక సూర్యగ్రహణాన్ని శాస్త్రవేత్తలు సూచిస్తున్న వివిధ జాగ్రత్తలతో, పరికరాలతో తప్ప నేరుగా చూడడం ప్రమాదకరమే. కాని, దాన్ని గురించి అంతకుమించిన భయాందోళనలు పెట్టుకోవలసిన అవసరం లేదు. దాన్ని ఒక సహజ ఖగోళ - భౌతిక సంఘటనగానే పరిగణించాలి తప్ప అలౌకిక సంఘటనగానో, అరిష్టంగానో భావించనక్కరలేదు.

*(ఫిబ్రవరి 14, 1980)*

# మహాకవి అస్తమయం

"ప్రాణసఖుడె నా కోసమై పంపినాడు
పల్లకీ యన హృదయమ్ము జల్లుమనియె
వీడని వియోగమున వేగు మోడుమేను
తలిరుతోరణమై సుమదామమాయె"

అని కృష్ణశాస్త్రిగారు ఏనాడో వ్రాశారు. ఆయన కోసం ఏ అదృశ్య ప్రాణసఖుడో పంపిన ఆ పల్లకి ఇప్పుడు వచ్చింది. ఎనభై రెండు సంవత్సరాల నిండు వయస్సులో ఆయన ప్రణయ వల్లకి వంటి ఆ పూలపల్లకిలో పూలమాల వలె, కొసరు నడలకు తూగాడుతూ కూర్చుని వెళ్ళిపోయారు.

ఆయన వెళ్ళిపోయారంటే అసంఖ్యాకులైన ఆయన కవితా ప్రియులకు, ఆప్తులకు నమ్మశక్యం కాని దుఃఖకర దుర్వార్త. శారీరకంగానే ఆయనకు వృద్ధాప్యం. మానసికంగా నిత్య యౌవనం, నిత్యోత్సాహం. గొంతు మూగవోయినా, గుండె పాడుతూనే వుండేది. "ముసలితనంలో మూగతనం భయంకరం- శిథిల మందిరంలో అంధకారం లాగున" అని ఆయనే వ్రాసుకున్నారు. కనుకనే ఎన్నడూ శీతవేళను దరికి రానిచ్చేవారు కారు! "వీథి వాకిటను జరా పదధ్వని వినబడగానే, వీట లేడనీ చెప్పించి" నట్టుగా వుండేవారు. ఎప్పుడూ పదిమందిలో కూర్చుని, కాగితంపై కలంతోఆయన కురిపించే ఛలోక్తుల మరంద ధారలలో తడియని వారు వుండేవారు కారు. చివరి వరకు తన జీవితాన్ని ఒక "ప్రియాననాన్వేషణోత్సవ యాత్ర"గా ఆయన కొనసాగించారు.

కృష్ణశాస్త్రిగారి పేరు చెప్పగానే అరవై ఏళ్ళనాటి ఆంధ్ర సాహిత్య చరిత్ర కనుల ముందు ముసురుతుంది. ఆయన సాహిత్య ప్రవేశంతో ఒక చీకటింటి లోనికి ఉదయ సూర్య కిరణం తొంగి చూచినట్టు అయింది. చల్లని పిల్ల తెమ్మెర వీచినట్టు అయింది. ఒక విరహ వీణ తరళ తరళ తంత్రీగతులతో మ్రోగినట్టు అయింది.

అది రాయప్రోలు, విశ్వనాథ, అబ్బూరి, నాయని, దువ్వూరి, తల్లావఝుల, నండూరి, వేదుల మొదలైన కవుల స్వర్ణయుగం. ఆనాడు వారి సహచరుడుగా, వారి కవిత్వ ప్రచారకుడుగా కృష్ణశాస్త్రిగారు తెలుగు నేల నాలుగు చెరగుల పర్యటిస్తూ, అనర్గళ వాగ్ధాటితో ప్రసంగిస్తూ నవ్య కవిత్వానికి ఎనలేని ప్రచారం కల్పించారు.

ఆయన పేరు భావ కవిత్వానికి పర్యాయ పదమైంది. గిరజాల జుట్టు, మెరుగు కళ్ళజోడు, తెల్లని లాల్చీ, పంచె, పల్లెవాటుతో ఆయన భావ కవికి మారు పేరైనారు. సుకుమారమయిన భావనతో, ఒక జయదేవుడికో, ఒక రవీంద్రుడికో మాత్రమే సాధ్యమనిపించే " మధుర కోమల కాన్త పదావళి"తో ఆయన విరచించిన కృష్ణపక్షం, ఊర్వశి, ప్రవాసం, మహతి వంటి ఖండకావ్యాలు ఆనాటి యువతరాన్ని ఉద్రూత లూగించాయి. షెల్లీ ప్రభావంలో జీవన విషాదంలోని మాధుర్యాన్ని,

స్వేచ్ఛా తత్వాన్ని గానం చేశారు. రఘుపతి వెంకటరత్నంనాయుడు గారి శుశ్రూషలో బ్రాహ్మ సమాజ ప్రార్థన గీతాలుగా -

"అంతరాంతరము నీ యమృత వీణేయైన
మాట కీర్తన మౌను, మనికి వర్తనమౌను
ఈ యనంతపథాన ఏచోటి కాచోటు
నీ యాలయమ్మౌను నీ యోలగమ్మౌను"...

వంటి మధుర గేయాలెన్నో లిఖించారు. టాగోర్ విరచిత జాతీయగీతంతో పోల్చదగిన "జయ జయ జయ ప్రియ భారత జనయిత్రీ దివ్య ధాత్రి" వంటి దేశ భక్తి గీతాలెన్నో వ్రాశారు. అసదృశ భావనా ప్రౌఢితో ఎన్నో రేడియో రూపకాలు, పద్య శైలికి తీసిపోని గద్య శైలిలో ఎన్నో ప్రసంగ వ్యాసాలు వ్రాశారు.

ఇక చలన చిత్ర కవిగా ఆయన రచించిన పాటలు వాటికవే సాటి. మూడు దశాబ్దాల నాటి "మల్లీశ్వరి" కి ఆయన కూర్చిన గీతాల మాధుర్యం నేటికి కూడా తెలుగు వారిని అలరిస్తూనే వున్నది. తుది వరకు ఆయన చలన చిత్రాలకు మధుర గీతాలను అందిస్తూనే వున్నారు. ఏ మాత్రం సాహిత్యాభిరుచి గల నిర్మాత అయినా, కృష్ణశాస్త్రి గారి తీయని పాట ఒక్కటైనా లేనిదే తన చిత్రం పూర్తి అయినట్టు భావించే వాడు కాదంటే అతిశయోక్తి కాదు. ఆయన లేని వెలితి అటు సాహిత్య రంగానికి, ఇటు చలన చిత్ర సీమకు ఎన్నడూ తీరనిది.

కృష్ణశాస్త్రిగారిలో ఎన్నదగిన మరొక విశేషం - తన తరం కవులలో పెక్కుమందివలె ఆయన 1920ల లోనో, 1930లలోనో ఆగిపోలేదు. కాలం నిత్య పరిణామ ప్రగతి శీలమయిందని ఆయనకు తెలుసు. కనుకనే, ఆయన కాలంతో పాటు ముందుకు నడిచారు. కొత్త వెలుగులను, కొత్త గాలులను ఆయన నిండు గుండెతో ఆహ్వానించారు. అభ్యుదయ భావాలకు ఆయన ఎప్పటి కప్పుడు స్వాగతం చెప్పారు. కనుకనే ఆయన రచనా వ్యాసంగం పోను పోను నవనవోన్మేషంగా, బహు ముఖంగా వికసించింది. యువకులలో యువకుడుగా వారితో ఆయన చేతులు కలిపి ముందుకు సాగిపోయారు. వివిధ సాహిత్య వేదికలపై నుంచి కడచిన మూడు, నాలుగు దశాబ్దాలుగా ఆయన చేసిన ప్రసంగాలు, వాటిలో వ్యక్తమయిన కవిత్వ తత్వ వివేచన, హేతువాద పటిమ, అభ్యుదయ భావస్ఫూర్తి నేటి యువతరం ఆకళించుకోదగినవి.

వ్యక్తిగా కృష్ణశాస్త్రి మరి లేరు. కాని, కవిగా ఆయనకు మృత్యువు లేదు. ఆయన కవిత తెలుగు భాష వున్నంత కాలం వెలుగొందుతూనే వుంటుంది.

*(ఫిబ్రవరి 26, 1980)*

# మానవతావాది సార్త్ర

ఇతరులకు తత్త్వబోధ చేసేవారు ఎందరైనా వున్నారు. కాని, తమ తాత్విక విశ్వాసాలకు అనుగుణంగా జీవించే వారు అరుదు. ఆ విధంగా తన తాత్విక సిద్ధాంతాలను తన జీవితంలోనే ఆచరించి చూపిన మహా వ్యక్తిగా మొన్న తన 75వ ఏట శాశ్వతంగా కన్ను మూసిన ఫ్రెంచి మేధావి, రచయిత జాఁపోల్ సార్త్రను ప్రపంచం కలకాలం జ్ఞాపకం పెట్టుకుంటుంది.

"దేవుడు లేడు. ఒకవేళ దేవుడు వున్నా, అతడి ఉనికివల్ల మానవుడికి ఒరిగే దేమీ లేదు. మనిషి సర్వ స్వతంత్రుడు. అతడి చర్యలకు అతడే బాధ్యుడు. వాటి ఫలితాలకు కూడా అతడే బాధ్యుడు. మంచి పని చేయాలో, చెడు పని చేయాలో నిర్ణయించుకోవలసిన బాధ్యత అతనిదే. ఈ స్వయం నిర్ణయ స్వేచ్ఛవల్ల మానవుడు అంతులేని ఆవేదన (యాంగ్విష్)కు లోనవుతాడు. ప్రపంచానికి అర్థం లేదు. దానికొక అర్థాన్ని కల్పించవలసిన బాధ్యత మనిషిదే. అతనికి మార్గదర్శకులంటూ ఎవరూ లేరు. తనకు తానే మార్గ దర్శకుడు. మనిషికి మార్గదర్శక సూత్రాలంటూ ఏవీ లేవు. తన మార్గదర్శక సూత్రాలను తానే రూపొందించుకోవాలి. ఒక విధంగా మనిషి స్వేచ్ఛా శాపగ్రస్తుడు....'

ఇటువంటి విచిత్ర భావాలతో 1940 ప్రాంతాలలో ఒక వినూతన తాత్విక సిద్ధాంత మహాసౌధాన్ని నిర్మించిన మేధావి సార్త్ర. అతని తాత్విక చింతన అస్తిత్వవాదం(ఎగ్జిస్టెన్షలిజం) పేరుతో జగత్ప్రసిద్ధమైంది. ఈ శతాబ్దంలో సమకాలికులపై, ముఖ్యంగా సమకాలిక సాహిత్యంపై అంతగా ప్రభావాన్ని ప్రసరించిన తత్వవేత్తలు అరుదు.

సార్త్ర 1965లో నోబెల్ సాహిత్య బహుమతిని తిరస్కరించిన సంఘటన అందరికి విదితమే. బహుమతులు, సన్మానాలు, సనదులు వ్యక్తి స్వేచ్ఛను పరిమితం చేస్తాయని, ఒక వ్యక్తి చేసిన పనులను గౌరవించాలి గాని వ్యక్తిని కాదని సార్త్ర విశ్వాసం. ఈ సందర్భంలోనే ఆయన "జాఁపోల్ సార్త్ర అని సంతకం పెట్టడానికి, జాఁ పోల్ సార్త్ర - నోబెల్ బహుమతి గ్రహీత అని సంతకం పెట్టడానికి ఎంతో తేడా వుంది" అని పేర్కొన్నాడు.

సార్త్ర వట్టి తాత్వికుడు మాత్రమే కాడు, క్రియా వీరుడు కూడా. ద్వితీయ ప్రపంచ యుద్ధంలో ఫ్రెంచి సేనలో చేరి నాజీలతో పోరాడాడు. ఖయిదీగా జర్మనీలో కొన్నాళ్ళున్నాడు. ఆ తర్వాత పారిస్ ప్రతిఘటనోద్యమంలో పాల్గొన్నాడు. ఫ్రెంచి వాడై వుండికూడా ఫ్రెంచి వలస వాదాన్ని తీవ్రంగా నిరసించాడు. అల్జీరియా స్వాతంత్ర్యోద్యమాన్ని బలపరిచాడు. ఇందుకై అతడిని జైలులో పెట్టాలని కొందరు ఒత్తిడి తేగా ప్రెసిడెంట్ డిగోల్ "సార్త్రకూడా ఫ్రాన్సు దేశమే" (సార్త్ర ఈజ్ ఆల్సో ఫ్రాన్స్) అంటూ నిరాకరించాడు.

తాను వ్రాసిన అనేక నాటకాలలో, నవలలలో, కథానికలలో, ముఖ్యంగా తన 'అస్తిత్వ వాద'

తాత్విక గ్రంథాలలో వ్యక్తి స్వేచ్ఛకు అన్నిటి కంటె అగ్రస్థాన మిచ్చిన సార్త్ర చివరి వరకు మార్క్సిస్టుగా, రాజకీయాలలో తీవ్ర సామ్యవాదిగా వుండడం ఒక విశేషం. మార్క్సిజం నిజమైన మానవతావాదానికి దారి తీయగలదని ఆయన విశ్వాసం. ఈ కారణంగా ఆయన ఎన్నో వివాదాలలో చిక్కుకున్నాడు. ఒక తత్వవేత్తగా, మహా రచయితగా చరిత్రలో ఆయన పేరు చిరస్థాయిగా నిలిచి పోతుంది.

*(ఏప్రిల్ 17, 1980)*

# "అమృతవాహిని"

"శ్రీరామ పాదమా! నీ కృప చాలునే!" అనే కృతిలో త్యాగరాజు "అమృతవాహినీ" రాగసుధా రసధారలతో శ్రీరామ పాదాలను అభిషేకించి కీర్తించాడు.

భద్రాద్రి రాముడు తెలుగువారి ఇష్టదైవం. గోదావరి తెలుగువారి అమృతవాహిని.

ఈ అమృత వాహినీ సలిలాలతో భద్రాచల రామ పాదాలను నిజంగా అభిషేకించే అవకాశం తెలుగువారికి లభించనున్నదా?

ఇది ఏనాడో - సుమారు 35 ఏళ్ళనాడు - శొంఠి రామమూర్తిగారు కన్న తీయని కల, పోలవరం సమీపంలో గోదావరిపై ఆనకట్ట కట్టి, లక్షలాది ఎకరాలకు అమృత సేచనం చేయాలని ఆయన ప్రతిపాదించారు. పోలవరం రిజర్వాయరు జలాలు భద్రాచల రామాలయం అంచుల వరకు పరవళ్ళు తొక్కుతూ ప్రవహిస్తాయి. కనుక, దానికి "రామపాదసాగర్ ప్రాజెక్టు" అని ఆయన నామకరణం చేశారు. డాక్టర్ శావేజ్ మొదలైన పేరుపొందిన పలువురు ఇంజనీర్లు ఆ ప్రాజెక్టును కూలంకషంగా సర్వేచేసి, ఆనకట్ట నిర్మాణానికి అనువైన స్థలాన్ని ఎన్నికచేశారు. ప్రాజెక్టు సర్వే మొదలైన పనులకు అప్పటిలో కోటి రూపాయలు ఖర్చు చేశారు కూడా. అన్నీ సిద్ధమైనాయి.

కాని, దురదృష్టవశాత్తు అప్పటి ఉమ్మడి మద్రాసు రాజకీయాలలో, ఆ తర్వాత తెలుగు వారి అశ్రద్ధవల్ల, ప్లానింగ్ కమిషన్‌వారి నిరాదరణ వల్ల ఆ ప్రాజెక్టు ఆలోచన గోదావరిలో కొట్టుకుపోయింది. నాటికి, నేటికి అది తెలుగువారి తీయని కలగా, తీరని కోరికగానే మిగిలిపోయింది.

ఇటీవల గోదావరి నదీజలాల వివాదం ఒక విధంగా పరిష్కారం కావడంతో ఈ ప్రాజెక్టు తిరిగి ఊపిరి పోసుకున్నది. పోలవరం ప్రాజెక్టు పేరుతో, కొన్ని మార్పులు చేర్పులతో దాన్ని చేపట్టాలని ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వం సంకల్పించింది. ఉక్కు ఫ్యాక్టరీ నిర్మాణం జరగనున్న విశాఖపట్టణానికి గోదావరి నీటిని సరఫరా చేయవలసిన ఆవశ్యకత ఈ ప్రాజెక్టు పునఃప్రాణ ప్రతిష్ఠకు ముఖ్య కారణం. దీనిపై రెండేళ్ళనాడు రాష్ట్ర ప్రభుత్వం కేంద్ర జల విద్యుత్ కమిషన్‌కు నివేదిక సమర్పించింది. అయినా, ఇన్నాళ్ళుగా దానికి హర జటాజూటంలోని గంగకు వలె విమోచనం కలుగలేదు.

ఇప్పుడు కేంద్ర జల, విద్యుత్ కమిషన్ పనుపున ఒక నిపుణుల బృందం పోలవరం ప్రాజెక్టు స్థలాన్ని సందర్శించింది. పూర్వం రామపాదసాగర్‌కు ఎంచుకున్న స్థలం వద్దనే ఈ ప్రాజెక్టును కొన్ని మార్పులతో నిర్మించడం సాధ్యమని ఈ బృందం అభిప్రాయపడినట్టు తెలుస్తున్నది.

ఒకప్పుడు రామపాదసాగర్ ప్రాజెక్టు ఆలోచన జరిగినప్పుడు డామ్ పొడుగును 6600

అడుగులుగా నిర్ణయించి, దాన్ని పునాది రాయినుంచి 428 అడుగుల ఎత్తున నిర్మించాలని, దాని వల్ల 587 చదరపు మైళ్ళ విస్తీర్ణంలో జలాశయం ఏర్పడుతుందని, ఇరవై ఏడు లక్షల ఎకరాల భూమికి జలాధారం సమకూర్చవచ్చునని తలపోశారు. అప్పటిలో దానికి కాగల వ్యయం సుమారు 130 కోట్ల రూపాయలని అంచనా వేశారు.

ఇటీవల రాష్ట్ర ప్రభుత్వం చేసిన మార్పుల ఫలితంగా రూపొందిన పథకం ప్రకారం డామ్ పొడుగు 7,780 అడుగులుండగా, ఎత్తు ఇదివరకు అనుకున్న దానికంటె 50-60 అడుగులు తక్కువ వుంటుందట. ప్రాజెక్టు నుంచి కుడి, ఎడమ వైపుల త్రవ్వేకాల్వలవల్ల అటు శ్రీకాకుళం, విశాఖ జిల్లాల నుంచి ఇటు ఉభయ గోదావరులు, కృష్ణా, గుంటూరు జిల్లాల వరకు 18 లక్షల 60 వేల ఎకరాల భూమికి సేద్యపు నీరు లభిస్తుంది. విశాఖపట్టణం భారీ పరిశ్రమలకు కావలసిన నీరు లభించడం మాత్రమే కాక 90 మెగావాట్ల జల విద్యుత్తును కూడా ఉత్పత్తి చేయవచ్చు. పడవల రవాణా సదుపాయాలు సయితం ఏర్పడతాయి.

కాని, ఇప్పుడు ప్రారంభించి నిర్మించాలంటే ఈ ప్రాజెక్టుకు 550 కోట్ల రూపాయల వరకు వ్యయం కాగలదని అంటున్నారు. ఏ ముప్పదేళ్ళనాడో దాన్ని నిర్మించి వుంటే ఇందులో నాల్గవ వంతు ఖర్చు మాత్రమే అయివుండేది. ఇంతేకాక ఇన్నేళ్ళూ అశేష ధాన్యరాసులు దేశానికి లభించివుండేవి.

ఇప్పుడైనా, ఈ బహుళార్థ సాధక పథకాన్ని చేపట్టడం జరుగుతుందా అన్నదే అనుమానం. కేంద్ర నిపుణుల బృందం వచ్చి పరిశీలించి వెళ్ళింది. వారి నివేదిక తయారుకావాలి. దాన్ని ప్లానింగ్ కమిషన్ పరిశీలించి ఆమోదించాలి. ఆ తర్వాత అది కేంద్ర ప్రభుత్వం ఆమోదం పొందాలి. రాష్ట్ర ప్రభుత్వం పని ప్రారంభించాలి. అనుకున్న ప్రకారం నిధుల కేటాయింపు జరగాలి. ఇవన్నీ అనుకున్నట్టు జరుగుతాయా? అమృతవాహిని అయిన గోదావరి జలాలు భద్రాచల రామ పాదాలను అభిషేకిస్తాయా? అవి తెలుగు మాగాణాలలో ప్రవహించి, అమృత ఫలాలు పండిస్తాయా? లేక ఈ ప్రాజెక్టు అలనాటి శొంఠి రామమూర్తిగారి "రామపాదసాగర్" కలవలె కల్లగానే మిగిలిపోతుందా?

ఇంకా ఆలస్యం చేసినకొద్దీ ప్రాజెక్టు వ్యయం మరింత పెరిగిపోవడం మాత్రం ఖాయం. రాష్ట్ర ప్రభుత్వం దీని విషయమై మరింత శ్రద్ధ వహించి నిర్మాణం జరిగేవరకు విశ్రమించబోదని ఆశిస్తున్నాము.

*(జూన్ 8, 1980)*

# కొడవటిగంటి

తెలుగు కథా సాహిత్యంలో కొడవటిగంటి కుటుంబరావు స్థానం అద్వితీయమైనది. ఒక తరం రచయితలపై, ఒక తరం యువకుల ఆలోచనాధోరణిపై ఆయన ప్రభావం అమేయమైనది. ఆయన అస్తమయం అసంఖ్యాకులైన అభిమానులకు అమిత విచారం కలిగిస్తుంది.

తెలుగులో మన కింతవరకు సర్వాంగ పరిపుష్టమైన గొప్ప నాటకం, గొప్ప నవల రాలేదేమోనన్న సంశయానికి తావు లేకపోలేదు. కాని, ఆధునిక కవితలో, ఆధునిక కథలో మాత్రం తెలుగుసాహిత్యం ఏ ఇతర భారతీయ వాఙ్మయానికి తీసిపోదని ఘంటాపథంగా చెప్పవచ్చు. ఇందుకు దోహదం చేసిన కథా రచయితలలో కొడవటిగంటి ఒకరు.

గురజాడ తర్వాత - చలం, చింతా దీక్షితులు, శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి, మొక్కపాటి, మల్లాది మొదలైన వారిది ఒకతరం. ఆ తర్వాత తరానికి కుటుంబరావుగారే నాయకుడు.

చలం తన ప్రపంచానికి కేంద్ర స్థానంలో స్త్రీని నిలబెట్టాడు. స్త్రీస్వాతంత్ర్యం, ముఖ్యంగా సెక్స్ స్వాతంత్ర్యం దృష్టి నుంచి సకల సామాజిక సమస్యలను పరిశీలించాడు. కథా రచనలో ఒక విధంగా ఆయన వారసుడు కొడవటిగంటి. కాని చలం ప్రారంభించిన భావవిప్లవాన్ని ఆయన విశ్వతోముఖంగా విస్తరింప జేశారు. మార్క్సిస్టు సామాజిక దృక్పథాన్ని సంపూర్ణంగా స్వీకరించారు. ఫ్రాయిడ్ మనోవిశ్లేషణలోని సంకుచితత్వాన్ని నిరాకరించి, ఆ ప్రక్రియను మానవుడి సామాజిక వ్యక్తిత్వావగాహనకు వర్తింపజేశారు. మానవుడి ఆర్థిక, రాజకీయ, లైంగిక తదితర సమస్యా సామస్త్యాన్ని తన సాహిత్య వస్తువుగా తీసుకుని తన హేతువాదదృక్పథంనుంచి నిశితంగా, నిర్దాక్షిణ్యంగా, విశ్లేషిస్తూ రచనలు సాగించారు.

ఆయన దృష్టి కథా శిల్పంపై కాదు, భాషా సౌందర్యంపై కాదు. ఆయనను ప్రభావితుడిని చేసిన రచయితలలో బెర్నార్డ్‌షా ఒకడు. షా నాటకాలలో వలె కుటంబరావుగారి కథలలో కూడా భావాలు ప్రధాన పాత్ర వహిస్తాయి. షా శైలీ విన్యాసంలోని వ్యంగ్య వైభవం, హాస్యం, అపహాస్యం, నైశిత్యం - ఇవన్నీ కుటుంబరావుగారి తెలుగు శైలిని పరిపుష్టం చేశాయి. గొప్ప తెలుగువచనం వ్రాస్తున్నట్టు పైకి కనిపించకుండా తెలుగు వచన శైలిని తీర్చిదిద్దిన మన అగ్ర రచయితలలో కుటుంబరావుగారు ఒకరు.

కొడవటిగంటిలో ఒక ముఖ్య విశేషం - ఆయన వలె కరడు కట్టిన హేతువాదులుగానో, తీవ్రవాదులుగానో జీవితాన్ని ప్రారంభించిన అనేకులు జీవిత ద్వితీయార్థంలో ప్రవేశిస్తూనే కాలం తాకిడికి అధ్యాత్మికవాదులుగా, ఛాందస మతవాదులుగా తిరోగమించారు. కుటుంబరావుగారు మాత్రం చివరివరకు హేతువాదిగా, వైజ్ఞానికవాదిగా, మార్క్సిస్టుగా కొనసాగారు. జీవిత చరమ దశకంలో "విప్లవరచయితల సంఘం"లో ప్రముఖ పాత్ర

వహించడంవరకు ఆయన విశ్వాస నైశ్చల్యం కొనసాగింది. తుది దశలో ఆయన దృష్టి అతీంద్రియ ప్రపంచంవైపు మళ్ళకపోలేదు. కాని, దాన్ని సయితం కుటుంబరావుగారు ఒక హేతువాదిగా, తార్కికుడుగా, మార్క్సిస్టుగా పరిశీలించడానికి, అతీంద్రియానుభవ జ్ఞానానికి పూర్తిగా ఆధునిక వైజ్ఞాని కాధారాలను కనుగొనడానికి ప్రయత్నించారు.

తెలుగుపత్రికా రంగానికి ముఖ్యంగా "పీరియాడికల్ జర్నలిజానికి" కుటుంబరావుగారి సేవ సర్వదా స్మరణీయమైనది. ఏ పత్రికలో సంపాదకత్వ బాధ్యత వహించినా ఒక "మిషనరీ" ఉత్సాహంతో పనిచేశారు. తుదివరకు ఆయన దైనందిన రాజకీయ, సాంస్కృతిక, సామాజిక సమస్యలకు ప్రతిస్పందిస్తూ పత్రికలలో శరపరంపరగా వ్రాస్తూ తన ఆలోచనలను ఇతరులతో పంచుకుంటూనే వెళ్ళిపోయారు. ఆయన మరణంతో తెలుగునాడు ఒక మేధావిని, గొప్ప రచయితను, మంచితనం మూర్తీభవించిన మనీషిని కోల్పోయింది.

*(ఆగస్టు 19, 1980)*

# నకిలీయోధులు

ఏ మంచి పని తలపెట్టినా, దాని దుర్వినియోగం తప్పడంలేదు. దానిలో అవినీతి తప్పడంలేదు. దీనితో ఆ మంచిపనిపట్ల ఏవగింపు మాత్రమే మిగులుతున్నది.

స్వాతంత్ర్య సమరంలో పాల్గొన్న వారికి పింఛను రూపేణా ఎంతో కొంత ధనసహాయం చేయాలని ప్రభుత్వం సంకల్పించడమేమిటి? నకిలీ స్వాతంత్ర్య యోధులు కొందరు బయలు దేరి ఆ సౌకర్యాన్ని పొందడానికి ఎగబడడమేమిటి? ఇంతకంటె జుగుప్సాకరమైన ఉదంతం మరొకటి వుండబోదు.

చివరికి ఎవరు అసలు యోధులో, ఎవరు నకిలీ యోధులో తేల్చడం సాధ్యంకాక రాష్ట్ర ప్రభుత్వం రెండు వేల మంది దరఖాస్తుల మంజూరును నిలిపివేసిందట. ఈ విధంగా చేయవలసిన పరిస్థితి ఏర్పడడమే ఎంతో సిగ్గుచేటు.

దేశ స్వాతంత్ర్య సమరంలో ఆనాడు లక్షలాది ప్రజలు పాల్గొన్నారు. వారిలో కొందరు ప్రాణాలు త్యాగం చేశారు. పలువురు కారాగారవాసక్లేశం అనుభవించారు; తమ సర్వస్వం కోల్పోయారు.

ఆనాడు త్యాగాలు చేసిన వారిలో కొందరు స్వాతంత్ర్యానంతరం రాజకీయాలలో ప్రవేశించి ఉన్నత పదవులు అధిష్ఠించారు. కొందరికి సాధారణ పదవులు లభించాయి. పలువురికి అసలు ఏమీ లభించలేదు. వారిలో చాలమంది రాజకీయాలకు ఒక నమస్కారం పెట్టి తమ బాధలు తాము పడ్డారు.

స్వాతంత్ర్యానంతర రాజకీయాలలో మంచి పదవులు పొందిన వారందరు త్యాగాలు చేసినవారు కారు. ఎట్టిత్యాగాలు చేయకుండానే, లేదా నామమాత్రంగా త్యాగాలు చేశామనిపించుకుని పదవులు పొందిన వారెందరో వున్నారు. స్వాతంత్ర్యానంతరం మన రాజకీయాలలో నీతి నిజాయితీ, త్యాగనిరతి, సేవాభావం. మేధాపటిమ, పరిపాలనా సామర్థ్యం మొదలైన విలువలకు ప్రాధాన్యం పోయింది. ధనబలానికి, కులబలానికి ప్రాముఖ్యం హెచ్చింది. ఇవే పదవులకు సోపానాలైనాయి. పదవులు ప్రజాసేవకు సాధనాలుకాక, ధనార్జనకు మార్గాలైనాయి. ఎంత పెద్ద పదవిలో వుంటే అంత పెద్దగా ధనార్జనకు మార్గం సుగమమైంది. పెద్ద పదవులు అలంకరించినవారు కొన్ని తరాలకు సరిపడినంత మూట కట్టడం జరిగింది.

రాజకీయాలు ఇంతగా అవినీతి మయమై పోయిన తర్వాత ఎవరి త్యాగ ఫలితంగా స్వాతంత్ర్య ఫలాన్ని అనుభవిస్తున్నామో ఆ స్వాతంత్ర్య యోధులను విస్మరించడం జరిగిందన్న విమర్శ, తీవ్ర అసంతృప్తి ప్రబలడంలో ఆశ్చర్యం లేదు. ఈ విమర్శలకు సమాధానంగానే ఆ అసంతృప్తిని కొంతవరకైనా తొలగించడానికే, పేదరికంలో మగ్గుతున్న వేలాది

స్వాతంత్ర్యయోధులకు ఆర్థిక సహాయం చేయాలన్న ఆలోచన వచ్చింది. రాజకీయ బాధితుల పేరుతో కొందరికి భూములివ్వడం జరిగింది. ఆ తర్వాత స్వాతంత్ర్య యోధుల పేరుతో ధన సహాయం చేయాలని తలపెట్టడం జరిగింది. ఇది సూత్ర రీత్యా న్యాయమే.

అయితే, మొదటనే పేర్కొన్నట్టు ఏ మంచి పని తలపెట్టినా, దానిలో అవినీతి చోటు చేసుకుంటున్నది. రాజకీయ రంగంలోనేమి, తదితర రంగాలలోనేమి అవినీతి లేని తావులేకుండా పోయినప్పుడు స్వాతంత్ర్యయోధులకు ధనసహాయం విషయంలో కూడా అవినీతి ప్రవేశించడంలో ఆశ్చర్యం లేదు. స్వాతంత్ర్యయోధులకు కేంద్ర ప్రభుత్వం. రాష్ట్ర ప్రభుత్వం నెలవారీ పింఛను లిస్తున్నాయి. ఈ సహాయం నిజంగా స్వాతంత్ర్యయోధులై వుండి, పేదరికంలో మగ్గుతున్న వారికి అందుతుంటే, అందులో అభ్యంతరం చెప్పదగినదేమీ లేదు. కాని, నకిలీ "యోధులకు" కూడా లభిస్తుంటేనే అది అభ్యంతకరమైనది. అది మొత్తం ఈ కార్యక్రమాన్నే అప్రతిష్ఠపాలు చేస్తుంది.

ఇటీవల హైదరాబాద్‌లో జరిగిన స్వాతంత్ర్యయోధుల మహాసభలో విదేశాంగ మంత్రి శ్రీ పి.వి. నరసింహారావు మాట్లాడుతూ పింఛను కోసం దరఖాస్తు పెట్టుకున్న వారిలో చాలా మంది నకిలీయోధులున్నారని వెల్లడించారు. పైగా తన సంతకం ఫోర్జరీ చేసినవారు, ఎన్నో ఇతర విధాలుగా నకిలీ రికార్డులు సృష్టించినవారు వున్నారని ఆయన తెలియజేశారు. కరీంనగర్ జిల్లాలో అటువంటి వారు ఎక్కువమంది వున్నారట. ఈ విధంగా అనుమానితులైనవారి దరఖాస్తులను నిలిపివేయడానికి ఇప్పుడు ప్రభుత్వం నిశ్చయించింది.

నిజంగా నిరుపేదలైన స్వాతంత్ర్యయోధులకు ధన సహాయం చేయడం సూత్ర రీత్యా అభిలషణీయమైనా, నిజమైన స్వాతంత్రయోధులెవరో నిర్ణయించడానికి కొన్ని ఉన్నత ప్రమాణాలను నిర్దేశించడం అవసరం. నామమాత్రంగా జైలుకు వెళ్ళివచ్చినా చాలు నన్నంత వరకు అర్హతలను దిగజార్చడం అసలు ఈ మొత్తం సహాయ కార్యక్రమాన్ని అపహాస్యం పాలుచేస్తుంది. అలా జరగకుండా ప్రభుత్వం తగు జాగ్రత్తలు గైకొనవలసి వుంది.

*(జనవరి 30, 1981)*

# 68 కోట్ల మంది

"త్రింశత్కోటి కంఠ కలకల నినాదకరాళే..." అని సుమారు నూరేళ్ళ క్రిందట బంకిం చటర్జీ తన వందేమాతరం గీతంలో భరతమాతను కీర్తించాడు. అప్పుడు ఇండియా జనాభా సుమారు 30 కోట్లు. ఇప్పుడు త్రింశత్కోటికాదు, ద్విత్రింశత్కోటిని దాటిపోయింది.

అప్పటివలె బర్మా ఇండియాలో భాగంకాదు. పాకిస్తాన్ విడిపోయింది. అయినా, ఇప్పుడు ఇండియా జనాభా 68 కోట్ల పైమాట.

స్వాతంత్ర్య సిద్ధి సమయంలోకూడా మన దేశం జనాభా 34 కోట్లు మాత్రమే. ఇప్పుడు అది రెట్టింపు అయింది.

అప్పటికే మనది నిరుపేద దేశం. "మంది ఎక్కువైతే మజ్జిగ పల్చన" అనే సామెత ప్రకారం జనాభాతోపాటు మన దేశ దారిద్ర్యం కూడా ఇప్పుడు రెట్టింపు అయివుండాలి.

జనాభా జ్యామెట్రికల్ క్రమంలో 1, 2, 4, 8, 16..... ఈ విధంగా పెరిగితే, ఆహారం, తదితరమైన వనరులు అరిత్‌మెటిక్ క్రమంలో 1, 2, 3, 4, 5..... ఈ విధంగా మాత్రమే పెరుగుతాయన్నది మాల్తస్ సూత్రం. ఇది నిజంకాదని పారిశ్రామికంగా తదితర విధాలుగా పురోగమించిన పాశ్చాత్య దేశాలు, జపాన్ వంటి ఆసియా దేశం నిరూపించాయి. కాని ఇండియాలో మాత్రం మాల్తస్ సూత్రం వర్తిస్తున్నట్టే కనబడుతుంది. క్రమంగా జనాభా పెరుగుతున్న కొద్దీ పేదల సంఖ్య కూడా పెరుగుతున్నది. ఇప్పుడు దేశంలో దాదాపు సగం మంది దారిద్ర్యరేఖకు దిగువన జీవితం గడుపుతున్నట్టు అంచనా.

మొన్న వెల్లడైన 1981 జనాభా లెక్కల వివరాలలో పెద్దగా ఆశ్చర్యకరమైన విశేషాలు లేకపోయినా, దేశ ప్రజల ఆర్థిక, సాంఘిక జీవన స్థితిగతులను గురించి శాస్త్రీయ పద్ధతులలో సేకరించిన అనేక వివరాలు మన ప్రణాళికా కర్తలకు అనేక విధాలుగా తోడ్పడగలవనడంలో సందేహం లేదు. ఇంతేకాదు, సామాన్య ప్రజలకు సయితం, మనం ఎక్కడ వున్నాము. ఎక్కడికి పోవలసి వుంది, అందుకు అనుసరించవలసిన మార్గం ఏమిటి అని జిజ్ఞాస చేయడానికి ఆ వివరాలు తోడ్పడతాయి.

ఒక విషయంలో మాత్రం ఆశ్చర్యం కలుగుతుంది. స్వాతంత్ర్య సిద్ధికి ముందు మన జనాభా పెరుగుదల రేటు ఇంత చేటులేదు. అప్పటిలో నూటికి 20 వంతుల లోపున పెరుగుదల. కాని, 1951 నుంచి మన జనసంఖ్య త్వరత్వరగా పెరుగుతూ పోయింది. 1961-71మధ్య జనాభా 24.80 శాతం పెరగగా, క్రిందటి దశాబ్దంలో 24.75 శాతం పెరిగింది.

స్వాతంత్ర్య సిద్ధికి ముందు జనసంఖ్యను గురించిన ఆలోచన ఎవరికీ లేదు. ఆ తర్వాతనే జనాభా పెరుగుదలను అదుపు చేయాలన్న ఆలోచన కలిగింది. అపారమైన ధన వ్యయం చేసి

కుటుంబ నియంత్రణ పథకాలను అమలు చేయడం జరిగింది. అయినా, వాటిని ముమ్మరంగా అమలు చేయడం ప్రారంభమైన తర్వాతనే జనాభా విపరీతంగా పెరగడం ఆశ్చర్యకరం. దీన్ని బట్టి ఆ పథకాలు ఆశించినంత విజయవంతం కాలేదనే అనుకోవాలి.

అయితే, జననాలరేటు పెరగడం వల్లనేకాక, మరణాలరేటు తగ్గడం వల్ల కూడా జనాభా పెరిగి వుండవచ్చునన్నది నిజం. వైద్య, ఆరోగ్య సౌకర్యాలు పెరిగినకొద్దీ మరణాల రేటు సహజంగా తగ్గుతుంది. సగటు ఆయుర్దాయం పెరుగుతుంది. ఇది సంతోషించవలసిన విషయమే కాని, దీనితోపాటు జననాలరేటు మరింతగా - మరణాలరేటుకు దాదాపు సమానంగా - తగ్గించినప్పుడు కాని మన జనాభా పెరుగుదల సమస్య పరిష్కారంకాదు. ఇందుకు కుటుంబ నియంత్రణ పథకాలను మరింత కట్టుదిట్టంగా అమలు జరపడం కంటె మార్గాంతరం లేదు. ఇప్పటి అంచనాల ప్రకారం ఈ శతాబ్దాంతానికి మన జనాభా 95 కోట్ల వరకు పెరగ గలదన్న విషయం గుర్తుంచుకుంటే ఈ పథకాల ఆవశ్యకత బోధపడుతుంది.

ఇక అక్షరాస్యత లెక్కలను చూస్తే ఏమున్నది గర్వకారణ మనిపిస్తుంది. కడచిన మూడు దశాబ్దాలలో అక్షరాస్యుల శాతం రెట్టింపు పెరిగివుండవచ్చుగాని ఇప్పటికి కూడా నూటికి సుమారు 36 మంది మాత్రమే వ్రాయను చదవను నేర్చినవారన్న విషయం మనం ఎంత వెనుకబడి వున్నామో గుర్తుచేస్తున్నది. ఇక ఆంధ్ర ప్రదేశ్ పరిస్థితి ఈ విషయంలో మరింత లజ్జాకరం. జాతీయస్థాయి కంటె మనం చాలా దిగువన వున్నాము. కేరళ సరే, దానిది అక్షరాస్యతలో ఎప్పుడూ అఖిలభారత స్థాయిలోనే పైచేయి. కాని, ఇరుగు పొరుగున గల తమిళనాడు, కర్ణాటక సయితం జాతీయపు సగటుకంటె పైన వుండగా మనం వాటితో పోలికకైనా ఎందుకు రాలేక పోతున్నామనేది మన రాష్ట్ర భాగ్యవిధాతలు ఆత్మ సంశోధన చేసుకోవలసిన విషయం.

మొన్న జనాభా లెక్కల కమిషనర్ వెల్లడించినవి కొద్దిపాటి వివరాలు మాత్రమే. పూర్తి వివరాలు వెల్లడైనప్పుడు దేశ ఆర్థిక, సాంఘిక సమగ్ర స్వరూపం ఆవిష్కృతమవుతుంది. ప్రజల, ప్రభుత్వాల ఆత్మ సంశోధనకు కావలసినన్ని విశేషాలు లభిస్తాయి.

*(మార్చి 20, 1981)*

# "తిట్టు కవిత్వం"

రాష్ట్ర శాసనసభకు వచ్చే మార్చి నెలలో ఎన్నికలు జరగవలసి వుంది. కాని, ఈ లోగానే, ఏ డిసెంబరులోనో ఎన్నికలను జరిపించే అవకాశం కలదని వార్తలు వస్తున్నాయి.

కాని, ఎన్నికలు ఎప్పుడు జరిగినా, ఇంకా తేదీ నిర్ణయం కాకుండానే, రాష్ట్రంలో ఎన్నికలవాతావరణం ప్రారంభమైనట్టుగా కనిపిస్తున్నది. క్రమంగా ప్రచారం జోరు హెచ్చుతున్నది.

ఇందులో తప్పు పట్టవలసినదేమీ లేదు. కాని, ఈ ప్రచారపు జోరులో ఒకరిపై ఒకరు ప్రయోగిస్తున్న "తిట్టు కవిత్వపు" పాలుమాత్రం ఎక్కువై పోతున్నది. ఉద్రేకం కట్టలు తెంచుకుని ప్రవహిస్తున్నది. ఇప్పుడే ఇలా వుంటే, ఇక ఎన్నికలు దగ్గరపడిన కొద్దీ వివిధ రాజకీయ పక్షాల నాయకుల ఉద్రేకం మరెంత భయంకర స్థాయికి పెరిగిపోతుందోనన్న ఆందోళన కలుగుతున్నది.

ఒక పార్టీ విధానాలను మరొకపార్టీ ఎంత తీవ్రంగానైనా విమర్శించవచ్చు. ప్రతిపక్షం ప్రభుత్వ చర్యలను, వైఫల్యాలను ఎంత ఘాటుగానైనా విమర్శించవచ్చు. కాని, ఆ విమర్శ సహేతుక విమర్శా స్థాయిని దాటి వ్యక్తిగత నిందగా పరిణమిస్తే అది ఆరోగ్యకరమైన ప్రచారం అనిపించుకోదు. ఒకరిని "శుంఠ" అని మరొకరు దూషిస్తే రెండవవారు "నీవు శుంఠన్నర శుంఠవు"అని దూషించే అవకాశం ఎప్పుడూ వుంటుంది. చివరికి ఉద్రేకాలు పెరిగి పెరిగి ఆ తర్వాత హానికర పరిణామాలకు దారి తీయగల ప్రమాదం కూడా వుంటుంది.

"తెలుగుదేశం" పార్టీ నాయకుడు శ్రీ ఎన్.టి.రామారావు రాష్ట్రంలో వివిధ ప్రదేశాలలో జరుపుతున్న ప్రచార సరళి, ఆయన ప్రసంగాలకు కాంగ్రెస్(ఐ) నాయకులు ప్రతిస్పందిస్తున్న తీరుచూడగా ఎవరికైనా బాధ కలగక తప్పదు. శ్రీ ఎన్.టి.ఆర్. రాష్ట్రంలో అసంఖ్యాక ప్రజలకు అభిమాన పాత్రుడైన సినిమా నటుడు. ఆయన రాజకీయ రంగంలోకి రావడంతో ఆయన పట్ల ప్రజల "గ్లామర్" ఇంకా పెరిగినట్టు కనబడుతున్నది. నిజమే.

కాని, ఈ "గ్లామర్"ను ఆధారం చేసుకుని శ్రీ ఎన్.టి.రామారావు పాలక పక్షాన్ని, దాని నాయకులను దూషిస్తున్న తీరు ఒక రాజకీయ నాయకునికి, రాజనీతిజ్ఞునికి తగునా అని విస్తుపోవలసినట్టుగా వుంటున్నది. రాజకీయ రంగంలోనికి రాగానే శ్రీ ఎన్.టి.ఆర్ తీవ్రమైన ఆవేశంలో, ఉద్వేగంతో ప్రసంగించడం, పరుషమైన పదజాలంతో పాలకపక్ష నాయకులను దూషించడం అలవాటు చేసుకున్నారు. పాలకపక్ష నాయకులను ఎంత ఆవేశంతో, పరుషంగా దూషిస్తే అంతగా జనం చప్పట్లు కొడతారని, అంతగా తన నాయకత్వం స్థాయి పెరుగుతుందని ఆయన భ్రమపడుతున్నట్టున్నారు.

రాజకీయ నాయకులకు ప్రజా సమస్యలపట్ల ఆవేశం అవసరమే. కాని, ఆవేశం ఆలోచనను అణచివేస్తుంది. ఏ ప్రజా సమస్యనూ ఎవరూ కేవలం ఆవేశంతో, ఉద్రేకంతో, పరుషదూషణ

పదజాలంతో పరిష్కరించలేరు. ఆలోచన కొరవడినవారే మితిమీరిన ఆవేశానికి లోనవుతారు; హేయ దూషణల స్థాయికి దిగజారతారు. ముఖ్యంగా అధికారంలోకి, పదవిలోకి రాదలచిన రాజకీయ నాయకుడు ప్రజా సమస్యలను మరింత సావధానంగా ఆవేశరహితంగా ఆలోచించడం అలవరచుకోవాలి. కేవలం ఆవేశపడి, చిందులుతొక్కి, శ్రోతలచేత చప్పట్లు కొట్టించుకోనడమే తన ధ్యేయమనిపించేటట్టు, ఉద్రేకంతో ప్రత్యర్థులను తిట్టినతిట్టు తిట్టకుండా తిట్టిపోస్తే ఆయన రాజనీతిజ్ఞత, ప్రజా సమస్యలపట్ల సావధాన మనస్కత ఏ పాటివని శంకించవలసి వస్తుంది. ప్రజలను ఉద్రేకపరిచే విధంగా ఉపన్యాసాలు గుప్పించడం ఒక కళ కావచ్చు కాని, కేవలం ఆ కళ తప్ప తన దగ్గర మరేమీ లేదేమో ననిపించే విధంగా ప్రవర్తించడం బాధాకరమే.

తెలుగు దేశం పార్టీ నాయకుల ప్రసంగాలే శుష్కోద్రేక భరితాలుగా వున్నవనుకుంటే, వాటికి కాంగ్రెస్ (ఐ) నాయకులలో కొందరిస్తున్న సమాధానాలు మరింత జుగుప్సాకరంగా వున్నాయి. ఇందుకు సరికొత్త ఉదాహరణ రాష్ట్ర చేనేత శాఖ మంత్రి శ్రీ గోవర్ధనరెడ్డి మొన్న "శ్రీ ఎన్.టి.ఆర్. శ్రీమతి ఇందిరా గాంధి కాలి గోటికి కూడా సరిరా"రని చేసినవ్యాఖ్య. "శ్రీమతి ఇందిరవంటి అత్తలుంటే కోడళ్ళ పని క్లోజ్" అని, ఇంకా ఏవేవో వ్యక్తిగత దూషణ వ్యాఖ్యలను శ్రీ ఎన్.టి.ఆర్. చేసి వుండవచ్చు. కాని, వాటికి పాలకపక్షంలో బాధ్యతా యుతమైన పదవులలో వున్న వారు మరింత హుందాగా ప్రతిస్పందించాలి. ఒకరిని చూసి మరొకరు రెచ్చిపోతే, ఇరువురి ధోరణి ప్రజలకు ఏవగింపు కలిగించక తప్పదు.

ఎంత రాజకీయ ప్రత్యర్థుల మధ్యనైనా విమర్శలకు ఒక హద్దును పెట్టుకోవాలి. ఆ హద్దును మీరితే, ఏ ప్రజల సంక్షేమం పేరుతో ఆ హద్దును మీరుతున్నా మంటున్నారో ఆ ప్రజలకే మేలుకలగదు. చివరికి వృథా ఆవేశకావేషాలు, వాటి దుష్ఫలితాలే మిగులుతాయి. ఏమైనా వారుగాని, వీరుగాని ప్రచారంలో కొన్ని హద్దులను, మర్యాదలను, ఉత్తమ ప్రజాస్వామిక సంప్రదాయాలను పాటించడం మంచిది.అన్ని హద్దులు, మర్యాదలు, సంప్రదాయాలు మంటగలిపిన వారిపట్ల వాటిని మేమెందుకు పాటించాలని ఉభయులలో ఏ ఒక్కరు అన్నప్పటికి, రెండవ వారు కూడా అదే మాట అనే ప్రమాదం వున్నది. ఇది రాజ్యా లేలుతున్న, లేదా రాజ్యాలు ఏలదలచిన రాజనీతిజ్ఞుల పద్ధతి ఎన్నటికీ కానేరదు.

*(అక్టోబరు 16, 1982)*

# మద్రాసుకు కృష్ణనీరు

పేచీ పెట్టదలుచుకుంటే ఎంత చిన్న విషయంపైన అయినా పేచీ పెట్టవచ్చు. కక్ష పెంచదలుచుకుంటే అందుకు ఎంత స్వల్ప సమస్య అయినా చాలు.

మద్రాసుకు మంచినీటి కొరత తీర్చడానికి కృష్ణనుంచి కొంత నీటిని సరఫరా చేయాలన్న నిర్ణయంపై వచ్చిన వివాదం ఇటువంటిదే. ఈ ప్రతిపాదన ఇప్పటిదికాదు. ఆరేళ్ళనాటిది. అప్పటిలో కృష్ణానదీ జలాల వివాద పరిష్కారంలో భాగంగా మూడు రాష్ట్రాల ప్రభుత్వాలు- అవి ఆంధ్రప్రదేశ్, మహారాష్ట్ర, కర్ణాటక ప్రభుత్వాలు - తమ తమ వాటాలలో అయిదు శతకోటి ఘనపుటడుగుల చొప్పున నీటిని మద్రాసు నగరానికి మళ్ళించడానికి అంగీకరించాయి. కాని క్రమంగా అది వివాదగ్రస్తమైంది. మనకే సేద్యపు నీరు తక్కువగా వున్నప్పుడు, మంచినీటి కొరత వున్నప్పుడు, రాయలసీమ తరచుగా అనావృష్టి బాధిత మవుతున్నప్పుడు, పొరుగు రాష్ట్రానికి మనం ఎందుకు మన వాటాలో నుంచి నీరు ఇవ్వాలి? అని కొందరు పేచీ లేవదీశారు. ఇది దురదృష్టకరమైన వివాదమని చెప్పక తప్పదు.

నిజమే. మనకే కరవుగా వున్నప్పుడు మనం మరొకరికి నీటిని దానం చేయడం కొంత బాధగానే వుంటుంది. కాని, అలా దానం చేస్తున్న నీరు మరీ ఎక్కువేమీ కాదు కదా? పైగా, మద్రాసుకు ఆంధ్ర ప్రదేశ్ ఒక్కటే కాదు - కర్ణాటక, మహారాష్ట్ర కూడా తమ వాటాలలో నుంచి అంతే పరిమాణంలో నీటిని త్యాగం చేయడానికి ఉదారబుద్ధితో ఒప్పుకున్నాయి. వాటికి కూడా నీటి కరవు వున్నది. అయినప్పటికీ, అవి కొంత నీటిని వదలుకొనడానికి అంగీకరించాయి. ఇక మనం మాత్రమే పేచీకి దిగి ఏమైనాసరే మేము మద్రాసుకు సహాయం చేయబోమని భీష్మించుకు కూర్చుంటే సముచితంగా వుంటుందా?

ప్రాంతీయ తత్వాన్ని రెచ్చగొట్టే పార్టీలు, వ్యక్తులు ప్రతిరాష్ట్రంలోను వుంటారు. ఇప్పుడు ఈ ప్రాంతీయతత్వం పరాకాష్ఠను పంజాబ్‌లో చూస్తూనే వున్నాము. జాతీయ సమైక్యానికి, దేశసమగ్రతా భావానికి ప్రాంతీయ తత్వం గొడ్డలిపెట్టు. ఏ ప్రాంతానికి ఆ ప్రాంతం - ఇప్పుడే కాదు. ఎప్పుడైనా సరే. - మరొకరిపై ఆధారపడకుండా, ఎవ్వరితోను సంబంధంలేకుండా, మనుగడ సాగించలేదు. ఈ రోజులలో ఇండియాలోని ఏ రాష్ట్రం కూడా ఏ మరొక రాష్ట్రంతోను సంబంధంలేకుండా వుండడం సాధ్యంకాదు. నదీజలాలు, విద్యుచ్ఛక్తి, పారిశ్రామికోత్పత్తులు, పెట్రోలు, ఆహార ధాన్యాలు - ఇలా ప్రతి విషయంలోను రాష్ట్రాల మధ్య ఆదాన ప్రదానాలు జరగవలసిందే. ఈనాడు ప్రపంచంలోనే ఏ దేశం మరొక దేశంతో సంబంధం లేకుండా మనుగడ సాగించలేకపోతున్నది. ఉదాహరణకు, సోవియెట్ యూనియన్ అమెరికా నుంచి ఆహార ధాన్యాలు దిగుమతి చేసుకొనక తప్పడం లేదు. అమెరికా ఒపెక్

దేశాల నుంచి పెట్రోలియం దిగుమతి చేసుకొనక తప్పడం లేదు. సంపన్న దేశాల పరిస్థితే ఇలా వుంటే, ఇక బడుగుదేశాలు ఇతరులపై ఆధారపడకుండా అసలే మనలేవు. కేవలం వ్యాపార దృష్టితోనే కాకుండా ఒక్కొక్కసారి త్యాగవైఖరితో కూడా దేశాల మధ్యనేమి, ఒక దేశంలోనే వివిధ ప్రాంతాల మధ్యనేమి ఆదాన ప్రదానాలు జరగవలసి వుంటుంది. నిత్యం వర్షాభావం వల్ల నీటి కొరతకు లోనౌతున్న మద్రాసు నగరంలోని లక్షలాది ప్రజలకు ఆ కొరతను తీర్చే ఉదారదృష్టితోనే అప్పటిలో ప్రధాని సూచన మేరకు కృష్ణనీటిలో తమ వాటాల నుంచి 15 శతకోటి ఘనపుటడుగుల నీటిని అందజేయడానికి మూడు రాష్ట్రాలు అంగీకరించాయి. ఇప్పుడు ఎవరైనా దాన్ని విమర్శించడం సంకుచిత ప్రాంతీయతత్వం తప్ప మరొకటి కాబోదు.

ఒప్పందం ఆరేళ్ళనాడు కుదిరినా, కృష్ణనీటి మళ్ళింపు పథకం ప్రారంభం కావడంలో జాప్యం జరిగింది. వ్యయం ఎవరెంత పెట్టుకోవాలి, కాల్వ ద్వారా నీటిని మళ్ళించాలా, గొట్టాల ద్వారానా, దానికి కావలసిన ధనాన్ని ఎలా సర్దుబాటుచేయడం మొదలైన అనేక విషయాలపై నిర్ణయం ఆలస్యమైంది. ఇప్పుడు వివిధ సాంకేతిక సమస్యలపై ఆంధ్ర ప్రదేశ్, తమిళనాడు ప్రభుత్వాల మధ్య ఒక ముసాయిదా ఒప్పందం కుదిరింది. దాన్ని ఉభయ రాష్ట్రాల ముఖ్యమంత్రులు పరిశీలించి మరి కొద్ది రోజులలో హైదరాబాదులో సంతకాలు చేయబోతున్నారు.

శ్రీశైలం రిజర్వాయరు నుంచి సోమశిలవరకు, అక్కడి నుంచి మద్రాసు వరకు నీటిని కాల్వ ద్వారా తీసుకుపోవడం ఈ ప్రాజెక్టు ఉద్దేశం. అయితే, ఇది కేవలం మద్రాసుకు మంచినీటిని సరఫరా చేయడానికి మాత్రమే పరిమితం చేయబోవడం లేదు. దాన్ని త్రోవలో మన రాష్ట్రంలోని భూములకు ఇరిగేషన్ సౌకర్యాన్ని కల్పించడానికి కూడా ఉపయోగిస్తారు. ఈ విధంగా అదనంగా మూడు లక్షల ఎకరాలకు నీటిని అందజేయవచ్చునట.

ఈ కాల్వ త్రవ్వకానికి ధన సహాయం చేయవలసిందిగా కేంద్రాన్ని రాష్ట్ర ప్రభుత్వం కోరింది. తన అవసరంకొద్దీ ఈ కోర్కెను తమిళనాడు ప్రభుత్వం కూడా బలపరచింది. కృష్ణ నీటి మళ్ళింపు ప్రతిపాదనకు ఆంధ్ర ప్రదేశ్ ఒప్పుకోవడం కేంద్రం సూచన మేరకు జరిగిందే కనుక దాని అమలుకు ధనసహాయం చేయడం కేంద్రం తన విధిగా భావించగలదని, సత్వరం సహాయం చేయగలదని ఆశించవచ్చు. ఇప్పుడు పని మొదలుపెడితే ఈ ప్రాజెక్టు ఆరేళ్లలో పూర్తికాగలదని అంటున్నారు. అయితే, ఇది పూర్తిగా నిధులను సమకూర్చడంపై ఆధారపడివుంది. నిధుల కొరత పేరుతో ఆలస్యం చేస్తే ఇప్పుడు 416 కోట్లుగా అంచనా వేస్తున్న వ్యయం క్రమంగా పెరిగిపోయి, ఈ ప్రాజెక్టు అలవిమాలినదిగా తయారయ్యే ప్రమాదం వున్నది.

*(నవంబర్ 7, 1982)*

# వినోబా అస్తమయం

అవి తెలంగాణాలో భూస్వాముల దోపిడీకి, దురాగతాలకు వ్యతిరేకంగా కమ్యూనిస్టుపార్టీ నాయకత్వాన హింసాపూరిత ఉద్యమం సాగుతున్న రోజులు. సాయుధ విప్లవం ద్వారా తప్ప సమాజంలో పరివర్తన అసాధ్యమని మేధావులతో సహా ప్రజలలో పలువురు నమ్మక తప్పని పరిస్థితి ఏర్పడిన రోజులు.

తెలంగాణాలో జరుగుతున్న సాయుధ రక్తపాత సహిత ఉద్యమానికి హృదయం క్షోభించి సమాజ పరివర్తనకు అది మార్గం కాదని, గాంధీజీ బోధించిన సత్యా హింసల మార్గం మరొకటి వున్నదని రుజువు చేయడానికై వజ్ర సంకల్పంతో ఆచార్య వినోబా భావే రంగంలోకి దిగారు. ఇందుకోసం ఆయన ప్రారంభించిన ప్రత్యామ్నాయ ఉద్యమం పేరే భూదాన యజ్ఞం. దీన్ని ఆయన 1951 ఏప్రిల్‌లో నల్గొండజిల్లాలోని పోచంపల్లి గ్రామంలో ఒక భూస్వామి ఇచ్చిన నూరెకరాల భూమిని పేద ప్రజలకు పంచడానికి స్వీకరించడం ద్వారా ప్రారంభించారు.

నాటి నుంచి ఒకటిన్నర దశాబ్దానికి పైగా ప్రేమ, అహింస ప్రాతిపదికలుగా గల భూదానోద్యమ సందేశాన్ని వినిపిస్తూ ఆచార్య వినోబా భావే 64 వేల కిలోమీటర్ల దూరం పాదయాత్ర చేశారు. దేశంలోని ప్రతి రాష్ట్రంలోను అనేక గ్రామాలను సందర్శించారు. "కొద్దిమంది వద్ద భూసంపద పోగుపడడం మిగిలినవారి కడుపుమంటకు కారణమవుతుంది. అది హింసాదౌర్జన్యోద్యమాలకు దారితీస్తుంది. దాన్ని వారించడానికి భూస్వాములు తమకు కొద్ది భూమిని మిగుల్చుకుని మిగిలిన దాన్ని స్వచ్ఛందంగా పేదలకు దానం చేయాలి. రక్తపాతం లేకుండా భూసంస్కరణలను సాధించడానికి ఇదొక్కటే మార్గం-" అని భూస్వామ్య వర్గాలకు హితబోధచేసి వారిలో హృదయ పరివర్తన కలిగించడం ద్వారా సమాజ పరివర్తన సాధించడానికి వినోబాజీ సంవత్సరాల తరబడి కృషి చేశారు.

ఆనాడు ఆయన ప్రారంభించిన ఆ ఉద్యమం గాంధేయ సిద్ధాంతాలకు అనుగుణమైనది. గాంధీజీ సన్నిహిత ప్రియశిష్యులలో వినోబాజీ ఒకరు. "నెహ్రూ నా రాజకీయ వారసుడు. వినోబా నా ఆధ్యాత్మిక వారసుడు" అని గాంధీజీ పేర్కొన్నారు. గాంధీజీ నిర్యాణానంతరం నెహ్రూ నవభారత నిర్మాణానికి, ముఖ్యంగా సాంఘిక న్యాయ సాధనకు కొంత వరకే గాంధీజీ నిర్మాణ కార్యక్రమాన్ని, ఎక్కువగా ఆధునిక పారిశ్రామికాభివృద్ధి మార్గాన్ని కలగాపులగం చేసి ప్రభుత్వ యంత్రాంగం ద్వారా ప్రయత్నించారు. ఈ ప్రయోగంలో ఆయన పూర్తిగా కృతకృత్యుడు కాలేకపోయారని వేరే చెప్పనక్కరలేదు.

కాగా, గాంధీజీ ఆధ్యాత్మిక వారసత్వాన్ని పుణికి పుచ్చుకున్న వినోబాజీ నూటికి నూరుపాళ్ళు గాంధేయ మార్గాన్ని అనుసరించారు. అయితే, ఆయన సయితం కృతకృత్యుడు కాలేకపోయారన్న విషయం స్పష్టమే. అయిదు కోట్ల ఎకరాల భూమిని స్వచ్ఛంద విరాళ మార్గాన సేకరించాలని ఆయన లక్ష్యం. దానిలో ఆయన సేకరించగలిగింది 45 లక్షల ఎకరాలు మాత్రమే కాని, దానిలో కూడా అధిక భాగం

వాస్తవ భూ దానాలుగా కాక వాగ్దానాలుగానే మిగిలి పోయింది. ఆయన భూదానోద్యమం ఆచరణలో నీరుకారిపోయింది. అదంతా చాలవరకు వృథా ప్రయాసగానే పరిణమించింది.

అయితే, గాంధి, నెహ్రూ, వినోబాల వంటి మహాపురుషుల వ్యక్తిత్వాలను వారి కృషి సంపూర్ణ సాఫల్యం ద్వారా కొలవకూడదు. వారు అవిశ్రాంతంగా, అచంచల విశ్వాసంతో సాగించిన కృషి, దాని వెనుక వారి చిత్త శుద్ధి, సామాజిక స్పృహపై వారి ప్రభావం ద్వారానే వారి వ్యక్తిత్వపు ఔన్నత్యాన్ని నిర్ణయించాలి. ఆ దృష్టితో చూచినప్పుడు వినోబాజీ కృషిలోని ఔన్నత్యం బోధపడుతుంది. నెహ్రూ ప్రభుత్వ యంత్రాంగం ద్వారా సాధించదలచిన సమాజ పరివర్తనను వినోబాజీ తానొక్కడుగా ఆధ్యాత్మికమార్గాన సాధించదలచారు. ఇరువురి కృషి పూర్తికాలేదు. కాని, తమ ఉద్యమాల ద్వారా సమాజ పరివర్తన ఆవశ్యకతను గుర్తింపజేశారు. ముఖ్యంగా సాంఘిక అసమానత్వాల నిర్మూలన ఆవశ్యకతను జాతి మరి మరచి పోవడానికి వీలులేని విధంగా చైతన్యస్ఫూర్తి కలిగించారు. దానిలోనే వారి జీవిత సాఫల్యం ఇమిడివున్నది.

గాంధీజీకి ప్రియశిష్యుడైనందుకు వినోబాకు గాంధీజీతో పెక్కు పోలికలున్నాయి. ఆయనవలె ఈయనది కూడా వజ్రకఠిన సంకల్పం. కనుకనే వామపక్షాలేకాక, మితవాద పక్షాలవారు, మేధావులు తన ఉద్యమాలను - భూదానం, చంబల్ లోయ దొంగల ముఠాలలో హృదయ పరివర్తన సాధన, గోవధ నిషేధం ఇత్యాదులను - ఎంతగా హేళన చేసినా వినోబాజీ సంకల్పం చెక్కు చెదరలేదు. అకుంఠిత విశ్వాసంతో వాటిని కొనసాగించారు. కనుకనే, ఆయన సిద్ధాంతాలతో ఏకీభవించలేకపోయినవారు కూడా, ఆయన నైతికౌన్నత్యాన్ని, విశ్వాసబలాన్ని చూసి ఓహో అని తల ఊపక తప్పలేదు. ఒక మహావ్యక్తిగా, ఆధునిక మహర్షిగా గౌరవించక తప్పలేదు. గాంధీజీ తర్వాత గాంధీజీ అంతటి మహాత్ముడుగా మన్నించక తప్పలేదు. కనుకనే 1920 ప్రాంతాలలో గాంధీజీ సత్యాగ్రహోద్యమం వలె 1950 ప్రాంతాలలో వినోబాజీ భూదానోద్యమం యావత్ప్రపంచ దృష్టిని ఆకర్షించింది. ఆయన ఆధ్యాత్మిక ప్రయోగ ఫలితాలకోసం అమితాసక్తితో నిరీక్షించేటట్టు చేసింది.

వినోబాజీ ఒక మహాయోగివలె జీవించారు, ఒక మహాయోగివలె మరణించారు. గుండెపోటు వచ్చిన తర్వాత వారం రోజులకు పైగా ఆయన ఔషధ సేవను నిరాకరించారు, అన్నపానాలను కూడా తిరస్కరించారు. ప్రాయోపవేశం అనదగిన పద్ధతిలో మృత్యువుకోసం నిరీక్షిస్తున్నట్టుగా తుదిరోజులు గడిపారు. జీవితేచ్ఛ పూర్తిగా నశించిపోయినట్టుగా ప్రవర్తించారు.

ఆయన అస్తమయంతో గాంధియుగంనాటి మరొక మహాజ్యోతి ఆరిపోయింది. గాంధియుగంనాటి మరొక అవశేషం అంతరించింది. ఆ యుగం వేరు. అది స్వార్థంకంటె త్యాగానికి, పదవికంటె ప్రజాసేవకు ప్రాముఖ్యమిచ్చిన యుగం. నైతికౌన్నత్యానికి, సచ్ఛీలానికి, ఉన్నతాదర్శాలకు పట్టాభిషేకం చేసినయుగం. ఆ యుగం దాదాపుగా అంతరించి పోయినట్టే.

కాగా మారిపోయిన ఈ ప్రపంచంలో తన మనుగడ మరివ్యర్థమన్న నిరాశతోనే, నిస్పృహతోనే వినోబాజీ ప్రాయోపవేశం చేసి నిర్యాణం చెందివుంటారా? కావచ్చు. అయినా, ఎనభై ఎనిమిదేళ్ళ నిండు జీవితాన్ని కొన్ని విశ్వాసాలకు, సిద్ధాంతాలకు అంకితంచేసి సార్థకంగా జీవించిన కర్మయోగిగా, ధన్యజీవిగా ఆయన నవభారత చరిత్రలో యశఃకాయులుగా కలకాలం వెలుగొందుతారు.

*(నవంబర్ 17, 1982)*

# “స్పీడ్ బ్రేకర్”అవసరం కాదా?

**లే**డికి లేచిందే పరుగు” అని సామెత. తెలుగుదేశం ప్రభుత్వం అధికారానికి రావడమే తడవుగా పరుగు ప్రారంభించింది.

తాము చెప్పినవన్నీ త్వరత్వరగా చేయదలచుకున్నామని, వేగంగా పోవడమే తమ అభిమతమని ముఖ్యమంత్రి ఇదివరకే ప్రకటించారు.

వేగంగా పోవడం మంచిదే. వేగిరపాటు తగదని మాత్రమే ఎవరైనా చెప్పగలిగింది. ముందు వెనుకలు చూడకుండా తొందర పాటుగా ప్రయాణాలు చేయడం వల్లనే రోడ్డు ప్రమాదాలు జరిగేది. అందుకే రోడ్లపై అక్కడక్కడ “స్పీడ్ బ్రేకర్లు” అవసరమవుతాయి.

శాసనమండలి ““స్పీడ్ బ్రేకర్” వంటిది. ప్రభుత్వం తొందరపాటుతో చేసే నిర్ణయాలను మరొకసారి సావధానంగా చర్చించి తగు సూచనలు చేయడమే శాసనమండలి కర్తవ్యం.

ఈ “స్పీడ్ బ్రేకర్”ను తొలగించాలని తెలుగుదేశం ప్రభుత్వం కోరుతున్నది. శాసనమండలిని రద్దు చేయాలని కేంద్రానికి సిఫారసు చేసే తీర్మానాన్ని శాసనసభలో ప్రవేశపెట్టింది. శాసనసభలో తెలుగుదేశం పార్టీకి వల్లమాలిన మెజారిటీ వున్నది. ప్రభుత్వం ఏది తలచుకుంటే అది, మంచి చెడులతో నిమిత్తం లేకుండా అసెంబ్లీ ఆమోదం పొందుతుంది. శాసనమండలి రద్దుకు సిఫారసు చేసే తీర్మానం కూడా అసెంబ్లీ ఆమోదాన్ని ఇట్టే పొందింది.

ఈ ఆలోచన తెలుగుదేశం పార్టీకి మొదటినుంచి లేదు. ఎన్నికలకు ముందు ఈ ఆలోచన రాలేదు. ఎన్నికలలో గెలిచిన తర్వాతనే - శాసనమండలిలో తమకు ప్రాతినిధ్యమే వుండదన్న విషయం–హఠాత్తుగా గుర్తుకు వచ్చింది. అసెంబ్లీలో తమకు బ్రహ్మాండమైన మెజారిటీ వుండగా శాసనమండలిలో అసలు ప్రాతినిధ్యమే లేకపోవడమా?

దీన్ని తమకు అవమానకర పరిస్థితిగా తెలుగుదేశం నాయకత్వం భావించివుండాలి. దానితో మొత్తం శాసనమండలినే రద్దు చేసేస్తే ఈ చిక్కు తొలగిపోతుందనే ఆలోచన వచ్చి వుంటుంది. వెనువెంటనే దానికి అనుగుణంగా తీర్మానం ప్రవేశ పెట్టి అసెంబ్లీ ఆమోదాన్ని పొందడం జరిగింది.

పైగా, శాసనమండలిలో వున్నవారు ఉద్దండులు, రాజకీయంగా కాకలు తీరినవారు, ప్రభుత్వాన్ని, అధికార పక్షాన్ని చర్చలలో, వాదోపవాదాలలో పల్టీలు కొట్టించగలవారు. ఇటీవలి శాసనమండలి కార్యక్రమాలలో ఇది ప్రస్ఫుటంగా వెల్లడైంది. అటువంటి అవకాశాన్ని వారి కెందు కివ్వాలి?

అయితే, ప్రభుత్వ పక్షం ఈ కారణా లేమీ చెప్పడం లేదు. శాసనమండలిని దుర్వినియోగం చేయడం జరిగిందని, అసెంబ్లీ ఎన్నికలలో ఓడిపోయినవారికి, తమ ఇష్టులకు పునరావాసం

కల్పించడానికే కాంగ్రెస్ (ఐ) దాన్ని వాడుకున్నదని ఆరోపించింది. దానికి చాలా ఖర్చు అవుతున్నదని, రద్దుచేస్తే అదంతా ఆదా అవుతుందని మరొక కారణం చూపించింది. శాసనమండలి అజాగళస్తనమని, పైగా దానివల్ల శాసన నిర్మాణ కార్యక్రమాలు [illegible]గా ఆలస్యమవుతాయని, ఆరు రాష్ట్రాలలో తప్ప మిగిలిన వాటిలో శాసనమండలి లేదు కదా అ[illegible] మరి కొన్ని కారణాలను చూపించింది.

కాంగ్రెస్ (ఐ)కి అధిక సంఖ్యాబలం వున్న శాసనమండలిని ఎందుకు కొనసాగనివ్వాలన్న కక్ష, రాజకీయానుభవం లేని కొత్త ప్రభుత్వం శాసనమండలిని ఎదుర్కోవడం కష్టం కాగలదన్న భయం తప్ప. నిజానికి పైన పేర్కొన్నవన్నీ పసలేని కారణాలే. శాసనమండలి సభ్యత్వాన్ని దుర్వినియోగం చేయడం జరిగిందంటే దాన్ని మున్ముందు చక్కదిద్దడం అసాధ్యమా? ఏడాదికి దాని క్రింద అవుతున్న పాతిక, ముప్పది లక్షల ఖర్చు మన రాష్ట్రం భరించలేనంత ఎక్కువా? ఇక కొన్ని రాష్ట్రాలలో శాసనమండలి లేకపోవడానికి కారణం వాటి శాసనసభలు శాసనమండలి ఏర్పాటుకు అవసరమైన దానికంటె చిన్నవికావడంకాదా? కొన్ని రాష్ట్రాలు శాసన మండలిని రద్దుచేసుకుని వుండవచ్చు. కాని, అదే సమయంలో అయిదు రాష్ట్రాలు – మన ఇరుగు పొరుగునగల తమిళనాడు, కర్ణాటక, మహారాష్ట్రతోసహా - శాసనమండలిని కొనసాగిస్తున్నాయన్న విషయాన్ని ఎందుకు గుర్తించరాదు?

పోతే, శాసనసభకు శాసన మండలి ఏ విధంగాను అడ్డంకి కాదు. శాసనసభ ఏ శాసనం చేయదలచినా శాసనమండలి కొద్ది నెలలపాటు ఆలస్యం చేయగలదేమో తప్ప, పూర్తిగా అడ్డుకట్ట వేయలేదు. ఆ కొద్ది నెలలైనా ఆలస్యం చేయదలిస్తే, అది శాసనసభ చేసిన నిర్ణయాలలో తొందరపాటు ఏదైనా వున్నదేమోనని మరొకసారి సావధానంగా ఆలోచించడానికి, చర్చించడానికి తోడ్పడగలవనే రాజ్యాంగ నిర్మాతలు కేంద్రంలో రాజ్యసభవలె రాష్ట్రాలలో శాసన మండలులకు అవకాశం కల్పించారు. దీని కొక తాజా ఉదాహరణ - మాజీ లెజిస్లేటర్లలో కేవలం పెన్షన్‌పైనే ఆధారపడి జీవిస్తున్నవారికి పెన్షన్ రద్దుచేయరాదన్న సూచన శాసన మండలిలో రాగా, దాన్ని పరిశీలించడానికి న్యాయశాఖ మంత్రి హామీ ఇచ్చారు.

ఈ విధమైన పునఃపరిశీలనావకాశం కల్పించడమే శాసనమండలి ప్రధాన ప్రయోజనం. శాసన నిర్మాణం ఎంతో బాధ్యతతో కూడిన విషయమైనందున ఇది తేలికగా త్రోసిపుచ్చదగిన ప్రయోజనం కాదు. ఏమైనా, శాసనమండలి రద్దుచేయాలన్న సిఫారసు తొందరపాటుతో చేసినదిగానే పరిగణించాలి.

*( మార్చి 26,1983)*

# సర్కారియా కమీషన్

"రాష్ట్రాలకు ఎంత స్వయం పరిపాలనా ప్రతిపత్తి వుండాలో రాజ్యాంగం స్పష్టంగా నిర్దేశించింది. అందుచేత ఇందుకోసం రాజ్యాంగాన్ని సవరించవలసిన అవసరంలేదు. దీనిపై చర్చకు సమావేశం కూడా అక్కరలేదు."

-ఈ మాటలను ఇప్పుడు ఉదాహరిస్తే, ఇవి ప్రతిపక్షాల దృష్టిలో నిరంకుశత్వానికి మారుపేరైన కాంగ్రెస్(ఐ) నాయకత్వం చెప్పిన మాటలుగా తోచవచ్చు. కాని, ఇది కాంగ్రెస్ (ఐ) అభిప్రాయం కాదు; శ్రీమతి గాంధి అభిప్రాయం కాదు.

ఈ అభిప్రాయాన్ని నిర్ద్వంద్వంగా, కుండ బద్దలు కొట్టినట్టు వెల్లడించినవారు జనతా ప్రభుత్వం కేంద్రంలో అధికారంలో వుండగా 1978 జనవరి 22 వ తేదీన అప్పటి ప్రధాని శ్రీ మొరార్జీ దేశాయి. పశ్చిమబెంగాల్ ముఖ్యమంత్రి శ్రీ జ్యోతిబసు కేంద్రం-రాష్ట్రాల మధ్య సంబంధాలను పునస్సమీక్ష చేయడానికి, రాష్ట్రాలకు ఇతోధిక స్వయం పరిపాలనా ప్రతిపత్తి ఇవ్వాలన్న సూచనను చర్చించడానికి ఒక సమావేశం ఏర్పాటుచేయాలని కోరిన విషయాన్ని తన దృష్టికి తీసుకురాగా శ్రీ మొరార్జీదేశాయి పై అభిప్రాయాన్ని వెల్లడించారు.

అది తన వ్యక్తిగతాభిప్రాయమని ఆయన అప్పుడు పేర్కొనకపోలేదు. కాని, అది ఆయన ప్రభుత్వ వైఖరి కూడా అనే విషయం మరి నెల రోజులలోనే స్పష్టమైంది. లోక్‌సభలో ఫిబ్రవరి 22వ తేదీన అప్పటి హోంశాఖ సహాయ మంత్రి శ్రీ ధనిక్ లాల్ మండల్ ఒక ప్రకటన చేస్తూ, ఈ విషయం మరింత విస్పష్టంగా ప్రకటించారు. కేంద్రానికి, రాష్ట్రాలకు మధ్య ఇప్పుడు గాని, ముమ్ముందుగాని ఏ సమస్య వచ్చినా దాన్ని పరిష్కరించడానికి ఇప్పటి రాజ్యాంగ నిబంధనలు సరిపోతాయని, దానికోసం రాజ్యాంగాన్ని సవరించనక్కరలేదని, ఈ విషయం చర్చించడానికి ఎట్టి సమావేశం అక్కరలేదని ఆయన చెప్పారు.

కేంద్రం-రాష్ట్రాల మధ్య సంబంధాలను పునస్సమీక్ష చేయడానికి, రాష్ట్రాలకు ఇతోధిక స్వయం పరిపాలనాధికారాలు ఇవ్వడానికి అన్ని పార్టీలు సుముఖంగా వుండగా ఒక్క కాంగ్రెస్(ఐ) మాత్రమే వ్యతిరేకిస్తుందని ఆరోపించేవారు పై విషయాలను గుర్తించడం అవసరం. ఇంతేకాదు. జనతాపార్టీ కేంద్రంలో అధికారంలో వుండగా ఈ విషయమై ఒక వైఖరిని అవలంబించినట్టు, కేంద్రంలో అధికార భ్రష్టత్వం చెందిన తర్వాత ఇప్పుడు మరొక వైఖరిని అవలంబిస్తున్నట్టు కూడా గమనించక తప్పదు.

ఎందుకంటే, 1978లో శ్రీ మొరార్జీదేశాయి పై విధంగా తన అభిప్రాయాన్ని వ్యక్తం చేసిన బెంగుళూరులోనే ఇటీవల దక్షిణాది ముఖ్యమంత్రుల సమావేశం జరిగింది. ఆ సమావేశాన్ని ఏర్పాటు చేసిన జనతాపార్టీ అగ్రనాయకుడు, కర్ణాటక ముఖ్యమంత్రి శ్రీ రామకృష్ణ హెగ్డే ఇప్పుడు

కేంద్రం-రాష్ట్రాల సంబంధాలను పునస్సమీక్ష చేయాలని కోరుతున్నారు. రాష్ట్రాలకు ఆర్థికంగా, రాజకీయంగా కేంద్రంవల్ల అన్యాయం జరుగుతున్న దంటున్నారు. ఆ అన్యాయాన్ని తొలగించాలని ఉద్ఘాటిస్తున్నారు. మరి కేంద్రంలో తమ పార్టీ అధికారంలో వున్నప్పుడు ఈ సమస్యపై భిన్న వైఖరి ఎందుకు అవలంబించారో మాత్రం చెప్పడం లేదు.

ఏమైనా, ఇప్పుడు కేంద్రం-రాష్ట్రాల మధ్య సంబంధాలను సమీక్ష చేసి, తగు మార్పులు సూచించడానికి జస్టిస్ సర్కారియా అధ్యక్షతన ఒక కమిషన్‌ను నియమిస్తున్నట్టు ప్రధాని శ్రీమతి గాంధి ప్రకటించారు. బెంగుళూరులో దక్షిణాది ముఖ్యమంత్రుల సమావేశం జరిగిన కొద్ది రోజులకే ఈ ప్రకటన వెలువడింది కనుక దాని ప్రభావమే ఇది అని కొందరు భుజాలు ఎగురవేయ వచ్చు. అకాలీలు దక్షిణాది ముఖ్యమంత్రులు కోరినదానికంటె ఎక్కువగా స్వయం పరిపాలనా ప్రతిపత్తిని కోరడమేకాక, దాని కోసం చేస్తున్న ఆందోళనను ఉధృతం చేయగలమని చేసిన హెచ్చరిక దృష్ట్యా ఈనిర్ణయం జరిగిందని మరి కొందరు వ్యాఖ్యానించవచ్చు. పశ్చిమ బెంగాల్‌లో అధికారంలో వున్న మార్క్సిస్టు పార్టీ కూడా ఇదే విషయమై ఒత్తిడి చేస్తున్నది కనుక దాని ప్రభావం పనిచేసిందని కొందరనవచ్చు.

బహుశా ఈ ఒత్తిడులన్నీ పనిచేయడంవల్లనే కేంద్రం సర్కారియా కమిషన్‌ను నియమించిందని ఎవరు భావించినా తప్పు కాదేమో. ఇంతకాలం త్రోసిపుచ్చుతూ, వాయిదావేస్తూ వచ్చిన కేంద్రం-రాష్ట్రాల సంబంధాల సమస్య పునస్సమీక్షకు తగు సమయం వచ్చిందని కేంద్ర ప్రభుత్వం ఇప్పుడు భావించడం, ఒక కమిషన్‌ను నియమించడం సంతోషించదగు విషయం, ఇది సమర్థనీయమైన, సముచితమైన నిర్ణయం.

అయితే, ఇల్లు అలకగానే పండుగ కానట్టు, కమిషన్ నియామకం జరగగానే ఏమీ ఒరగదు. దాని పరిశీలనకు ఏయే అంశాలను అప్పగించబోతున్నారనే దానిపై, దాని నివేదిక ఎంత త్వరగా వెలువడుతుందనే దానిపై, ఆ నివేదికపై ఎంత త్వరగా కేంద్రం చర్యలు గైకొనబోతున్నదనే దానిపై కమిషన్ సార్థకత ఆధారపడి వుంటుంది.

రాష్ట్రాలు బలంగా వుంటేనే కేంద్రం బలంగా వుంటుంది. కేంద్రం బలంగా వుంటేనే రాష్ట్రాలు బలంగా వుంటాయి. నిజమే. కాని రెండూ బలంగా వుండే విధంగానే కాక, మొత్తం దేశం, జాతి బలానికి భంగం కలగని విధంగా ఆ రెండింటి మధ్య సంబంధాలు రూపొందాలి. దీన్ని ఏ విధంగా సాధించాలన్న దానిపై దేశంలో ఎంత విస్తృతంగా చర్చ జరిగితే అంత మంచిది. సర్కారియా కమిషన్‌కు నివేదించనున్న పరిశీలనాంశాలపై అట్టి విస్తృత చర్చ జరగగలదని ఆశిస్తున్నాము.

*(మార్చి 27, 1983)*

# పెండింగ్ కేసులు

"న్యాయం జరగడంలో ఆలస్యమైతే న్యాయం జరగనట్టే లెక్క" అని ఇంగ్లీషులో ఒక నానుడి వున్నది. మన న్యాయస్థానాలలో కేసుల పరిష్కారంలో జరుగుతున్న ఆలస్యాలను చూస్తే ఇండియాలో న్యాయాన్ని గగనకుసుమంగా పరిగణించాలి.

"కేసులో ఓడిపోయినవాడు కోర్టులో ఏడిస్తే, గెలిచినవాడు ఇంటికి వచ్చి ఏడ్చాడట" అని తెలుగు సామెత. కోర్టులో కేసు దాఖలైన తర్వాత నుంచి తుదితీర్పు వచ్చేవరకు జరిగే ఆలస్యాన్ని బట్టి, ఆలస్యం వల్ల అయ్యే వ్యయాన్నిబట్టి ఈ సామెత వచ్చింది.

ఒక ఏడాది, రెండేళ్ళు కాదు, కోర్టులలో దశాబ్దాల తరబడి తెమలని కేసులు మన న్యాయస్థానాలలో కోకొల్లలు. కొన్ని సందర్భాలలో కక్షిదార్లు ఇరువురూ చనిపోయిన తర్వాత ఎప్పుడో తుది తీర్పు రావడం కూడా జరుగుతూ వుంటుంది.

కోర్టుకు ఎక్కనే కూడదు, ఎక్కిన తర్వాత వ్యయానికి, ఆలస్యానికి వెనుదీయకూడదు. ఇదీ మన దేశంలో పరిస్థితి.

కోర్టులలో ఆలస్యాలకు ఒక ముఖ్యకారణం నానాటికి "లిటిగేషన్" పెరుగుతుండగా, దానికి తగినట్టు న్యాయమూర్తుల సంఖ్య పెరగకపోవడం. అందుచేతనే దావా దాఖలైన తర్వాత విచారణకు రావడానికి సయితం విపరీతమైన ఆలస్యం అవుతూ వుంటుంది.

రాజస్థాన్ హైకోర్టు న్యాయమూర్తి శ్రీ జి.ఎమ్. లోథా నిరుడు అక్టోబరులో కొన్ని ఆసక్తికరమైన విశేషాలను సేకరించి వెల్లడించారు. 1951లో మన హైకోర్టులలో 54 వేల కేసులు పెండింగ్‌లో వున్నాయట. 1982 నాటికి వీటి సంఖ్య ఎనిమిది లక్షలు. హైకోర్టులలోగాని, క్రింది న్యాయ స్థానాలలోగాని మొత్తం 110 లక్షల సివిల్, క్రిమినల్ కేసులు పెండింగ్‌లో వున్నాయి. కాగా, 1951లో మొత్తం జడ్జీల సంఖ్య 141 కాగా. 1982 నాటికి వారి సంఖ్య 367 మాత్రమే అయింది. అంటే మూడు దశాబ్దాలలోను మూడురెట్లుకూడా పెరగలేదు.

ఏళ్ళ తరబడి తెమలని కేసులసంఖ్య కూడా గణనీయంగానే వుంటున్నది. నిరుడు మేనెలనాటికి సుప్రీంకోర్టులో పేరుకుపోయిన కేసులలో అయిదేళ్ళకుపైగా పెండింగ్‌లో వున్నవి 2588 కేసులట. హైకోర్టులలో అలా అయిదేళ్ళకుపైగా పెండింగ్‌లో వున్నవి 1,04,923 కేసులు. ముఖ్యంగా అలహాబాదు, కలకత్తా హైకోర్టులు ఇటువంటి పెండింగ్ కేసులకు మరీ ప్రసిద్ధి.

ఈ శోచనీయ పరిస్థితికి బహుశా విసిగిపోవడంవల్లనే శ్రీ చరణ్‌లాల్ సాహు అనే సుప్రీంకోర్టు న్యాయవాది జడ్జీల కొరత వల్ల పేరుకుపోతున్న కేసులను గురించి సుప్రీంకోర్టులో ఒక పిటిషన్ దాఖలుచేసి వుంటారు. ఆ పిటిషన్‌పై విచారణను జులై 23వ తేదీకి వాయిదా వేస్తూ సుప్రీంకోర్టు డివిజన్ బెంచి మొన్న కేంద్ర ప్రభుత్వానికి ఒక ముఖ్యసూచన చేసింది. వివిధ

న్యాయస్థానాలలో పర్మనెంట్ న్యాయమూర్తులు, అదనపు న్యాయమూర్తుల పదవులకు ఏర్పడిన ఖాళీలను భర్తీ చేయడానికి ప్రభుత్వం అగ్రప్రాధాన్య మివ్వాలన్నది ఆ సూచన.

ప్రభుత్వానికి ఇటువంటి సూచన అందడం ఇది మొదటిసారి కాదు, పెక్కు న్యాయస్థానాలలో ఖాళీలు ఏర్పడిన తర్వాత వెంటనే కాకపోయినా, కొన్ని నెలల తర్వాతనైనా వాటిని భర్తీ చేయకుండా మిగిల్చి వేయడం పరిపాటి అయింది. దీనివల్ల అటు న్యాయస్థానాలపై, న్యాయమూర్తులపై పని ఒత్తిడి, ఇటు ప్రజలలో అసంతృప్తి పెరుగుతున్నాయి.

నిరుడు సెప్టెంబరు, క్రిందటి నెలాఖరు మధ్యకాలంలో 31 మంది పర్మనెంట్, 11 మంది అడిషనల్ జడ్జీలను నియమించారు. అడిషనల్ జడ్జీలను 47 మందిని పర్మనెంట్ చేశారు. అయినా ఇప్పటికీ ఇంకా 47 పర్మనెంట్, 39 అడిషనల్ జడ్జీల పదవులు ఖాళీగా వున్నాయని ప్రభుత్వ ప్రకటన తెలుపుతున్నది. న్యాయమూర్తులను నియమించడానికి, బదిలీ చేయడానికి ప్రభుత్వానికి పూర్తి అధికారం వున్నదని సుప్రీంకోర్టు అంగీకరించింది కనుక ఖాళీలను భర్తీ చేయడంలో ఆలస్యాలకు ఏదో సాకుచెప్పే అవకాశంకూడా ప్రభుత్వానికి లేదు, సుప్రీంకోర్టు సూచన ప్రకారం ఖాళీలు భర్తీ చేయడం అవసరం.

పోతే, పెండింగ్ కేసుల పరిష్కారానికి ఒక మార్గంగా తాత్కాలిక న్యాయమూర్తులను నియమించాలన్న ఆలోచన కూడా ప్రభుత్వం ఒకప్పుడు చేసింది. ఆ ప్రతిపాదన ఎందుకు అమలు చేయరాదో తెలియదు.

కేసుల పరిష్కారంలో జాప్యానికి కారణాలుగా హెబియస్ కార్పస్ పిటిషన్లు, ఎన్నికలు, పన్నులకు సంబంధించిన అప్పీళ్ళు, క్రిమినల్ అప్పీళ్ళు మొదలయినవాటితో ఎక్కువకాలం గడచిపోవడాన్ని న్యాయస్థానాలు పేర్కొంటూ వుంటాయి. రాజ్యాంగ సంబంధమైన పిటిషన్ల విచారణకు ప్రత్యేక న్యాయస్థానాన్ని ఏర్పాటుచేయడం మంచిదేమోనన్న సూచన ఇదివరకొకసారి వచ్చింది కాని, దాన్ని పలువురు వ్యతిరేకించడం జరిగింది. ఏమైనా, న్యాయస్థానాలలో అసంఖ్యాకంగా పేరుకుపోతున్న కేసుల సమస్యను ప్రభుత్వం తీవ్రంగా పరిశీలించి పరిష్కార మార్గాన్ని ఆలోచించడం అవసరం.

*( మే 5, 1983)*

# మహిళలపై అత్యాచారాలు

ఒకవైపు దారిదోపిడీలు, ఇళ్ళదోపిడీలు, మరొక వైపు మహిళలపై అత్యాచారాలు తెల్లవారిన తరువాత ఏరోజు ఏ పత్రిక తిరగవేసినా ఇవే వార్తలు, రాష్ట్రంలో ఎక్కడో ఒకచోట ఈ దురాగతాలు జరగని రోజులేదు, శాంతిభద్రతల పరిస్థితి అంతగా అధ్వాన్నమై పోయింది.

కొన్ని కొన్ని వార్తలు చదువుతుంటే ఎవరికైనా హృదయం కరిగిపోతుంది. జుగుప్సాకరం, అమానుషం, పైశాచికం అనదగిన పద్ధతిలో నేరాలు జరుగుతున్నాయి. ముఖ్యంగా వరకట్నపు హత్యలు, మానభంగాల వార్తలు కూడా వస్తూ వుంటాయి. బందిపోటు దొంగతనాలవలె బందిపోటు మానభంగాలు కూడా సర్వసామాన్యమైపోయాయి. విద్యార్థినులు, నడివయస్సు మహిళలేకాక ముక్కుపచ్చలారని బాలికలపై సయితం ఆత్యాచారాలు జరుగుతున్నాయి. ఈ వార్తలు చదువుతున్నప్పుడు మనం జీవిస్తున్నది నాగరిక సమాజంలోనేనా అని సందేహం కలుగుతుంది.

మొత్తంపై నేటి సమాజంలో స్త్రీలకు రక్షణ, భద్రత కరువై పోయాయి. ఒంటరిగా స్త్రీలు ఏ సమయంలోనైనా పట్టణాలలో, పల్లెలలో సంచరించడానికి వీలులేని పరిస్థితు లేర్పడుతున్నాయి. మరొకవైపు కట్నం తేలేదని భర్త, అత్తమామలు పెట్టే హింసలు భరించలేక స్త్రీలు ఆత్మహత్యలకు పాల్పడుతున్న సంఘటనలు, హత్యచేసి, ఆత్మహత్యగా చిత్రించడానికి ప్రయత్నిస్తున్న సంఘటనలు కూడా జరుగుతున్నాయి. హత్యకాక ఆత్మహత్యేనని ఒకవేళ న్యాయస్థానాలలో తేలినప్పటికి ఒక అబల ఆత్మహత్యకు పాల్పడడానికి కారణమైన పరిస్థితులనుగాని, కారకులనుగాని ఎవరూ పట్టించుకొనడం లేదు.

జనాభాలో సగం మంది మహిళలే అయినా, రాజ్యాంగంలో స్త్రీలకు అన్ని హక్కులూవున్నా, ఆచరణలో వారిని రెండవ తరగతి పౌరులుగానే చూడడం జరుగుతున్నది. మానభంగ నేరాలకు గాని, వరకట్నపు హత్యలకు, హింసలకు, ఇతర విధాలుగా పెట్టే బాధలకుగాని ముఖ్యకారణం స్త్రీలపట్ల పురుషుల ఆధిక్య భావం, ఈ ఆధిక్య భావంతోనే నేటి సమాజంలో స్త్రీని అన్ని విధాలా అవమానించడం, బాధించడం, వేధించడం జరుగుతున్నది.

స్త్రీల రక్షణకు, భద్రతకు చట్టాల కొరతలేదు. అయినా అవి వారికి అక్కరకురావడం లేదు, మనరాష్ట్రంలో తెలుగు దేశం పార్టీ ఏర్పడిన తర్వాత దాని నాయకుడు శ్రీ ఎన్.టి. రామారావు స్త్రీలకు పూర్తిరక్షణ కల్పించడం, వారు నిర్భయంగా అర్థరాత్రి వేళలలోనైనాసరే వీధులలో సంచరించగల విధంగా భద్రతను చేకూర్చడం తమ ధ్యేయమని వాగ్దానం చేశారు. ఆయన చిత్తశుద్ధిని, స్త్రీల హీన పరిస్థితిపట్ల ఆయన ఆవేదనను ఎవరూ శంకించలేరు, అయినా, నూతన ప్రభుత్వం వచ్చిన తరువాత కూడా స్త్రీలపట్ల అత్యాచారాలు యథేచ్ఛగా జరిగిపోతున్నాయి.

ఇప్పటి పరిస్థితికి, ఇంతకుముందు పరిస్థితికి లేశమైనా తేడా కనపడడంలేదు. స్త్రీలపట్ల కొన్ని అత్యాచారాల వార్తలను చదివిన తరువాతనే తన హృదయం వికలమై, ఒక విధమైన వైరాగ్య భావంతో సన్యాసం స్వీకరించాలన్న ఆలోచన కలిగిందని శ్రీ రామారావు కడచిన ఉగాదినాడు చెప్పారు. ఈ ప్రకటన ఆయన ఆవేదనతోపాటు నిస్సహాయతను కూడా తెలియజేస్తున్నది.

తెలుగుదేశం ప్రభుత్వం అధికారానికి వచ్చి కొద్ది నెలలే అయింది కనుక, శాంతిభద్రతల పరిస్థితి వెంటనే చక్కబరచలేక పోయినందుకు తప్పుపట్టడం భావ్యం కాదు. అత్యాచారాలను అరికట్టడం ఒక్కనాటితో జరగగల పని కూడా కాదు. కాని, ప్రజల ధన, మాన, ప్రాణాలకు భద్రత కల్పించడం, ముఖ్యంగా మహిళలకు రక్షణను కల్పించడం ప్రభుత్వపు ప్రప్రథమ కర్తవ్యం కావాలి.

మహిళల అభ్యున్నతికి దోహదకరమని తాను భావించిన కొన్ని చర్యలను తెలుగుదేశం ప్రభుత్వం ఇప్పటికే చేపట్టింది. మహిళా విశ్వవిద్యాలయం స్థాపన, ఆస్తిలో మహిళలకు సమాన భాగం కల్పించే బిల్లు ఇందుకు ఉదాహరణలు. కాని, ఇవి కేవలం శాసనం ద్వారా సులభంగా అమలుచేయదగిన చర్యలు, శాంతిభద్రతల పరిరక్షణ, మహిళలపట్ల అత్యాచారాల నివారణ కేవలం శాసనాల ద్వారా అమలుకాగల పనులు కాదు, ప్రభుత్వపు సామర్థ్యానికి అవి గీటురాళ్లు. వీటిని నెరవేర్చడానికి తన ఎన్నికల వాగ్దానాల మేరకు ప్రభుత్వం ఏమి చేయబోతున్నది?

*(మే 8, 1983)*

# యుగకర్త నిర్యాణం

శ్రీశ్రీ లేని ఆధునికాంధ్ర కవిత్వాన్ని ఊహించుకోవడం కష్టం. అర్థ శతాబ్దిపాటు ఆయన తెలుగు కవిత్వాన్ని శాసించాడు. వందలాది యువకవులకు దేశికుడు, పథనిర్దేశకుడు అయ్యాడు. అక్షరాలా అసంఖ్యాక పాఠకులకు అభిమాన కవి అయ్యాడు.

తెలుగు కవిత్వంలో ఒక ఉజ్వల యుగానికి కర్త శ్రీశ్రీ. ఆయన మరణంతో ఆ యుగం అంతం కాబోవడంలేదు. తెలుగు కవిత్వం రానున్న తరాలలో ఎన్ని మలుపులు తిరిగినా, దానిపై ఆయన ప్రభావం ప్రత్యక్షంగానో, పరోక్షంగానో కొనసాగుతుంది.

ఆధునికాంధ్ర సాహిత్యానికి ఆదివైతాళికుడు గురజాడ. ఆధునికత్వానికి ఆయన తలుపులు తెరిచాడు. ఆంధ్ర సరస్వతికి ఆయన "ముత్యాల సరాలు" సంతరించిన సంవత్సరమే శ్రీశ్రీ ప్రభవించాడు. గురజాడ అడుగుజాడలో మునుముందుకు సాగిపోయాడు.

శ్రీశ్రీ కళ్ళు తెరిచేనాటికి తెలుగులో భావ కవితా మార్గానిదే ప్రాబల్యం. దాని ప్రభావంలోనే శ్రీశ్రీ తనకవిత్వ సౌధానికి పునాదులు నిర్మించుకున్నాడు. ఆరోజులలో విశ్వనాథ, కృష్ణశాస్త్రి ప్రభృతుల రచనలకు ప్రతిధ్వను లనదగిన వృత్తాలు, గీతాలు రచించాడు. అనతికాలంలోనే ఆయనకు దానిపై మొగం మొత్తింది. పూర్తిగా తనదే అనిపించుకోదగిన నూతన వ్యక్తిత్వానికై అన్వేషించాడు. ఆ అన్వేషణ ఫలితమే 1933లో ఆయన రచించిన "నేనుసైతం ప్రపంచాగ్నికి సమిధ నొక్కటి ఆహుతిచ్చాను.."అని ప్రారంభమయ్యే అపూర్వ గీతం. ఆధునికుల వ్యష్టివాదానికి, ప్రాచీనుల సమష్టి వాదానికి అవినాభావాన్ని అంత కవితాత్మకంగా సంభావించిన గీతం సాహిత్య చరిత్రలోనే కనబడదు. పాత కొత్తలకు వారధి వంటి ఆ గీతానికి ఇది స్వర్ణోత్సవ సంవత్సరం కూడా.

ఆ మరుసటి సంవత్సరమే శ్రీశ్రీ పూర్తిగా నూతన మార్గానికి మరలి "మరో ప్రపంచం మరో ప్రపంచం మరో ప్రపంచం పిలిచింది..." అనే సుప్రసిద్ధ గీతంతో ఒక నవశకాన్ని ఆవిష్కరించాడు. ముద్దుకృష్ణగారి 'జ్వాల'లో ప్రచురితమైన ఆ గీతం ఆనాడు గొప్ప సంచలనం కలిగించింది. ఎందరో యువకవులకు స్ఫూర్తి నిచ్చింది. తెలుగులో అభ్యుదయ కవితాస్రవంతికి అది జన్మగీతమైంది.

ఆ తర్వాత శ్రీశ్రీ మరి వెనుదిరిగి చూడలేదు. మునుముందుకే ప్రయాణించాడు. తెలుగునాట అప్పుడప్పుడే వామపక్ష భావాలు వ్యాపిస్తున్నాయి. ఆ భావాల ప్రభావం శ్రీశ్రీపై పడింది. ఒకవైపు మార్క్సిస్టు దార్శనికతను పుణికి పుచ్చుకున్నాడు. మరొక వైపు సంఘంలో దగాపడిన తమ్ముల బాధల గాథలు ఆకళించుకున్నాడు. వేరొకవైపు ప్రాచీనాధునాతనాంధ్ర సాహిత్యావలోడనం వల్ల కలిగిన వ్యుత్పత్తి, భావుకత వుండనే వున్నాయి. ఇంకొకవైపు పాశ్చాత్య

వాఙ్మయ మథనం వల్ల కలిగిన ఆధునిక దృక్పథం వున్నది. ఇన్ని ప్రభావాల సమ్మేళనం నుంచి తర్వాత కాలంలోయుగకర్తగా గణనకెక్కిన శ్రీశ్రీ ఆవిర్భవించాడు.

"మహాప్రస్థానం" గీతసంపుటి తెలుగు ఆధునిక కవిత్వంలో ఒక మైలురాయి. దాని తర్వాత శ్రీశ్రీ ఎన్నో కవితా ఖండికలు, వచన రచనలు- ప్రయోగాత్మకమైనవి, ప్రయోజనాత్మకమైనవి, ప్రచారాత్మకమైనవి - రచించాడు. వాటిలో ఆయన గాఢ ప్రతిభ, విలక్షణ వ్యక్తిత్వ ముద్ర ప్రస్ఫుటంగా ప్రత్యక్షమవుతాయి. కాని, అనంతర కాలంలో ఎన్ని వ్రాసినా "మహాప్రస్థానం" గీతాలలో ఆయన అందుకున్న ప్రతిభా శిఖరాల ఔన్నత్యం ఈనాటికి కూడా పఠితలను ఆశ్చర్య పరుస్తుంది.

ఒక తాత్త్విక సిద్ధాంతాన్ని కవితామయంగా పలకడం సాధారణులకు సాధ్యం కాదు. ఆ విధంగా మార్క్సిస్టు సిద్ధాంతాన్ని కవితాత్మకంగా పలికిన వారిలో ముఖ్యుడుగా జర్మన్ కవి బెర్టాల్ట్ బ్రెక్ట్‌ను పేర్కొంటారు. తిరిగి తెలుగులో శ్రీశ్రీ ఆ "ఫీట్" చేశాడు. "ఏదేశ చరిత్రచూచినా ఏ మున్నది గర్వకారణం - నరజాతి చరిత్ర సమస్తం పర పీడన పరాయణత్వం" అని ప్రారంభమయ్యే గీతం"కమ్యూనిస్టు మ్యానిఫెస్టో"లో "ఇప్పటివరకు నడిచిన సమాజ చరిత్ర అంతా వర్గ సంఘర్షణల చరిత్ర అని ధ్వనించే ప్రారంభ వాక్యాలను కవనీకరించినట్టు వుంటుంది". "కాదేదీ కవిత కనర్హం, ఔనౌను శిల్పమనర్ఘం" అనే పాదాలతోకూడిన శ్రీశ్రీ రచన "ఋక్కులు" రమ్యమైనదైనా, జుగుప్సితమైనదైనా, ఏదైనా కవి భావుక భావ్యమానమై రసస్ఫోరక మవుతుందని సూత్రీకరించే సంస్కృతాలంకారిక శ్లోకానికి ఆధునిక రూపంవలె భాసిస్తుంది.

"ఏకో రసః కరుణ ఏవ" అని భవభూతి వాక్యం. అన్ని నదులు సముద్రంలో విలీనమైనట్టు అన్ని రసాలు కరుణ రసంలో పర్యవసిస్తాయి. శ్రీశ్రీ కవితలో స్థూల దృష్టికి ఎంతరౌద్రం, బీభత్సం కనిపించినా అంతర్లీనంగా కరుణ రసం ప్రవహిస్తూనే వుంటుంది; మానవతావాదం ప్రచలిస్తూనే వుంటుంది. "మానవుడే నా సందేశం, మనుష్యుడే నా సంగీతం"అని ఎలుగెత్తి చాటిన కవి శ్రీశ్రీ.

తన రచనలలో లోకం ప్రతిఫలించాలని, తన గీతాన్ని తన జాతి జనులు పాడుకునే మంత్రంగా మ్రోగించాలని, తన ఆకాశాలను లోకానికి చేరువగా, తన ఆదర్శాలను సోదరులంతా పంచుకునే వెలుగుల రవ్వలజడిగా కురిపించాలని జీవితమంతా ఒక తపస్సుగా గడిపిన మహాకవి శ్రీశ్రీ. ఆయన మహాప్రస్థానం చేసినా ఆయన కవితకు, ఆదర్శాలకు "మహాప్రస్థానం" లేదు. ఏ వెలుగులకో, ఏ స్వప్నానికో, ఏ దిగ్విజయానికో మార్గసూచికలై అవి మనలను నిత్యం మంత్రిస్తూనే వుంటాయి, ఆమంత్రిస్తూనే వుంటాయి.

*(జూన్ 17, 1983)*

# వధూ దహనకాండ

పూర్వం కంటె అన్ని రకాల నేరాలు పెరిగాయి. కాని, స్త్రీలపై అత్యాచారాలతో కూడిన నేరాలు ఎంతో ఎక్కువగా పెరిగి పోయినట్టు కనిపిస్తున్నది. ఏ రోజు చూచినా, మానభంగాల వార్తలే; నవ వధువుల హత్యా వార్తలే; ఆత్మహత్యల వార్తలే.

దేశంలో ఎందుకింతగా నేర వాతావరణం పెరిగిపోయింది? నైతికమైన విలువలు ఎందుకింతగా విలుప్తమైపోయాయి? ముఖ్యంగా స్త్రీలను వేధించడం, బాధించడం, అమానుషంగా హింసించడం, మానభంగంచేసి వినోదించడం ఎందుకింతగా ఎక్కువైపోయింది?

అన్నిటికంటె విచారకరమైన విషయం-స్త్రీలపై అత్యాచారాలు అతి తరుచుగా జరగడంవల్ల అవి ప్రజల మనస్సులను కదిలించలేకపోతున్నాయి. ఇవి ఎప్పుడూ జరిగేవేలే అనే నిర్లిప్తభావాన్ని కలగజేస్తున్నాయి. వీటికిక నివారణోపాయమే లేదన్న ఉదాసీన భావానికి కారణాలవుతున్నాయి. మనస్సులను మొద్దు బారేటట్టు చేస్తున్నాయి.

వరకట్నాల సమస్యనే తీసుకోండి. ఎప్పుడో ఏ చరిత్రకందని కాలంలోనో అవి ఒక వేడుకగా ప్రారంభమై వుంటాయి. రానురాను వరకట్నం ఒక ఆచారమైంది, దురాచారమైంది. నిర్బంధపు నిబంధన అయిపోయింది.

మానభంగం నేరాలకు ముఖ్యకారణం పురుషాహంకారమని ఆధునిక మనస్తత్వ పరిశోధకులు చెబుతున్నారు. అబల అయిన స్త్రీని మానభంగం చేసి వినోదించడం పురుషుని కొక వేడుక.

వరకట్న దురాచారానికి కూడా ఈ పురుషాహంకారమే ముఖ్యకారణం. తాను పురుషుడు, అధికుడు, కనుక తనకు భార్యగా రాగోరే స్త్రీ కట్న కానుకలతో వచ్చి, తనకు పాదదాసి కావాలి. ఎంత ఎక్కువ కట్న కానుకలతో వస్తే, అంతగా తాను అధికుడు, అంతగా తన పురుషాహంకారం తృప్తి చెందుతుంది.

ఈ దురాచారం మనదేశంలో ఎంత ఎక్కువగా వేళ్ళు పాతుకుపోయి వున్నదో చూస్తే ఆశ్చర్యం కలుగుతుంది, ఆవేదన కలుగుతుంది. నాగరికులమని, ఆధునికులమని, విద్యాధికులమని చెప్పుకునే వర్గాలలోనే ఈ దురాచారం ఎక్కువగా వుండడం, నానాటికి పెరిగిపోతూ వుండడం మరింతగా మనస్తాపం కలిగిస్తుంది. వరకట్నాన్ని నిషేధిస్తూ కేంద్రం, రాష్ట్రాలు శాసనాలు చేయకపోలేదు. కాని, వరకట్నం పరమ దురాచారమని అంగీకరించేవారు. ఖండించేవారు కూడా దానికి పాల్పడుతున్నప్పుడు ఎన్ని శాసనాలున్నా ప్రయోజనం ఏమున్నది?

వరుడు కోరిన కట్నం ఇచ్చి ఆడపిల్లకు పెళ్ళి చేయడం-అదొక పద్ధతి. కాగా పెళ్లి అయిన తర్వాత కట్న కానుకలు చాలలేదని, ఇంకా తెమ్మని భర్త, అత్తమామలు, మరదులు, ఆడబిడ్డలు నవ వధువును వేధించడం ఇప్పుడు సర్వసాధారణమై పోయింది. తాము కోరిన కట్నం, కానుకలు పుట్టింటినుంచి తీసుకురాలేని వధువును భర్త, అతని బంధువులు హత్యచేస్తున్న సందర్భాలు, లేదా వారు పెట్టే చిత్రహింసలు భరించలేక వధువులు ఆత్మహత్యకు పాల్పడుతున్న సంఘటనలు - ఈరోజులలో ఎక్కడో చెదురుమదురుగా కాదు - వందలాదిగా జరుగుతున్నాయి. ఈ ఏడాది ఇంతవరకు ఒక్క ఢిల్లీ నగరంలోనే

35 పైగా ఇటువంటి హత్యలో, ఆత్మహత్యలో జరిగాయట. ఇటీవల వరసగా జరగడంతో ఇవి విదేశాల దృష్టిని కూడా ఆకర్షించాయి. ఇండియాలో వరకట్న దురాచారాన్ని పురస్కరించుకొని జరుగుతున్న వధూ దహనకాండ వార్తలను విదేశ పత్రికలు ప్రముఖంగా ప్రచురించడం, యూరోపియన్ పార్లమెంటు ఇట్టి సంఘటనలను ఖండిస్తూ తీర్మానించడం కూడా జరిగింది.

వరకట్నపు హత్యలు, ఆత్మహత్యలు వార్తలలోకి వస్తున్న వాటికంటె చాలా ఎక్కువగానే జరుగుతూ వుండి వుండాలి. అన్నీ అధికారుల దృష్టికి రావు. తమ దృష్టికి వచ్చిన వాటినైనా అన్నిటిని అధికారులు పట్టించుకోరు, పెక్కు సందర్భాలలో ఇట్టి హత్యలను వేరే కారణాలవల్ల జరిగిన ఆత్మహత్యలుగా ప్రకటిస్తారు. కేసు పెట్టిన సందర్భాలలో కొన్నిటిని హత్యకు తగు సాక్ష్యం లేదన్న కారణాన న్యాయస్థానాలు కొట్టివేస్తాయి. చట్టాలలోని లొసుగులవల్ల నిందితులు శిక్ష తప్పించుకోవడం తరచుగా జరుగుతున్నది.

అయితే, ఈ పరిస్థితిలో ఇప్పుడిప్పుడే కొద్దికొద్దిగా మార్పు వస్తున్నది. ఇటీవల ఢిల్లీలో ఒక వధూదహనం కేసులో న్యాయస్థానం నిందితుడైన భర్తకు, మరి ఇరువురికి మరణ శిక్ష విధించింది. మరొక కేసులో మరొక న్యాయస్థానం ముగ్గురికి యావజ్జీవ శిక్ష విధించింది.

వీటి తర్వాత ఇప్పుడు చట్టంలోని లోపాలను సవరించడానికి కేంద్ర ప్రభుత్వం వచ్చే పార్లమెంటు సమావేశంలో ఒక బిల్లు ప్రవేశపెట్టడానికి నిశ్చయించడం ముదావహం. వరకట్నం విషయంలో భార్యను భర్తగాని, బంధువులు గాని మానసికంగానో, భౌతికంగానో వేధిస్తే హింసిస్తే మూడేళ్ళవరకు శిక్ష విధించడానికి వీలుగా శిక్షాస్మృతిని సవరిస్తారట. వివాహిత యువతి ఆత్మహత్య చేసుకుంటే దానికి వేరే కారణం వున్నదని రుజువైతే తప్ప, లేకపోతే భర్త, అతడి బంధువుల వేధింపే కారణమని భావించడానికి వీలుగా మరొక చట్టాన్ని సవరిస్తారట. వివాహమైన ఏడేళ్ళలోగా అనుమానాస్పద పరిస్థితులలో స్త్రీ మరణిస్తే శవపరీక్ష జరగాలని మరొక సవరణ చేస్తారట.

ఇవీ, ఇంకా ఇట్టి ఇతర సవరణలవల్ల ప్రస్తుతపు చట్టాలలోని లోపాలు చాలవరకు తొలగిపోతే, వరకట్నపు పిశాచి కోరలలో నలిగి పోతున్న అమాయిక, నిర్భాగ్య స్త్రీలకు న్యాయస్థానాలలో న్యాయం జరగగలదని, వారికి కొంత రక్షణ కలగగలదని ఆశించవచ్చు.

అయినా, ఒక విషయం చెప్పక తప్పదు. చట్టాలు వుండవలసినంత కఠినంగా, నిర్దుష్టంగా లేకపోవచ్చు కాని, ఆ విధంగా వున్న మేరకైనా వాటిని అధికారులు చిత్తశుద్ధితో అమలు చేయకపోవడం వల్లనే సామాజిక న్యాయం జరగడంలేదు. చట్టం చేయగానే సరిపోదు. దాన్ని నిజాయితీతో అమలు చేయాలి. అయినా, వున్నంతలో ప్రస్తుతం కేంద్రప్రభుత్వం తలపెట్టిన సవరణ బిల్లును అభ్యుదయకర చర్యగానే పరిగణించాలి.

మరొక విషయం కూడా పేర్కొనవలసి వున్నది. మానభంగం నేరాలకు సంబంధించిన చట్టాన్ని మరింత కఠినం చేయడానికి తలపెట్టిన సవరణ బిల్లు మూడేళ్ళయినా ఇంతవరకు శాసనం కాలేదు. ఇప్పుడు రానున్న బిల్లుకు కూడా అదే జాప్యపు జాడ్యం పట్టకుండా జాగ్రత్తపడాలి. సవరణ బిల్లులు ప్రవేశ పెట్టడంతోనే ప్రభుత్వ బాధ్యత తీరిపోదు. అవి చట్టాలు అయ్యేటట్టు శ్రద్ధ వహించాలి.

*(జూలై 10, 1983)*

# ఉరిశిక్షలపై తీర్పు

హత్యానేరం చేసినవాడికి మరణశిక్ష విధించడం తగునా? అది అనాగరికం కాదా? అమానుషం కాదా?

ఈ ప్రశ్నపై ఇటీవలి కాలంలో - ముఖ్యంగా కడచిన రెండుమూడు దశాబ్దాలుగా - ప్రపంచ వ్యాప్తంగా చర్చ జరుగుతున్నది. "అన్ని నేరాలలోకి హత్యానేరం అతి ఘోరమైనది. దానికి విధించే శిక్ష అందుకు అనుగుణంగానే, అంతిమమైన స్థాయిలోనే - వుండాలి. అందుచేత హత్యా నేరానికి మరణశిక్ష విధించడంలో తప్పు లేదు. అది అనాగరికం కాదు. అమానుషం కాదు" - ఇది కొందరివాదం. కాగా, "హత్యా నేరం ఎంత ఘోరమైన దైనప్పటికి ఆ నేరం చేసేది ఒక వ్యక్తి. లేదా కొద్దిమంది వ్యక్తులు. నేరానికి మరణశిక్ష విధించేది న్యాయస్థానాలైనప్పటికి, అది మొత్తం సమాజంపక్షాన విధించే శిక్షే అవుతుంది. తనను తాను నాగరికమైనదిగా, సభ్యమైనదిగా భావించుకునే ఏ సమాజం హంతకుల స్థాయికి తాను కూడా దిగజారిపోయి, కంటికి కన్ను, పంటికి పన్ను అనే సూత్రాన్ని అనుసరించి, పగ తీర్చుకునే పద్ధతిలో వ్యవహరించడం తగదు. అది నిస్సందేహంగా అమానుషం, అనాగరికం, క్రూరం అవుతుంది. అంతేకాదు ఎంత కిరాతక హంతకునిలోనైనా ఏ మూలనో మానవత్వం మినుకుమినుకు మంటూనే వుంటుంది. దాన్ని మేల్కొలిపే అవకాశం లేకుండా చేస్తుంది మరణశిక్ష. పైగా, మరణశిక్షను విధించడంలో ఒకవేళ పొరపాటు జరిగితే. దాన్ని దిద్దుకునే అవకాశం లేకుండా పోతుంది." ఇది మరణదండనను వ్యతిరేకించేవారి వాదం.

ఈ చర్చ ఫలితంగా కొన్ని దేశాలలో మరణశిక్ష విధానాన్ని రద్దుచేయడం జరిగింది. అలా రద్దుచేసిన దేశాలలో బ్రిటన్ ఒకటి. ఈ మధ్య మరణశిక్ష పద్ధతిని పునరుద్ధరించాలని థాచర్ ప్రభుత్వం ప్రయత్నించింది. కాని, పార్లమెంటు ఆ ప్రయత్నాన్ని వ్యతిరేకించింది.

మన దేశంలో కూడా ఈ వివాదం కనీసం పది పన్నెండేళ్లుగా ఎడతెగకుండా జరుగుతున్నది. కాని, మరణశిక్షా విధానాన్ని రద్దు చేయించడానికి న్యాయస్థానాలద్వారా జరిగిన ప్రయత్నాలన్నీ విఫలమైనాయి. ఎన్నిసార్లు ఈ వివాదం తన ముందుకు వచ్చినప్పటికి. సుప్రీంకోర్టు మరణశిక్షా పద్ధతి రాజ్యాంగ సమ్మతమేనని తన అధికారాల పరిధిలో తాను తీర్పు చెబుతూ వచ్చింది.

అయితే, కడచిన పదేళ్ళలో ఒక ముఖ్యమైన మార్పు మాత్రం వచ్చింది. అంతకుముందు హత్యా నేరం చేసినవారికి మరణశిక్ష విధించడం సర్వసామాన్య పద్ధతిగాను, యావజ్జీవశిక్ష విధింపు అరుదుగాను వుండేది. కాగా, పలువురు మేధావులు, న్యాయవాదులు రేకెత్తించిన చర్చ ఫలితంగా, ఆ తర్వాత హత్యా నేరానికి మరణశిక్ష విధించడం అరుదుగాను, యావజ్జీవ శిక్ష విధింపు సర్వసామాన్యంగాను మారిపోయింది.

ఇంతేకాదు. 1980లో సుప్రీంకోర్టు ఒక తీర్పు చెబుతూ, మరణశిక్షను "అరుదైన సందర్భాలలో కూడా అరుదుగా" (రేరెస్ట్ ఆఫ్ రేర్ కేసెస్) మాత్రమే విధించాలన్న అభిప్రాయాన్ని వ్యక్తం చేసింది. ఇటీవల మరొక సందర్భంలో దేన్ని అటువంటి "అరుదైన సందర్భాలలో సయితం అరుదైన సందర్భంగా" పరిగణించాలో నిర్వచించింది కూడా.

దీన్నిబట్టి మరణశిక్ష పద్ధతిపై మన దేశంలో జరిగిన చర్చ, వాదోపవాదాలు వృథా కాలేదనిపిస్తుంది. మరణశిక్షను సర్వసామాన్యంగా పరిగణించే దశ నుంచి దాన్ని అసామాన్యమైనదిగా, అరుదైనదిగా పరిగణించాలన్న దశకు మన సమాజం ఎదిగిందని అనుకోవాలి.

అయినా, మరణశిక్ష వుండాలనే వాదం, రద్దు కావాలనే వాదం ఇంకా కొనసాగుతూనే వున్నాయి. మరణశిక్షే లేకపోతే, బిల్లా, రంగాలను పోలిన అతి క్రూర హంతకులపట్ల సమాజ ప్రతీకార భావం ఏ విధంగా వ్యక్తమవుతుందనే ప్రశ్నను కొందరు లేవనెత్తుతున్నారు. కాని, చారిత్రికంగా చూస్తే పూర్వకాలంలో హత్యా నేరమే కాదు, అంతకంటె చిన్న నేరాలు చేసిన వారినికూడా ఏనుగులచేత తొక్కించడం, కొండపై నుంచి విసిరి వేయడం, రాళ్ళతో కొట్టి చంపడం, కాళ్ళు, చేతులు నరికివేయడం, తలకొట్టి కోట కొమ్ముల వ్రేలాడదీయం, ఇంకా ఎన్నో చిత్రవధా పద్ధతులను అనుసరిస్తేకాని నేరస్థుల పట్ల సమాజం పగ తీరేది కాదు. కాని, నాగరికత పెరిగిన కొద్దీ ఈ పద్ధతులను ఏవగించుకొని, మరింత మానుషమైన శిక్షా విధానాలను అవలంబించడం, మరణశిక్షను హత్యా నేరాలకే పరిమితం చేయడం అమలులోకి వచ్చింది. అందుచేత అసలు ఎట్టి సందర్భాలలోను మరణ శిక్షలు తగవనే స్థాయికి ముమ్మందు మన సమాజం ఎదుగుతుందేమో చెప్పలేము.

ఏమైనా, ప్రస్తుతానికి మరణ శిక్షలు న్యాయ విరుద్ధం కావని, రాజ్యాంగ విరుద్ధం కావనే న్యాయ స్థానాలు అభిప్రాయపడుతున్నాయి. అయినప్పుడు మరణశిక్షను ఉరిత్రాటితో అమలు జరపడం రాజ్యాంగ విరుద్ధం కాదా అన్న ప్రశ్న పూర్తిగా అసంబద్ధంగా తోస్తుంది. కడచిన మేలో ఒక నేరస్థుడు ఉరిత్రాడు పద్ధతి రాజ్యాంగ విరుద్ధం, క్రూరం, కనుక దాన్ని రద్దు చేయాలని సుప్రీంకోర్టులో రిట్ వేయడం, అతడిని అనుసరించి మరి 30 మందికి పైగా అలాగే రిట్‌లు వేయడం, ఈ విషయాన్ని నిర్ధారించేవరకు ఉరి శిక్షలను కోర్టు నిలుపు చేయడం జరిగింది.

ఈ రిట్ పిటిషన్‌లపై విచారణ జరిపిన సుప్రీం కోర్టు బెంచి వాటిని ఇప్పుడు కొట్టి వేసింది. మరణదండన రాజ్యాంగ సమ్మతమైనప్పుడు ఉరిత్రాడు పద్ధతి రాజ్యాంగ విరుద్ధం అనడం పొసగదని, ఎలక్ట్రిక్ చెయిర్. గ్యాస్ ఛేంబర్, మరణానికి దారితీసే ఇంజెక్షన్ మొదలైన పద్ధతుల కంటె అది ఎక్కువ క్రూరమైనది, ఎక్కువ అమానుషమైనది, అధిక బాధాకరమైనది కాదని సుప్రీంకోర్టు తీర్పు చెప్పింది. బాధారహితమైన మరణశిక్ష అంటూ వుండదని - ఒక వేళ యావజ్జీవ శిక్ష విధించినా - అసలు బాధారహితమైన శిక్ష అనేది కూడా అసంభవమని అభిప్రాయపడింది.

ఈ అభిప్రాయంతో విభేదించవలసిన అవసరం లేదు. ఉరిత్రాటితో మరణం ఎక్కువ బాధాకరం, మరొక ఆధునిక పద్ధతి అయితే తక్కువ బాధాకరం అనే వాదమే అసంబద్ధమైనది, అసలు సమాజ ప్రతీకార భావానికి ప్రతీక అయిన మరణదండన పద్ధతే ఈ కాలపు మానవతా సూత్రాలకు తగినదా కాదా అన్నదే చర్చనీయాంశం కావాలి. మరణశిక్షా పద్ధతి రాజ్యాంగ విరుద్ధం కానప్పుడు, దాని రద్దుకు రాజ్యాంగాన్ని సవరించడానికి ఎందుకు వెనుకాడాలన్న ప్రశ్నపై చర్చ జరగాలి. మధ్య యుగాలనాటి చిత్ర శిక్షా పద్ధతులు నేడు మనకు క్రూరమైన వనిపిస్తున్నప్పుడు, వాటి అవశేషమైన మరణ దండన పద్ధతి మాత్రం ఎందుకు క్రూరమైనది కాదో ఆలోచించాలి. నేడు కాకపోతే మరికొంత కాలానికైనా అట్టి పునరాలోచన జరగగలదనే ఆశించాలి.

*(సెప్టెంబర్ 24, 1983)*

# గాంధి జయంతి

నేడు గాంధి జయంతి. ప్రతి అక్టోబరు 2వ తేదీన గాంధీజీని సంస్మరించడం ఒక ఆనువాయితి.

మనకు ఎన్నో పండుగలు, పబ్బాలు చిన్నవీ, పెద్దవీ వున్నాయి. ఏటేటా అవే తిరిగి తిరిగి వస్తాయి. పూర్వం నుంచి అనూచానంగా వస్తున్నవి కాక, స్వాతంత్ర్య సిద్ధి తర్వాత కొత్తగా ఏర్పాటు చేసుకున్న జయంతులు, వర్ధంతులు, దినోత్సవాలు మరికొన్ని వున్నాయి. వీటన్నిటిలోను గాంధి జయంతి కూడా ఒకటిగా మారిపోయింది. సభలు, సమావేశాలు జరపడం, పత్రికలు ప్రత్యేక వ్యాసాలు, సంపాదకీయాలు ప్రచురించడం. గాంధీజీ ఉపదేశాలను ఏకరువు పెట్టడం, వాటిని ప్రజలు ఆచరించాలని ఉద్బోధించడం ఇది కూడా మనకొక ఆచారంగా మారిపోయింది.

గాంధి జయంతిని ఒక ఆచారంగా పాటించడమేతప్ప, దాని వెనుక ఏ కొంచెమైనా చిత్తశుద్ధి మిగిలివున్నదా అంటే లేదనే సమాధానమే వస్తుంది. గాంధీజీ ఉపదేశాల సంస్మరణ దారి సంస్మరణది, ఆచరణ దారి ఆచరణది. గాంధీజీ పేరును ఆయన జయంతినాడు స్మరించడం సయితం అసందర్భంగా ధ్వనించేటంతగా సమకాలిక భారతదేశ స్వరూపం మారిపోయింది.

ఒక సందర్భంలో ఒకరెవరో ఏదైనా సందేశం ఇమ్మని కోరగా "నా జీవితమే నా సందేశం" అని గాంధీజీ చెప్పారు. ఈ సందేశం ఇవ్వడానికి అపారమైన ఆత్మవిశ్వాసం, నైతిక ఔన్నత్యం కావాలి. గాంధీజీని అనుకరిస్తూ నీతి బోధలు చేసేవారు వూరూరా కొల్లలుగా కనిపిస్తారు. కాని, తమ జీవితమే తమ సందేశమని చెప్పగలిగినవారు అరుదుగా తప్ప కనబడరు.

గాంధీజీ బోధలు వేరు, ఆయన జీవితం వేరు కావు. ఆ రెండింటిది అవినాభావసంబంధం. ఆయన జీవితంలో నుంచే ఆయన బోధలు వెలువడ్డాయి. తాను ఆచరించలేనిదాన్ని, ఆచరించి చూపనిదాన్ని ఒక ఆదర్శంగా ఆయన ఎన్నడూ ప్రకటించలేదు. అందుకే ఆయన తన "ఆత్మ కథ"కు "సత్యంతో నా ప్రయోగాల గాథ" (ది స్టోరీ ఆఫ్ మై ఎక్స్‌పెరిమెంట్స్ విత్ ట్రూత్) అని పేరు పెట్టుకున్నారు. ఆయన సత్యాచరణ ప్రయోగాలనుంచి వెలువడినవే ఆయన ఉపదేశాలు.

జర్మన్ తత్వవేత్త కాంట్ "క్యాటిగారికల్ ఇంపరేటివ్" అనే పేరిట ప్రవచించిన నైతిక సూత్రం ప్రపంచ ప్రసిద్ధమైంది. నీ కొక నీతి, ప్రపంచానికొక నీతి లేదు. అందరికీ ఒకటే నీతి, వ్యక్తిగత జీవితంలో ఏది నీతి, ఏది అవినీతి అని నీకు సందేహం వచ్చినప్పుడు అది ప్రపంచంలో అందరికి వర్తించదగినదేనా, అలా వర్తిస్తే ప్రపంచ సౌభాగ్యం వర్ధిల్లుతుందా లేదా అని ఆలోచించాలి. అలా వర్తించదగినదైతేనే అది తిరుగులేని నైతిక కర్తవ్యం - క్యాటిగారికల్ ఇంపరేటివ్ - అవుతుంది. నైతిక వర్తనకు వ్యక్తిగతమని, సంఘగతమని విభాగాలు లేవు. విశ్వజనీనత కలిగినదే అచ్చమైన నైతిక వర్తన.

ఈ సూత్రాన్ని గాంధీజీ తన జీవితంలో, స్వీయ ప్రయోగాల ద్వారా ఆచరించారు. తనకు ఆచరణ సాధ్యమైనదానినే నైతికాదర్శంగా ఆయన ప్రబోధించారు. ఇటీవల కొత్తగా ఒక కుహనా వాదం బయలుదేరుతున్నది. అసలు గాంధేయవాదమే మన దేశానికి, ప్రపంచానికి పనికిరాదన్నది ఈ వాదం. గాంధీజీ తన ఆదర్శాలను ఎవరూ ఆచరించడానికి సాధ్యం కానంత ఉన్నత స్థాయిలో ప్రబోధించారని, కనుకనే గాంధీయిజం విఫలమైందని మేధావులు సయితం కొందరు వాదిస్తున్నారు. ఇదొక అవాస్తవ వాదం.

గాంధీజీ పుట్టుకతోనే మహాత్ముడు కాలేదు. మానవ సహజమైన దౌర్బల్యాలన్నీ ఆయనకు వుండేవి. కాని, ఆయన వాటిని అధిగమించడానికి, జయించడానికి, తనతో తాను, తనలో తాను నిరంతరం పోరాటం జరిపారు. ఈ పోరాటం, దానిలో ఆయన సాధించిన విజయాలే ఆయనను మహాత్ముడిని చేశాయి. సామాన్యుడుగా పుట్టి పెరిగిన గాంధీ అనే వ్యక్తి నిరంతరమైన సాధనతో సాధించినది ఇతరులకు అసాధ్యం కానక్కరలేదు. ఈ విశ్వాసంతోనే ఆయన పలువురికి అసాధ్యంగా కనబడే ఉన్నత నైతికాదర్శాలను ప్రబోధించారు.

కాని, నేడు ఎటు చూసినా గాంధీజీ అదర్శాలపట్ల, ఉపదేశాలపట్ల అవహేళనాత్మక దృక్పథమే తాండవిస్తున్నది. మాటలలో కాకపోతే, చేతలలోనైనా అవహేళన అనాదరణ కనిపిస్తున్నది. గాంధీజీ ఆదర్శాలేకాదు, అసలు నీతి పేరు ఎత్తడం, నైతికమైన విలువలను స్మరించడమే ఒక వెర్రితనంగా భావించే స్థితికి మన సమాజం చేరుకొన్నది. నీతిని ఉల్లంఘించడమే వ్యక్తి గొప్పదనానికి నిదర్శనమవుతున్నది. అవినీతికే సంఘంలో నేడు గౌరవం, హోదా, పదవి, అధికారం, పలుకుబడి లభిస్తున్నాయి. నైతికపతనం కంటె నైతికపతనం పట్ల ఉదాసీనత మరింత ప్రమాదకర ధోరణి. ఈ ధోరణే నేడు సర్వత్రా కనిపిస్తున్నది. ఒక్క రాజకీయ రంగంలోనే కాదు, ప్రజాజీవితంలోని సర్వరంగాలలో అవినీతికే నేడు అగ్రతాంబూలం.

అయినా, మొదటనే పేర్కొన్నట్టు మనం గాంధీ జయంతులను, సంస్మరణ సభలను జరుపుకొనడం మానడంలేదు. అన్ని వేడుకలతోపాటు అదొక వేడుక. అన్నిటిలోకి దౌర్భాగ్యం - గాంధీజీ ఆదర్శాలపట్ల అంతరాంతరాలలో ఏమాత్రం గౌరవం లేనివారే ఆయన ఉపదేశాలను బహిరంగ వేదికలపై సంస్మరించడం; అవినీతిపరులైన వారే తమ్ము తాము మినహాయించుకుని, ఇతరుల అవినీతిని ఖండించడం; తాము అవినీతి పంకంలో పొర్లాడుతూనే సంఘమంతా అవినీతి వ్యాపించిందని వాపోవడం, మేధావులనబడేవారిలో కూడా ఈ కాపట్యానికి కొరత లేదు.

కనుకనే గాంధీజీ స్మృతికి, ఆయన ఆదర్శాలకు దేశంలో స్థానం వున్నదా అన్న నిరాశా నిస్పృహలు కలుగుతాయి. ఒక వేడుకగాతప్ప గాంధీజీ జయంత్యుత్సవాలకు ప్రయోజనం వున్నదా అనిపిస్తుంది. గాంధీజీ జయంతినాడు ఆయనను సంస్మరిస్తూ ఆయన స్మృతికి అపచారం చేస్తున్నామేమో అన్న సంశయం సయితం కలుగుతున్నది.

*(అక్టోబర్ 2, 1983)*

# హానికర ధోరణి

కేంద్రానికి, రాష్ట్రాలకు మధ్య ఎటువంటి సంబంధాలుండాలి, కేంద్రం ఎక్కువ బలంగా వుండాలా? రాష్ట్రాలు ఎక్కువబలంగా వుండాలా? ఎవరికి ఎక్కువ అధికారాలుండాలి? ఎవరిది పైచెయ్యి, తుది మాట కావాలి?

ఈ ప్రశ్నలు కొంతకాలంగా తరచుగా వివాదాలకు, విభేదాలకు, ఆవేశాలకు కూడా కారణాలవుతున్నాయి. వీటిపై దేశవ్యాప్తంగా చర్చలు జరుగుతున్నాయి.

ముఖ్యంగా కేంద్రంలో అధికారంలో వున్న పార్టీ కంటె భిన్నమైన పార్టీలు అధికారంలోకి వచ్చిన రాష్ట్రాలలో ఆయా పార్టీల ప్రభుత్వాలు, వాటిని సమర్థించే ఇతర ప్రతిపక్షాలు ఈ ప్రశ్నలను తీవ్ర చర్చనీయాంశాలుగా చేస్తున్నాయి.

అందులోను ఆంధ్ర ప్రదేశ్‌లో ప్రాంతీయ ప్రాతిపదికపై ఏర్పడిన "తెలుగుదేశం" అధికారంలోకి వచ్చిన తర్వాత ఈ ప్రశ్నల ప్రాముఖ్యం మరింతగా పెరిగింది. తెలుగుదేశం ప్రభుత్వం, దాని నాయకులు అదను దొరకడం తరువాయిగా ఈ ప్రశ్నలను లేవనెత్తడమేకాక, కేంద్రాన్ని చేతనైనంత పరుషమైన భాషలో దూషించడానికి అలవాటు పడుతున్నారు. కేంద్ర ప్రభుత్వాన్ని ఒక జాతీయ ప్రభుత్వంగా కాక, ఒక సామ్రాజ్యవాద ప్రభుత్వంగా, వలస ప్రభుత్వంగా చిత్రిస్తున్నారు. అసెంబ్లీ ఎన్నికలకు ముందు అధికారంలోకి రావడానికి గాను ప్రాంతీయ దురభిమానాలను, కేంద్రం పట్ల ద్వేషాన్ని వారు రేకెత్తించగా. అధికారానికి వచ్చిన తర్వాత తమ వైఫల్యాలను కప్పిపుచ్చుకొనడానికి కేంద్రం పట్ల ఆరోపణల విధానాన్ని ఉపయోగించుకుంటున్నారు.

రాష్ట్రం ఆర్థికంగా మోయలేనంత బరువుతో రకరకాల ఆకర్షణీయ పథకాలను రూపొందించి, వాటి అమలుకు కేంద్రం నిధులు సమకూర్చడం లేదని, కేంద్రం సహాయం చేయనిదే తాము ఏమి చేయగలమని, కేంద్రం సవతితల్లి ప్రేమ చూపిస్తున్నదని ప్రచారం చేస్తున్నారు. కేంద్రంపట్ల విద్వేషం రేకెత్తించడానికి చేస్తున్న తమ ప్రయత్నాలు దీర్ఘకాలిక దృష్టితో చూస్తే జాతీయ సమైక్యానికి ఎంత హానికరమో వారు గుర్తిస్తున్నట్టు కనబడదు. తమది రాష్ట్ర ప్రజలు ఎన్నుకున్న ప్రభుత్వమైతే, కేంద్ర ప్రభుత్వం అన్ని రాష్ట్రాల ప్రజలు కలిసి ఎన్నుకున్న ప్రభుత్వమే తప్ప మరొకటికాదన్న విషయాన్ని కూడా వారు గుర్తిస్తున్నట్టు కనబడదు.

ఈ మధ్య హైదరాబాద్‌లో కేంద్రం - రాష్ట్రాల సంబంధాల సమస్యపై జరిగిన ఒక సదస్సు కేంద్ర ప్రభుత్వంపట్ల విద్వేషం రేకెత్తించడానికి తెలుగుదేశం ప్రభుత్వానికి మరొక వేదికగా ఉపయోగపడినట్టు కన్పిస్తుంది. ముఖ్యమంత్రి శ్రీ, ఎన్.టి. రామారావు తమ ప్రసంగంలో కేంద్ర ప్రభుత్వాన్ని రాష్ట్రాల పాలిటి పీడ అని, శాపమని అర్థం వచ్చే మాటలతో వర్ణించడం ఇందుకు తార్కాణం.

కేంద్రం - రాష్ట్రాల మధ్య ప్రస్తుతపు సంబంధాలు అసంతృప్తికరంగావుంటే వాటిని ఎలా మార్చాలన్న విషయమై విస్తృతంగా, నిర్మాణాత్మకంగా చర్చ జరగడం మంచిదే. నిజానికి ఇటువంటి చర్చ అవసరాన్నే కాక, మార్పుల అవసరాన్ని కూడా కేంద్రంలో అధికారంలో వున్న కాంగ్రెస్ (ఐ) ప్రభుత్వం ఆలస్యంగానైనా గుర్తించింది. రాజ్యాంగం సవరణతోసహా అట్టి మార్పులను సూచించడానికి సర్కారియా కమిషన్‌ను నియమించింది. ఆ కమిషన్ పని ప్రారంభించింది. రాష్ట్ర ప్రభుత్వాలు, వివిధ రాజకీయ పక్షాలు, ఇతరులు ఆ కమిషన్‌కు ఉపయోగకరంగా ఎన్ని సూచనలైనా చేయవచ్చు. వీటి ఆధారంగా ఆ కమిషన్ నిర్ణీత వ్యవధిలోగా తన నివేదికను రూపొందించి సమర్పించగలదనే ఆశించాలి.

అయితే, ఈ సమస్య సావధానంగా, ప్రశాంతంగా, నిర్మాణాత్మకంగా ఆలోచించి పరిష్కరించుకోవలసినట్టిదే తప్ప దానిలో ఆవేశానికి, విద్వేషానికి, విచ్ఛేదకర ధోరణులకు ఎంత మాత్రం తావులేదు. అటువంటివి ఎంత మాత్రం సహించరానివి కూడా. పోతే ఈ సందర్భంలో హైదరాబాదు సదస్సులో ముఖ్యమంత్రి ప్రసంగంలోని ఒక పొరపాటును ఎత్తిచూపక తప్పడం లేదు.

ఏ రాష్ట్రాలు సుపరిపాలన కోసం తమ అధికారంలో కొంత భాగాన్ని కేంద్రానికి ఐచ్ఛికంగా ధారాదత్తం చేశాయో ఆ రాష్ట్రాల ఆశలకు, ఆశయాలకే కేంద్రం గొడ్డలి పెట్టుగా తయారైందని ముఖ్యమంత్రి అన్నారు. ఇందులో ఒక సత్యదూరమైన విషయం వున్నది. అది అమెరికాకు వర్తిస్తుందిగాని ఇండియాకు కాదు. అమెరికా బ్రిటిష్ వలస పాలనపై తిరుగు బాటు చేసిన సందర్భంలో పదమూడు స్వతంత్ర రాష్ట్రాలు ఒక చోట సమావేశమై సమర్థమైన జాతీయ పరిపాలన కోసం ఒక కేంద్ర ప్రభుత్వాన్ని సృష్టించుకుని దానికి తమ అధికారాలలో కొన్నిటిని ఐచ్ఛికంగా ధారాదత్తం చేశాయి. ఆ తర్వాత క్రమంగా రాష్ట్రాల సంఖ్య పెరిగింది. కేంద్రానికి మరిన్ని అధికారాలను అప్పగించడం, అది మరింత బలపడడం జరిగింది. అయినా, ఇప్పటికి కూడా అమెరికన్ రాజ్యాంగం ప్రకారం పేర్కొనబడని అధికారాలు - రెసిడ్యువల్ పవర్స్ - రాష్ట్రాలకే వున్నాయి తప్ప కేంద్రానికి కాదు.

ఇండియాలో అలా కాదు. బ్రిటిష్ పరిపాలనా కాలంలో సయితం మన రాష్ట్రాలు చారిత్రిక కారణాలవల్లనో, పరిపాలనా సౌలభ్యం కోసమో ఏర్పడినవే తప్ప స్వతంత్ర రాజ్యాలు కావు. ఇండియా స్వతంత్రమైన తర్వాత కూడా (మన రాజ్యాంగం ఫెడరల్ స్వభావం కలిగినదైనప్పటికి) కొన్ని స్వతంత్ర రాష్ట్రాలు చేరి కేంద్ర ప్రభుత్వాన్ని నిర్మించుకోలేదు. కేంద్ర ప్రభుత్వమే పరిపాలనా సౌలభ్యం కోసం. ఆయా ప్రాంతాల, భాషల, ప్రజల ఆకాంక్షలకు అనుగుణంగా వివిధ రాష్ట్రాలను నిర్మించింది. 1956లో జరిగిన భాషా ప్రయుక్త రాష్ట్ర పునర్నిర్మాణం ఈ విషయాన్నే సూచిస్తుంది. అవసరమైతే ఇప్పటికి కూడా రాజ్యాంగం ప్రకారం ఈనాటి రాష్ట్రాల విస్తీర్ణాన్ని పెంచడానికి, తగ్గించడానికి, సరిహద్దులను మార్చడానికి అధికారం పార్లమెంటుకు - అంటే కేంద్రానికి - వున్నది.

అందుచేత మన రాష్ట్రాలు తమ అధికారాలలో కొన్నిటిని తమకు తాము కేంద్రానికి అప్పగించడం జరగలేదు. భారత ప్రజలు తమను తామొక సర్వ స్వతంత్ర, ప్రజాస్వామిక రిపబ్లిక్‌గా రూపొందించుకున్నారు. ఆ రిపబ్లిక్ ప్రభుత్వం పరిపాలనా సౌలభ్యం, విభిన్న భాషలు, ప్రాంతాలు ఆచార వ్యవహారాలు మొదలైనవాటి కారణంగా దేశాన్ని కొన్ని రాష్ట్రాలుగా విభజించి వాటికి పెక్కు విషయాలలో స్వయంపాలన అధికారాలిచ్చింది. అమెరికాలో వలె కాక, శేషించిన అధికారాలను - రెసిడ్యువల్ పవర్స్‌ను - తనకు వుంచుకున్నది. అందుచేత ముఖ్యమంత్రి అన్నట్టు రాష్ట్రాలు తమ అధికారాలను కేంద్రానికి ధారపోయడమన్న ప్రశ్న లేదు.

అయితే అంతమాత్రాన ఇప్పటి పరిస్థితిలో మార్పు రాకూడదని మా అభిప్రాయంకాదు. కాలం గడిచినకొద్దీ రాష్ట్రాలకు రాజ్యాంగమిచ్చిన స్వయం పాలనాధికారాలు చాలడం లేదన్నది, వాటి సర్వతోముఖాభివృద్ధికి మరిన్ని అధికారాలు అవసరమన్నది స్పష్టపడుతున్నది. అందుచేత రాజ్యాంగం సవరణతో సహా ప్రస్తుత పరిస్థితిని - కేంద్రం బలహీనపడని రీతిలో - మార్చడం తప్పక అవసరమే.

కాని, ఆవశ్యకమైన ఈ మార్పును కేంద్రానికి, రాష్ట్రాలకు మధ్య విద్వేషాగ్నిని రగిలించడం ద్వారా సాధించబూనడం తగదని, ప్రమాదకరమని మాత్రమే మేము చెప్పదలచింది. ఈ విషయాన్ని తెలుగుదేశం ప్రభుత్వ నాయకులతో సహా దేశంలోని వివిధ రాజకీయ పక్షాల వారు కూడా గమనించడం అవసరం.

*(డిసెంబర్ 7, 1983)*

# నవ్యకవితా పితామహుడు

"అడుగులు బొబ్బలెత్త, వదనాంచలమందున చిమ్ము చెమ్మటల్ మడుగులు గట్ట..." అని ఇరవై ఏళ్ళ ఒక యువకవి ఒక ఖండ కావ్యం ప్రారంభించాడు. అది అభినవాంధ్ర కవిత్వానికి ఆద్య పద్యమైంది. అది 1912 - 13 నాటి మాట.

ఆ ఖండకావ్యం పేరు "తృణకంకణము". అది రచించిన ఆనాటి ఆ యువకుని పేరు నవ్యాంధ్ర కవితా పితామహుడుగా ప్రసిద్ధుడైన రాయప్రోలు సుబ్బారావు.

తెలుగు కవిత్వంలో ఒక స్వర్ణయుగానికి కారకులైన విశ్వనాథ, దేవులపల్లి, తల్లావఝల, దువ్వూరి, వేదుల మొదలైన మహామహులందరుఇంతకుముందే మనమధ్య నుంచి నిష్క్రమించారు. కాగా, వారందరికి ముందు నడిచి, వారందరికి మార్గదర్శకుడైన రాయప్రోలు వారు అందరికంటె వెనుకగా, ఆ యుగానికి చెందిన అంతిమ మధుర సౌరభతరంగాన్ని కూడా తనతో తీసుకుపోతూ నిన్న శాశ్వతంగా కన్ను మూశారు

గురజాడ, రాయప్రోలు - వీరిరువురిలో నవ్యకవిత్వానికి నాంది పలికినవారెవ్వరని కొంతకాలంపాటు తెలుగునాట ఒక వివాదం రేగింది. ఆ ఇరువురు ఉత్తర, దక్షిణ ధ్రువాల వంటివారు. వారివి భిన్న మార్గాలు, అయినా, ఇరువురు తమ కాలపు ప్రబంధ సంప్రదాయంమీద తిరుగుబాటు చేసిన వారే. ఆంగ్ల సాహిత్యంతో ప్రభావితులైనవారే. నూతన కవితారీతులను ప్రారంభించినవారే. తరువాతి కవులపై అపార ప్రభావాన్ని ప్రసరించినవారే. అందుచేత ఆ ఇరువురిని నవ్యాంధ్ర కవిత్వ యుగకర్తలుగానే పేర్కొనాలి. రాయప్రోలువారి నిర్యాణంతో తెలుగు కవిత్వంలో ఒక యుగకర్త అస్తమించారు.

రాయప్రోలు వారు గేయ ఛ్ఛందస్సులలో ఎన్నెన్నో మధుర గీతాలు ఆలపించకపోలేదు. అయినా, ఆయన ప్రతిభ వృత్తచ్ఛందస్సులలో మరింతగా రాణించింది. ఆధునికులలో సరళ సుందరంగా వృత్తరచన చేసినవారు పలువురున్నారుగాని, వారికి మార్గం చూపిన వారు రాయప్రోలు వారే. ప్రబంధ కవిత్వానికి భిన్నంగా, వుండీ లేదని పించేటంత చిన్న ఇతివృత్తంతో, సందేశాత్మకమైన ఖండ కావ్యాల రచనకు ఆయనే వరవడిపెట్టారు. నాయికల అంగాంగవర్ణన, చంద్రోపాలంభం, మదనోపాలంభం, రతివర్ణన మొదలైన సంప్రదాయాలను కాలదన్ని, అమలినశృంగార భావనకు తెలుగు కవిత్వంలో పట్టాభిషేకం చేసి భావకవిత్వమనే పేరుతో ప్రచారం పొందిన పద్ధతికి మార్గదర్శకుడైనది కూడా ఆయనే.

"ఆధునిక కవిత్వమునకు తృణకంకణము ఆది గ్రంథమని అస్మదాదుల ఆశయము"అని దాని రజతోత్సవ సందర్భంలో తల్లావఝుల శివశంకరశాస్త్రిగారు అన్నారు. పాతికేళ్ళ తర్వాత ఆమాట అనడంలో విశేషం లేదు. "తృణకంకణము'వెలువడినకొద్ది నెలలకే 1913 అక్టోబరులో జయంతి రామయ్యగారు "This little poem purports to make the beginning of a

new school of Telugu poetry..." అని ప్రస్తుతించారు. అలాగే 1916లో కట్టమంచివారు "He is almost entitled to be acclaimed as the founder of a new school of poetry". అని కీర్తించారు. సమకాలికులైన ఉద్దండ పండితులు, అందులో ఇరవైఏళ్ళ యువకవిని ఒక నూతన కవితా మార్గానికి కర్తగా ప్రశంసించడం గొప్ప విశేషం.

తృణకంకణం తర్వాత రాయప్రోలువారి లేఖినినుంచి స్నేహలతాదేవి, కష్ట కమల, స్వప్న కుమారము, ఆంధ్రావళి, జడకుచ్చులు, తెనుగుతోట వంటిఖండకావ్య సంపుటాలెన్నో వెలువడి ఆంధ్ర రసికలోకాన్ని అలరించాయి. అన్నిటిలోను ఆయన అమలిన శృంగార సిద్ధాంతం-- ప్లేటోనిక్ లవ్‌గా పేర్కొనదగిన ప్రేమభావం-- ప్రముఖంగా భాసిస్తుంది. వీటిలో వరకట్నపు దురాచారాన్ని ఖండించిన స్నేహలతాదేవి ఒక విలక్షణ ఖండకావ్యం.

ఇక రాయప్రోలువారి పేరుచెబితే ఆయన మహావేశంతో, మహానురక్తితో పలికిన ఎన్నో దేశభక్తి పద్యాలు జ్ఞాపకం వస్తాయి.

"ఏదేశమేగినా ఎందుకాలిడిన, ఏపీఠమెక్కినా ఎవ్వరెదురయిన, పొగడరా నీ తల్లి భూమి భారతిని, నిలుపరా నీజాతి నిండు గౌరవము"అని ప్రారంభమయ్యే ప్రసిద్ధగీతం స్వాతంత్ర్య సమరకాలంలో తనపాత్ర తాను నిర్వహించింది.

"........... చావలేదు చావలేదు ఆంధ్రుల మహోజ్వలచరిత్ర, హృదయములు చీల్చి చదువుడో సదయులార!" మొదలైన పద్యాలు నాటి ఆంధ్రోద్యమానికి చేసిన దోహదం సాటిలేనిది.

"కలదయేని పునర్జన్మ కలుగుగాక, మధుర మధురంబయిన తెన్గు మాతృభాష" అని తెలుగు వారిలో రాయప్రోలువారు రేకెత్తించిన స్వభాషాభిమానం ఎన్నటికీ మరువరానిది.

రాయప్రోలువారి తక్కిన ఖండ కావ్యాలన్నీ ఒక ఎత్తు, వారి రమ్యాలోకం, మాధురీదర్శనం ఒకెత్తు. అందులో రమ్యాలోకం మరీని. నవ్య కవితా లక్షణాలను, ఆశయాలను, ఆదర్శాలను సూత్రీకరించే అలంకార శాస్త్రగ్రంథంగా దాన్ని ఉద్దేశించినప్పటికి "రమ్యా లోకం" ఒక గొప్ప రసాత్మక కావ్యంగా కూడా భాసిస్తుంది.

ఆయన ఏదివ్రాసినా మధురమధురంగా వ్రాశారు. ఆర్ద్రంగా వ్రాశారు. ఉదాత్త శైలిలో ఒక ఋషివలె వ్రాశారు."మామిడి కొమ్మమీద కలమంత్ర పరాయణుడైన కోకిల స్వామికి మ్రొక్కి యీ యభినవ స్వరకల్పన కుద్యమించితిన్...." అని ఆయనే చెప్పుకున్నారు. ఆ కోకిలస్వామి రాయప్రోలు వారే, ఆయన జపించింది కలమంత్రమే. ఆయన ఆలపించింది అభినవ స్వరమే.

తెలుగు భాషలోని తీయదనమంతా ఆయన కవితలో గూడు కట్టుకున్నది. అవధాన ప్రక్రియా కృత్రిమత్వం నుంచి మరల్చి తెలుగు కవిత్వాన్ని రమ్యాక్షర క్షోణిగా మార్చిన ఘనత ఆయనది. ఒక తరం తెలుగు కవిత్వాన్ని ప్రభావితంచేసి, తొంభయిరెండేళ్ళ పరిపూర్ణ జీవితం గడిపి కన్ను మూసిన రాయప్రోలు వారికి తెలుగు వారు ఎంతైనా ఋణపడి వున్నారు.

*(జులై 1, 1984)*

సమతూకం వుండే విధంగా మన రాజ్యాంగ నిర్మాతలు రాజ్యాంగాన్ని రచించారు. దాన్ని తిరగదోడడం కందిరీగల పుట్టను కదలించినట్టే కాగలదు.

వచ్చే ఎన్నికలలో ఏ పార్టీకి మెజారిటీ రాకపోతే మిశ్రమ ప్రభుత్వం ఏర్పడుతుంది. లేదా, అన్నిటిలోకి పెద్దదిగా ఎన్నికైన పార్టీ మైనారిటీ ప్రభుత్వాన్ని ఏర్పరుస్తుంది. మైనారిటీ ప్రభుత్వాలు బ్రిటన్ వంటి పార్లమెంటరీ ప్రజాస్వామ్య దేశాలలో ఏర్పడిన సందర్భాలు ఎన్ని లేవు? ఆ ప్రభుత్వం ఎంతో కాలం నడవకపోతే తిరిగి ఎన్నికలు జరుగుతాయి. అంతేతప్ప అసాధారణాధికారాలను కేంద్రీకరించుకున్న అధ్యక్షతరహా వ్యవస్థను వరించడం తగదు. అది ఇప్పటి వ్యవస్థ కంటే విజయవంతం కాగలదన్న హామీ లేకపోగా, నియంతృత్వానికి, ఆ తర్వాత అరాజకానికి దారితీసే ప్రమాదమే ఎక్కువ.

*(జూలై 22, 1984)*

# పాతబస్తీ అల్లర్లు

రాష్ట్ర రాజధానిలో అల్లర్లు ప్రస్తుతానికి తగ్గు ముఖం పట్టడం సంతోషించవలసిన విషయం. ఇవి ఇంతటితో సమసిపోయి పౌరజీవనం యథా ప్రకారంగా ప్రశాంతంగా కొనసాగగలదని ఆశించాలి.

అల్లర్ల కారణంగా పాతబస్తీలో రోజుల తరబడి నిరవధికంగా కర్ఫ్యూ విధించవలసివచ్చింది. విస్తారమైన ప్రాంతంలో లక్షలాది ప్రజలు కర్ఫ్యూ కారణంగా గృహ నిర్బంధంగా చెప్పదగిన అసౌకర్యానికి లోనయ్యారు.

కర్ఫ్యూ విధిస్తే పౌరులకు అసౌకర్యం కలుగుతున్నదని ఫిర్యాదు. కర్ఫ్యూ విధించకపోతే పోలీసులు శాంతి భద్రతల పరిరక్షణకు ఏమీ చేయలేదన్న ఆరోపణ. పోనీ, అప్పుడప్పుడు కొన్ని గంటలసేపైనా కర్ఫ్యూ సడలించి పౌరులకు తెరపి ఇద్దామంటే, ఆ కొద్దిపాటి వ్యవధిలోనే తిరిగి కత్తిపోట్లు, లూటీలు, గృహ దహనాలు మొదలైన దుస్సంఘటనలు జరిగి కర్ఫ్యూ ఎందుకు ఎత్తివేశారని విమర్శలు - ఇన్నిటి మధ్య అధికారయంత్రాంగం సతమతమైవుండాలి.

హైదరాబాదులో పూర్వపు రోజులలో కూడా ఎప్పుడైనా చెదురుమదురుగా భిన్న మత వర్గాల మధ్య సంఘర్షణలు జరగకుండా పోలేదు గాని, 1978 నుంచి ఇవి వరసగా ప్రతి ఏడు జరగడం, ప్రతి ఏడాది రెండు మూడు సార్లు చొప్పున కూడా జరగడం పరిపాటి అయింది. ముఖ్యంగా ఆయా మతవర్గాల పండుగల ఊరేగింపులు, ఉత్సవాల సమయంలో సంఘర్షణలు జరగడం ఆనవాయితీ అయింది. ఏదైనా ఒక పండుగ, ఒక పెద్ద ఊరేగింపు, ఒక ప్రార్థన సమావేశం ప్రశాంతంగా జరిగిపోయిందంటే బ్రతుకుజీవుడా అని సంతోషపడవలసివస్తున్నది.

ఈ అల్లర్లు కూడా ఎక్కువగా పాతబస్తీలోనే కేంద్రీకృతం కావడం గమనించదగింది. ఇటీవలి కాలంలో హైదరాబాదు వ్యాపార, పారిశ్రామిక రంగాలలో విశేషంగా అభివృద్ధి కావడం హర్షించవలసిన విషయమే. కాని, హైదరాబాదులో ఒక ముఖ్య భాగమైన పాతబస్తీ దశాబ్దాలుగా పీసమైనా అభివృద్ధికి నోచుకొనకపోవడం గురించి ఎవరూ ఎందుకు ఆలోచించరో అర్థంకాదు. అక్కడి లక్షలాది ప్రజలు - విభిన్న మతాలకు చెందినవారు - ఎంతటి నికృష్ట పరిసరాలలో, హైన్య పరిస్థితులలో జీవిస్తున్నారో గమనిస్తే ఇప్పటి మత కలహాలకు మూల కారణాలను తేలికగానే గ్రహించవచ్చు.

ఇంటిమీద ఇల్లు, కేవలం ఏడెనిమిది అడుగుల వెడల్పు మాత్రమే ఉండే రొచ్చు గల్లీలు, అపరిశుభ్రమైన పరిసరాలు, దారుణమైన దారిద్ర్యం, అవిద్య, అనారోగ్యం - అటువంటి పరిస్థితులలో ఎంత సజ్జనులైన వారిలోనైనా నేర ప్రవృత్తి సహజంగానే అంకురిస్తుంది. పెరిగి పెద్దదై పెనుభూతంగా ఆవహిస్తుంది. దానికితోడు అక్కడి ప్రజల వెనుకబాటుతనాన్ని, అజ్ఞానాన్ని, అమాయకత్వాన్ని ఆసరా చేసుకుని స్వప్రయోజనాలను గడుపుకొనజూచే మత దురభిమానశక్తులు, రాజకీయ వర్గాలు కలిస్తే ఎంతగానైనా హింసాకాండను ప్రోత్సహించవచ్చు.

బొంబాయిలోని ఖేర్వాడి, భివాండి, లక్నో, మీరట్, ఆగ్రా, అలిఘర్ మొదలైన అన్నిచోట్ల ఇంతే జరుగుతున్నది. పేదరికంలో మగ్గుతున్న ప్రజలను మతం పేరుతో రెచ్చగొట్టి ప్రయోజనం పొందజూచే రాజకీయ వర్గాలే అల్లర్లకు కారణవుతున్నాయి. అలాగే పాతబస్తీ కూడా, భిన్న మతస్థుల మధ్య ఒక పథకం ప్రకారం అసహనాన్ని, విద్వేషాన్ని రెచ్చగొట్టడానికి తరుచుగా ప్రయత్నం జరుగుతున్నది. ఆ ప్రయత్న ఫలితమే ప్రతి పండుగ సందర్భంలోను చెలరేగే హింసాకాండ.

పాతబస్తీ అభివృద్ధికి శ్రీ చెన్నారెడ్డి ముఖ్యమంత్రిగా వున్ననాటి నుంచి ఏవేవో పథకాలను గురించి ప్రకటనలైతే పరంపరగా వెలువడ్డాయి గాని, ఫలితం శూన్యం. చెన్నారెడ్డిగారి పాతబస్తీ అభివృద్ధి సంస్థ పథకంగాని, అంజయ్య గారి కులీకుతుబ్ షాహి పథకంగాని అమలుకాలేదు.

ఇటీవల అధికారంలోకి వచ్చిన తెలుగుదేశం ప్రభుత్వం కూడా ప్రకటనల విషయంలోను, వాటిని అమలు చేయకపోవడంలోను పాత ప్రభుత్వాల అడుగుజాడలలోనే నడుస్తున్నది తప్ప మత కలహాలతో "పాత సుస్తీ"గా మారిన పాతబస్తీని అభివృద్ధిచేయడానికి ఇంతవరకు చేసింది వీసమైనా లేదు. తెలుగుదేశం ప్రభుత్వానికి కేంద్రాన్ని నిందించడం మీద వున్న శ్రద్ధలో కించిత్తు కూడా అభివృద్ధి పథకాల అమలుపై కనబడడంలేదు. పైగా, ఇప్పుడు కొత్తగా రాజధానిలో జరిగిన మత కలహాలకు ఏదో అదృశ్య హస్తం కారణమని ఆ పార్టీ నాయకులు ఆరోపించడం తమ బాధ్యత నుంచి ప్రజల దృష్టిని మరలించడానికేనని చెప్పాలి.

ప్రస్తుతానికి పాతబస్తీలో కొంత సద్దుమణిగినట్టు కనిపిస్తున్నా, అధికార యంత్రాంగం ఉదాసీనంగా వుండడానికి వీలులేదు. క్రిందటిసారి అల్లర్లు ఇప్పటి అల్లర్లకు కారణమైతే, ఇప్పటి అల్లర్లు మరొకసారి అల్లర్లకు కారణం కావచ్చు. ఇంకా పెద్ద పండుగలు రాబోతున్నాయి. ప్రతి పెద్ద పండుగకు, పర్వదినానికి ఎప్పటికప్పుడు మరింత పెద్ద ఎత్తున ఉత్సవాలు, ఊరేగింపులు జరపడం ఇటీవలికాలంలో ఒక ఆనవాయితీ అయింది. వీటిని ఆయా మత వర్గాలు, వాటిపై ఆధారపడిన రాజకీయవర్గాలు తమ బల ప్రదర్శనకు ఉపయోగించుకుంటున్నాయి. వీటిని అధికారులు ఇకపై అనుమతించరాదు. ఎక్కడి కక్కడ పూర్వపు రోజులలోవలె చిన్న చిన్న ఊరేగింపులను తప్ప భారీ ప్రదర్శనలను నిషేధించాలి.

ఇందుకు కొన్ని రాజకీయవర్గాలు అభ్యంతరం చెప్పవచ్చు. కాని, వాటిని లెక్కచేయరాదు. రానురాను మితిమీరిపోతున్న మత సంఘర్షణలను అదుపుచేయడానికి ఇట్టి నిషేధం అత్యవసరం, భివాండిలో శివాజీ జయంతిని చాలా ఏళ్ళ తర్వాత ఇటీవల అనుమతించిన సందర్భంలోనే ఘోరమైన మత కలహాలు జరిగాయన్న విషయాన్ని ఈ సందర్భంలో విస్మరించరాదు.

మతం పేరుతో ఇంత తరచుగా మారణహోమం జరుగుతున్నా వివిధ రాజకీయ పక్షాలు పరస్పర నిందారోపణలతో ప్రకటనలు చేయడం తప్ప నిర్మాణాత్మక కృషిని చేపట్టకపోవడం ఎంతైనా విచారం కలిగిస్తుంది. కలిసికట్టుగా మత కలహాలను చల్లార్చే ఉద్యమానికి ఏ పార్టీ చొరవ తీసుకొనకపోవడం శోచనీయం.

*(ఆగస్టు 2, 1984)*

# అప్రజాస్వామికం

**ఆం**ధ్ర ప్రదేశ్ గవర్నర్ చర్య అప్రజాస్వామికం అనడంలో సందేహంలేదు. ఒక రాష్ట్ర ముఖ్యమంత్రికి శాసనసభలో మెజారిటీ కలదో లేదో నిర్ధారణ చేయడానికి తగిన వేదిక రాజ్ భవన్ కాదు, మరొక భవన్ కాదు; శాసనసభే.

శ్రీ నాదెండ్ల భాస్కరరావు ప్రభృతులు రాజీనామా చేసి తమకు పలువురు తెలుగుదేశం శాసనసభ్యుల మద్దతు కలదన్నప్పుడు, శాసన సభను ఈ నెల 18వ తేదీన సమావేశం చేసి దాని విశ్వాసం తనకు కలదో లేదో నిరూపించుకునే అవకాశం తనకిమ్మని శ్రీ ఎన్.టి. రామారావు గవర్నరును కోరారు.

ఆయన సూచించిన తేదీ ఎంతో దూరంలో లేదు కనుక ఆ విధంగా ఆయనకు గవర్నరు అవకాశమిచ్చి వుండవలసింది. అలా చేయకుండా శ్రీ ఎన్.టి.రామారావు మంత్రివర్గం మెజారిటీ కోల్పోయిందని తనకు తానే నిర్ణయించి, ఆయన రాజీనామా ఇవ్వాలని గవర్నరు కోరారు. ఆయన తిరస్కరించగా మంత్రివర్గాన్ని బర్తరఫ్ చేశారు. శ్రీ నాదెండ్ల భాస్కరరావు చేత ముఖ్యమంత్రిగా ప్రమాణస్వీకారం చేయించారు. ఇవన్నీ ఎంత మాత్రం సమర్థించరాని చర్యలు.

ఒక పార్టీ నాయకునికి శాసన సభలో మెజారిటీ వుందో లేదో తనకు తానే నిర్ణయించుకునే సాంకేతిక అధికారం గవర్నరుకు వుండవచ్చు. కానీ, సాంకేతికంగా సమర్థనీయమైనది నైతికంగా సమర్థనీయమని చెప్పడానికి వీలులేదు. కనుకనే, కాశ్మీర్‌లో అబ్దుల్లా ప్రభుత్వాన్ని గవర్నరు తనకు తానే బర్తరఫ్ చేయడం నైతికంగా సమర్థించరానిదని మేము అభిప్రాయపడ్డాము. అదే అభిప్రాయం ఇప్పటి సందర్భంలో కూడా వర్తిస్తుంది.

ముఖ్యమంత్రిగా శ్రీ ఎన్.టి.రామారావులో ఎన్ని లోపాలైనా వుండవచ్చు. ఆయన ప్రభుత్వం అసమర్థమైనదే కావచ్చు. కనుకనే తెలుగుదేశం పార్టీని స్థాపించిన క్షణం నుంచి నిన్నటి వరకు ఆయన ప్రాంతీయతత్వాన్ని, కేంద్రం పట్ల వ్యతిరేకతా వైఖరిని, మరి పెక్కు అనుచిత విధానాలను మేము తీవ్రంగా విమర్శిస్తూనే వచ్చాము. ఆయన వ్యవహారశైలిని సయితం విమర్శించాము.

కాని, ఆయన అత్యధిక ప్రజాదరంతో అధికారానికి వచ్చిన వ్యక్తి. ఆయన పట్ల ప్రజాదరం మొదటిలో కంటె ఇప్పుడు తగ్గినమాట నిజమే కావచ్చు. తెలుగుదేశం పార్టీలో తిరుగుబాటు కారణంగా శాసనసభలో కూడా ఆయన బలం తగ్గి వుండవచ్చు. కాని, ఆ విషయం తేలవలసింది శాసనసభలోనేకాని, బయటకాదు. ఆయన ప్రభుత్వాన్ని బర్తరఫ్ చేసిన తీరు పూర్తిగా అభ్యంతరకరం.

గవర్నరు శ్రీ రామ్‌లాల్ చర్య అప్రజాస్వామికమని మరొకసారి మేము ఉద్ఘాటించ గోరుతున్నాము. మన ప్రజాస్వామ్య సంప్రదాయాలకు ఇది గొడ్డలి పెట్టు వంటి చర్య. దాన్ని ఖండించడం మా విధిగా మేము భావిస్తున్నాము.

*(ఆగస్టు 17, 1984)*

# ఇదీ ప్రజాస్వామ్యం!

ప్రజాస్వామ్యం అనే మాట ప్రజలు చాలాకాలంగా వింటున్న మాటే. అయినవేళ, కానివేళ వారి నోట వీరినోట నలిగి నలిగి దాని అర్థం మరుగునపడి కూడా చాలా కాలమైంది.

కాని, నేడు నిజంగా ప్రజాస్వామ్యం అంటే ఇదీ అని ఆంధ్రప్రదేశ్ ప్రజలు, వారితో పాటు భారతీయ ప్రజలు అనుభవపూర్వకంగా తెలుసుకోగలిగారు. ఆ మాటలో అంతర్నిహితంగా వున్న ప్రచండశక్తి నేడు - బహుశా ఇటీవలి కాలంలో మొదటిసారిగా - సర్వ ప్రపంచానికి తేట తెల్లమైంది.

నెలరోజులపాటు ఆంధ్రప్రదేశ్‌లో ప్రజాస్వామ్యానికి గ్రహణం పట్టింది. నేడు అది రాహు విముక్త చంద్రబింబం వలె చల్లని వెలుగులు ప్రసరిస్తున్నది.

నెలరోజులనాడు గవర్నరు శ్రీ రామ్‌లాల్ శ్రీ ఎన్.టి.రామారావు ప్రభుత్వాన్ని అక్రమంగా, అప్రజాస్వామికంగా బర్తరఫ్ చేశాడు. శ్రీ నాదెండ్ల భాస్కరరావు నెత్తిన అంతే అక్రమంగా, అప్రజాస్వామికంగా ముఖ్యమంత్రిత్వ పదవీ కిరీటాన్ని అలంకరించాడు. శ్రీ భాస్కరరావుకు ఆనాడు, ఈనాడు, ఏనాడు అసెంబ్లీలో మెజారిటీ లేదని సమస్త ప్రపంచానికి విదితమైనా, రాజ్‌భవన్‌కు మాత్రం అది తెలియడానికి నెలరోజులు పట్టింది. ఈ నెల రోజులు ఒక అప్రజాస్వామిక ప్రభుత్వం కొనసాగింది, కొనసాగనివ్వబడింది.

అసెంబ్లీలో మెజారిటీ విశ్వాసాన్ని పొందడానికి శ్రీ రామ్‌లాల్ శ్రీ భాస్కరరావుకు నెల రోజులు గడువిచ్చినమాట నిజమే. కాని, శ్రీ భాస్కరరావు ఆ విషయంలో ఘోరంగా విఫలమయ్యారు. ఎవరో కొద్దిమంది కంచె దూకి ఆయన శిబిరానికి వచ్చినా, శ్రీ ఎన్.టి.రామారావు మెజారిటీ - ప్రతిపక్ష సభ్యుల మద్దతును కూడా కలుపుకొని - ఇన్నాళ్ళూ అన్ని పరీక్షలను తట్టుకుని, యథాతథంగా కొనసాగింది.

కొత్త గవర్నరు శ్రీ ఎస్.డి.శర్మ బలాబలాల నిరూపణకు అసెంబ్లీ సమావేశాన్ని ఏర్పాటు చేయగా, ఆ సమావేశంలో విశ్వాస తీర్మానం ప్రతిపాదన జరగకుండా శ్రీ భాస్కర రావు వర్గం, దాని మద్దతుదారులు ఎంత గలభా, గందరగోళం సృష్టించాలో అంతగాను సృష్టించారు. సభ్య ప్రపంచం యావత్తు విస్తుపోయే విధంగా జుగుప్సాకరంగా, దౌర్జన్యకరంగా ప్రవర్తించారు. ఎంత చేసినా శ్రీ భాస్కరరావు మెజారిటీ సంపాదించుకొనలేకపోయారు.

చివరికి శ్రీ రామ్‌లాల్ మొదట పెట్టిన నెల రోజుల గడువుకూడా పూర్తి అయింది. అంతకు మించి శ్రీ భాస్కరరావు మెజారిటీ నిరూపణ నిమిత్తం వ్యవధిని పొడిగించడం ఎంతమాత్రం సంభావ్యం కాబోదని, అది పూర్తిగా రాజ్యాంగ విరుద్ధం, ప్రజాస్వామ్య వ్యతిరేకం కాగలదని గవర్నరు శ్రీ ఎస్.డి.శర్మ భావించారు. శ్రీ భాస్కరరావును రాజీనామా చేయమని కోరారు. శ్రీ

ఎన్.టి.రామారావుకు మెజారిటీ కలదని సంతృప్తి చెందినందున మంత్రివర్గ నిర్మాణానికి ఆయనను ఆహ్వానించారు. "అక్రమం, అన్యాయం" అంటూనే అనిష్టంగానే శ్రీ భాస్కరరావు రాజీనామా చేయడం, ఇది ప్రజల విజయంగా వర్ణిస్తూ శ్రీ రామారావు ముఖ్యమంత్రిగా తిరిగి పదవీ స్వీకారం చేసి మంత్రివర్గాన్ని ఏర్పాటు చేయడం సంభ్రమాశ్చర్యకరంగా, ప్రజాస్వామ్య ప్రియులకు ఆనందదాయకంగా ఆదివారంనాడు జరిగి పోయింది. దీన్ని చరిత్రాత్మక సంఘటనగా తప్ప మరొక విధంగా వర్ణించడానికి వీలులేదు.

శ్రీ రామారావు బర్తరఫ్ తమకు తెలియలేదని ప్రధాని శ్రీమతి గాంధి పార్లమెంటులో ప్రకటించారు. ఈ ప్రకటనను చాలామంది విశ్వసించనిమాట నిజమే. కాని, శ్రీమతి ఇందిరా గాంధి వంటి సుదీర్ఘ రాజకీయానుభవం గల పరిణత రాజనీతిజ్ఞురాలు ఎన్నో విషమ పరిణామాలకు దారితీయగల ఈ చర్యను స్వయంగా అనుమతించివుంటారని దేశంలో మరి కొందరు రాజకీయ వ్యాఖ్యాతలవలె మేము కూడా నమ్మలేకపోతున్నాము.

అయితే, ఆంధ్రప్రదేశ్‌లో జరిగిన పొరపాటును, తప్పిదాన్ని, దానివల్ల తమకు, తమ పార్టీకి జరగగల అపకారాన్ని ఆమె పూర్తిగా గ్రహించారని మేము భావిస్తున్నాము. అందుచేతనే జరిగిన దానికి పరిహారంగా శ్రీ భాస్కరరావును తొలగించి శ్రీ రామారావుకు తిరిగి మంత్రివర్గ నిర్మాణావకాశాన్ని ఇవ్వడంలో స్వయంగా ప్రధాని జోక్యం వున్నదనే మేము భావిస్తున్నాము.

ఆంధ్రప్రదేశ్‌లో మెజారిటీగల ఒక పార్టీని అధికారచ్యుతం చేయడం పట్ల రాష్ట్ర ప్రజలలో ఆగ్రహావేశాలు ప్రబలడంలో ఆశ్చర్యం లేదు. కాని, అదేవిధమైన ఆగ్రహం, ఆందోళన యావద్భారతంలోను ఇంతకుముందెన్నడు, ఏ సందర్భంలోను లేని విధంగా కలగడం నిజంగా అరుదైన విశేషమే. ఆంధ్రప్రదేశ్‌లో ప్రజాస్వామ్య పునరుద్ధరణ నిర్ణయానికి ఇది అన్నిటికంటె మిన్నగా తోడ్పడి వుంటుందనడంలో సందేహంలేదు. ఈ కారణాన్ని పురస్కరించుకొని అట్టి నిర్ణయానికి వచ్చిన కేంద్ర నాయకత్వాన్ని, ఆంధ్రప్రదేశ్ గవర్నరును మేము హృదయపూర్వకంగా పదే పదే అభినందిస్తున్నాము.

నెల రోజుల పాటు అకుంఠిత దీక్షతో, అచంచల ఆత్మ విశ్వాసంతో, తనకు జరిగిన అన్యాయ నిష్కృతికి నిర్విరామంగా పోరాడిన శ్రీ ఎన్.టి.రామారావును కూడా మేము ఈ సందర్భంగా అభినందిస్తున్నాము. అయితే, ఇదే సందర్భంలో కొన్ని విషయాలు మేము మనవి చేయదలచుకున్నాము. మేము ఇంతకుముందే పెక్కుసార్లు స్పష్టం చేసినట్టు, ఆయన "తెలుగుదేశం" పార్టీని స్థాపించిన క్షణం నుంచి దాని ప్రాంతీయ తత్వ ప్రాతిపదికను, అధికారానికి వచ్చిన తర్వాత ఆయన అనుసరించిన అనుచిత, అనాలోచిత విధానాలను మేము నిస్సంకోచంగా వ్యతిరేకిస్తూ వచ్చాము. మా వ్యతిరేక వైఖరిలో నాటికి, నేటికి ఎట్టి మార్పు లేదు. ఆయనను పదవీచ్యుతుని చేసిన అప్రజాస్వామిక విధానాన్నే మేము గర్హించాము తప్ప, ఆయన వ్యవహారశైలిని, ఆయన ప్రభుత్వ విధానాలను మేము ఎన్నడూ ఆమోదించలేదు. ఇకపై కూడా

ఆయన ప్రభుత్వంపట్ల మా వైఖరి ఆయన విధానాల ఉచితానుచితాలపైనే ఆధారపడి వుంటుందని స్పష్టం చేయదలుచుకున్నాము.

శ్రీ ఎన్.టి.రామారావు అధికారానికి వచ్చిన స్వల్పకాలంలో అనుభవ రాహిత్యంవల్ల అత్యాశకుపోయి ఏకకాలంలో అనేక సమస్యల పరిష్కారం పేరుతో తొందరపాటు నిర్ణయాలు చేసి దాదాపు ఏ వర్గాన్ని సంతృప్తి పరచలేక పోయారు. లేకపోతే, ప్రభుత్వోద్యోగుల రిటైర్మెంట్ వయస్సు పరిమితిని ఎందుకు తగ్గించినట్టు? శాసనమండలి రద్దుకు ఎందుకు సిఫారసు చేసినట్టు? పంచాయతీరాజ్ వ్యవస్థలో అనుచితమైన మార్పులను ఎందుకు తలపెట్టారు? ఆర్డినెన్స్‌ల సహాయంతో, ఫిరాయింపుల పద్ధతితో జిల్లా పరిషత్తులను కబళించడానికి ఆ ఎత్తుగడలేమిటి? గ్రామోద్యోగుల వ్యవస్థ నిర్మూలనకు ఎందుకు నిర్ణయించారు? అకాడమీలపై ఆ కక్ష దేనికి? ఈ విధంగా ఆయన అనాలోచిత నిర్ణయాలను ఎన్నిటినైనా ఏకరువు పెట్టవచ్చు.

అలాగే, ఆయన ఆరు కోట్ల ఆంధ్రుల ఆత్మగౌరవం నేలపాలు అవుతున్నదంటూ దాన్ని నిలబెట్టడానికి దివి నుంచి దిగిన అవతార పురుషుని వలె చేసిన అభినయం! వ్యక్తి పూజను ఆయన ప్రోత్సహించారు. ముఖ్యమంత్రికి, లేదా ప్రధానమంత్రికి నిర్వచనం "సమానులలో ప్రథముడు" అని. దీనికి భిన్నంగా శ్రీ రామారావు తన మంత్రి వర్గ సహచరుల ఆత్మగౌరవాన్ని కించపరుస్తూ, ఎవరినీ నమ్మకుండా ప్రవర్తించారని, తన పార్టీ శాసనసభ్యులపట్ల అవమానకరంగా ప్రవర్తించారని, అధికారులను కూడా గడ్డిపోచలవలె చూశారని, విమర్శలకు గురి అయ్యారు. ఇంతేకాకపోతే, గణనీయమైన సంఖ్యలో ఆయనపై శాసనసభ్యులు తిరుగుబాటు చేసేవారే కాదు.

అన్నిటికంటె అభ్యంతరకరమైన ఒకే ఒక అంశం శ్రీ రామారావు అధికారానికి వచ్చిన క్షణం నుంచి కేంద్రంతో కయ్యానికి కాలుదువ్విన విధానం. ఆంధ్రప్రదేశ్‌లో ఎక్కడ ఏ మూల ఏమి జరిగినా కేంద్రాన్ని నిందించడం ఆయనకు "సెకండ్ నేచర్"గా, ఒక వ్యసనంగా తయారైంది. చివరికి ఆయన కేంద్ర ప్రభుత్వ విద్వేషం "ఇండియాలో రాష్ట్రాలు తప్ప కేంద్రం లేదు. అది మిథ్య. కేంద్రానికి అధికారం రాష్ట్రాలిస్తేనే వస్తుంది. లేకపోతే లేదు." అని ఒక విచిత్ర సిద్ధాంతం చేసే వరకు వెళ్ళింది. ఇది ఎవ్వరూ - ఎన్నడూ సహించరాని విషయం.

ఇదంతా కొంత అనుభవ రాహిత్యంవల్ల, కొంత ఏదో ఇతరేతర కాంక్షా ప్రాబల్యంవల్ల జరిగివుండాలి. ఈ లోపాలన్నిటిని మేము కడచిన ఏడాదిగా ఎప్పటికప్పుడు సహేతుకంగా విమర్శిస్తూనే వచ్చాము. ఇకపై కూడా అవే లోపాలు కొనసాగితే, కొనసాగిన మేరకు విమర్శిస్తూనే వుంటాము.

కాని, కడచిన నెల రోజుల అనుభవాలు అనేకులకు అనేక విధాలుగా కనువిప్పు కలిగించి వుంటాయి. ముఖ్యంగా తిరిగి పదవీ స్వీకారం చేసిన శ్రీ ఎన్.టి.రామారావు కొన్ని పాఠాలను నేర్చుకొని వుంటారనుకొంటున్నాము. తమ వ్యక్తిగత, ప్రభుత్వగత లోపాలను పరిహరించి రాష్ట్రానికి సుపరిపాలనను ప్రసాదించి, దాని సర్వతోముఖ వికాసానికి నిర్విరామ కృషి

సాగించగలరని ఆశిస్తున్నాము. తనకు జరిగిన అన్యాయాన్ని ఎదిరించి పోరాడి సాధించిన అపూర్వ విజయానికి అభినందిస్తూనే ఈ స్నేహ పూర్వక హితోక్తులను ఆయన దృష్టికి తీసుకువస్తున్నాము.

ఈ సందర్భంలో ముఖ్యమంత్రి రామారావుగారికి మరొక మనవి చేయదలుచుకున్నాము. మూడు రోజుల పాటు అసెంబ్లీ సమావేశంలో తమపట్ల ప్రత్యర్థులు ఎంత అసభ్యంగా ప్రవర్తించినా శ్రీ రామారావు, ఆయన సహచరులు ఎంతో హుందాగా, నిగ్రహంతో వ్యవహరించి అందరి ప్రశంసలు చూరగొన్నారు. తిరిగి అధికారానికి వచ్చిన ఈ తరుణంలో తమ ప్రత్యర్థులపట్ల అదే హుందాతనాన్ని, నిగ్రహాన్ని, ఔదార్యాన్ని ప్రదర్శించగలరని నమ్ముతున్నాము.

*(సెప్టెంబర్ 18, 1984)*

# నేల కొరిగిన గులాబి

ఆమె మరి మనకు కనబడదు. చిరునవ్వులు చిందే ఆమె సుందరవదనం శాశ్వతంగా మాయమైంది.

ఆమె పేరే ఇందిరా ప్రియదర్శిని! ఇందిర ప్రియదర్శనం మరి మనకు లేదు

తన ప్రజల కష్ట సుఖాలు తెలుసుకొనడానికి, వారిని సాదరంగా పలకరించడానికి, ఆసేతుశీతనగ పర్యంతం అహర్నిశలు విసుగు, విరతి లేకుండా సంచరించిన భారతప్రియతమ ప్రధాని శ్రీమతిఇందిరాగాంధి నేటినుంచి మన మధ్య తిరగరు

కోట్లకొలది భారతీయులు -- అట్టడుగు వర్గాల ప్రజలు -- "అమ్మ!"అని నోరారా ఆప్యాయంగా పిలుచుకునే శతసహస్ర నరనారీ హృదయనేత్రి ఇక ఎన్నటికి తిరిగిరాదు.

పద్దెనిమిదేళ్ళ క్రిందట మొదటిసారిగా భారత ప్రధాని పదవిని అధిష్ఠించి, మధ్యలో మూడేళ్ళు తప్ప నిర్విరామంగా దేశాన్ని శత్రు దుర్నిరీక్ష్యంగా పరిపాలించిన మహారాజ నీతిజ్ఞురాలు మరి తన ప్రజలకు దర్శన మివ్వదు.

చిన్ననాట విశ్వకవి శాంతినికేతనంలోను, మరి కొన్నిచోట్ల విద్యాభ్యాసం చేసినా, తండ్రి జవహర్లాల్ నెహ్రూయే ఆమె ప్రధాన గురువు. ఆయన కలం నుంచి వెలువడిన లేఖలరూపంలో ఇందిర ప్రపంచ పరిణామ చరిత్రను, మానవజాతి వికాసగాథను అవలోడనం చేసింది. తన లేత మెదడును పరిపుష్టం చేసుకున్నది. తండ్రివెంట దేశదేశాలు తిరిగింది. ప్రపంచ రాజకీయ నాయకులను, మేధావులను పరిచయం చేసుకున్నది. భారత స్వాతంత్ర్యోద్యమంలో తన కుటుంబ సభ్యులందరితో పాటు తాను కూడా ఓపిన మేరకు పాల్గొన్నది. చిన్ననాటినుంచి దేశసేవా నిరతిని పెంచుకున్నది. వీటన్నింటితో వచ్చిన ఒకానొక హృదయ - మేధా సంస్కారంతో ఆమె ప్రధాని అయిన తర్వాత ప్రపంచ రాజకీయ ప్రముఖులలో అగ్రశ్రేణికి చెందిన వ్యక్తిగా గణనకెక్కింది.అలీనోద్యమ అధ్యక్షురాలుగా ప్రాక్పశ్చిమ రాజ్యకూటాల మధ్య అణ్వాస్త్రయుద్ధ ప్రమాద నివారణకు ఆమె ఎంతగానో కృషి చేసింది. ఆ మహా రాజనీతివేత్రి నేడు శాశ్వతంగా అంతర్ధానమైంది

"తల్లీ! ధైర్యం అలవరుచుకో! ప్రపంచం నీవెంట వస్తుంది!" అని తండ్రి ఆమెకు ఉపదేశించాడు. అలాగే శ్రీమతి ఇందిర అమితధైర్య సాహసాలతో జీవిత రణరంగంలో ఎవరికీ వెరవక, ఏ క్లిష్ట పరిస్థితికీ వెన్నివ్వక నిలిచింది. దేశాభ్యుదయ మహాకార్యక్రమానికి తన జీవితాన్ని అంకితం చేసింది. ఎన్ని అవాంతరాలు ఎదురైనా ఆ కృషిలో మునుముందుకే సాగిపోయింది. ఆ మేరునగధీరురాలు నేడు నేల కొరిగింది.

మొన్న మొన్న పంజాబులో సిక్కు మతోన్మాదులు, ఉగ్రవాదులు చెలరేగి రాష్ట్రాన్ని నానా

బీభత్సం చేస్తుండగా, ఆమె వారిపై కఠిన చర్యలు గైకొనక తప్ప లేదు. అమృత్‌సర్ స్వర్ణాలయంలో దాగిన దుండగులను వెడలగొట్టడానికి సైన్యాన్ని ప్రయోగించడం అనివార్యమైంది. ఈ చర్యలో పెక్కుమంది ఉగ్రవాదులు విహతులయ్యారు. అకాల్‌తఖ్త్ దెబ్బతిన్నది. నాటి నుంచి సిక్కు ఉగ్రవాదులు ఆమెపై పగ బట్టారు. ఆమెను హత్య చేయడానికి ప్రతిజ్ఞ వహించారు. అయినా, ఆమె చలించలేదు. దేశసమైక్యం, సమగ్రత --వీటిని తన ప్రాణాధికాలుగా భావించి వాటి పరిరక్షణకు దీక్ష వహించింది. చివరికి ఆ కిరాతక మతోన్మాదుల తుపాకి తూటాలకే ఆమె బలి అయింది. అలనాడు మహాత్మా గాంధివలె నేడు ఇందిరాగాంధి మృతి కూడా వీరోచిత మరణం.

తనతండ్రి అసంపూర్తిగా వదలివెళ్ళిన దేశాభివృద్ధికృషిని శ్రీమతిగాంధి అకుంఠిత దీక్షతో, అప్రతిమాన దీక్షతో కొనసాగించింది. ఆ కృషి తిరిగి ఆమె విషాద మరణంతో అసంపూర్తిగానే మిగిలిపోతున్నది. దేశం ఎన్నడూ ఎరుగనంతటి అత్యంత క్లిష్ట పరిస్థితిలో వుండగా జీవిత రంగం నుంచి ఆమె నిష్క్రమించడం జాతికి ఎన్నటికీ తీరనిలోటు.

రాజకీయాలలోవున్న వారికి, ముఖ్యంగా ప్రభుత్వాధికారంలో వున్నవారికి శత్రువులు ఎందరో వుంటారు. ప్రాణాపాయం అడుగడుగునా పొంచి చూస్తూ వుంటుంది.ఎంత జాగరూకతతో వున్నా, ఎటు నుంచి ఏప్రమాదం వచ్చి పడుతుందో తెలియదు. అయినా, శ్రీమతి గాంధి భద్రత విషయంలో ఎందుకింత ప్రమత్తత సంభవించిందో, ఆమెను ఆమె భద్రతా సిబ్బందిలోని వారే హత్యచేయడం ఎలా జరిగిందో, ఆశ్చర్యం.

రాజకీయ విభేదాలు ఎంత తీవ్రంగా నైనా వుండవచ్చు. అయినా, రాజకీయవేత్తల హత్యలతో విభేదాలు పరిష్కారం కావు. ప్రజాస్వామ్యంలో ప్రతీకార రాజకీయాలకు తావు లేదు. సిక్కు ఉగ్రవాదులు భారత ప్రధానిని రాజకీయంగా ఎదుర్కొనలేక హత్యకు పాల్పడడంకంటె పిరికితనం మరిలేదు. వారి ఘాతుకాన్ని సర్వసభ్య ప్రపంచం ముక్తకంఠంతో ఖండిస్తుంది. ఆమె ఆకస్మిక విషాద మరణానికి బాధాసంతప్త హృదయంతో స్పందిస్తుంది.

దేశ సమగ్రత, జాతి సమైక్యంకోసం శ్రీమతి గాంధి తన జీవితాన్ని బలి చేశారు. ఆమె జీవితధ్యేయంకోసం పునరంకితం కావడం నేడు ప్రతిభారత పౌరుని పవిత్రకర్తవ్యం.అదే సమయంలో శ్రీమతిగాంధి నిష్క్రమణతో దేశంలో ఏర్పడిన ఈనాటి క్లిష్ట పరిస్థితిని నిబ్బరంగా, సహనం కోల్పోక నిగ్రహంతో, విజ్ఞతతో, వివేకంతోఎదుర్కొనడం కూడా ప్రతి భారతీయుని పునీత విధి. ఇంతకంటె తమ ప్రియతమ నేత్రికి భారతజాతి నేడు అర్పించ గలిగిన నివాళి మరి లేదు.

*(నవంబరు 1, 1984)*

# "ఎన్.టి.ఆర్.ఉవాచ"

"బ్రహ్మసత్యం, జగన్మిథ్య" - అని వేదాంతు లంటారు

"కేంద్రం మిథ్య, రాష్ట్రాలు సత్యం" - అని ఎన్.టి.ఆర్. ఉవాచ.

దీన్ని రాజకీయ అజ్ఞానమని అనేవారిని అననివ్వండి. ముఖ్యమంత్రి శ్రీ ఎన్.టి.ఆర్. మాత్రం ఈ వాదాన్ని విరమించరు. "కేంద్రం అనేదిలేదు. అది మిథ్య" అని అంటూనే వుంటారు.

ఇప్పుడు దీన్ని సమర్థించుకొనడానికి సరికొత్త రుజువును కని పెట్టారు. రాజ్యాంగం తిరగేసి చూడగా దానిలో ఎక్కడా "సెంట్రల్ గవర్న్‌మెంట్" - కేంద్రప్రభుత్వం - అనే మాట కనబడ లేదు. యూనియన్ గవర్న్‌మెంట్ అనే మాటే వుంది. అందుచేత కేంద్రం (సెంటర్) అనేది మిథ్య అని తేల్చివేశారు.

ఆదోనిలో ఒక ఎన్నికల ప్రచార సభలో మాట్లాడుతూ "యూనియన్ గవర్న్‌మెంట్ అంటే రాష్ట్ర ప్రభుత్వాల యూనియన్ అని ముఖ్యమంత్రి కొత్త నిర్వచన మిచ్చారు. రాష్ట్ర ప్రభుత్వాల నిర్ణయాలను ఒక ట్రస్టీవలె అమలు చేయడమే యూనియన్ ప్రభుత్వం విధి అని సెలవిచ్చారు. తమ రాజకీయ అజ్ఞానాన్ని మరొకసారి బయటపెట్టుకున్నారు.

భారత రాజ్యాంగం కేంద్రం (సెంటర్) అనే మాటను ఉపయోగించలేదు నిజమే. ఈ విషయాన్ని ఇప్పుడు కొత్తగా ఎవరూ జ్ఞాపకం చేయనక్కరలేదు. రాజ్యాంగంలోని మొట్టమొదటి వాక్యం "ఇండియా, దటీజ్ భారత్, షల్ బి ఎ యూనియన్ ఆఫ్ స్టేట్స్" (భారతదేశం రాష్ట్రాల యూనియన్) అని పేర్కొంటున్నది. ఈ విషయం కడచిన 35 ఏళ్లుగా అందరికీ తెలిసిందే.

"సెంటర్" అనే మాటను రాజ్యాంగంలో ఉపయోగించనంత మాత్రాన కేంద్రం, కేంద్ర ప్రభుత్వం మిథ్య అయిపోవు. యూనియన్‌ను, సెంటర్‌ను మనం ఇన్నాళ్లుగా పర్యాయపదాలుగా వాడుతున్నాము. ఇలా వాడుతున్నవారు కాంగ్రెస్ వారొక్కరేకాదు. ప్రతిపక్షాలతో సహా అందరూ వాడుతున్నారు. కేంద్రం మిథ్య అయితే, యూనియన్ కూడా మిథ్యే కావాలి.

అయినా, రాజ్యాంగం కేంద్ర ప్రభుత్వం అనే మాటను పేర్కొనలేదని చెప్పడం ద్వారా శ్రీ ఎన్.టి. రామారావు ఏ కొత్త విషయాన్ని ఆవిష్కరించదలచారో అర్థం కావడం లేదు. కేంద్ర ప్రభుత్వం అనే మాట లేకపోయినా, యూనియన్ ప్రభుత్వం అనే మాట వున్నది కదా? రెండింటిని సమానార్థకాలుగా వాడుతున్నారు కదా? ఎడమ చెయ్యి వేరు, పుర చెయ్యి వేరూనా?

పైగా, మన రాష్ట్రాలన్నీ కలిస్తే భారత్ యూనియన్ అవుతున్నది తప్ప రాష్ట్ర ప్రభుత్వాలన్నీ కలిస్తే యూనియన్ ప్రభుత్వం కావడం లేదు. అది శ్రీ ఎన్.టి.ఆర్. సొంత కవిత్వం.

శ్రీ ఎన్.టి.ఆర్. మనకు చెప్పగోరుతున్న మరొక "సత్యం" రాష్ట్ర ప్రభుత్వాల నిర్ణయాలను అమలుచేయడమే యూనియన్ ప్రభుత్వం విధి-ట.

ఈ విచిత్ర సూత్రం మనకు తెలిసిన భారత రాజ్యాంగంలో ఎక్కడున్నదో శ్రీ ఎన్.టి.ఆర్. చెప్పలేదు. రాజ్యాంగంలోని ఏడవ షెడ్యూలులో మూడు రకాల జాబితాలున్నాయి. ఒకటి యూనియన్ జాబితా. ఇది 97 అధికారాలను యూనియన్ ప్రభుత్వ పరిధిలోనివిగా పేర్కొంటున్నది. రెండవది రాష్ట్రాల జాబితా. ఇది 66 అధికారాలను రాష్ట్ర ప్రభుత్వాల పరిధిలోనివిగా పేర్కొంటున్నది. మూడవది ఉమ్మడి జాబితా. ఇది 47 అధికారాలను యూనియన్‌కు, రాష్ట్రాలకు చెందిన సంయుక్త పరిధిలోనివిగా పేర్కొంటున్నది.

అంతేతప్ప, రాష్ట్ర ప్రభుత్వాల నిర్ణయాలను అమలుచేసే ట్రస్టీ మాత్రమే యూనియన్ ప్రభుత్వమని ఎక్కడా రాజ్యాంగం పేర్కొనడం లేదు. నిజానికి, మన రాజ్యాంగ నిర్మాతలు రాష్ట్ర ప్రభుత్వాలకంటె యూనియన్ ప్రభుత్వానికే ఎక్కువ అధికారా లిచ్చారు.

అన్నట్టు, మన రాజ్యాంగంలో సెంటర్ అనే మాటే కాదు, ఫెడరేషన్ అనే మాట కూడా లేదు. అంతమాత్రాన భారతదేశం ఫెడరేషన్ కాకుండాపోదు. అది ఫెడరేషన్ కనుకనే పైన పేర్కొన్నవిధంగా ఏ అధికారం యూనియన్ పరిధిలోనిది, ఏది రాష్ట్రాల పరిధిలోనిది, ఏది సంయుక్త పరిధిలోనిది - అని ప్రత్యేకించి పేరు పేరునా చెప్పడం జరిగింది.

అయితే, భారతదేశం ఫెడరేషన్ అయినప్పటికి, అది యూనిటరీ ఫెడరేషన్. అంటే ఫెడరల్ స్వభావంకంటె యూనిటరీ స్వభావమే ఎక్కువగా గల ఫెడరేషన్. కనుకనే రాష్ట్ర ప్రభుత్వం కంటె యూనియన్ ప్రభుత్వానికే ఎక్కువ అధికారాలున్నాయి. ఎందుకంటే, యూనియన్ పరిధిలోకి వస్తాయని పైన పేర్కొన్న 97 అధికారాలలో 97వ దాని ప్రకారం రెండవ (రాష్ట్రాల) జాబితాలోగాని, మూడవ (ఉమ్మడి) జాబితాలోగాని పేర్కొనని ఏ ఇతర విషయమైనా యూనియన్ పరిధికి చెందినదిగానే పరిగణించాలి. అట్టి ఇతర విషయాలనే "రెసిడ్యువల్ పవర్స్" అంటారు. అంటే "శేషించిన అధికారాలు".

అమెరికా సంయుక్త రాష్ట్రాల రాజ్యాంగంలో ఈ శేషించిన అధికారాలు రాష్ట్రాల పరిధిలో వుంటే, ఇండియాలో యూనియన్ పరిధిలో వున్నాయి. అందుచేత రాష్ట్ర ప్రభుత్వాల కంటె యూనియన్ ప్రభుత్వానికే ఎక్కువ అధికారం వున్నట్టు. కనుకనే, మనది ప్రధానంగా యూనిటరీ స్వభావంగల ఫెడరల్ వ్యవస్థ.

ఇండియా అనేది రాష్ట్రాల యూనియన్ తప్ప రాష్ట్రాల కలగూరగంపకాదు. The whole is greater than the sum of its parts అంటే "వివిధ భాగాల కూడిక కంటే వాటి ఏక రూపం గొప్పది" అనేది ప్రాథమిక సత్యం. రాష్ట్రాలు అవయవాలు. యూనియన్ అవయవి. అవయవాల మొత్తంకంటె అవయవి గొప్పది. కనుక మన దేశంలో యూనియన్‌కు ఎక్కువ అధికారాలుండడంలో అసహజం లేదు.

ఇదేదో కాంగ్రెసు నాయకులు కుట్రచేసి రూపొందించిన రాజ్యాంగమని పొరపడకూడదు. మన, ఆనాటి రాజ్యాంగసభలో కాంగ్రెసు వాదులే కాదు, కాంగ్రెసు వ్యతిరేకులు సయితం

ఎందరో వున్నారు. ఆ నాటి పరిస్థితులలో, భారత జాతీయతను సుదృఢం చేయడమే పరమ లక్ష్యంగా రాజ్యాంగ నిర్మాతలు బుద్ధిపూర్వకంగానే యూనియన్ వ్యవస్థను దృఢతరమైనదిగా నిర్దేశించారు.

అయినా, ఎన్.టి.రామారావుగారు ఇప్పుడు కేంద్రంలో (క్షమించాలి. ఈ మాట రాజ్యాంగంలో లేకపోయినప్పటికి వాడక తప్పదు. "యూనియన్‌లో" అంటే అంతసుఖంగాలేదు) అధికారంలో వున్న పార్టీపట్ల ఆగ్రహంతో అసలు కేంద్ర ప్రభుత్వ వ్యవస్థపైనే నిరంతరం కారాలు, మిరియాలు నూరడం భావ్యంకాబోదు. కేంద్ర ప్రభుత్వం పరాయి ప్రభుత్వం కాదు. రాష్ట్ర ప్రభుత్వాలను ఎన్నుకున్న ప్రజలే కేంద్ర ప్రభుత్వాన్ని కూడా ఎన్నుకున్నారు. ఆ విషయం మరిచిపోయి కేంద్రం రాష్ట్రాలపై పెత్తనం చేస్తున్నదని పదేపదే అదే పల్లవి పాడడం సముచితం కాదు.

నాటికి, నేటికి దేశపరిస్థితులలో ఎన్నో మార్పులు వచ్చాయి. ఈ పరిస్థితులకు అనుగుణంగా రాజ్యాంగంలో కేంద్రం, రాష్ట్రాల అధికారాలలో ఏవైనామార్పులు చేయవలసివస్తే నిరభ్యంతరంగా రాజ్యాంగాన్ని సవరించవచ్చు. మన రాజ్యాంగం సవరణలకు అతీతమైంది కాదు. ఎన్నో సార్లు అట్టి సవరణలు జరిగాయి. అంతే తప్ప, అసలు యూనియన్ ప్రభుత్వమే రాష్ట్ర ప్రభుత్వాలకు లొంగి వుండాలన్నట్టు మాట్లాడడం దేశ విచ్ఛిత్తికి దారితీయగల ప్రమాదభరిత వాదం.

*(డిసెంబర్ 14, 1984)*

# చాసో సప్తతి

చాసో అనగానే తోడిరాగంలాంటి 'వాయులీనం' కథ జ్ఞాపకం వస్తుంది. "ఇదిగో ఈ దృశ్యం ఎన్నడైనా చూశారా?" అని రాచకురుపులాంటి జీవితాన్ని చూపించే 'ఎంపు' కథ జ్ఞాపకం వస్తుంది. కుక్కలకంటే హీనంగా బతికే మనుషుల గురించి వ్రాసిన 'కుక్కుటేశ్వరం' కథ జ్ఞాపకం వస్తుంది.

ఇంకా ఎన్నెన్నో అచ్చమైన ఆణిముత్యాల వంటి నిత్యసత్యాలను కళ్ళకు కట్టే గొప్ప కథలు జ్ఞాపకం వస్తాయి.

చాసో అనగానే కొందరికి ఫ్రెంచి వారిని భావ విప్లవోన్ముఖులను చేసిన రూసో జ్ఞాపకం వస్తాడు.

మాకు మాత్రం చెఖోవ్ జ్ఞాపకం వస్తాడు. ఎన్నో గొప్ప కథలు వ్రాసిన చెఖోవే కాదు. త్రీ సిస్టర్స్. షెర్రీ ఆర్చర్డ్ లాంటి గొప్ప నాటకాలు వ్రాసిన చెఖోవ్ కూడా జ్ఞాపకం వస్తాడు.

ఇంకా ప్రపంచ సాహిత్యంలో సూర్యాస్తమయాల గురించి, సూర్యోదయాల గురించి, చీకటి లోకంలో మినుకుమినుకుమనే మానవత్వపు మహత్వం గురించి కథలు వ్రాసిన గొప్ప రచయిత లెందరో జ్ఞాపకం వస్తారు.

చాసో అనగానే నోట్లో గిరీశం చుట్టతో, కళ్లు చిట్లించి చూస్తూ, కొంటెతనంతోనూ, గురజాడ అప్పారావుగారి లాంటి లోకపుటెరుకతోను కూడిన మందహాసంతో విజయనగరం వీథులలో తిరిగే చాగంటి మేధావిత్వం, 1940ల నాటి నుంచి అభ్యుదయ రచయితల సంఘానికి, ఎందరో వర్ధమాన రచయితలకు ఆయన ఇచ్చిన ప్రేరణ, ఉత్తేజం కూడా జ్ఞాపకం వస్తాయి.

చాసో కథలు చదువుతుంటే చాసో ఎక్కడా కనబడడు. పచ్చి జీవితం - రా లైఫ్ - ముందు కొచ్చి నిలబడుతుంది. "ఆకులందున అణగిమణగీ కవిత కోయిల పలకవలెనోయ్" అన్న గురజాడ సూక్తి మనస్సులో మెరుస్తుంది.

ఆయన వాక్యాలు "మమ్మల్ని చూడండి. ఎంత అందంగా ముస్తాబై వచ్చామో" అని మన కళ్లను మిరుమిట్లు గొలపవు. "ఇయమధిక మనోజ్ఞా వల్కలే నాపితన్వీ" అని కాళిదాసు వర్ణించిన శకుంతల సౌందర్యంలా నిరలంకారంగా వుంటూనే మనల్ని లోబరుచుకుంటాయి.

ఏమీ ఎరగనట్లుండే అమాయక నగ్న వాక్యాలతో భగ్న హృదయాలను, భుగ్న

జీవితాలను ఆయన వర్ణిస్తారు. ఆయన వచన శైలిలో అలంకార ప్రకర్ష కనబడనట్టే, ఆయన కథలలో "నేను బోలెడు మార్క్సిజం చదువుకున్నాను సుమా" అన్న సిద్ధాంత ప్రకర్ష సయితం తొంగి చూడదు. జీవిత వాస్తవత్వం మాత్రమే కనిపిస్తుంది.

శ్రీశ్రీకి ఎందుకోగాని "మరో ప్రపంచం" గీతంతో గొప్ప పేరొచ్చింది. "పొలాలనన్నీ హలాలదున్నీ...." అని హడావిడిచేసే గీతాలు కీర్తి కెక్కాయి. నిజానికి ఆయన మహా గీతాలలో ఒకటి "భిక్షువర్షీయసి".

చాసో కథలు కొన్ని చదువుతుంటే "దారి పక్క చెట్టు కింద - ఆరిన కుంపటి విధాన" ఈగలను తోలుకుంటూ కూర్చున్న వృద్ధురాలి జీవితాన్ని, మరణాన్ని శ్రీశ్రీ వర్ణించిన ఆ అద్భుత కవిత జ్ఞాపకం వస్తుంది.

తెలుగు కథను ఉన్నత శిఖరాలకు తీసుకు వెళ్ళిన గొప్ప రచయితలను పదిమందిని పేర్కొన వలసివస్తే ఏదో ఒక వేలితో చాసోను లెక్కించవలసిందే. ఆయనకు ఎందువల్లనో రావలసినంత ప్రకాస్తి రాలేదేమో ననిపిస్తుంది. ఎక్కువ వ్రాయకపోవడంవల్లనో. అట్టే చప్పుడు చేయకపోవడం వల్లనో, తెలుగువాడై పుట్టడం వల్లనో, ఏమో తెలియదు. వలభై ఏళ్ళకు పైబడి కథా వ్యవసాయం చేస్తున్నా నలభై కథలైనా వ్రాశారో లేదో అనుమానమే. అయినా అవి వేమనగారి గంగిగోవు పాలతో పోల్చదగినవి.

చాసో గారిని తలచుకుంటే ఇవాళ ఆయనకు విశాఖపట్టణంలో అభిమానులు చేస్తున్న సప్తతి జన్మ దినోత్సవ సన్మానం జ్ఞాపకం వస్తున్నది. కనీసం ఇంకొక 30 కథలైనా వ్రాసి కథా సప్తతి పూర్తి చేయాలని కోరుతూ ఈ శుభసందర్భంలో ఆయనకు మా శుభాకాంక్షలు తెలుపుతున్నాము.

*(మార్చి 10, 1985)*

# ఉగాది ఊహలు

ఆధునిక శాస్త్రవేత్తలు కాలాన్ని బాణంతో పోల్చారు. దాన్ని "యారో ఆఫ్ టైమ్" అంటారు. బాణం సంధించి విడిస్తే ముందుకే పోతుందిగాని, వెనుకకు రాదు.

కాలం కూడా అంతే. ముందుకే తప్ప వెనుకకు మరలదు. "సమయ మమూల్య మొక్క నిముసంబు వృథా జన గ్రమ్మరింపనేరము..." అన్నారు కవి కోకిల దువ్వూరి.

అయితే, మన పూర్వులు కాలాన్ని చక్రంతో పోల్చారు. చక్రనేమివలె అది తిరిగి తిరిగి ఆవృత్తమవుతుంది.

నేటి సూర్యోదయం నుంచి రేపటి సూర్యోదయం వరకు ఒక రోజు. సూర్యోదయాస్తమయాలున్నంత వరకు రోజులు తిరిగి తిరిగి వస్తాయి. వారానికి ఏడు రోజులు. అవే తిరిగి తిరిగి వస్తాయి. నెలకి రెండు పక్షాలు. పక్షానికి పదిహేను తిథులు. సంవత్సరానికి పన్నెండు నెలలు. పన్నెండు నెలలలో ఆరు ఋతువులు.

ఇవన్నీ చక్రనేమివలె పునరావృత్తాలవుతాయి: అరవై సంవత్సరాలయ్యేసరికి షష్టిపూర్తి చేసుకుని కాలచక్రం బయలు దేరిన చోటికి తిరిగి వస్తుంది. "శిష్యా! ఇది అనంతం" అన్నట్టు ఈ క్రమానికి అంతులేదు.

మన అరవై సంవత్సరాలకు ప్రభవ, విభవ అంటూ, అరవై పేర్లున్నాయి. నేటితో రక్తాక్షి వెళ్ళిపోయింది. క్రోధన ప్రవేశించింది.

కొన్ని సంవత్సరాలకు శ్రవణసుఖంగా వుండే పేర్లుంటే, మరి కొన్నిటికి భీతిగొలిపే పేర్లుంటాయి. ఆయా సంవత్సరాలకు ఆయా పేర్లు రావడానికి ఏవేవో కథలు చెబుతారుకాని, అవన్నీ కాకమ్మ కథలే.

పేర్లని బట్టి ఆయా సంవత్సరాల సంఘటనలను వ్యాఖ్యానించడానికి కవులు, అకవులు కూడా ప్రయత్నిస్తూ వుంటారు. ఆ ప్రయత్నాలను కూడా ఉబుసుపోకకు చేసే పనులుగానే భావించవచ్చు.

సంవత్సరం పేరునుబట్టి సంవత్సరంలో సంఘటనలు జరగవు. ఉదాహరణకు సౌమ్య అనే సంవత్సరం అతి భయంకరంగా గడవవచ్చు. ఏ సంవత్సరాన్ని తీసుకున్నా శుభాశుభాల మిశ్రంగానే వుంటుంది. అందుచేత ఏ సంవత్సరం పేరును సార్థకమని చెప్పలేము.

నేటితో రక్తాక్షి వెళ్ళిపోయి క్రోధన నామ సంవత్సరం వచ్చింది. గతించిన సంవత్సరంలో స్వర్ణాలయం లోపల, వెలుపల అనేకుల వధ, శ్రీమతి గాంధి దారుణ హత్య, భోపాల్‌లో విషవాయు మరణాలు, ఇంకా ఎక్కడెక్కడో ఏవేవో రక్తపాత సంఘటనలు జరిగాయి. కనుక రక్తాక్షి సార్థక నామమని, రానున్న సంవత్సరం కూడా ఇలాగే వుండే సూచనలున్నాయి కనుక క్రోధన కూడా సార్థకం కావచ్చునని స్వారస్యాలులాగే వారికి కొరత వుండదు.

ఇవన్నీ అటుంచి, తెలుగు సంవత్సరాల పేర్లని తలుచుకున్నప్పుడల్లా కాలచక్ర పరిభ్రమణం గురించిన ఆలోచనలు రాకమానవు. అరవై సంవత్సరాలు ఒక ఆవృత్తం. అలాగే నాలుగు

యుగాలు - కృత, త్రేతా, ద్వాపర, కలి - కలిసి ఒక మహాయుగం. ఇటువంటి మహా యుగాలు కలిసి ఒక మన్వంతరం. కొన్ని మన్వంతరాలు ఒక కల్పం... ఈ విధంగా మన పూర్వులు కాల విభజన చేశారు. ఈ విభాగాలు తిరిగి తిరిగి వస్తూ పోతూ వుంటాయి.

గ్రీకు తాత్వికుడు పార్మెనిడీజ్ కాలాన్ని మిథ్యగా కొట్టివేశాడు. కాలం అంటే కదలికకు, మార్పుకు ప్రతీక కదా? కదలిక. మార్పు అనేవి లేవు; అఖండత్వమే సత్యం. అందుచేత కాలం అనేది లేదన్నాడు. దీనికి విరుద్ధంగా హెరాక్లిటస్ అనే మరొక గ్రీకు తత్వ వేత్త మార్పు ఒక్కటే సత్యమని, "ఒకే నదిలో రెండు సార్లు కాళ్లు కడగ లేవు" అని, కనుక కాలం అనేది యథార్థమని అన్నాడు.

ఈ రెండింటికి మధ్యస్థంగా మన పూర్వులు కాలాన్ని చక్రంతో పోల్చారు. గతించిన కాలం తిరిగి తిరిగి వస్తుందన్నారు. కాలాన్ని బాణంతో పోల్చినప్పటికీ, కొందరు ఆధునిక శాస్త్ర వేత్తలు కూడా కాలాన్ని చక్రభ్రమణంతో పోల్చడం గమనార్హం.

ఆధునిక విశ్వశాస్త్రం (కాస్మాలజీ) లో ఒక ముఖ్యాంశం విశ్వవిస్తరణ వాదం. ఈ వాదం ప్రకారం విశ్వం విస్తరిస్తున్నది. గ్యాలక్సీలు ఒక దానినుంచి ఒకటి అమిత వేగంతో దూరంగా జరిగి పోతున్నాయి. వాటి మధ్య గల స్థలం వ్యాకోచిస్తున్నది. ఐన్‌స్టయిన్ సాపేక్ష సిద్ధాంతం, ఆధునిక దూరదర్శినీ యంత్రాలు కూడా ఈ విశ్వ విస్తరణ వాదాన్ని రుజువు చేశాయి.

ఫ్రెడ్ హాయిల్ వంటి ఒకరిద్దరు తప్ప, శాస్త్రజ్ఞులందరు విశ్వవిస్తరణ వాదాన్ని అంగీకరించినప్పటికీ, తిరిగి వారిలోనే ఎన్నో మత భేదాలున్నాయి. ఉదాహరణకు కొందరు విశ్వవిస్తరణకు అంతంలేదని అంటారు. మరికొందరు దీనికి భిన్నంగా, గ్యాలక్సీలమధ్య గురుత్వాకర్షణ శక్తి కారణంగా అవి పరస్పరం దూరంగా జరగడం కొన్నాళ్ళకు ఆగిపోతుందని, అవి తిరిగి దగ్గర కావడం ప్రారంభమవుతుందని అంటారు. అలా గ్యాలక్సీలు, వాటి మధ్య స్థలం క్రమంగా కుంచించుకుపోయి, మొత్తం విశ్వంలోని పదార్థం అంతా గురుత్వాకర్షణ ప్రభావంవల్ల ఒకే ఒక బిందువంతటి సూక్ష్మ పరిమాణంలోకి కుదించుకుపోతుందని, ఆ తర్వాత ఒక మహావిస్ఫోటం (బిగ్ బ్యాంగ్) జరిగి తిరిగి విశ్వం, స్థలం వ్యాకోచించి, సృష్టి పునః ప్రారంభమవుతుందని వారి వాదం.

ఈ విధంగా విశ్వ వ్యాకోచ, సంకోచాలు, వికసన ముకుళనాలు (ఎక్స్‌పాన్షన్, కాంట్రాక్షన్) తిరిగి తిరిగి జరుగుతాయని ఆధునిక శాస్త్రజ్ఞులలో పలువురు ఊహిస్తున్నారు. ఇది మన పూర్వులు ఊహించిన కల్పాది, కల్పాంతాలను పోలివుండడం ఒక ఆశ్చర్యకర విషయం. అంటే కాలం అనేది చక్రంతో పోల్చదగినదనే విషయంలో పూర్వులు, ఆధునికులు ఏకీభవిస్తున్నా రన్నమాట.

ఏమైనా, అరవై ఏళ్ళ నాటి క్రోధన తిరిగి వచ్చింది. అరవై వసంతాలు, అరవై శరత్తులు, అరవై ఋతుషట్కాలు, దాటుకుని అరవై వర్షాలనాటి క్రోధన మళ్ళీ వచ్చింది. దీని తర్వాత అక్షయనామ సంవత్సరం. దాని తర్వాత మళ్ళీ అరవై ఆకుల కాలచక్రం మళ్ళీ "ప్రభవిస్తుంది."

క్రిందటి క్రోధనలో జన్మించిన వారు ఈ క్రోధనలో షష్టి పూర్తి చేసుకుంటారు. ఈ షష్టిపూర్తి సందర్భంలో వారికి, ఇతరులకు అందరికి ఇష్టపూర్తి కావాలని మేము హృదయ పూర్వకంగా కోరుకుంటున్నాము. *(మార్చి 22, 1985)*

# ఆంధ్ర పితా మహుడు

అప్పటిలో అది నిజాం నిరంకుశ ప్రభుత్వ పద ఘట్టనలో నలిగిపోతున్న ప్రాంతం. తెలుగు భాషకు కాని, ఆంధ్రజాతికి కాని ఆదరణ లేని కాలమది; ఆంధ్రులమని చెప్పుకుంటేనే నిజాం నిరంకుశ ప్రభుత్వం అవమానిస్తున్న రోజులవి.

ఇప్పటికి దాదాపు 65 సంవత్సరాలనాడు ఆనాటి నిజాం ప్రాంతంలో జరిగిన ఒక సంఘ సంస్కరణ సభలో తెలుగు భాషలో మాట్లాడుతున్న ఒక వక్తను సభికులలో ఒక వర్గంవారు అవహేళన చేశారు; అవమానించారు.

ఆ సంఘటనతో అంతవరకు నిద్రాణులై - నిస్తేజులై - నిరుత్సాహంతో - క్రుంగుతున్న తెలంగాణాప్రాంత ఆంధ్రులలో ఆవేశం పెల్లుబికింది; ఆంధ్ర చైతన్యం రగిలింది.

నిజాం ప్రాంత ఆంధ్రులకు జరుగుతున్న అవమానాలను ఎదుర్కొనడానికి - ఆంధ్రుల ఆత్మగౌరవభావ పునరుద్దీపనకు - ఒక ప్రత్యేక సంస్థ అవసరమని ఆ సభలో పాల్గొన్న కొందరు యువకులు భావించారు.

వారిలోని ఆంధ్ర చైతన్యానికి ప్రతీకయే "ఆంధ్రజన సంఘం" (ఇప్పటి రాజకీయ పార్టీ కాదు) అవిర్భావం. ఆ జన సంఘమే ఆ తరువాత తెలంగాణాలో ఆంధ్ర మహాసభగా రూపుదాల్చి, నిజాం నిరంకుశ పాలన ప్రతిఘటనలో నేమి, ఆంధ్రోద్యమ వ్యాప్తిలో నేమి, తెలుగు భాషా వికాసంలో నేమి ప్రధాన పాత్ర వహించింది. ఈ సంస్థల ప్రాదుర్భావంలో ప్రధాన సూత్రధారి ఈ సంవత్సరం మనం శతజయంత్యుత్సవం జరుపుకుంటున్న శ్రీ మాడపాటి హనుమంతరావు.

ఆనాడు వెనుకబడివున్న తెలంగాణా ఆంధ్రులలో నవ చైతన్యాన్ని కలిగించిన వైతాళికుడు ఆయన. తెలుగు భాషాభివృద్ధికి, ముఖ్యంగా తెలంగాణా ప్రాంతంలో ఆంధ్రశబ్ద ప్రాచుర్యానికి ఎనలేని కృషి, సేవ చేసిన వారు మాడపాటి వారు.

హనుమకొండలోని శ్రీ రాజరాజ నరేంద్ర ఆంధ్ర భాషా నిలయం. హైదరాబాద్‌లోని శ్రీకృష్ణదేవరాయాంధ్ర భాషా నిలయం, బాల సరస్వతీ గ్రంథాలయం, ఆంధ్ర సారస్వత పరిషత్తు, వేమనాంధ్ర భాషా నిలయం మొదలైన సంస్థలు ఆయన మహత్తర కృషికి ప్రతీకలు.

అంతేకాదు - దాదాపు అర్ధ శతాబ్దికి పూర్వమే తెలంగాణా ప్రాంతంలో స్త్రీ విద్యాభివృద్ధికి కూడా ఆయన ఎంతగానో కృషి చేశారు. ఆయన కృషి ఫలాలే నేడు హైదరాబాద్‌లో కానవచ్చే వెంకటరామారెడ్డి మహిళా కళాశాల, హనుమంతరావు బాలికోన్నత పాఠశాల మొదలైనవి.

ఆయన స్వయంగా కవి, రచయితకూడా. ఉర్దూ, పార్సీ భాషలలో ఆయనకు ప్రవేశమే కాదు, పాండితీ విభవం కూడా వున్నది. ఒక ఉర్దూ దినపత్రికకు ఆయన చాలాకాలం

సంపాదకీయ రచయిత. "మహాభారత సమీక్ష", "రోమన్ సామ్రాజ్య చరిత్ర" మొదలైన గ్రంథాల రచయిత. "మల్లికాగుచ్ఛం" తెలుగు సాహితీ ప్రియులకు ఆయన సమర్పించిన కథానికల సంపుటం.

తెలంగాణా ఆంధ్రులలో భాషా వికాసానికి, రాజకీయ చైతన్యానికి ఇంత బహుముఖంగా సేవలు చేసిన ఆయనను "ఆంధ్రపితామహు"డని ప్రజలు సమ్మానించారు; "పద్మభూషణ్' బిరుదంతో భారత ప్రభుత్వం సత్కరించింది; హైదరాబాద్ కార్పొరేషన్ మొదటి మేయర్‌గాను, ఆ తర్వాత రెండుసార్లు ఏకగ్రీవంగా ఆ పదవికి ఎన్నిక కావడం తెలంగాణా ప్రజానీకానికి ఆయన పట్ల గల ప్రేమాభిమానాలకు నిదర్శనం; ఆంధ్రప్రదేశ్ శాసన మండలికి తొలి చైర్మన్‌గా ఆయనను ఏకగ్రీవంగా ఎన్నుకోవడం ఆంధ్రజాతి సమైక్యానికి, ఆంధ్రప్రదేశ్ అవతరణకు ఆయన చేసిన అవిరళ కృషిపట్ల రాష్ట్ర ప్రజానీకానికి గల గౌరవానికి తార్కాణం.

మాడపాటి వంటి ఎందరో మహనీయుల కృషి ఫలితమే నేటి ఆంధ్రజాతి సమైక్య ఫలం. ఈ ఫలాన్ని జాగ్రత్తగా కాపాడుకోవడం ఆంధ్రులందరి విధి. శత జయంత్యుత్సవాల సందర్భంగా "ఆంధ్ర పితామహుని" పవిత్ర స్మృతికి మా జోహార్లు.

*(ఏప్రిల్ 6, 1985)*

# సమైక్యానికి ప్రతీక

ఆయన జన్మతః ఆంధ్రుడు కాడు, అయినా. ఆయన ఆంధ్రజాతి సమైక్యాన్ని కోరాడు. ఆయన జన్మతః మహారాష్ట్రుడు కూడా కాడు, అయినా, మహారాష్ట్ర అవిర్భావానికి ఆయన చేసిన కృషి అనల్పమైనది.

ఆయన మాతృభాష కన్నడం, అయినా, ఆంధ్ర, కన్నడ, మహారాష్ట్ర సంస్కృతుల సమ్మేళనం ఆయన.

అందువల్లనే, మొన్న హైదరాబాద్‌లో కాంస్య విగ్రహావిష్కరణ జరిగిన స్వామి రామానంద తీర్థ ఆనాటి హైదరాబాద్ సంస్థానంలోని మూడు భాషా ప్రాంతాలవారికి - తెలంగాణా, మరాఠ్వాడా, కన్నడ ప్రాంతాలవారికి - ప్రేమాస్పదుడైనాడు.

అనాటి నిజాం సంస్థానంలో ఈ మూడు భాషా ప్రాంతాలు కలిసివుండడంవల్ల అది బహుభాషా సంగమమని. "హైదరాబాద్ సంస్కృతి"కి ఒక విశిష్టత కలదని, కాబట్టి, ఆ సంస్థానాన్ని భాషా ప్రయుక్తంగా విడదీయరాదని ఆదిలో నెహ్రూ, ఆసాంతం ఆజాద్ భావించినప్పటికీ - ఆ సంస్థానాన్ని భాషా ప్రయుక్తంగా విభజించడం వల్ల తన నాయకత్వానికి భంగం కలిగే ప్రమాదం వున్నప్పటికీ - స్వామి రామానంద తీర్థ తన స్వార్థాన్ని గురించి ఆలోచించలేదు; మౌలానా ఆజాద్ వంటి కాంగ్రెస్ అధిష్ఠానవర్గ ప్రముఖులకు తనపట్ల వైమనస్యం, అసంతృప్తి కలగగలవని ఆయన ఆందోళన పడలేదు.

నిజాం సంస్థానాన్ని భాషా ప్రయుక్తంగా విభజించి, దానిలోని త్రివిధ భాగాలను పరిసరాలలోని ఆయా భాషా ప్రాంతాలలో విలీనం చేయడమే సముచితమని ఆయన భావించారు. అందువల్లనే, సంస్థాన విభజనకు ఆయన మనసారా కృషిచేశారు. తెలంగాణా, ఆంధ్రరాష్ట్రాల విలీనాన్ని, మహారాష్ట్రలో మరాఠ్వాడా ప్రాంతం చేరికను, మైసూర్ రాష్ట్రంలో కన్నడ జిల్లాల విలీనాన్ని ఆయన కళ్ళారాచూచి ఆనందించారు.

కాగా, నిజాం సంస్థాన విచ్ఛిత్తిలోనేకాదు. నిజాం నవాబ్ నిరంకుశత్వపు పిడికిలినుంచి దాని విమోచనలో సయితం ఆయన ప్రముఖ పాత్ర వహించారు. నిజాం సంస్థానాన్ని "స్వతంత్ర దేశం"గా ప్రకటించి. భారతదేశం రొమ్ముల్లపై కుంపటిగా చేయడానికి ఆనాటి నిజాం నవాబ్, కాశింరజ్వీ ప్రభృతులు చేసిన ప్రయత్నాన్ని వమ్ము చేయడానికి సంస్థానంలోని మూడు భాషా ప్రాంతాలలోని దేశభక్తులు జరిపిన సంస్థాన విమోచన పోరాటానికి స్వామి రామానందతీర్థ నాయకత్వం వహించారు.

మొన్న హైదరాబాద్‌లో ఉపరాష్ట్రపతి శ్రీ వెంకట్రామన్ స్వామి రామానందతీర్థ కాంస్య విగ్రహాన్ని ఆవిష్కరిస్తూ చెప్పినట్టు. ఆనాటి హైదరాబాద్ సంస్థాన ప్రజలలో రాజకీయ, సామాజిక, సాంస్కృతిక చైతన్య ప్రదీప్తిలో ప్రముఖ పాత్ర వహించి, వారి రాజకీయ జీవితంతో ఆయన పెనవేసుకుపోయారు.

సన్యాసాశ్రమం స్వీకరించిన వ్యక్తి రాజకీయాలలో అంతగా ప్రముఖ పాత్ర వహించడం అరుదు. అయితే, రాజకీయాలంటే ఆయన దృష్టిలో సంప్రదాయ సిద్ధంగా చెప్పుకునే రాజకీయాలు కావు; అవి పదవీ రాజకీయాలు కావు. అందువల్లనే కోరితే ఆయనకు సంస్థాన విభజనానంతరం ఏదో ఒక భాషా రాష్ట్రంలో అట్టి పదవి లభించేది కాని, మంత్రి పదవికాని, అధికారం కాని ఆయన లక్ష్యం కానే కాదు.

రాజకీయమంటే ఆయన దృష్టిలో ప్రజాసేవే; ప్రజాసేవకు అది ఆయన దృష్టిలో పర్యాయ పదం.

హైదరాబాద్‌లోని ఆయన విగ్రహం - ఈ విషయాన్ని నేడు క్రమంగా విస్మరిస్తున్న రాజకీయ వేత్తలకు జ్ఞాపకం చేయగలదని, సమకాలికులకు, ముందుతరాల వారికి నిస్వార్థ ప్రజాసేవకు ఉత్తేజం కలిగించగలదని ఆశించాలి.

*(ఏప్రిల్ 17, 1985)*

# నూరేళ్ల కాంగ్రెస్

ఒక జాతి చరిత్రలో నూరేళ్ళు ఒక లెక్కలోనిది కాదు, సహస్రాబ్దాల చరిత్రలో అది స్వల్ప కాలం.

కాని, ఒక రాజకీయపక్షం చరిత్రలో నూరేళ్ళు దీర్ఘ కాలమే. నూరేళ్ళుగా అప్రతిహతంగా, సజీవంగా, చైతన్యవంతంగా కొనసాగుతున్న రాజకీయ పక్షాలు ప్రపంచ ప్రజాస్వామ్య దేశాలలో ఎన్నో లేవు. ఉన్న కొద్ది సంస్థలలోను భారత జాతీయ కాంగ్రెస్ ఒకటి.

నూరేళ్లనాడు అతి స్వల్పస్థాయిలో భారత జాతీయ కాంగ్రెస్ ఏర్పడింది. అప్పటిలో దాని ఆశయం భారతదేశానికి బ్రిటిష్ పరిపాలన నుంచి విముక్తికాదు; దాని ధ్యేయం సంపూర్ణ స్వాతంత్ర్యం కాదు.

బ్రిటిష్ పరిపాలనలో భారతీయులకు ఎదురవుతున్న సమస్యలను. ఇబ్బందులను, కష్టనిష్ఠురాలను ప్రభుత్వం దృష్టికి తెచ్చి, వాటి నివృత్తికి మార్గాలను సూచించి, వారికి మరిన్ని సౌకర్యాలను సాధించడం అప్పటిలో కాంగ్రెస్ ఆశయం. సంపూర్ణ స్వాతంత్ర్య మనే భావం అప్పటి కాంగ్రెస్ స్థాపకులకు ఊహకైనా అందని విషయం. "ఆంగిలేయుల ధర్మరాజ్యము" పది కాలాలపాటు చల్లగా వర్ధిల్లాలనే వారి కోరిక.

నిజానికి, భారత జాతీయ కాంగ్రెస్ స్థాపనకు కారకుడు, ప్రేరకుడు ఒక బ్రిటిష్ మాజీ అధికారి. ఆయన పేరు ఎలాన్ ఆక్టేవియన్ హ్యూమ్. భారత ప్రజల సమస్యలను బ్రిటిష్ ప్రభుత్వానికి నివేదించి సంస్కార కృషి చేసే రాజభక్తిపూరిత సంస్థగానే ఆయన, ఆనాటి ఆయన భారతీయ సహచరులు కాంగ్రెసును ఉద్దేశించారు.

అంతమాత్రాన ఆనాటి జాతీయ నాయకులకు దేశభక్తి శూన్యమని భావించడం కూడా పొరపాటు. స్వదేశాభిమానం, త్యాగబుద్ధిగల యాభైమంది కలిసివస్తే ఒక జాతీయ సంస్థను స్థాపించడం సాధ్యమని ఏ.ఓ. హ్యూమ్ ప్రకటించాడు. ఆ ప్రకటనకు ప్రతిస్పందనగా 70 మంది భారతీయ విద్యాధికులు బొంబాయిలో జరిగిన మొదటి కాంగ్రెస్ మహాసభకు హాజరయ్యారు. నాలుగేళ్ళ తర్వాత దాని మరొకవార్షిక మహాసభకు 1200 మంది ప్రతినిధులు హాజరయ్యారు.

అంతకుముందు కూడా బ్రిటిష్ ప్రభుత్వంతో రాయబారాలు నడపడానికి ప్రజల కష్టనిష్ఠురాలను విన్నవించడానికి, ఏవేవో పేర్లతో కొన్ని జాతీయ సంస్థలు లేకపోలేదు. కాని, అవన్నీ కొద్దికాలంలోనే తెరమరుగైనాయి. ఒక్క భారత జాతీయ కాంగ్రెస్ మాత్రమే నిలదొక్కుకొని, క్రమక్రమంగా ఒక మహా వటవృక్షంవలె విస్తరించింది.

కాంగ్రెస్ మొదటి నుంచి తన పేరుకు తగినట్టు నూటికి నూరుపాళ్లు జాతీయ సంస్థగానే వర్ధిల్లింది. అది ఏ ఒక్క మతానికి, కులానికి, వర్గానికి, భాషకు, ప్రాంతానికి పరిమితమైందికాదు. మొత్తం భారతదేశానికి, భారతజాతికే అది అంకితమైంది. అది ఏ ఒక్క సంకుచిత సిద్ధాంతానికో

కట్టుబడిన సంస్థ కూడా కాదు. దాని లక్ష్యం భారత ప్రజల శ్రేయస్సాధన. మార్గాలు వేరైనా, ఆ లక్ష్యానికి అంకితులైన వారందరు దానిలో సభ్యులయ్యారు.

అందుచేతనే కాంగ్రెస్‌లో మొదటి నుంచి విభిన్నవాదాలకు, సిద్ధాంతాలకు చెందిన వివిధ వర్గాలుండేవి. కాంగ్రెస్‌లో గ్రూపుతత్వం ఈ మధ్యనే చొరబడిందని కొందరు ఆరోపిస్తారు. కాని, సిద్ధాంత విభేదాలపై ఆధారపడిన "గ్రూపు తత్వం" మొదటినుంచి కాంగ్రెస్‌లో వున్నది.

అది మొదట మితవాద సంస్థగా ప్రారంభమైంది. క్రమంగా దానిలో అతివాదుల ప్రాబల్యం పెరిగింది. గోఖలే, ఫెరోజ్‌షా మెహతావంటి మితవాదులకు, తిలక్, లజపతిరాయ్ వంటి అతివాదులకు నిత్య ఘర్షణ జరుగుతూ వుండేది.

ఆ తర్వాత కాలంలో శాసనసభలద్వారా పోరాటం జరపాలనేవారు కొందరైతే, వాటితో ప్రమేయం పెట్టుకోరాదనేవారు కొందరు. అధినివేశ ప్రతిపత్తి చాలనేవారు కొందరైతే, సంపూర్ణ స్వరాజ్యం మన ధ్యేయం కావాలనేవారు కొందరు. అహింసాత్మక ఉద్యమం పట్ల విశ్వాసం కలవారు కొందరైతే, అది నిష్ప్రయోజనమని కొందరు, సామ్యవాదం రావాలనేవారు కొందరైతే, వ్యతిరేకించినవారు కొందరు.

ఈ విధంగా కాంగ్రెస్ ఎప్పుడూ భిన్న వాదాలకు నిలయంగా వుంటూనే వచ్చింది. అయినా, ఏళ్లు గడచిన కొద్దీ అది జాతి స్వాతంత్ర్య సమరానికి ఒక మహాసాధనంగా మారింది. బ్రిటిష్ ప్రభుత్వానికి మహజర్లు సమర్పించే సంస్థగా ప్రారంభమై, చివరకు సంపూర్ణ స్వాతంత్ర్యం తప్ప మరేదీ భారతీయులను సంతృప్తిపరచదని సింహగర్జనచేసే స్థాయికి అది పెరిగింది.

ఆధునిక భారత చరిత్ర కాంగ్రెస్ సంస్థ చరిత్రతో విడదీయలేని విధంగా పెనవైచుకు పోయింది. కడచిన నూరేళ్లను సింహావలోకనం చేస్తే మహా దేశభక్తులు, మహా వ్యక్తులైన వారు, మన జాతి భవితవ్యాన్ని తీర్చిదిద్దిన వారు - దాదాభాయ్ నౌరోజీ, సురేంద్రనాథ్ బెనర్జీ, గోపాలకృష్ణ గోఖలే, బాలగంగాధర తిలక్, లాలా లజపతిరాయ్. చిత్తరంజన్ దాస్. మోతీలాల్ నెహ్రూ, మహాత్మాగాంధి. వల్లభ్‌భాయ్‌పటేల్. జవహర్‌లాల్ నెహ్రూ, మౌలానా ఆజాద్, సుభాస్ చంద్రబోస్, రాజగోపాలాచారి, పట్టాభి, ప్రకాశం వంటి వారెందరో - మన మనోనేత్రాల ముందు కదిలి మనలను పులకితులను చేస్తారు. వారి త్యాగాల ఫలితమే నేటి మన స్వాతంత్ర్యం.

**1947** ఆగస్టు **15**వ తేదీన ఇండియా స్వతంత్ర దేశంగా అవతరించడంతో కాంగ్రెస్ చరిత్రలో ఒక శకం ముగిసింది. మరొక శకం ప్రారంభమైంది.

అయితే, కాంగ్రెస్ చరిత్ర కూడా అక్కడితో ముగిస్తే బాగుండేదని కొందరు తరుచుగా అభిప్రాయపడుతూవుంటారు. దీనికి సమర్థనగా కాంగ్రెస్ సంస్థను రద్దుచేసి దాని బదులు లోక్ సేవా సంఘ్‌ను స్థాపించవలసిందిగా గాంధీజీ చెప్పిన మాటలను ఉదాహరిస్తూ వుంటారు.

కాని, ఇది పూర్తిగా హ్రస్వదృష్టితో కూడిన అభిప్రాయం. స్వాతంత్ర్య సిద్ధితో కాంగ్రెస్ రద్దు అయివుంటే, ఆనాటి కల్లోల పరిస్థితులలో దేశం కుక్కలు చింపిన విస్తరికంటె అధ్వాన్నమై వుండేది. అసలు భారతదేశ మనేది మిగలకుండా పోయేది. వెనుకటి పురాణకాలంలో వలె ఛప్పన్నారుదేశాలుగా విభక్తమై. సామ్రాజ్య వాదుల క్రీడారంగంగా మారివుండేది.

బ్రిటిష్‌వారు వదిలివెళ్ళిన శూన్యాన్ని పూరించగల సామర్థ్యం ఆనాడు ఒక్క కాంగ్రెస్‌కేవున్నది. అంతగా భారతదేశం మూలమూలలకు వ్యాపించిన మరొక పార్టీగాని, అంతగా కోట్ల కొలది ప్రజల హృదయాలలో చెరగని స్థానాన్ని సంపాదించుకున్న మరొక సంస్థగాని ఆనాడూ లేదు. ఈనాడూ లేదు.

బ్రిటిష్ ప్రభుత్వం స్థానంలో కాంగ్రెస్ ప్రభుత్వానికి సారథిగా నెహ్రూ కోట్లకొలది భారతీయులను ఒక త్రాటిపై నడిపించి వుండకపోతే, ఉపసారథిగా పటేల్ నాలుగైదు వందలకు పైబడిన స్వదేశీ సంస్థానాలను మాతృదేశంలో విలీనం చేయకపోతే ఏమైవుండేదో తలచుకొనడానికే భయం కలుగుతుంది. కాంగ్రెస్ లేకపోతే ఈ మహా నాయకులైనా ఏమీ చేయలేకపోయే వారనడంలో సందేహం లేదు. కాంగ్రెసులో ఆ తర్వాతకాలంలో ప్రవేశించిన పదవీ వ్యామోహం, అనైకమత్యం, అవినీతి వంటి దుర్గుణాలను చూచి ఆవేదనతో కొందరు అప్పుడప్పుడు ఆ కాంగ్రెస్ అప్పుడే గాంధీజీ చెప్పినట్టు అంతరించివుంటే బాగుండునని వాపోవడం దూరదృష్టి రాహిత్యాన్ని సూచిస్తుంది.

ఒక జాతి చరిత్రను తాత్కాలిక, సమకాలిక దృష్టితో కాక, పూర్వాపరాల దృష్టితో చూడాలి. కడచిన 38 ఏళ్ళ చరిత్రను చూడండి. ఇన్నేళ్ళలోను కాంగ్రెస్‌కు ప్రత్యామ్నాయంగా మరొక జాతీయ రాజకీయపక్షం ఆవిర్భవించలేదన్న సత్యం కొట్టవచ్చినట్టు కనిపిస్తుంది. దాన్ని బట్టే కాంగ్రెస్ మన దేశచరిత్రలో నిర్వహించవలసిన చారిత్రిక పాత్ర ఇంకా వున్నదని గ్రహించవచ్చు.

కాంగ్రెస్ రద్దు అయితే, మరొక దేశపరివ్యాప్త జాతీయ రాజకీయపక్షం దానంతట అదే ఎదిగి వుండేదని ఎవరైనా భావిస్తుంటే అంతకంటె పొరపాటు వుండదు. కాంగ్రెసు ఒక్క రోజులోనో, ఒక్క ఏడాదిలోనో జాతీయపక్షంగా అవతరించలేదు. తిలక్, గాంధి, నెహ్రూ, పటేల్‌వంటి ఎందరో మహామహుల త్యాగఫలితంగా, శ్రమఫలంగా అది ఆ స్థాయికి పెరిగింది. అదేమీ లేకుండా ప్రత్యామ్నాయ జాతీయ రాజకీయపక్షం ఒక్క రోజులో రావాలంటే అయ్యే పని కాదు.

నేటి నుంచి ఈ సంవత్సరాంతం వరకు కాంగ్రెస్ శత వార్షికోత్సవాలు జరుగుతున్నాయి. ఈ ఉత్సవాలు జరుపుతున్నది అసలు కాంగ్రెసు కాదని, నకిలీ కాంగ్రెసు అని వాదించేవారు ఈర్ష్యాళువులైనా అయివుండాలి. ప్రత్యక్ష సత్యాన్ని కనలేనివారైనా అయివుండాలి. ఆనాటి కాంగ్రెసు ఈనాడు లేదని వాదించడం అర్థం లేనిది.

సరిగ్గా నూరేళ్ళనాడు కాంగ్రెస్ జన్మించింది. ఈ నూరేళ్ళలో దేశం ఎంతో మారింది. పరిస్థితులు మారాయి. దానికి తగినట్టు కాంగ్రెసు కూడా మారింది. ఆనాటి ఆదర్శవాదం, నైతికౌన్నత్యం ఈనాడు కాంగ్రెసులో లేనిమాట నిజమే. వాటిని తిరిగి పాదుకొల్పడం కాంగ్రెసు వాదుల విధి.

– రాజకీయ స్వాతంత్ర్య సాధన కాంగ్రెస్ లక్ష్యాలలో ఒకటి మాత్రమే. జాతి సౌభాగ్యసాధన దాని రెండవ లక్ష్యం. దాన్ని అదే ఆదర్శవాదంతో, నైతికబలంతో సాధించడానికి ఉపకరించినమేరకే కాంగ్రెసు నిలుస్తుంది. లేకపోతే ఎప్పుడో దానంతట అదే అంతరిస్తుంది.

*(మే 7, 1985)*

# సింగిల్ విండో సంస్కృతి

**ఆం**ధ్రప్రదేశ్ సాహిత్య అకాడెమీ ఇరవై తొమ్మిదేళ్లనాడు ఏర్పడింది. ఆంధ్ర భాషా, సాహిత్యాలకు ఎనలేని సేవ చేసింది. తోటి రాష్ట్రాలలోని సాటి అకాడెమీలకు తీసిపోని విధంగా - పెక్కు విషయాలలో వాటికంటె మిన్నగా - కృషి చేసింది.

గత శుక్రవారంతో దానికి తెరపడింది. ఉద్వాసన జరిగింది. తెలుగు విజ్ఞానపీఠం పేరుతో కొత్తగా ఏర్పాటైన సంస్థలో విలీనమైంది. అది కడచిన సుమారు మూడు దశాబ్దాలలోను చేసిన భాషా, సాహిత్యసేవ తెలుగువారికి మిగిలింది కాని, తాను మాత్రం మరి కనబడదు. ఇది ఎంతైనా విచారకర విషయం.

అలాగే, గత శుక్రవారంతో కనుమరుగైన మరొక సాంస్కృతిక సంస్థ లలితకళా అకాడెమీ. ఇది ఏర్పాటై సుమారు రెండున్నర దశాబ్దాలైంది. సాహిత్య అకాడెమీ అంతగా కాకపోవచ్చు కాని, ఇది కూడా ఎంతో కళాసేవ చేసింది. ఇప్పుడు అది కూడా తెలుగు విజ్ఞానపీఠంలో విలీనమైంది.

నదీనాం సాగరోగతిః అన్నట్టు ఎక్కడెక్కడి అకాడెమీలు. ఇతర సాంస్కృతిక సంస్థలు తెలుగు విజ్ఞాన పీఠంలో లయిస్తున్నాయి. సంగీత, నృత్య, నాటక అకాడెమీలు ఇంతకు ముందే ఆ పీఠంలో కలిసిపోగా, ఇప్పుడు సాహిత్య, లలిత కళా అకాడెమీలు కూడా అంతరించాయి. తెలుగు అకాడెమీకి కూడా అదే గతి పట్టవచ్చునని అంటున్నారు.

తెలుగు దేశం ప్రభుత్వం అధికారానికి వచ్చినప్పటినుంచి అకాడెమీలపై కత్తికట్టింది. ఈ అకాడెమీలు సరిగా పని చేయడంలేదని, అవకతవకలకు, ఆశ్రితపక్షపాతానికి, అవినీతికి, అలసతకు ఆలవాలాలైనాయని చాలాకాలంగా ఆరోపణలు, విమర్శలు లేకపోలేదు. వీటిని పురస్కరించుకుని ఆ సంస్థలను రద్దు చేయాలని ఒత్తిడి వచ్చింది కూడా.

ఈ ఆరోపణలలో, విమర్శలలో కొంత నిజం వుండవచ్చు. ఏ సంస్థ నూటికి నూరుపాళ్లు లోపరహితంగా వుండడం సాధ్యం కాదు. సంభవం కాదు. పని చేసే సంస్థ తప్పులు కూడా చేస్తుంది. దాన్ని ఎప్పటికప్పుడు సంస్కరించుకుంటూపోవాలే తప్ప, మొత్తం సంస్థనే రద్దుచేయడం అర్థంలేని పని. సంగీత, నృత్య, నాటక, లలిత కళా అకాడెమీలనైనా ప్రభుత్వం ప్రాణాలతో వదిలి పెడుతుందేమోనని కొంత కాలం క్రిందట కొందరు భావించడం జరిగింది. కాని, దాన్ని ఇంతకాలం ఎటూకాని భావాభావ సందిగ్ధస్థితిలో వుంచి, చివరికి నట్టేట ముంచింది.

మూడున్నర శతాబ్దాలుగా నడుస్తున్న ఫ్రెంచి అకాడెమీ ఒరవడిలో భాషా, వాఙ్మయ సేవల నిమిత్తం కేంద్రంలో ఏర్పడినట్టే వివిధ రాష్ట్రాలలో సాహిత్య అకాడెమీలు ఏర్పడ్డాయి. వాటికి రాష్ట్ర ప్రభుత్వాలు ధన సహాయం చేయడం వరకే తమ ప్రమేయాన్ని పరిమితం చేసుకున్నాయి. మిగతా అన్ని విషయాలలోను అవి స్వయం పరిపాలనా ప్రతిపత్తిగల స్వతంత్ర సంస్థలుగా వ్యవహరిస్తున్నాయి.

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడెమీ కడచిన దాదాపు మూడు దశాబ్దాలలో తన నిధులు అనుమతించిన మేరకు ఒక అకాడెమీ చేయవలసిన విధులన్నిటిని నిర్వర్తించింది. వివిధ నిఘంటువులు,

ప్రాచీన, అధునాతన ప్రామాణిక గ్రంథాలు, పరిశోధన గ్రంథాలు - ఇంకా ఎన్నెన్నిటినో ప్రచురించింది. వీటి నిర్మాణంలో లోపాలు జరిగివుండవచ్చు, కాలయాపన, వృథా వ్యయం వంటివి జరిగి వుండవచ్చు. అదే సమయంలో సగర్వంగా చెప్పుకోదగిన పనులు కూడా ఎన్నో తలపెట్టి పూర్తిచేసింది. ఏ పని చేసినా విమర్శించే వారుంటారు. ఏ పని చేయకపోయినా నిందించేవారుంటారు. "అకాడెమీ అదిచేయలేదు. ఇది చేయలేదు" అని నిందించడం తేలికే. కాని, స్వల్ప కాలంలో పరిమిత నిధులతో ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడెమీ అమూల్యమైన వాఙ్మయ సేవ చేసిందనడంలో సందేహం లేదు. ప్రభుత్వ సహాయం పొందుతున్న అకాడెమీ తప్ప ఇతర సంస్థలు చేయలేనంతటి బృహత్తర కార్యాలను అది చేసినట్టు ఘంటాపథంగా చెప్పవచ్చు.

అది వట్టి "కన్సర్వేటివ్" సంస్థ అని, నవ్యత్వాన్ని హర్షించలేని సంస్థ అని నిందపడింది. కాని, సరిగా ఇటువంటి నింద రెసైన్, వోల్టేర్, షాటోబ్రియా, హ్యూగో, బెర్గ్‌సన్ వంటి మహామహులు వివిధ కాలాలలో సభ్యులుగా వుండిన ఫ్రెంచి అకాడెమీకి సయితం తప్ప లేదు.

అయినా ఒకప్పుడు దాన్ని నెత్తికెక్కించుకుని వూరేగినవారే దానిపై, లేదా దాని నిర్వాహకులపై ఈర్ష్యాద్వేషాల వల్లనో, ఇతరేతర కారణాలవల్లనో దాన్ని రద్దుచేయాలని సిఫారసు చేయడం, ఆ సలహాను తెలుగుదేశం ప్రభుత్వం అనాలోచితంగా శిరసావహించడం జరిగింది. ఒక స్వతంత్ర ప్రతిపత్తిగల సంస్థను - దానిలో లోపాలున్నవని భావిస్తే సంస్కరించవచ్చుగాని - ఒక కలంపోటుతో కత్తివేటుకు గురి చేయడం సమర్థించరానిది.

తక్కిన అకాడెమీలవలె సాహిత్య అకాడెమీ కూడా తెలుగు విజ్ఞానపీఠంలో విలీనమైంది. ఈ పీఠం ఒక బృహన్నిర్మాణం. దీని ఆశయ ప్రణాళిక చూస్తే ఒక సంస్థ ఇన్నిటిని సవ్యంగా నిర్వహించడం సాధ్యమా అనిపించక మానదు. భాష, సాహిత్యం, చరిత్ర, సంస్కృతి, పురాతత్వ శాస్త్రం, సంగీతం, నృత్యం, నాటక, విగ్రహరచనాది లలిత కళలు, జానపద కళలు, ఇవి చాలవన్నట్టు సంస్కృత భాషా సాహిత్యాలు, తత్వశాస్త్రం - ఒకటేమిటి, సమస్త సంస్కృతీ భారాన్ని తెలుగు విజ్ఞానపీఠంపై రాష్ట్ర ప్రభుత్వం మోపుతున్నది. ఒక పీఠంపై ఇన్నిటి భారం మోపితే, ఏ ఒక్క దానికైనా అది న్యాయం చేయడం సాధ్యమా అని సందేహం కలుగుతుంది.

అందులో నిత్యం బాధ్యతా వికేంద్రీకరణ మంత్రం జపించే తెలుగుదేశం ప్రభుత్వం తెలుగు విజ్ఞానపీఠానికి ఇన్ని బాధ్యతలు, అధికారాలు అంటగట్టడం ఆశ్చర్యం కలిగిస్తుంది. ఉదాహరణకు తాలూకాలు చాలా పెద్దవిగా వున్నవనే కారణాన వాటిని రద్దుచేశారు. ప్రజల ముంగిటికి వెళ్లి తలుపు తట్టే రెవిన్యూ మండలాల వ్యవస్థను వ్యయభారానికి వెరవక ఏర్పాటు చేశారు. అలాగే సమితులను రద్దుచేసి పంచాయతీ మండలాలను వ్యవస్థీకరించబోతున్నారు. ఈ మార్పు వికేంద్రీకరణ పేరుతో జరుగబోతున్నది. అయినప్పుడు అదే వికేంద్రీకరణ సూత్రాన్ని అకాడెమీల విషయంలో ఎందుకు విస్మరించినట్టు? సాహిత్యాన్ని, లలిత కళలను, ఇంకా ఎన్నిటినో కలిపి ఒకేమూటగా ఎందుకు కడుతున్నట్టు? ఇది విజ్ఞాన పీఠానికి తలకుమించిన బరువుకాదా? సంస్కృతీ వికాసానికి కూడా "సింగిల్ విండో" విధానాన్ని అవలంబించడం ఎంతవరకు సమంజసం?

*(జూన్ 26, 1985)*

# మడత పేచీ

తెలుగుగంగ ప్రాజెక్టుకు కర్ణాటక ప్రభుత్వం లేవనెత్తిన అభ్యంతరం చాలా ఆశ్చర్యకరంగా వుంది. రెండేళ్ళపాటు నిమ్మకు నీరెత్తినట్టు కిమ్మనకుండా వూరుకుని ఇప్పుడు అడ్డుపుల్ల వేయడం మరింత ఆశ్చర్యంగా వుంది.

ఈమధ్యనే ప్రధాని శ్రీ రాజీవ్‌గాంధి తెలుగుగంగ ప్రాజెక్టు పట్ల కర్ణాటక, మహారాష్ట్ర ప్రభుత్వాలకు ఏవో అభ్యంతరాలున్నాయని, ముందు వాటిని పరిష్కరించుకుంటే ప్రాజెక్టుకు ఆమోదం పెద్ద కష్టం కాదని అన్నారు. అయితే,ఇది నిజంకాదని ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి శ్రీ ఎన్.టి. రామారావు వాదించారు. దానికితగినట్టుగా కర్ణాటక ముఖ్యమంత్రి శ్రీ రామకృష్ణ హెగ్డే కూడా తమకు తెలుగుగంగ విషయమై ఎట్టి అభ్యంతరం లేదని ఇటీవల ప్రకటించారు.

మరి ఇంతలోనే పరిస్థితి మారిపోవడం ఆశ్చర్యం. తెలుగుగంగకు అనుమతి ఇవ్వరాదని శ్రీ హెగ్డే ఇంతకు ముందే ప్రధానికి లేఖ వ్రాశారని కర్ణాటక ఇరిగేషన్ మంత్రి శ్రీ దేవెగౌడ మొన్న పత్రికా ప్రతినిధుల సమావేశంలో వెల్లడించారు. అసలే మొదటి నుంచి తికమకగా వున్న తెలుగుగంగ ప్రాజెక్టు విషయాన్ని ఆయన ప్రకటన మరింత గందరగోళంలో పడవేస్తున్నది.

మొదట్లో తెలుగు గంగ అనే ప్రాజెక్టు ప్రసక్తిలేని మాట నిజమే. మంచినీటి కొరతతో చిరకాలంగా అవస్థపడుతున్న మద్రాసు నగరానికి కృష్ణ నుంచి నీటిని సప్లయి చేయడం వరకే మొదటగా సంకల్పించిన ప్రాజెక్టు. దీనికిగాను ఆంధ్రప్రదేశ్, కర్ణాటక, మహారాష్ట్ర తమకు కృష్ణానది నుంచి లభించే జలాలలో తలొక అయిదు శత కోటి ఘనపుటడుగుల నీటిని ఒక కాల్వద్వారా మద్రాసుకు అందజేయడానికి 1976లో బచావత్ ట్రిబ్యునల్ తన తీర్పు చెప్పిన సమయంలో అంగీకరించాయి. అంటే మొత్తం 15 శతకోటి ఘనపుటడుగుల నీటిని మాత్రమే కృష్ణ నుంచి మద్రాసుకు తీసుకుపోవాలి. ఈ నీటిని శ్రీశైలం ప్రాజెక్టు నుంచి తీసుకుపోవాలని కూడా అంగీకారం కుదిరింది. ఈ తీసుకుపోవడం కాల్వద్వారా జరగాలా, గొట్టాలద్వారా జరగాలా, ఖర్చు ఎవరెంత పెట్టుకోవాలి మొదలైన వివరాలు తేలక ఆ ప్రాజెక్టు సంకల్పం కాగితాలపైనే మిగిలిపోయింది.

ఆంధ్రప్రదేశ్‌లో తెలుగుదేశం ప్రభుత్వం వచ్చిన తర్వాత ఆ ప్రాజెక్టు సంకల్పాన్ని పునరుద్ధరించారు. శ్రీశైలం నుంచి ఎలాగూ మద్రాసుకు మంచినీటిని కాల్వద్వారా తీసుకువెళ్ళేటట్టయితే, మార్గమధ్యంలో రాయలసీమకు సాగునీటి సౌకర్యం కలగజేయడం బాగుంటుందని భావించారు. అప్పుడో, ఆ తర్వాతనో నెల్లూరు జిల్లాకు సాగునీటి సప్లయి ఆలోచన కూడా అందులో కలిసింది. తెలుగుగంగ ప్రాజెక్టు రూపుదాల్చింది.

దీని ప్రకారం కడప, కర్నూలు, చిత్తూరు, నెల్లూరు జిల్లాలలో మొత్తం 575 వేల ఎకరాలలో

ఇరిగేషన్ సౌకర్యం లభించేవిధంగా తెలుగుగంగ కాల్వను త్రవ్వాలని నిర్ణయం జరిగింది. దీనికి మొత్తం 637 కోట్లు ఖర్చు కాగలదని అంచనా వేశారు. అందులో తన వాటాగా 180 కోట్ల రూపాయలను ప్రతి ఆరు నెలలకు 30 కోట్ల చొప్పున సమకూర్చడానికి తమిళనాడు ప్రభుత్వం అంగీకరించింది. ఆరేళ్లలో - అంటే 1983లో మొదలు పెట్టి 1989 నాటికి పని పూర్తి చేయాలని నిర్ణయించారు. 1983 మే లో అప్పటి ప్రధాని శ్రీమతి గాంధి అధ్యక్షతన మద్రాసులో జరిగిన ఒక సభలో తమిళనాడు ముఖ్యమంత్రి శ్రీ ఎన్.టి.రామారావుకు మొదటి విడతగా 30 కోట్ల రూపాయల చెక్కు అందజేశారు. ఆ తర్వాత తమిళనాడు వాయిదాల చెల్లింపు తగాదాలలో పడింది. అది వేరే సంగతి. కాని, మొత్తంపై తెలుగుగంగ ప్రాజెక్టుకు కేంద్రం అనుమతి ఇంకా రాకపోయినా పని మొదలైంది.

ఇంతకీ 1983 మే నాటికే తెలుగుగంగ ప్రాజెక్టు కేవలం మద్రాసుకు మంచినీటిని సరఫరా చేయడానికేకాక, రాయలసీమకు కృష్ణాజలాలతో ఇరిగేషన్ సౌకర్యం కల్పించడానికికూడా ఉద్దేశించినట్టిదని అందరికీ తెలుసు. అలా చేయాలంటే మద్రాసు కివ్వవలసిన 15 శత కోటి ఘనపుటడుగులుకాక, అదనంగా నీరు కృష్ణ నుంచి తీసుకోవాలని కూడా అందరికీ తెలుసు. శ్రీ హెగ్డేకు కూడా తెలుసు.

ఇలా అదనపు నీరు తీసుకోవడం బచావత్ తీర్పును, మూడు రాష్ట్రాల ఒప్పందాన్ని ఉల్లంఘించడమేనని శ్రీ దేవెగౌడ వాదిస్తున్నారు. బచావత్ తీర్పుపై ఆయనవాదంకూడా విచిత్రంగా వుంది. మనం అనుకుంటున్న దానికి కూడా వ్యతిరేకంగా వుంది. కృష్ణానదిలో నమ్మకంగా వుండేది 2060 శతకోటి ఘనపుటడుగుల నీరు అని నిర్ధారణచేసి, దానిలో 800 ఆంధ్రప్రదేశ్‌కు, 700 కర్ణాటకకు, 560 మహారాష్ట్రకు బచావత్ కేటాయించారు. అయితే, ఒక్కొక్కసారి కృష్ణలో ఇంకా ఎక్కువగా నీరు ప్రవహిస్తుంది. అలా మిగులు తేలిన నీటిని మొత్తంగా ఆంధ్రప్రదేశ్ 2000 సంవత్సరం వరకు వాడుకోవచ్చునని, అప్పుడు తిరిగి కృష్ణా నదీజలాల ఒప్పందాన్ని పునఃపరిశీలించాలని బచావత్ తీర్పు చెప్పినట్టు మనం ఇప్పటివరకు భావిస్తున్నాము. ఇలా మిగులు తేలిన నీటిలోనుంచే తెలుగు గంగవంటి ప్రాజెక్టులకు సప్లయిచేయడం, ఈ లోగా గోదావరి నీటిని కృష్ణలో కలిపి తన ప్రాజెక్టులకు ఇబ్బంది లేకుండా చేసుకొనడం ఆంధ్రప్రదేశ్ ఉద్దేశం.

కాని, కర్ణాటక మంత్రి శ్రీ దేవెగౌడ చెబుతున్న దాన్ని బట్టి కృష్ణ మిగులు నీటిలో 50 శాతం కర్ణాటకకు పోతుందట. తనకు బచావత్ ట్రిబ్యునల్ కేటాయించిన నీటికి సరిపడా ప్రాజెక్టులను ఇప్పటికే రూపొందించుకుని, ఇంకా అదనపు నీటికోసం ఆంధ్రప్రదేశ్ ఎదురుచూస్తుండగా, తన వాటాకు వచ్చిన నీటికి తగిన ప్రాజెక్టులను ఇప్పటిలో తలపెట్టడానికి కూడా స్తోమతలేని కర్ణాటకకు కృష్ణ మిగులు నీరు దేనికో తెలియదు.

ఏమైనా, తెలుగుగంగ ప్రాజెక్టు మూడు రాష్ట్రాల ఒప్పందాన్ని ఉల్లంఘిస్తున్న పక్షంలో

కర్ణాటక ఆ ప్రాజెక్టుకు అప్పుడే ఎందుకు అభ్యంతరం తెలుపలేదు? తెలుగుగంగను అనుమతించరాదని శ్రీ హెగ్డె కేంద్రానికి 1984 ఏప్రిల్‌లో ఉత్తరం వ్రాశారని శ్రీ గౌడ మొన్న చెప్పారు. మద్రాసు సభ జరిగిన ఏడాదికి-ప్రాజెక్టు పని మొదలైన ఏడాదికి-అభ్యంతరం తెలపడం ఏమిటి? పోనీ అప్పుడు అభ్యంతరం తెలుపుతూ లేఖ వ్రాసినట్టు అప్పుడే ఎందుకు బయటపెట్టలేదు? మొన్న తెలుగుగంగ పట్ల తమకు అభ్యంతరాలున్నవంటూ కర్ణాటక కాంగ్రెసు(ఐ) నాయకుడు శ్రీ వీరప్ప మొయిలీ ప్రకటన చేసే వరకు పెదవి విప్పని కర్ణాటక ప్రభుత్వం ఇప్పుడు ఎందుకు పేచీ లేవనెత్తింది?

ఇదంతా చాలా గందరగోళం కలిగిస్తున్నది. పొరపాటు ఎక్కడ జరిగిందో, ఎవరివల్ల జరిగిందో తెలియడం లేదు. తమకు అభ్యంతరాలున్నాయని కర్ణాటక ప్రభుత్వం ఇదివరకే చెప్పిందా, ఇప్పుడే చెబుతున్నదా? దానికి అభ్యంతరాలున్నాయని ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వానికి ఇదివరకు తెలియదా? అలా తెలియకుండానే ప్రాజెక్టును మొదలుపెట్టిందా? మరి శ్రీ హెగ్డే తమకు ఎటువంటి అభ్యంతరంలేదని ఈ మధ్యనే ఎందుకు ప్రకటించారు? తమకు అభ్యంతరం వున్నట్టు తమకే తెలియదా? లేక హెగ్డే పేరు చెప్పి శ్రీ గౌడ ఈ పేచీ లేవదీస్తున్నారా?

అసలే నిధుల కొరతతో అగమ్యగోచరంగా, రాయలసీమ నాయకుల అభ్యంతరాలతో వివాదాస్పదంగా తయారైన తెలుగుగంగ ప్రాజెక్టు శ్రీ గౌద ప్రకటనతో మరింత అయోమయంగా తయారైంది. దీనిపై ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం సమగ్ర ప్రకటన చేయడం అవసరం. తొందరపడి అట్టహాసంగా ప్రాజెక్టును మొదలు పెట్టినందుకు ఇప్పుడు తెలుగుదేశం ప్రభుత్వం పడినంత గందరగోళంలో ఎన్నడూ ఏ ప్రభుత్వమూ పడివుండదు.

*(జూలై 13, 1985)*

# వివాదాస్పద వ్యక్తి

ఒకప్పుడు మన దేశంలో ఆధ్యాత్మిక జీవనం గడపడం అంటే సర్వసంగ పరిత్యాగం చేసి, అరణ్యాలలో పర్ణ కుటీరాలలో కౌపీన ధారులై, కందమూల ఫలాలు భుజిస్తూ, ముక్కు మూసుకుని తపస్సు చేసుకోవడం అనే భావన వుండేది. క్రమంగా ఈ భావం అంతరించింది. కొన్ని సందర్భాలలో దానికి పూర్తిగా విరుద్ధమైన ఆచరణ వ్యాప్తిలోకి వచ్చింది.

ఏవో కొన్ని ఆధ్యాత్మిక గ్రంథాలు చదువుకుని, వాటి సారాంశాన్ని చక్కగా ఆకర్షణీయంగా ఉపన్యసించగలిగి, యోగులుగా, ఋషులుగా పోజు పెట్టగలిగి, వీలైతే ఏవైనా "మహిమలు" చేయగలిగి ప్రజలలో తమపట్ల "గ్లామర్" పెంచగలిగిన వారు నేడు గొప్ప ఆధ్యాత్మికులుగా, ఆచార్యులుగా, మహర్షులుగా, బాబాలుగా, స్వాములుగా, భగవాన్లుగా చెల్లుతున్నారు. ఇటువంటివారు మొదట చిన్న సైజు ఆశ్రమాలు స్థాపిస్తారు. ప్రచారం బాగా జరిగి, అదృష్టం బాగా వుంటే చిన్నదిగా ప్రారంభమైన ఆశ్రమమే పెద్ద కాంప్లెక్స్‌గా మహా భవనాలు వెలుస్తాయి. దేశ విదేశాలలో అభిమానులు, అనుయాయులు, ఆరాధకులు పెరుగుతారు. వ్యాపారవస్తువు ఎంత ఎక్కువగా అమ్ముడైతే అంత విలువైనదైనట్టు ఏస్వామికి ఎందరు శిష్యులుంటే అంత గొప్ప స్వామి. విదేశాలలో శిష్యులెక్కువగా వుంటే ఇంకా గొప్ప స్వామి. ఆయన గారు ఇక నేలపైన నడవరు. దిగుమతి అయిన కార్లలో, విమానాలలో విహరిస్తారు. విలాస జీవితానికి అలవాటు పడతారు. ఎక్కువగా ధనికులనే శిష్యులుగా అనుగ్రహిస్తారు. అయితే, పూర్తిగా ధనికులేఅయితే బాగుండదని అప్పుడప్పుడు నిరుపేదలను కూడా కటాక్షిస్తూ వుంటారు. యథోచితంగా సంఘసేవ కూడా చేస్తూ వుంటారు. తమ "ఆధ్యాత్మిక" సామ్రాజ్యంలో మహారాజుల వలె, చక్రవర్తులవలె ఒక వెలుగు వెలుగుతారు. వారిని పల్లెత్తుమాట అన్నా సహించలేనంత మూఢభక్తిని శిష్యులలో ప్రోత్సహిస్తారు.

ఇటువంటి వారిలో ఈమధ్య దాదాపు ప్రతి దినం పత్రికలలో వార్తలకెక్కుతూ వివాదాస్పద వ్యక్తిగా పరిణమించిన శ్రీ రజనీష్ ఒకరు. ఈయన మొదట తత్వశాస్త్రోపాధ్యాయుడట. క్రమంగా "ఆధ్యాత్మిక రంగం" లోకి దిగారు. ఆచార్యుడుగా ప్రారంభమై సాక్షాత్తు "భగవాన్" గా తేలారు.పూనాలో ఒక ఆశ్రమం స్థాపించారు. క్రమంగా దేశ, విదేశాలలో ఆయనకు ధనికులైన శిష్యులనేకులు బయలుదేరారు. పూనా ఆశ్రమం పేరు కొంతకాలం క్రిందట మారుమ్రోగిపోయింది. అయితే, సెక్సు వైపరీత్యాలు, మాదకద్రవ్యాల వాడకం మొదలైన పుకార్లతో అది చాలా వివాదాస్పదంగా తయారైంది. వాటిని శ్రీ రజనీష్ ఖండించకపోగా, భోగలాలసకు, ఆధ్యాత్మిక జీవితానికి మధ్య వైరుధ్యం లేదన్నట్టుగా, ఆ రెండూ ఒకటే నన్నట్టుగా, ఆధ్యాత్మిక సిద్ధి పొందడానికి సెక్సు కూడా ఒక మార్గమన్నట్టుగా విపరీత వ్యాఖ్యానాలకు అవకాశమిచ్చే ఉపదేశాలు చేశారు. ప్రచారం పెరిగి, గ్లామర్ పెరిగి, కీర్తి పెరగడంతో ఆ రోజులలో ఆయన రాజకీయాలు, ప్రభుత్వ నిర్వహణతో సహా అన్నిటి మీద ఎడాపెడా ఉచితంగా సలహాలు కూడా ఇచ్చేవారు.

చివరికి ఏమి జరిగిందో ఏమో అయిదారేళ్ళనాడు వున్నట్టుండి ఆకస్మికంగా మాయమయ్యారు. ఆయనమరణించినట్టు పుకార్లు కూడా వచ్చాయి. కాని, ఇండియాలో అంతర్ధానుడై అమెరికాలో తేలారు. ఓరిగాన్ రాష్ట్రంలో ఒక చోట వందలాది ఎకరాల సుక్షేత్రంలో ఆశ్రమం స్థాపించారు. అది రజనీష్‌పురం అనే పేరుతో ప్రసిద్ధమైంది.

అమెరికాకు, ఇండియాకు ఏ విషయంలో పోలికలున్నా, లేకపోయినా ఒక విషయంలో పోలిక వుంది.ఇక్కడవలె అక్కడ కూడా జీవిత ప్రధాన వాహిని నుంచి చీలిపోయే ఉపస్రవంతులకుగిరాకీ ఎక్కువ. వీటికి "సబ్ కల్చర్స్" అని పేరు. మితిమీరిన భోగలాలస వల్ల జనించే విరక్తితో, దానికి "ఆధ్యాత్మిక అశాంతి" అనే పెద్ద పేరు పెట్టి ఎవరు తరణోపాయం చూపిస్తామంటే వారి చుట్టూ చేరేవారికి అక్కడ కొరతలేదు. రెండు దశాబ్దాల క్రితం "హిప్పీయిజం" పేరుతో ఒక సబ్‌కల్చర్ అమెరికాలో బయలుదేరి ఎలా ప్రపంచవ్యాప్తమైందో అందరికి తెలిసిందే. అలాగే ఇటీవలి సంవత్సరాలలో రజనీష్‌పురంలో "రజనీష్ కల్ట్" కూడా. కాని, అనతికాలంలో అది కూడా వివాదాస్పదమైంది. చివరికి ఆయన ముఖ్యశిష్యురాలు, రజనీష్‌పురం కమ్యూన్ నాయకురాలు అయిన "మా ఆనందషీలా" ఈమధ్య శ్రీ రజనీష్‌పై చాలా ఆరోపణలు చేసి అయిదున్నరకోట్ల డాలర్ల ధనంతో పలాయితురాలైంది. ఆ పిదప అమెరికా ప్రభుత్వం ఆయనపై అనేక నేరాలు, ముఖ్యంగా "ఇమిగ్రేషన్" చట్టాలను ఉల్లంఘించిన నేరం మోపి అరెస్టు చేసింది. ఆ నేరాలన్నీ రుజువైతే ఆయనకు 175 ఏళ్ళ కారాగార శిక్షపడేదట. తుదకు ఆయన తాను "ఇమిగ్రేషన్" చట్టాలు ఉల్లంఘించినట్టు ఒప్పుకోవడంతో పదేళ్ళ శిక్ష పడింది. కాని, ఆ శిక్షను సస్పెండు చేసినందున విడుదల అయి, అమెరికాకు ఒక నమస్కారం పెట్టి స్వదేశానికి మొన్న తిరిగి వచ్చారు.

ఇప్పుడు శ్రీ రజనీష్ హిమాచల్‌ప్రదేశ్‌లో కులూలోయలో స్థిరపడతారట. ఈసారి ఆశ్రమం వంటిదేమీ స్థాపించరట. ఎవరన్నావస్తే వారికి సలహాలు మాత్రం ఇస్తారట. అమెరికన్ కారాగారంలో తాను పడిన బాధలు, హింసలు, అవమానాలు వర్ణిస్తూ ఆయన ఒక ప్రకటన చేశారు. అవన్నీ ఆయన కొనితెచ్చుకున్నవే ననిపిస్తుంది. అమెరికాలో డెమోక్రసీ లేదని, హిపోక్రసీ వున్నదని ఆయన ఆరోపించారు. ఇది దాదాపు ఏ దేశానికైనా వర్తించవచ్చు. ఇండియా నుంచిమాయమయ్యే ముందు శ్రీ రజనీష్ స్వదేశంపై కూడా ఇలాగే ఆరోపణలు చేసేవారు.

శ్రీ రజనీష్‌కు చాలా అన్యాయం జరిగిందని బాధ పడేవారు కొందరుండవచ్చు. కాని, ఆయన పట్ల పెద్దగా జాలిపడవలసిందేమీ లేదని అనిపిస్తుంది. తానొక ఆదర్శనగరం నిర్మించ దలచానని, అందుకే తనపట్ల అసూయతో అమెరికా ప్రభుత్వం తనను బాధించి వెళ్ళగొట్టిందని ఆయన అంటున్నారు. కాని, 92 రోల్స్‌రాయిస్ కార్లు, కోట్లకొలది ధనరాసులు, విపరీతమైనవిలాసాలు, భోగలాలస, ఆత్మరక్షణకోసమైనా సరే మారణాయుధాలతో కూడిన ఆశ్రమ జీవితం ఆధ్యాత్మిక సాధనకు ఏ విధంగా తోడ్పడుతాయో తెలియదు. ఆయన గురించి వ్యాపించిన వివాదాలలో ఏ కొన్ని నిజమైనా ఆయన ఆధ్యాత్మికోపదేశాల మీద గౌరవం కలగడం కష్టం.

*(నవంబరు 19, 1985)*

# "జనగణమన"

భారతజాతీయ గీతమైన "జనగణమన..." పై వివాదం ఈనాటిది కాదు. దాని రచన జరిగిన నాటి నుంచి వున్నది. ఒక విధమైన వివాదం కాదు, రకరకాల వివాదాలకు ఆ గీతం లోనైంది.

ఇప్పటికీ ఎవరో ఒకరు దానిపై ఏదో ఒక వివాదం లేవనెత్తుతూనే వున్నారు. దాన్ని ప్రశంసిస్తూనో, అభిశంసిస్తూనో ఏవేవో రచనలు వస్తూనే వున్నాయి. ఈ మధ్య కేరళలోనే దాన్ని గురించి రెండు వివాదాలు బయలుదేరాయి. వాటిలో ఒకటి కోర్టుకు కూడా ఎక్కింది. అయితే, ఆ కేసును విచారణ చేసిన హైకోర్టు గత శనివారంనాడు తీర్పు చెబుతూ "జనగణమన"కు వ్యతిరేకంగా దాఖలైన రిట్ పిటిషన్‌ను కొట్టివేసింది.

భారత జాతీయ గీతంగా దేన్ని ఎంచుకోవాలన్న ప్రశ్న వచ్చినప్పుడు ప్రధానంగా రెండు విభిన్న గీతాల అభిమానుల మధ్య వివాదం చెలరేగింది. పండిట్ జవహర్లాల్ నెహ్రూ "జనగణమన"ను సమర్థించారు. మరి కొందరు "వందేమాతరం"ను బలపరిచారు.

బంకించంద్ర ఛటర్జీ వ్రాసిన "వందేమాతరం" ఒక దేశభక్తి ప్రబోధక గీతంగా అత్యుత్తమమైనదని, చారిత్రిక ప్రాధాన్యం కలిగినదని ఈనాడు కొత్తగా చెప్పనక్కరలేదు. మన జాతీయోద్యమ కాలంలో, ముఖ్యంగా 1905 నాటి బెంగాల్ విభజన కాలం నుంచి, అది ప్రముఖ పాత్ర వహించింది. లక్షలాది ప్రజలను అది ఉత్తేజితులను చేసింది, ఉగ్రూతలూగించింది. "వందేమాతరం"అనే మాటను స్వరాజ్యసమర నినాదంగా ఎలుగెత్తి పలుకుతూ జాతీయోద్యమ కాలంలో ఎందరో కారాగారాలకు వెళ్లారు. అయితే, ఆ గీతంలో "త్వంహి దుర్గా..." మొదలైన పదాల కారణంగాను, "ఆనంద మఠ్" నవలలో అది హిందూ సన్యాసుల ప్రార్థన గీతం కావడం వల్లను అది హిందూ మతానికి మాత్రమే సంబంధించినదనే కారణాన దాన్ని జాతీయ గీతంగా నిర్ణయించడం పట్ల వ్యతిరేకత కూడా ఆ రోజులలో వచ్చింది.

కాగా, పండిట్ నెహ్రూ టాగోర్ వ్రాసిన "జనగణమన" జాతీయ గీతం కాదగినదని గట్టిగా వాదించారు. అయితే, దాని పట్ల కూడా ఆ రోజులలో వ్యతిరేకత రాకపోలేదు. టాగోర్ దాన్ని 1911 లో వ్రాయగా, ఆ సంవత్సరం డిసెంబరు 27వ తేదీన కలకత్తాలో జరిగిన 28వ కాంగ్రెసు మహాసభలో దాన్ని మొదటిసారిగా పాడడం జరిగింది. టాగోర్ దాన్ని అప్పుడు భారత దేశం సందర్శిస్తున్న బ్రిటిష్ చక్రవర్తి అయిదవ జార్జికి స్వాగత గీతంగా వ్రాశాడని ఆరోపణ వచ్చింది. ఈ ఆరోపణ కారణంగా అది స్వతంత్ర భారత జాతీయ గీతంగా వుండదగినది కాదని కొందరు వ్యతిరేకించారు. అయినా, చివరికి పండిట్ నెహ్రూ వాదమే నెగ్గింది. రాజ్యాంగ సభ 1950 జనవరి 24వ తేదీన "జనగణమన"నే జాతీయ గీతంగా నిర్ణయించింది.

అయినా, అప్పటికీ, ఇప్పటికీ అప్పుడప్పుడు "జనగణమన" దేశభక్తి గీతం కాదని, అయిదవ జార్జిపై వ్రాసిందన్న వాదం వినిపిస్తూనే వుంది. ఈమధ్య కొన్ని నెలల క్రిందట కేరళలో ఒక సంస్కృత పాఠశాల హెడ్మాస్టరు ఇదే వాదం లేవదీసి "జనగణమన" స్థానంలో తాను వ్రాసిన ఒక సంస్కృత గీతాన్ని జాతీయ గీతంగా తన విద్యార్థులచే ఆలపింపజేయడం మొదలు పెట్టాడు. అయితే, ఇది నేరం కాగలదని కేంద్ర విద్యాశాఖ హెచ్చరించడంతో అతడు తన సొంత గీతాన్ని విరమించాడు.

ఆ ఉదంతం తర్వాత కేరళలోనే కిడంగూర్ అనే చోట మరొక వివాదం తలెత్తింది. ఒక హైస్కూలులో "జెహోవాస్ విట్‌నెసెస్" అనే ఒక క్రైస్తవ మతశాఖ అనుయాయులైన కొందరు విద్యార్థులు "జనగణమన" ఒక ప్రత్యేక మతానికి చెందిన ప్రార్థన గీతమని, దాన్ని ఆలపించాలని నిబంధన విధించడం రాజ్యాంగం తమకు ప్రసాదించిన మత స్వేచ్ఛకు భంగకరమని రిట్ పిటిషన్ దాఖలు చేశారు. కేరళ హైకోర్టు ప్రధాన న్యాయమూర్తి, మరొక న్యాయమూర్తితో కూడిన డివిజన్ బెంచి ఈ పిటిషన్‌ను విచారణ చేసింది. "జనగణమన" ఏ ప్రత్యేక మతానికి చెందిన ప్రార్థన గీతం కాదని, దాన్ని పాడడం రాజ్యాంగరీత్యా ఎవరి మత స్వేచ్ఛకు భంగకరం కాదని ఇటీవల తీర్పు చెప్పింది. అంతేకాక, అది దేశభక్తి గీతమని, దాని ఆలాపన సెక్యులర్ చర్య మాత్రమే అవుతుందని కూడా డివిజన్ బెంచి తన తీర్పులో పేర్కొని రిట్ పిటిషన్‌ను తిరస్కరించింది.

జాతీయగీతంగా "జనగణమన"ను నిర్ణయించి 35 ఏళ్లు దాటిపోయినప్పటికీ, నేటికి కూడా దానిపై పరస్పర విరుద్ధమైన వివాదాలు రావడం విచిత్రం, దురదృష్టకరం. ఒకరు దాన్ని బ్రిటిష్ చక్రవర్తిపై వ్రాసిన గీతం అంటూ వ్యతిరేకిస్తుంటే, మరొకరు దాన్ని ఒక ప్రత్యేక మతానికి చెందిన గీతమని వ్యతిరేకిస్తున్నారు. ఆ రెండు ఆరోపణలలోను నిజం లేదని వాటి పరస్పర వైరుధ్యాన్నిబట్టే గ్రహించవచ్చు. టాగోర్ ఆ గీతం తాను జార్జి చక్రవర్తిపై వ్రాశానన్న ఆరోపణను స్వయంగా ఖండించాడు. కాగా, అయిదు చరణాలతో కూడిన ఆ సుదీర్ఘ గీతం చదివితే ఎక్కడా అది ఆనాటి బ్రిటిష్ చక్రవర్తిపై వ్రాసినదన్న భావం కలగనే కలగదు. అలాగే రెండవ చరణంలో "హిందు, బౌద్ధ, సిఖ్, జైన, పారసిక్, ముసల్మాన్, కిర్‌స్తానీ..." అని భారతదేశంలోని అన్ని మతాలను పేరు పేరున పేర్కొనడాన్ని బట్టి టాగోర్ ధాన్ని ఏ ప్రత్యేక మత గీతంగా ఉద్దేశించి వ్రాయలేదని తేటతెల్లమవుతుంది. "భారత భాగ్యవిధాతా" అని సంబోధించినది అన్ని మతాలు ఆరాధించే ఒకే ఒక భగవంతుడినేనని పలువురు వ్యాఖ్యానించారు. కాగా, ప్రజాస్వామ్యపరంగా దానికి అర్థం చెప్పుకోవలసి వస్తే "భారత భాగ్యవిధాత" అనే సంబోధన సామాన్య మానవుడికి వర్తిస్తుందని అర్థం చెప్పుకోవచ్చు. అలా చెప్పుకున్నప్పటికీ ఆ గీతానికి అన్వయం సరిపోతుంది. ఏమైనా ఒక గీతంగా ఒకసారి నిర్ణయమైపోయిన తర్వాత దాన్ని గురించి పోయిన పాడుగున వివాదాలు లేవదీయడం, దాని పట్ల అనుమానాలను, అగౌరవాన్ని ప్రకటించడం అనుచితం. *(డిసెంబర్ 11, 1985)*

# గురువుకాని గురువు

అది 1948వ సంవత్సరం. జిడ్డు కృష్ణమూర్తి పదేళ్ళ విరామం తర్వాత ఇండియా వచ్చారు. మద్రాసులో నుంగంబాకంలోని ఒక మిత్రుని గృహంలో విడిది చేశారు. ఆవరణలో పెద్ద పందిరి నిండా అభిమానులు, ఎదురుగా ఎత్తయిన వేదిక మీద సిల్కు లాల్చీ, తెల్లని పైజమా ధరించి కృష్ణమూర్తి కూర్చుని వున్నారు.

అప్పటికి ఆయన వయస్సు 52-53 సంవత్సరాలు, వయస్సు ముదిరిన లక్షణాలు గోచరిస్తున్నా వర్చస్సు తగ్గని ఆకర్షణీయమయిన ముఖం, తేజస్సు తగ్గని విశాల విస్ఫారిత నేత్రాలు, స్ఫుటంగా, స్వచ్ఛంగా వినబడే మంద్ర గంభీర కంఠం.

ఆయన తాను చెప్పవలసిన విషయాలు ముందుగా ప్రసంగ రూపంలో చెబుతారు. తర్వాత శ్రోతల నుంచి ప్రశ్నలను ఆహ్వానిస్తారు. కొందరు లేచి నిలబడి అడిగితే, కొందరు చీటీలపై వ్రాసి ప్రశ్నలు పంపిస్తారు. అన్నిటికి ఓపికగా సమాధానాలిస్తారు. సందేహాలు ఒక స్థాయిలో వుంటే ఆయన సమాధానాలు మరొక స్థాయిలోవుంటాయి. ఆయన సమాధానాలు ఒక్కొక్కసారి తేలికగా అర్థంకావు, సంతృప్తి పరచవు. మళ్ళీ మళ్ళీ వాటిని మననం చేయాలి. అందుకే అడిగిన ప్రశ్నలే అడుగుతున్నట్టు, చెప్పిన సమాధానాలే వేరే మాటలలో తిరిగి చెబుతున్నట్టు అనిపిస్తుంది. పృచ్ఛకుడు తన ప్రశ్నకు సమాధానాన్ని తానే కనుగొనేటట్టు చేయడానికి కృష్ణమూర్తి ప్రయత్నిస్తున్నట్టు వుంటుంది. ఏథెన్సు నగర వీధులలో "ఏది సత్యం, ఏదసత్యం; ఏది నిత్యం, ఏదనిత్యం; ఏది సౌందర్యం, ఏది కాదు... ముందు నీ నిర్వచనం చెప్పు..." అంటూ వారిని వీరిని నిలదీసి, సదసత్సంశయాలను రేకెత్తిస్తూ, సమకాలిక సమాజ రుగ్మతలను కడిగేస్తూ తిరిగిన సోక్రటీస్ జ్ఞాపకం వస్తాడు. మద్రాసులో ఆయన వున్నన్నినాళ్ళు ప్రతిరోజూ అదే దృశ్యం, అదే సన్నివేశం.

ఆ తర్వాత జిడ్డుకృష్ణమూర్తి ఎన్నో సార్లు ఇండియా వచ్చారు. ఎప్పుడు వచ్చినా మద్రాసు రాకుండా, మదనపల్లివద్ద ఋషీవ్యాలీ వెళ్ళకుండా వుండరు. స్థలం మారవచ్చు, కాలం మారవచ్చు, శ్రోతలు మారవచ్చు, కాని, అవే సమావేశాలు, ప్రసంగాలు. అవే ప్రశ్నలు, సమాధానాలు; సోక్రాటిక్ డయలెక్టికల్ పద్ధతిలో అవే వాగ్వాదాలు. కడచిన నలభై ఏళ్ళుగా ఆస్ట్రేలియా వెళ్ళినా, యూరోపియన్ దేశాలు వెళ్ళినా, అమెరికాలో వున్నా, ఇండియా వచ్చినా కృష్ణమూర్తి దినచర్యలో ఈ విధమైన సమావేశాలు, సన్నివేశాలు ప్రధానమైన భాగం. ఆయన ప్రసంగాలు, ప్రశ్నోత్తరాలు ఏడు వందలకు పైగా పుస్తకాల రూపంలో వెలువడ్డాయి. అంతదీర్ఘకాలం, అంత నిర్విరామంగా ప్రపంచ పర్యటన చేస్తూ దేశ దేశాలలో తన సందేశం వినిపించిన తత్వవేత్త మరొకరు లేరనడం అతిశయోక్తి కాదు.

ఇకపై ఆయన సందేశం ప్రత్యక్షంగా వినే అదృష్టం శ్రోతలకు కలగదు. ఆయన రూపం ప్రత్యక్షంగా దర్శించే అవకాశం కలగదు. ఆయన కంఠం శాశ్వతంగా మూగవోయింది. తొంభైఏళ్ళుగా లోకాన్ని, లోకం వెనుక దాగిన సత్యాన్ని నిరంతరం అన్వేషించిన ఆయన విశాల నేత్రాలు శాశ్వతంగా మూత పడ్డాయి. ఏ హేలీ తోకచుక్కనో అధిరోహించి ఎన్నటికి తిరిగిరాని ఏ అజ్ఞాత, సుదూర లోకాలకో ఆయన శాశ్వతంగా పయనమై వెళ్లిపోయారేమో ననిపిస్తుంది.

ఆయన ఎన్ని దేశాలలో, ఎన్ని వేలసార్లు ఎన్ని వేల ప్రసంగాలు చేశారో, ఎన్ని ప్రశ్నలకు సమాధానాలు చెప్పారో లెక్క లేదు. అన్నిటి సారాంశం ఒకటే. ప్రపంచంలోకి మానవుడు ఏకాకిగా వస్తాడు; ఏకాకిగా పోతాడు. ఈ మధ్యలో జాతులు, కులాలు, మతాలు, భాషలు, రకరకాల విశ్వాసాలు పెంచుకుని, తన చుట్టూ గోడలు కట్టుకుంటాడు. ఆ గోడలవల్ల అతడు అసలు సత్యం చూడలేక పోతాడు. ఎవరి చేయూతనో అర్థిస్తాడు. వేదాలనో, ఉపనిషత్తులనో, భగవద్గీతనో, మరొక మత గ్రంథాన్నో సహాయం అడుగుతాడు. ఏ స్వామీజీనో, బాబానో, మత ప్రవక్తనో, మతాచార్యుడినో గురువుగా ఆశ్రయిస్తాడు.

ఇదంతా వృథా. వృథాయే కాదు; దగా. అంతా మోసం, వంచన, దోపిడీ. సత్యాన్వేషణకు ఇది మార్గం కాదు. ఎవరూ ఎవరినీ ఉద్ధరించలేరు. ఏ మతం, మఠం, పీఠం, విశ్వాసం ఏదీ సత్యదర్శనం చేయించలేదు. వీటిని నమ్ముకోవడం కానని వాడు కానని వాడిని ఊతగొనడం వంటిది. ఎవరికి వారే సత్యాన్ని అన్వేషించాలి. ఎవరికి వారే సత్యాన్ని కనుగొనాలి. ఏ గురువూ ఎవరికీ మార్గదర్శి కాలేడు. ఎప్పుడు ఎక్కడ, ఎన్ని సార్లు చెప్పినా కృష్ణమూర్తి సందేశ సారాంశం ఇదే.

జిడ్డు కృష్ణమూర్తిని చిన్ననాట దివ్యజ్ఞాన సమాజం నాయకులైన లెడ్ బీటర్, ఆనీ బిసెంట్ చూసి, ఆ ముఖ వర్చస్సుకు, తేజస్సుకు ముగ్ధులై ఆయనను అపర బుద్ధుడుగా, అభినవ కృష్ణుడుగా, మెసయాగా, మహా ప్రవక్తగా ప్రపంచానికి చాటారు. ఆయనను జగద్గురువుగా చేయడానికి ప్రయత్నించారు. ఆయన నిజంగానే తనలో వారు చెప్పిన అలౌకిక లక్షణాలు, దివ్యజ్ఞాన సమాజంవారు విశ్వసించే "అక్కల్ట్" (తాంత్రిక) శక్తులు, సిద్ధులు కలవనే కొంత కాలం విశ్వసించారు.

కాని, చివరికి తాను అప్పటి వరకు చెప్పింది, చేసింది, నమ్మింది అంతా మోసమని ఆయన గ్రహించి, 1928-30 ప్రాంతాలలో దివ్యజ్ఞాన సమాజానికి రాజీనామా ఇచ్చారు. జగద్గురు పీఠాన్ని పరిత్యజించారు. అత్యుచ్చ దశలో వుండగా ఆ విధంగా బంగారు పంజరం నుంచి బయట పడడానికి చాలా ధైర్యం కావాలి, సాహసం కావాలి.

బహుశా తనను జగద్గురువుగా ప్రకటించి ప్రపంచాన్ని దగాచేయడానికి జరిగిన ప్రయత్నం పట్ల జుగుప్సా భావంతోనే జిడ్డు కృష్ణమూర్తికి అసలు గురువు అనే భావం పట్లనే వ్యతిరేకత కలిగి వుండాలి. మతాలు, మఠాలు, గురుపీఠాలు, వేదాలు, శాస్త్రాలు, ఇతర ప్రామాణిక గ్రంథాలు అన్నీ బూటకాలని ఆయన తిరస్కరించారు.

ఆయన ప్రసంగాలలో తరుచుగా వినవచ్చే ఒక మాట "అవేర్‌నెస్" -ఎరుక. బాహ్యంగాను, ఆంతరికంగాను అన్నిటిని జాగ్రత్తగా, నిశితంగా కనిపెట్టి వుండు. ఏ ఒక్క చర్యను, ఆలోచనను, భావాన్ని, అనుభవాన్ని వదిలిపెట్టకు. అన్నిటిని పరిశీలించు. వాటి వెనుక, నీ మనస్సు వెనుక, అన్నిటికి వెనుక ఏమున్నదో అన్వేషించు. నిన్ను నీవు తెలుసుకోవడమే సత్యాన్ని తెలుసుకోవడం. ఒకనాడు డెల్ఫీ ఆలయంలోని దేవత సోక్రటీస్‌కు చెప్పింది అదే; ..."నిన్ను నీవు తెలుసుకో." కాని అలా తెలుసుకోవడానికి ఒకరు ఒకరికి సహాయం చేయలేరు. ఒకరి అనుభవం మరొకరిది కానేరదు. ఒకరి దృక్కోణం మరొకరిది కాజాలదు. అందువల్లనే ఒకరి సమస్యను ఒకరు పరిష్కరించలేరు. ఒకరు మరొకరికి మార్గం చూపలేరు. అన్ని మార్గాలను తరచి చూసి, మన మార్గాన్ని మనం ఎంచుకోవాలి. మరొకరి మార్గాన్ని అనుసరించడం వల్ల ప్రయోజనం లేదు. ఎవరి సత్యాన్ని వారు స్వయంగా సందర్శించవలసిందే. ఒక చిక్కు సమస్య ఎదురైనప్పుడు ఎవరి నిర్ణయం వారు చేయవలసిందే. కృష్ణమూర్తి బోధలలో అక్కడక్కడ కీర్క్ గార్డ్, సార్త్ర వంటి అస్తిత్వవాదుల ఛాయలు కనిపించడానికి కారణం ఇటువంటి భావాలే.

ఆయన భావాలు చాలా సందర్భాలలో సులభంగా కొరుకుడు పడవు. అయినా, వాటిలో ఏదో ఆకర్షణ వుంది. "ఏదియొ అపూర్వ మధుర రక్తి స్ఫురియించుగాని, అర్థమ్ము కాని భావ గీతమ్ములని..." అన్నట్టుగా ఆయన భావాలు మనల్ని వింతగా ఆకర్షించి వశపరచుకుంటాయి.

ముఖ్యంగా - ప్రపంచంలోని ప్రతి విషయం పట్ల ఎరుక పెంపొందించుకుని నీ నిర్ణయం నీవు చేసుకో. ఎవరినీ గుడ్డిగా అనుసరించకు, ఆరాధించకు - అని జిడ్డు కృష్ణమూర్తి చేసిన ప్రబోధం వ్యక్తి స్వాతంత్ర్యానికి ఎత్తిన నీరాజనం వంటిది.

ఆయన ఈ శతాబ్దపు భారతీయ మహాపురుషులలో ఒకరు. ఆయన తాను గురువును కాను అంటూనే గురువుగా, దేశికుడను కాను అంటూనే దేశికుడుగా 90 ఏళ్ళ పరిపూర్ణ జీవితం జీవించారు. తమను తాము భగవాన్లుగా, జగద్గురువులుగా, అవతార పురుషులుగా వర్ణించుకునేవారు కోకొల్లలుగా పుట్టుకు వస్తున్న ఈ రోజులలో 'నేను గురువును కాదు, సామాన్యుడిని. నా మాటలు మీరు విశ్వసించనక్కరలేదు, మీకు మీరు ఆలోచించి, మీ నిర్ణయాలు మీరు చేయండి, మీ మార్గం మీరు అనుసరించండి' అని వెన్ను తట్టి ధైర్యం చెప్పే మహామనీషి జిడ్డు కృష్ణమూర్తి. ఆయన స్మృతికి జోహార్లు.

*(ఫిబ్రవరి 19, 1986)*

# మూడు దశాబ్దాలు

దీపావళి, ఆంధ్ర ప్రదేశ్ అవతరణ దినోత్సవం.

ఈ రెండు పండుగలు ఈ ఏడాది ఒకే రోజున నేడు చెట్టపట్టాలు వేసుకుని కలిసి తెలుగు ముంగిళ్ళ ముందుకు నడిచివచ్చాయి. వీటిలో ఒకటి ఎన్ని శతాబ్దులు, సహస్రాబ్దుల నాటి పండుగో తెలియదు. కాని, దేశంలో అన్ని భాషలవారు, ప్రాంతాలవారు జరుపుకునే పండుగ; భారతజాతి భిన్నత్వంలోని ఏకత్వానికి ఒక ప్రతీకగా భాసించే పండుగ.

రెండవది అచ్చగా తెలుగు పండుగ. మూడు దశాబ్దాల నాడే ప్రారంభమైన పండుగ. అయినా, చారిత్రిక ప్రాధాన్యంలో దేనికీ తీసిపోని పండుగ; ఎన్నో శతాబ్దాలుగా వేర్వేరు ప్రాంతాలలో, వేర్వేరు ఏలుబడుల క్రింద జీవించిన తెలుగు భాషా ప్రజలందరిని మొదటిసారిగా ఒకే రాజకీయ ఛత్రం క్రిందికి తీసుకువచ్చిన పంఢుగ; తెలుగువారి భాష, వాఙ్మయం, సంస్కృతి - అన్నిటిలోని ఏకత్వానికి ప్రతీకగా భాసించే పండుగ.

ఆంధ్రప్రదేశ్ ఒక రాష్ట్రంగా అవతరించి మూడు దశాబ్దాలే అయినా, దాని వెనుక కనీసం మరి నాలుగైదు దశాబ్దాల చరిత్ర వున్నది. ఉమ్మడి మద్రాసు రాష్ట్రంలో ఆంధ్ర రాష్ట్రం ఒక భాగంగా వుండే రోజులలో తెలుగువారికి రాజకీయంగా, ఆర్థికంగా, ఇంకా ఎన్నో విధాలుగా జరుగుతున్న అన్యాయం నుంచి విముక్తి కోసమే స్వరాష్ట్రోద్యమం ప్రారంభమైంది. బాపట్లలో **1913** నాటి ప్రథమాంధ్ర మహాసభతో దానికి అంకురారోపణ జరిగింది. పరిపాలనా సౌలభ్యం దృష్ట్యా చూచినా ఆ రోజులలో సువిశాలమైన మద్రాసు రాష్ట్రం నుంచి ఆంధ్ర ప్రాంతాన్ని విడదీసి వేరే రాష్ట్రం చేయడం పెద్ద కష్టమై వుండనక్కరలేదు. ఈనాడు తలుచుకుంటే ఆశ్చర్యం కలుగుతుంది. దాదాపుగా పర ప్రభుత్వం నుంచి స్వాతంత్ర్య సాధనకు జరిపిన పోరాటమంత స్థాయిలో ఆంధ్రులు స్వరాష్ట్ర సాధనకు ఆందోళన సాగించవలసి వచ్చింది. తెలుగు వారిలో స్వభాష పట్ల, సంస్కృతి పట్ల, స్వచరిత్ర పట్ల ఎంతో ఆవేశపూరిత భక్తిని, రక్తిని రేకెత్తించి, నాలుగు దశాబ్దాల పాటు నిర్విరామంగా ఉద్యమాన్ని నడపవలసి వచ్చింది. స్వాతంత్ర్య సిద్ధి తర్వాత కూడా ఆ ఉద్యమాన్ని ఎంతో ఉద్రిక్తతతో నిర్వహించవలసి వచ్చింది. గోటితో పోయేదానికి గొడ్డలి కావలసి వచ్చిందన్న సామెతలో వలె చివరికి అచ్చమైన గాంధేయవాది పొట్టి శ్రీరాములుగారు చరిత్రలోనే ఎన్నడూ, ఎవరూ కని విని ఎరుగని ఆత్మ బలిదానం చేస్తేనే గాని ఆంధ్ర రాష్ట్ర నిర్మాణం వంటి అల్పాతి అల్ప వాంఛను తెలుగువారు సఫలం చేసుకోలేక పోయారు.

ఒకరు ఒక దారి చేసిన తర్వాత ఆ దారిని నడవడం ఎవరికైనా సులభమే. ఆంధ్రులు అష్టకష్టాలు.పడి, అశేష త్యాగాలు చేసి స్వరాష్ట్రం సంపాదించుకున్న తర్వాత దేశంలో మిగిలిన

భాషల వారికి అనాయాసంగా, అయాచితంగా, స్వరాష్ట్రాలు సిద్ధించాయి. మొత్తం దేశం భాషా ప్రయుక్తంగా పునర్వ్యవస్థీకృతమైంది. ఇది నిజానికి చాలా స్వల్పమైన రాజకీయ, పరిపాలనా సంబంధమైన సంస్కరణ. కాని దానికి ఆ రోజులలో ఎందుకంత వ్యతిరేకత వచ్చిందో, ఇప్పుడు ఏటేటా ఒక ఉత్సవం జరుపుకోవలసినంతగా ఆనాడు ఎందుకు అన్ని త్యాగాలు చేసి, ఆందోళన చేస్తేనేగాని స్వరాష్ట్రం రాలేదో అర్థం కాదు.

అయితే, ఆనాడే కాదు, ఈనాడు కూడా భాషా రాష్ట్ర వ్యవస్థను సూత్రరీత్యా వ్యతిరేకిస్తున్నవారు లేకపోలేదు. భాషా రాష్ట్రాలు భారత జాతీయతకు భంగకారులన్న భయం, భ్రమ ఈనాటికీ ప్రచలితా లవుతున్నాయి. నదీజలాల వివాదాలు, సరిహద్దు వివాదాల వంటి వాటిని ఇందుకు ఉదాహరణలుగా చూపుతున్నారు. ఒకప్పుడు శ్రీ వి.వి. గిరి సయితం భాషా రాష్ట్రాలను రద్దు చేసి దేశాన్ని అయిదు మండలాలుగా పునర్వ్యవస్థీకరించాలని వాదించారు. ఇది కొత్త వాదం కాదు కనుక, చరిత్ర గమనాన్ని వెనుకకు మరలించాలన్న ప్రతీప వాదం కనుక, దాన్ని ఇప్పుడు కొత్తగా ఖండించనక్కరలేదు.

కాని, ఒకటి గుర్తుంచుకుంటే చాలు. ఆంధ్ర రాష్ట్రం విడిపోకుండా, ఆంధ్ర ప్రదేశ్ ఏర్పడకుండా, తెలుగువారు అటు ఉమ్మడి మద్రాసు రాష్ట్రంలోను, ఇటు నిజాం సంస్థానంలోను వుండిపోతే ఏమై వుండేది? ఆంధ్ర ప్రదేశ్ ఈనాడు సాధించిన ప్రగతి సాధించవలసిన దానితో పోల్చితే స్వల్పమే కావచ్చు కాని, ఈ మాత్రం ప్రగతి అయినా సాధ్యమై వుండేదా? ఆనాడు ఉమ్మడి రాష్ట్రంలో పరిశ్రమలలో, ప్రాజెక్టులలో, విద్యలో అన్నిటిలో అన్యాయం జరిగినందుకే కదా మనం విడిపోవాలని కోరింది? కలిసే వుంటే ఈనాటికీ తమిళులు, మనం తన్నుకులాడుతూనే వుండేవారం కాదా? ఆ తర్వాత మహారాష్ట్రులను, గుజరాతీలను కలిపి ఒకే రాష్ట్రంలో బంధించి వుంచాలన్న ప్రయోగానికి ఏ గతి పట్టిందో మనకు తెలియదా?

భారత దేశంలోని భిన్నత్వం, వైవిధ్యం అనాదిగా వున్నట్టివే. వాటిని గుర్తించడానికి నిరాకరించినంత మాత్రాన ఏకత్వం సిద్ధించదు. ఆ భిన్నత్వ, వైవిధ్యాల నుంచే ఏకత్వాన్ని సాధించుకోవాలి. అట్టి ఏకత్వ సాధన తెలుగువారికే కాక, అన్ని భారతీయ భాషా రాష్ట్రాల వారికి ధ్యేయం కావాలి. ఆ ధ్యేయానికే నేడు మనం గాని, తమ తమ రాష్ట్రావతరణోత్సవాలను జరుపుకునే సందర్భాలలో మిగిలిన రాష్ట్రాల వారు కాని పునరంకితులు కావాలి. అదే నేటి జాతీయ పర్వమైన దీపావళి, ప్రాంతీయ పర్వమైన ఆంధ్ర ప్రదేశ్ దినోత్సవం మనకు అందిస్తున్న సందేశం.

*(నవంబరు 1, 1986)*

# ఊరుమ్మడి బతుకులు

స్త్రీని యుక్త వయస్సు రాగానే దేవునికి సేవ పేరుతో దేవదాసిగా మార్చివేయడం, ఆ మార్పును ఉత్సవయుక్తంగా, శాస్త్రోక్తంగా జరిపించడం, ఆ పిదప ఆ నిర్భాగ్య యువతిని ఊరిలోని పెద్ద మనుషులందరు ఉమ్మడి ఉంపుడుకత్తెగా అనుభవించడం, జీవితాంతం వరకు లేదా యౌవనాంతం వరకు ఆ స్త్రీ బతుకు ఊరుమ్మడి బతుకుగా, కుక్కలు చింపిన విస్తరిగా కొనసాగడం - ఇంత కంటె పరమ దారుణ సాంఘిక దురాచారాన్ని ఊహించడమైనా కష్టం.

ఏ పూర్వకాలంలోనో, భూస్వామ్య వ్యవస్థ, రాజరికం, మత చ్ఛాందసం ప్రబలంగా వున్న మధ్య యుగాల అంధకారంలో అటువంటి దురాచారం వుండేదంటే అర్థం చేసుకోవచ్చు. కాని, అధునాతన నాగరికత, సార్వత్రిక విద్య, వైజ్ఞానిక మనస్తత్వం, ప్రజాస్వామ్య భావాలు ఇంతగా వ్యాప్తి చెందిన ఈ రోజులలో కూడా అది మన దేశంలో కొన్నిచోట్ల మూడు పువ్వులు, ఆరు కాయలుగా వర్ధిల్లుతున్నదంటే సాంఘికంగా మనం ఇంకా ఎంత వెనుకబడి వున్నామో ఊహించుకోవచ్చు.

కాగా, ఇప్పుడు, ఇన్నాళ్ళకు, ఇన్నేళ్ళకు ఈ దురాచారాన్ని రూపుమాపడానికి రాష్ట్ర ప్రభుత్వం శాసన సభలో ఒక బిల్లును ఆంధ్ర ప్రదేశ్ దేవదాసీ (కైంకర్య నిషేధం) బిల్లును ప్రవేశ పెట్టడం, అది సభ ఆమోదం పొందడం జరిగింది. ఇది ఎంతైనా హర్షించదగిన విషయం.

ఆంధ్ర ప్రాంతానికి వర్తించే ఇటువంటి చట్టం ఒకటి - 1947 నాటిది - వున్నదట. ఈ కారణంగానో ఏమోగాని, ఆంధ్ర ప్రాంతంలో దేవదాసీ దురాచారం దాదాపుగా లేదనే చెప్పవచ్చు. కాని, తెలంగాణా ప్రాంతంలో ఇప్పటికీ అది కొనసాగుతున్నది. ఈ విధంగా దేవునికి కైంకర్యం చేయబడిన స్త్రీలను దేవదాసి, జోగిని, బసివి, పార్వతి మొదలైన పేర్లతో వ్యవహరిస్తారట. అటువంటి వారు పదహారు వేలమందికి పైగా రాష్ట్రంలో వున్నారని శాసనసభలో బిల్లును ప్రవేశపెట్టిన సాంఘిక సంక్షేమ శాఖ మంత్రిణి శ్రీమతి ప్రతిభా భారతి తెలియజేశారు. అది ప్రభుత్వం దృష్టికి వచ్చిన అంకె. ఇంకా జనాభా లెక్కలలోకి ఎక్కకుండా ఎందరు అటువంటివారు వున్నారో తెలియదు.

ఏమైనా దేవదాసీ దురాచారాన్ని మాన్పించడానికి ఇప్పటికైనా ప్రభుత్వపరంగా ఒక చర్యను తలపెట్టడం హర్షించదగిందే. ఒక స్త్రీని దేవదాసిగా మార్చినా, ఆ మార్పును ప్రోత్సహించినా, ఆ కార్యక్రమంలో పాల్గొన్నా, దాన్ని కాగ్నిజబుల్ నాన్ బెయిలబుల్ నేరంగా పరిగణించాలని బిల్లు నిర్దేశిస్తున్నది. దానికి మూడేళ్ళు కారాగార శిక్ష, అయిదువేల రూపాయిల జరిమానా విధించవచ్చు.

అయితే, ఇల్లు అలకగానే పండుగ కావట్టు, బిల్లు తీసుకురాగానే అది అమలు అయినట్టుకాదు. బిల్లుపై చర్చ సందర్భంలో సభ్యులు దానిలోని కొన్ని లోపాలను పేర్కొన్నారు. ముఖ్యంగా ఈ

నేరాలను విచారించే అధికారాన్ని ఎగ్జిక్యూటివ్ మేజిస్ట్రేట్లకు ఇవ్వడం వల్ల అది దుర్వినియోగం కాగల అవకాశం వున్నదని, నాన్ బెయిలబుల్ నేరంగా పరిగణించడం వల్ల కూడా ఈ చట్టం పేరుతో వ్యక్తులను వేధించడం జరగవచ్చునని, ఆంధ్ర ప్రాంతంలోని చట్టాన్ని సవరిస్తే సరిపోయేదని ఇంకా పలు సూచనలు వచ్చాయి. బిల్లు నిబంధనలు హడావిడిగా రూపొందించినట్టున్నాయన్న విమర్శ కూడా వచ్చింది.

ఈ విమర్శ నిజమే కావచ్చు. అయిన ఆలస్యం ఎలాగూ అయింది కనుక, మరింత కట్టుదిట్టంగా బిల్లును రూపొందిస్తే బాగుండేదేమో. కొందరు సూచించినట్టు దాన్ని సెలెక్ట్ కమిటీకి పంపి సావధానంగా పరిశీలించి, నిర్దుష్టంగా తీర్చిదిద్ది వుండవలసిందేమో.

కాని, ప్రస్తుతపు బిల్లులో ఏవైనా చిన్న లోపాలున్నప్పటికి, దాని అవసరాన్ని, దాని వెనుక గల చిత్తశుద్ధిని ఎవరూ శంకించనక్కరలేదు. ఇప్పుడు దానిలో ఆ లోపాలున్నాయని, ఈ లోపాలున్నాయని రంధ్రాన్వేషణ చేసేవారు ఇన్నేళ్ళుగా ఇటువంటి చట్టం చేయడానికి ఎందుకు ప్రయత్నమైనా చేయలేదు? సభ్య సమాజానికే తలవంపులైన దేవదాసీ దురాచారాన్ని రూపుమాపడానికి ఎవరూ ఎందుకు కృషి చేయలేదు? ఇంతకుముందు అధికారంలో వున్న పార్టీ దృష్టి ఈ విషయంపై ఎందుకు ప్రసరించలేదు?

ఇప్పుడైనా ఈ సంస్కరణను తలపెట్టినందుకు ప్రభుత్వాన్ని అభినందించాలి. అయితే, ఇంతకు ముందు చెప్పినట్టు చట్టం చేసినంత మాత్రాననే కర్తవ్యం తీరిపోయిందని భావించరాదు. ఎన్నో సంఘ సంస్కరణ చర్యలు చట్ట రూపం ధరించినా ప్రభుత్వాల శ్రద్ధా లోపం వల్ల, చట్టంలోని లొసుగుల వల్ల సరిగా అమలు కావడం లేదని మనం ఎరిగినదే. ఈ చట్టం అలా కాకుండా జాగ్రత్త వహించాలి. దేవదాసీ జీవితం నుంచి విముక్తలైన స్త్రీలు తిరిగి ఆ నరక కూపాలలోకి పోకుండా వారికి పునరావాసం, జీవనోపాధి సదుపాయాలు, ముఖ్యంగా వివాహావకాశాలు కల్పించాలి. ఆర్థికంగా వారు పడుపు వృత్తిపై ఆధారపడవలసిన అవసరం లేకుండా చేయాలి.

చట్టం అమలు బాధ్యత ప్రభుత్వం మీద మాత్రమే లేదు, ప్రజలపై కూడా వుంది. ప్రజలు సహకరించనిదే ఎంత మంచి చట్టం చేసినా, ఎంత మంచి సంస్కరణ తలపెట్టినా అవి వ్యర్థమై పోతాయి. దేవదాసీత్వ నిషేధ శాసనం అలా కాకుండా ప్రజలు, ప్రభుత్వం కూడా జాగ్రత్త పడాలి.

*(ఏప్రిల్ 3, 1987)*

# మిథ్యావాదం

మొత్తం మీద ముఖ్యమంత్రి మిథ్యావాదాన్ని వదలిపెట్టేటట్టు లేదు. అలాగే మిథ్యావాదం ఆయనను వదలి పెట్టేటట్టు లేదు. కేంద్రం మిథ్య అని ఆయన పదే పదే ప్రకటిస్తున్నారు. అందరిని అయోమయంలో ముంచెత్తుతున్నారు. ఆయన అసలు ఉద్దేశం ఏమైందీ అంతుపట్టడం లేదు.

మిథ్య అంటే నిఘంటువు ప్రకారం అసత్యం, భ్రాంతి. ఫలానా విషయం మిథ్య అంటే అది అసత్యమని అర్థం.

ముఖ్యమంత్రి శ్రీ ఎన్.టి. రామారావు కేంద్రం మిథ్య అని పెక్కుసార్లు ప్రకటించారు. కేంద్రం అనేది కేంద్ర ప్రభుత్వం అనేదానికి హ్రస్వరూపం. కేంద్రం మిథ్య అంటే కేంద్ర ప్రభుత్వం కూడా మిథ్య అన్నమాట. అంటే కేంద్ర ప్రభుత్వాన్ని ముఖ్యమంత్రి గుర్తించడం లేదనే ఇన్నాళ్ళూ అందరూ అర్థం చేసుకోవలసి వచ్చింది.

కేంద్రం, కేంద్ర ప్రభుత్వం అనే మాటలు భారత రాజ్యాంగంలో లేని మాట నిజమే. రాజ్యాంగంలో యూనియన్ (ఫెడరేషన్ కాదు), గవర్న్‌మెంట్ ఆఫ్ ఇండియా వంటి మాటలు మాత్రమే వున్నాయి. వీటికి పర్యాయ పదాలుగానే కేంద్రం, కేంద్ర ప్రభుత్వం అనే మాటలను మనం ఉపయోగిస్తున్నాము. అందుచేత రాజ్యాంగ పాఠంలో లేకపోయినప్పటికీ కేంద్రం, కేంద్ర ప్రభుత్వం అనే మాటలు మిథ్య అయిపోవు. వాటిని మన సౌలభ్యం కోసం వాడడంలో తప్పు లేదు.

ముఖ్యమంత్రి మిథ్యావాదంలోని మరొక అంశం ఇది. రాష్ట్రాలకు సరిహద్దులున్నాయి. రాష్ట్రాల యూనియన్ అయిన భారతదేశానికి కూడా సరిహద్దులున్నాయి. కాని కేంద్రానికి ఎల్లలు లేవు. దానికొక ఆకారం లేదు. అందుచేతనే అది మిథ్య. కేంద్రం అనే భావం మిథ్య.

ముఖ్యమంత్రి భారతదేశాన్ని ఒప్పుకుంటున్నారు. అయినప్పుడు భారతదేశాన్ని పాలించే ప్రభుత్వం ఒకటి వుండాలి కదా? దాన్నే మనం కేంద్ర ప్రభుత్వం, లేదా హ్రస్వ రూపంలో కేంద్రం అని వ్యవహరిస్తున్నాము. రాజ్యాంగం పేర్కొన్న భారత ప్రభుత్వాన్నే (గవర్న్‌మెంట్ ఆఫ్ ఇండియా) కేంద్ర ప్రభుత్వం, కేంద్రం అని అంటున్నాము. మరి భారత ప్రభుత్వం నిజమై, కేంద్ర ప్రభుత్వం, కేంద్రం నిజం కాకపోవడమేమిటి?

కేంద్రం అనే మాటపట్ల ముఖ్యమంత్రికి అభ్యంతరం వుందనుకోవాలా? అలాగైతే రాష్ట్రం అనేదానికి ఎల్లలున్నాయి కనుక అది నిజమై, దాన్ని పాలించే రాష్ట్ర ప్రభుత్వానికి ఎల్లలు లేవు కనుక అది మిథ్య కావాలి. మరి ఈ నిర్వచనానికి ముఖ్యమంత్రి అంగీకరిస్తారా?

శుక్రవారంనాడు పత్రికలవారితో మాట్లాడుతూ ముఖ్యమంత్రి తన వ్యాఖ్యలను కొందరు

తప్పుగా అర్థంచేసుకుని, తప్పు విమర్శలు చేస్తున్నారని ఆరోపించారు. కేంద్ర ప్రభుత్వాన్ని తాము మిథ్య అనలేదని మాట మార్చారు. అధికారాల కేంద్రీకరణనే తాను మిథ్య అంటున్నానన్నారు. దీని భావం ఏమిటో ఎంత ఆలోచించినా మాకు బోధపడడం లేదు. కేంద్ర ప్రభుత్వం చేతిలో అధికారాలన్నీ కేంద్రీకృతం అవుతున్నాయని ఒక పక్క విమర్శిస్తూ ఆ కేంద్రీకరణనే మిథ్య అని మరొకపక్క ఎలా పేర్కొంటారు? కేంద్రీకరణ జరుగుతున్నది. కాని, ఆ కేంద్రీకరణ మిథ్య. అంటే అసత్యం, భ్రాంతి! చాలా విచిత్రమైన వివరణ! ముఖ్యమంత్రి వివరణ శక్తికి జోహార్లు అర్పించాలి.

రాజ్యాంగంలో కేంద్రీకృత అధికారాలు లేవని ముఖ్యమంత్రి అంటున్నారు. నిజానికి రాజ్యాంగంలో యూనియన్ లిస్ట్, స్టేట్ లిస్ట్, కంకరెంట్ లిస్ట్ అని మూడు రకాల అధికారాల జాబితాలున్నాయి. కేంద్రం (పోనీ, యూనియన్) అధికారాలు కేంద్రానికి, రాష్ట్రాల అధికారాలు రాష్ట్రానికి, రెండింటికి ఉమ్మడిగా వుండే అధికారాలు రెండింటికి అని స్పష్టంగా పేర్కొన్నారు.

అది కాక, కేంద్రం లిస్టులో 97వ నిబంధన ప్రకారం రాష్ట్రాల లిస్టులో గాని, ఉమ్మడి లిస్టులో గాని పేర్కొనబడని ఏ అధికారమైనా కేంద్రానికే చెందుతుంది. పైగా ఒక రాష్ట్ర శాసనానికి, కేంద్ర శాసనానికి మధ్య పేచీ వస్తే కేంద్ర శాసనానిదే పై చెయ్యి అవుతుంది. ఇది అధికార కేంద్రీకరణ కాక మరేమిటి? దీన్ని రాజ్యాంగమే నిర్దేశించింది కదా?

ముఖ్యమంత్రి ప్రధానమైన విమర్శ - కేంద్ర ప్రభుత్వం చేతిలో అధికారాలు క్రమంగా ఎక్కువ అవుతున్నాయి. రాష్ట్ర ప్రభుత్వాలకు తక్కువ అవుతున్నాయి. ఇది అన్యాయం. రాష్ట్రాలకు ఎక్కువ అధికారాలుండాలి. కేంద్రానికి తక్కువ వుండాలి. రాష్ట్రాలు బలంగా వుంటేనే కేంద్రం బలంగా వుంటుంది - ఈ అభిప్రాయంతో ఏకీభవించడానికి ఎవరికీ అభ్యంతరం వుండదు, వుండరాదు. రాజ్యాంగాన్ని రూపొందించిన సమయంలో దాని నిర్మాతలు కావాలనే కేంద్రానికి ఎక్కువ అధికారాలు ఇచ్చారు. అప్పటి పరిస్థితిలో అది సమర్థనీయమనిపించింది. ఇప్పుడు రాష్ట్రాలు అలా కాక, రాష్ట్రాలకే ఎక్కువ అధికారాలు వుండాలి, లేదా మరికొన్ని అదనపు అధికారాలు కావాలి అని కోరితే ఆ విధంగా రాజ్యాంగాన్ని రాజ్యాంగబద్ధంగా, ప్రజాస్వామ్యబద్ధంగా సవరించుకోవచ్చు. అది ఎలా జరగాలో సూచించడానికే సర్కారియా కమిషన్ ఏర్పడింది. ఈలోగా వేళా పాళా లేకుండా, అర్థం పర్థం లేకుండా, సందర్భశుద్ధి లేకుండా కేంద్రం మిథ్యవంటి అసంగత వ్యాఖ్యలు చేయడం అనవసరం.

*(ఏప్రిల్ 5, 1987)*

# ఘోర దురాచారం

మనం 21వ శతాబ్దానికి చేరువలో వున్నామా, లేక మధ్యయుగాల అంధకారంలో జీవిస్తున్నామా?

ఇది క్రీస్తు శకం 1987 వ సంవత్సరమా, లేక క్రీస్తు పూర్వం 1987 వ సంవత్సరమా?

ఇటీవల రాజస్థాన్‌లోని దేవరాల గ్రామంలో జరిగిన సతీ సహగమనం వార్త విన్నప్పుడు ఈ ప్రశ్నలు ఎవరికైనా మదిలో మెదలుతాయి.

సందేహం లేదు. మన దేశంలో ఒక గణనీయమైన భాగం, మన ప్రజలలో ఒక గణనీయమైన శాతం ఇంకా మధ్య యుగాల దుర్భర బర్బర పరిస్థితులలో, అతిహేయమైన, నికృష్టమైన మూఢ విశ్వాసాల పంక కూపంలో జీవిస్తున్నది.

ఆధునిక భారత జాతి నిర్మాత రాజారామ మోహనరాయ్ ప్రోత్సాహ, ప్రోద్బలాలతో అప్పటి ఈస్ట్ ఇండియా కంపెనీ గవర్నర్ జనరల్ విలియం బెంటింక్ సతీ సహగమనాన్ని నిషేధిస్తూ 1829లో ఒక చట్టం చేశాడని, ఆ తర్వాత క్రమంగా ఆ ఘోర దురాచారం సమసిపోయిందని చరిత్రలో చదువుతూ వుంటాము. కాని, ఇది నిజం కాదని, ఇంకా చెదురు మదురుగానైనా ఆ దురాచారం బ్రతికే వుందని, విరిసీ విరియని మొగ్గలవంటి యువతుల జీవితాలను నిలువునా కాల్చి చంపుతూనే వున్నదని మొన్నటి దేవరాల ఉదంతం తెలుపుతున్నది.

ఆమె పేరు రూప్ కున్వార్. ప్రాయం 18 ఏళ్ళు. పెళ్ళయి ఎన్నో రోజులు కాలేదు. బ్రతుకంతా ఇంకా ముందే వున్నది. ఇంతలో భర్త చనిపోయాడు. అతనితో పాటు ఆమె కూడా చితిపై కూర్చుని తాను కూడా నిలువునా కాలిపోయింది. చుట్టూ చేరిన తల్లిదండ్రులు, అత్తమామలు ఆమెను వారించలేదు. వేడుక చూడవచ్చిన వందలాది ప్రజలు ఆ దారుణ దృశ్యాన్ని చూస్తూ నిలబడ్డారే గాని, ఒక్కరూ ఆ దురంతం జరగకుండా ఆపడానికి ప్రయత్నించలేదు.

ఆ సంఘటన జరిగింది ఈ నెల 4వ తేదీన కాగా, మొన్న 13వ రోజున సమీప గ్రామాలనుంచి, దూర ప్రాంతాల నుంచి లక్ష మందికి పైగా జనం దేవరాల గ్రామానికి వచ్చి "చున్రీ మహోత్సవ్"లో పాల్గొన్నారట. ఆ ఉత్సవం జరగడానికి వీలు లేదని రాజస్థాన్ హైకోర్టు ఉత్తర్వు జారీ చేసింది. ఆ ఉత్తర్వును పాటించగలనని రాజస్థాన్ ప్రభుత్వం వాగ్దానం చేసింది. అయినా, ఆ రోజున సహగమనం అంత "వేడుక" గా జరుగుతుంటే నివారించలేకపోయినట్టే, మొన్నటి చున్రీ ఉత్సవాన్ని కూడా జరగకుండా చేయలేక రాష్ట్ర ప్రభుత్వం తన అసమర్థతను తిరిగి చాటుకున్నది.

ప్రపంచానికే నాగరికతా భిక్ష పెట్టిన దేశమని, వేదభూమి అని, కర్మ క్షేత్రమని, మతానికి ఎంతో విలువ ఇచ్చే జాతి అని మన గురించి మనం గొప్పగా చెప్పుకుంటాము. కాని, చనిపోయిన

భర్తతో పాటు భార్యను కూడా సజీవ దహనం చేయడాన్ని ఒక పవిత్ర చర్యగా భావించే ప్రజలు మన దేశంలో వున్నారంటే సభ్య దేశాల మధ్య మనం సిగ్గుతో తలవంచుకొనక తప్పదు.

ఈ సంఘటన వెనుక మత మౌఢ్యమే కాదు. పురుషాహంకారం కూడా వున్నది. భారత నారికి భర్త తోడిదే లోకమని, పురుషునికి స్త్రీ భోగ్యవస్తువు మాత్రమేనని, భర్త చనిపోతే భార్య బ్రతికి వుండరాదనే దారుణమైన ఆలోచన వున్నది.

బహుశా దేశంలోకల్లా రాజస్థాన్ వెనుకబడిన రాష్ట్రమై వుండాలి. అక్కడనుంచి అప్పుడప్పుడు ఇటువంటి వార్తలు వస్తూ వుంటాయి. మధ్యయుగాలలో రాజపుత్ర వీరులు యుద్ధ రంగంలో చనిపోయి వారి రాజ్యాలు శత్రువుల వశమైతే, వారి భార్యలు అగ్నిలో దూకి "జోహార్" చేసేవారట. ఆనాటి ఆచారానికి చిహ్నమే మొన్నటి సంఘటన.

ఇంతేకాదు. రాజస్థాన్‌లో ఇప్పటికి కూడా ప్రతి ఏడాది ఒకానొక రోజున వందలు, వేల సంఖ్యలో ఏడాది, రెండేళ్ళయినా లేని బాల బాలికలకు సామూహిక వివాహాలు జరిగే దురాచారం అమలులో వున్నది. స్వాతంత్ర్యం వచ్చిన ఇన్నేళ్ళ తర్వాత కూడా భారత ప్రభుత్వం గాని, రాజస్థాన్ ప్రభుత్వం గాని ఈ జుగుప్సాకర బాల్య వివాహాలను మాన్పించలేకపోవడం కంటె లజ్జాకరం మరొకటి లేదు.

అయితే, రాజస్థాన్‌ను మాత్రమే అనుకోవలసిన పని లేదు. సహగమనం వంటి సంఘటనలు జరగక పోవచ్చు కాని, స్త్రీలపై పురుషాధిక్యానికి సంబంధించిన ఎన్నో దురాచారాలు దేశమంతటా వికృతతాండవం చేస్తూనే వున్నాయి. ఉదాహరణకు కోరినంత వర కట్నం తేలేదని భర్త, అత్తమామలు యువతులను అమానుషంగా సజీవ దహనం చేసి చంపి, దాన్ని ఆత్మహత్యగా చిత్రించే సంఘటనల వార్తలు రాని రోజు అంటూ లేదు. అలాగే పోలీసుస్టేషన్‌లతో సహా ఎక్కడ పడితే అక్కడ ఒంటరిగా దొరికిన స్త్రీని సామూహిక మానభంగం చేసి చివరికి గొంతు పిసికి చంపుతున్న సంఘటనలు కూడా తరచుగా వార్తలలోకి ఎక్కుతున్నాయి.

ఇటువంటి ఉదంతాలు విని విని వాటిని ఏవో మామూలుగా జరిగేవేలే అని తేలికగా తీసుకునే దుస్థితికి చేరుకున్నది మన సమాజం. ఈ దుస్థితి నుంచి సమాజాన్ని జాగృతం చేయడానికి చట్టాలు మాత్రమే చాలవు. ప్రభుత్వపరమైన చర్యలు మాత్రమే చాలవు. మహిళా సంఘాల నుంచి కూడా తీవ్ర ప్రతిస్పందన రావాలి. స్త్రీలలో చైతన్యం రావాలి. తిరుగుబాటు దృక్పథం రావాలి. స్త్రీగా పుట్టినంత మాత్రాన పురుషునికి బానిసగా, ఆటవస్తువుగా పడి వుండవలసిన అవసరం లేదన్న మనస్తత్వం పెంపొందించుకోవాలి. తమ హక్కుల కోసం సంఘటితలు కావాలి.

*(సెప్టెంబర్ 18, 1987)*

# విప్లవాత్మక సంస్కరణలు

సుమారు 70 ఏళ్ళనాడు 1917 అక్టోబరులో జార్ చక్రవర్తుల నిరంకుశత్వం బోల్షివిక్కుల చేతిలో నిర్మూలనం కావడం మొట్టమొదటి రష్యన్ విప్లవం కాగా, ఈనాడు సోవియెట్ కమ్యూనిస్టు పార్టీ ప్రధాన కార్యదర్శి మిఖాయిల్ గోర్బచేవ్ ప్రవేశ పెట్టిన సంస్కరణలను రెండవ విప్లవంగా పలువురు వర్ణిస్తున్నారు.

సందేహం లేదు. గోర్బచేవ్ ప్రతిపాదించిన సంస్కరణలు విప్లవాత్మకమైనవే. సోవియెట్ సమాజాన్ని సమూలంగా మార్చివేయగలిగినట్టివే.

కాని, నిజానికి గోర్బచేవ్ సంస్కరణలను మూడవ విప్లవంగా పరిగణించాలి. రెండవ విప్లవం 1956 లోనే ప్రారంభమైంది. ఆనాడు సోవియెట్ కమ్యూనిస్టు పార్టీ ప్రథమ కార్యదర్శిగా వున్న నికితా క్రుశ్చేవ్ ఆ విప్లవ ప్రారంభకుడు. పార్టీ 20వ కాంగ్రెస్‌లో స్టాలిన్ దారుణ నియంతృత్వాన్ని, ఫాసిస్టుల క్రౌర్యాన్ని తలపింపచేసే దమననీతిని క్రుశ్చేవ్ బట్టబయలు చేసి సోవియెట్ సమాజాన్ని మరింత ఉదారవాద మార్గంలో నడిపించడానికి ప్రయత్నించాడు.

నిజానికి ఆనాటి నుంచే సోవియెట్ సమాజంలో పెద్ద మార్పులు రాసాగాయి. స్టాలిన్ కాలంలో పార్టీ విధానంతో ఏ కొద్దిగా వ్యతిరేకించిన వాడినైనా సైబీరియాలోనో, మరొక చోటనో నిర్బంధ కార్మిక శిబిరాలకు ప్రవాసం పంపించే వారు. సమష్టి వ్యవసాయ క్షేత్రాల పేరుతో లక్షలాది ప్రజలను ఊచకోత కోయడం జరిగేది. సామ్రాజ్యవాదులతో కలిసి సోవియెట్ యూనియన్‌కు వ్యతిరేకంగా కుట్ర పన్నినట్టు అసత్యారోపణలు చేసి స్టాలిన్ తన వ్యతిరేకులైన పార్టీ అగ్ర నాయకు లనేకులను కపట విచారణల తంతు జరిపించి హతమార్చడం కూడా జరిగింది.

ఈ ఘోర చర్యలను ఆ రోజులలో పశ్చిమ దేశాల వారెవరైనా బయట పెడితే అవన్నీ సామ్రాజ్యవాదుల దుష్ప్రచారంగా కమ్యూనిస్టులు ఖండించేవారు. ఆర్థర్ కోస్లర్ తన "డార్క్‌నెస్ ఎట్ నూన్" నవలలో ఆనాటి కపట విచారణల క్రౌర్యాన్ని కఠోర భయానక వాస్తవికతతో కళ్ళకు కట్టినట్టు చిత్రిస్తే దాన్ని ఒక మాజీ కమ్యూనిస్టు కట్టుకథగా కొట్టిపారవేశారు.

కాని స్టాలిన్ తర్వాత పార్టీ నాయకత్వాన్ని స్వీకరించిన క్రుశ్చేవ్ 20వ పార్టీ కాంగ్రెస్‌లో అవన్నీ నిజమేనని తేల్చి చెప్పాడు. దాన్ని సోవియెట్ రష్యాలో రెండవ విప్లవంగా పరిగణించాలి. క్రుశ్చేవ్ సోవియెట్ సమాజాన్ని ఎంతోకొంత లిబరలైజ్ చేయడానికి ప్రయత్నించాడు. కాని, ఆనాటి పరిస్థితులలో అతని ప్రయత్నం అంతగా విజయవంతం కాలేదు. ఆ పిదప 30 ఏళ్ళకు పైగా స్తబ్దత కొనసాగింది. అయినా, ఆ 30 ఏళ్ళలో ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమ స్వరూప స్వభావాలు మారిపోయాయి. తిరిగి స్టాలిన్ కాలంనాటి పరిస్థితులు పునరావృత్తం కావడానికి అణుమాత్రమైనా వీలులేని విధంగా కమ్యూనిస్టు వ్యవస్థ మారిపోయింది.

కాగా, ఇప్పుడు మారుతున్న ప్రపంచ పరిస్థితులకు అనుగుణంగా సోవియెట్ కమ్యూనిజంలో మరింత విప్లవాత్మకమైన సంస్కరణలను తీసుకురావడానికి గోర్బచేవ్ ప్రయత్నం ప్రారంభించాడు. "గ్లాస్‌నోస్త్" విధానం ద్వారా సోవియెట్ సమాజంలోను, ప్రభుత్వంలోను, పార్టీలోను జరిగే అవకతవకలను బహిరంగంగా, స్వేచ్ఛగా, నిర్భయంగా ఎండగట్టడానికి అవకాశం కల్పించాడు. "పెరిస్త్రోయికా" విధానం ద్వారా సోవియెట్ ప్రభుత్వాన్ని, కమ్యూనిస్టు పార్టీని మరింత ప్రజాస్వామ్యబద్ధమైన మార్పులతో పునర్వ్యవస్థీకరించడానికి సంకల్పించాడు. ఒకప్పుడు హ్యూమనిజం, హ్యూమేనిటీ మొదలైన మాటలను బూర్జువా వర్గపు కృత్రిమ మూల్యాలకు ప్రతీకలుగా నిరసించడం జరిగేది. ఈనాడు గోర్బచేవ్ తన ప్రసంగంలో సోషలిస్టు వ్యవస్థకు ఒక కొత్త "హ్యూమేన్" (మానవతా) రూపం కల్పిస్తామనడం గమనించదగింది.

సోవియెట్ సమాజంలో గ్లాస్‌నోస్త్ (బహిరంగత్వం), పెరిస్త్రోయికా (పునర్వ్యవస్థీకరణ) లకు, స్టాలినిజాన్ని ఏడు నిలువుల లోతున పాతిపెట్టడానికి ప్రతీకగా స్టాలిన్ కాలంలో నిష్కారణంగా నిహతులైన లక్షలాది అభాగ్యుల స్మారక చిహ్నాన్ని మాస్కోలో నిర్మించడానికి మొన్నటి 19వ పార్టీ జాతీయ మహాసభ నిర్ణయించింది. గోర్బచేవిజానికి ఇది మహత్తర విజయం, ఇంతకుముందే లెనిన్‌పై మంద్రస్థాయిలోనైనా ప్రారంభమైన విమర్శలు, ఇన్ని దశాబ్దాలుగా అవాచ్యుడుగా మిగిలిపోయిన ట్రాట్స్కీకి బోల్షివిజం చరిత్రలో సముచిత స్థానం కల్పించడం మొదలైన కొత్త ధోరణులకు ఈ స్మారక చిహ్నం ప్రతిపాదన పరాకాష్ఠ.

కాగా, సోవియెట్ కమ్యూనిస్టు పార్టీ జాతీయ మహాసభ చేసిన ముఖ్య నిర్ణయాలలో మరొకటి అధ్యక్ష తరహా పరిపాలనకు సంబంధించినది.

ప్రస్తుతం సోవియెట్ యూనియన్‌లో అధ్యక్షుడు ఉత్సవ విగ్రహం మాత్రమే. ఇకపై అలాకాక, అమెరికాలోవలె ఆ పదవిని సంపూర్ణాధికార సమన్వితం చేయాలని, పార్టీ ప్రధాన కార్యదర్శి పదవిని కూడా దానికి జోడించాలని, ఇదే పద్ధతి జాతీయ స్థాయి నుంచి గ్రామ స్థాయివరకు అవలంబించాలని ప్రతిపాదన జరిగింది. ఈ రెండు పదవుల ఎన్నిక రహస్యపు బ్యాలట్ ద్వారా, పూర్వంవలె కాక ఒకరి కంటె ఎక్కువ మంది అభ్యర్థులు నిలబడే అవకాశమివ్వడం ద్వారా మరింత ప్రజాస్వామ్యబద్ధం చేయడానికి నిర్ణయం జరిగింది.

అయితే, అమెరికాలో అధ్యక్షునికి ఎన్ని అధికారాలున్నా అతనిపై కాంగ్రెస్ అదుపు, న్యాయస్థానాల అదుపు వంటి కొన్ని పరిమితులున్నాయి. మరి సోవియెట్ రష్యాలో పార్టీ పదవి, ప్రభుత్వ పదవి ఒకే వ్యక్తికి అప్పగిస్తే ఎటువంటి అధికార పరిమితులను, అదుపులను విధిస్తారో చూడవలసి వుంది. లేకపోతే ఇదివరలో పార్టీ ప్రధాన కార్యదర్శి పదవిని, ప్రధాని పదవిని ఒకేసారిగా చెలాయించిన స్టాలిన్ ఉదంతం వంటిది పునరావృత్తం కాగలదనే భయం తప్పదు.

అయితే, ఏ వ్యక్తి పార్టీలోగాని, ప్రభుత్వంలోగాని ఒక పదవిని పదేళ్ళకు మించి నిర్వహించరాదనే నిబంధనను కొత్త నిర్ణయాలలో చేర్చారు. ఇది ఒక వ్యక్తి పదవిలో పాతుకుపోయి నియంతగా

మారే ప్రమాదాన్ని నివారించగలదని ఆశించవచ్చు. ఇంతేకాక, మొన్నటి మహాసభలో అయిదు వేలమంది ప్రతినిధులు నిర్భయంగా, స్వేచ్ఛగా తమ అభిప్రాయాలను వెల్లడించడం చూస్తే, ఇదే స్వేచ్ఛా ధోరణి... గ్లాస్‌నోస్త్ .. ఇకపై మరింతగా బలపడి అదొక అదుపుగా పనిచేస్తుందని కూడా ఆశించవచ్చు.

మొత్తంపై గోర్బచేవ్ ప్రతిపాదించిన సంస్కరణలకు పార్టీ మహాసభ ఆమోదముద్ర వేయడం సోవియెట్ సమాజానికి శుభోదర్కంగా భావించాలి. ఇప్పటికే యూరోకమ్యూనిజం వంటి రకరకాల పేర్లతో ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమం చాలా మార్పులకు లోనైంది. కాగా, కమ్యూనిజంలో కూడా "ఫండమెంటలిస్టు" ఛాందసత్వంలో కూరుకుపోయిన పార్టీలు కొన్ని దేశాలలో ఇంకా లేకపోలేదు. వాటిపై గోర్బచేవ్ సంస్కరణలు ఎటువంటి ప్రభావం కనబరుస్తాయో చూడాలి. ముఖ్యంగా 1968లో చెకొస్లొవాకియాలో సోవియెట్ సైనిక జోక్యం తర్వాత దాన్ని సమర్థిస్తూ బయలు దేరిన "బ్రెజ్నెవ్ డాక్ట్రిన్" (సోషలిజం రక్షణార్థం ఒక సోషలిస్టు దేశంలో తక్కిన సోషలిస్టు దేశాలు కలుగజేసుకోవచ్చునన్న సిద్ధాంతం) తూర్పు యూరప్‌లో ఎట్టి మార్పులకు లోను కాగలదో కూడా ఆసక్తితో గమనించదగింది. గోర్బచేవ్ ప్రారంభించిన గ్లాస్‌నోస్త్, పెరిస్త్రోయికాలు సోవియెట్ యూనియన్‌కు మాత్రమే పరిమితమని, తక్కిన సోషలిస్టు దేశాలకు అవి వర్తించవని వాదించడం పోనుపోను కష్టం కాగలదనడంలో సందేహం లేదు.

*(జులై 6, 1988)*

# పరువు నష్టం బిల్లు

వర్ధమాన ప్రపంచంగా పేరుపడిన దేశాలలో ఇండియాది ఒక విశిష్ట స్థానం. ఒకటీ అరా దేశాలలో తప్ప పెక్కింటిలో ప్రజలు నియంతృత్వపు ఇనుప పాదాల క్రింద, పౌరత్వపు హక్కులు మచ్చుకైనా లేకుండా మగ్గుతుండగా ఇండియాలో మాత్రం పార్లమెంటరీ ప్రజాస్వామ్యం, పౌరస్వత్వాలు, ముఖ్యంగా వాక్స్వాతంత్ర్యం, సభా స్వాతంత్ర్యం, పత్రికా స్వాతంత్ర్యం వంటివి వర్ధిల్లుతున్నాయి. ఎమర్జన్సీ విధించిన కొద్దికాలంలో తప్ప వాటికి భంగం కలగలేదు. సభ్య ప్రపంచంలో మనం తలెత్తుకుని సగర్వంగా చెప్పుకోదగిన విషయాలలో ఇదొకటి.

అయితే, ఇప్పుడు ఇందుకు విఘాతం కలిగించే ఒక విపరీత విషయం అమలులోకి రాబోయే ప్రమాదం పొడ చూపింది. కేంద్ర ప్రభుత్వం గత సోమవారంనాడు "పరువు నష్టం" (డిఫమేషన్) పేరుతో ఒక బిల్లును లోక్‌సభలో ప్రవేశ పెట్టింది. ఆ మర్నాడు దాన్ని తన మెజారిటీ బలంతో ఆమోదింపజేసింది.

అంతకుముందు ఈ బిల్లు ప్రసక్తి లేదు, దాని ప్రస్తావన ఎక్కడా రాలేదు. ఉన్నట్టుండి పిడుగుపాటు వలె ఆ బిల్లును ప్రభుత్వం తలపెట్టింది. హడావిడిగా దానికి ఆమోదం పొందింది.

పరువు నష్టం బిల్లు తీరు, దాన్ని ప్రవేశపెట్టి ఆమోదం పొందిన తీరు రెండూ కూడా పూర్తిగా అభ్యంతరకరమైనవి. ప్రజాస్వామ్య స్వాతంత్ర్యాలకు, ముఖ్యంగా పత్రికా స్వాతంత్ర్యానికి గొడ్డలిపెట్టుగా పరిణమించబోతున్న ఈ తీవ్రమైన బిల్లును ప్రవేశపెట్టదలచినప్పుడు దానిపై దేశవ్యాప్తంగా స్వేచ్ఛగా చర్చ జరగనివ్వవలసింది. తగినంత హెచ్చరికతో తలపెట్టి వుండవలసింది. అదేమీ లేకుండా ఆదరాబాదరా ప్రవేశపెట్టి ప్రజల నెత్తిన దాన్ని రుద్దడానికి ప్రభుత్వం ప్రయత్నించింది. ఇది ఎంతైనా అభ్యంతరకరం.

ఈ బిల్లు ప్రకారం ఒక వ్యక్తి ప్రతిష్ఠకు భంగం కలిగించగల, కలిగించే అవకాశం కలదని తెలిసిన, ఏ ఆరోపణనైనా ప్రచురించడం పరువు నష్టం దావాకు దారితీస్తుంది. ఆరోపణతో పాటు పూర్తి సాక్ష్యాధారాలను కూడా ప్రచురిస్తే సరే. లేకపోతే అది శిక్షార్హమైన నేరం అవుతుంది. మొదటిసారి ఈ నేరం చేస్తే రెండేళ్ళవరకు జైలు శిక్ష కాని, రెండువేల రూపాయల వరకు జుల్మానా కాని, లేదా రెండూ కాని కోర్టు విధించవచ్చు. ఆ తర్వాత అటువంటి నేరమే చేస్తే, ఎన్నిసార్లు చేస్తే అన్నిసార్లు అయిదేళ్ళ కారాగార శిక్ష, అయిదువేల రూపాయిల జుల్మానా విధించవచ్చు.

లోక్‌సభ ఆమోదించిన ఈ బిల్లులో ఒక విచిత్ర విశేషం వుంది. మామూలుగా కోర్టులో ముద్దాయి నేరం చేశాడని నిరూపించవలసిన బాధ్యత అభియోగం తీసుకువచ్చినవారిది. నేరం రుజువయ్యేదాకా ముద్దాయిని నిర్దోషిగానే పరిగణించాలి. ఈ బిల్లు ప్రకారం అలా కాదు. తాను

నిర్దోషినని నిరూపించుకోవలసిన బాధ్యత ముద్దాయిది. అలా నిర్దోషి అని నిరూపణ కానంతవరకు ముద్దాయిని దోషిగానే పరిగణిస్తారు.

ఇది న్యాయసూత్రాన్ని శీర్షాసనం వేయించడం తప్ప, మరొకటి కాదు. ఇది సభ్య ప్రపంచంలో, ప్రజాస్వామ్య దేశాలలో చెల్లుబడిలో వున్న న్యాయానికి విరుద్ధమైనది.

ఈ సందర్భంలో ముద్దాయి అంటే - ఈ బిల్లు వ్యక్తులకు కూడా వర్తిస్తుందని అంటున్నప్పటికి ... ప్రధానంగా పత్రికలు అనే అర్థం. వార్తలు, వ్యాఖ్యలు ప్రచురించేది పత్రికలు కనుక, ఆ వార్తలలో, వ్యాఖ్యలలో ఆరోపణలు వున్న పక్షంలో బిల్లు ప్రకారం అది శిక్షార్హమైన నేరం అవుతుంది. అంటే పత్రికల నోరు నొక్కివేయడానికే ఈ బిల్లును ప్రభుత్వం ఉద్దేశించిందని స్పష్టమవుతున్నది.

ఈ బిల్లు శాసనమైతే బోఫోర్స్, జర్మన్ జలాంతర్గాములు, ఫెయిర్ ఫాక్స్ కుంభకోణం, ఒ.ఎన్.జి.సి... లలిత్‌సూరి వ్యవహారం మొదలైన వాటిని పత్రికలు ప్రచురించడం నేరమవుతుంది. ఈ ఉదంతాలన్నింటిలోను అంతిమ నేరస్థులెవరో ఇంకా బయట పడివుండక పోవచ్చు. కాని, వార్తాప్రసార సాధనాల ద్వారా ఆయా ఉదంతాల వార్తలు వెలువడిన తర్వాతనే అటువంటి ఉదంతాలు జరిగిన విషయం ప్రజలకు వెల్లడి అయింది. బోఫోర్స్ విషయంలో ప్రభుత్వం అసలు అటువంటి కుంభకోణమేదీ జరగలేదనే మొదట ఖండించింది. కాని, ఒకదాని తర్వాత ఒకటిగా వార్తలు, ఆరోపణలు పరంపరగా వెలువడడంతో దానిపై దర్యాప్తు జరిపించక తప్పలేదు. ఎంత లేదనుకున్నా, ఆయా ఆరోపణల విషయంలో ప్రజల మనస్సులలో కలిగిన అనుమానాలు ఇంకా తొలగిపోలేదు. ముడుపులు ఎవరికి ముట్టినవో తెలియకపోవచ్చు. కాని, ఎవరో ఒకరికి అక్రమంగా, చట్టవిరుద్ధంగా ముట్టినవన్న విషయమైనా వెల్లడి అయింది కదా? అసలు అటువంటి ఆరోపణలను ప్రచురించనేకూడదని నిషేధిస్తే ప్రభుత్వ యంత్రాంగంలో జరుగుతున్న అవినీతి కుంభకోణాలు వెలుగులోకి ఎలా వస్తాయి? అలా నిషేధించడం తెలుసుకునే హక్కును... రైట్ టు నో అనేదాన్ని ... నిరాకరించడమే కాదా?

ఏ ఆరోపణలైనా ప్రచురిస్తే డాక్యుమెంటరీ సాక్ష్యాధారాలతో ప్రచురించవచ్చునని బిల్లు పేర్కొంటున్నది. కాని, ఒక వేళ డాక్యుమెంట్లతో సహా ప్రచురించినప్పటికీ ఆ డాక్యుమెంట్లను అసత్యమైనవిగా, ఫోర్జరీ పత్రాలుగా త్రోసి పుచ్చవచ్చు కదా! ఇక నిజం బయటపడే అవకాశం ఎక్కడ?

పత్రికలన్నీ ఒకరకమైనవి కావు. వాటిలో కొన్ని సత్యనిరూపణ ధ్యేయంగా కలిగినవి, ఇన్వెస్టిగేటివ్ రిపోర్టింగ్‌ను తమ బాధ్యతగా భావించేవి వున్నాయి. కాగా, కేవలం బ్లాక్‌మెయిలింగ్‌నే లక్ష్యంగా పెట్టుకున్నవి, గిట్టనివారిపై బురద చల్లేవి, అసభ్యమైన, అశ్లీలమైన వ్రాతలు వ్రాసేవి కూడా కొన్ని వున్నాయి. మొదటివాటి పట్ల అభ్యంతరం వుండనక్కరలేదు. వాటిని ఇష్టమైనా, కష్టమైనా ప్రభుత్వాలు భరించవలసిందే. ఆమోదించవలసిందే. అది ప్రజాస్వామ్య ప్రధాన సంప్రదాయాలలో ఒకటి.

కాని, రెండవ రకం పత్రికలు ... బ్లాక్ మెయిలింగ్‌కు పాల్పడేవి. .... సమాజానికి చీడ పురుగులు. వాటిని ఏరిపారవేయడానికి, శిక్షించడానికి ఇప్పటికే భారత శిక్షాస్మృతిలో చట్టాలున్నాయి. అయినప్పుడు కొత్తగా అసలు ఏ విధమైన సత్యనిరూపణాత్మక వార్తా సేకరణను - ఇన్వెస్టిగేటివ్ రిపోర్టింగ్‌ను - అనుమతించని విధంగా కొత్త బిల్లును తీసుకురావలసిన అవసరం ఏమున్నది? ఈ బిల్లు శాసనమైతే దానికి రెండు వైపుల పదును కలుగుతుంది. ఇదివరలో తమిళనాడులోను, బీహారులోను ఇటువంటి కఠినమైన బిల్లులను తలపెట్టినప్పుడు దేశవ్యాప్తంగా అసమ్మతి చెలరేగింది. అలాగే ఆంధ్ర ప్రదేశ్‌లో కూడా తెలుగుదేశం ప్రభుత్వం అట్టి బిల్లు తీసుకురాదలచి, ఆ తర్వాత ఆ సంకల్పాన్ని విరమించుకున్నది. ఇప్పుడు ఏకంగా కేంద్రమే అట్టి చట్టం చేస్తే రాష్ట్రాలు కూడా దాన్ని అనుసరిస్తాయి. కాంగ్రెస్ ప్రభుత్వాల మీద వాటి ప్రత్యర్థులు ఆరోపణలు చేయడానికి ఎలా వీలుండదో, నాన్ కాంగ్రెస్ ప్రభుత్వాల మీద వాటి ప్రత్యర్థులు ఆరోపణలు చేయడానికి కూడా అలాగే వీలుండదు.

అది అలా వుంచి ఈ "పరువు నష్టం బిల్లు" ను మన ప్రజాస్వామ్యపు పరువు తీసే బిల్లుగానే వర్ణించాలి, ఖండించాలి. దీన్ని అమలులోకి తీసుకురాకూడదు; తీసుకురాకుండా చూడాలి.

*(సెప్టెంబర్ 2, 1988)*

# మౌలానా ఆజాద్

గాంధీజీ నాయకత్వాన భారత జాతీయోద్యమంలో పాల్గొన్న మహామహులలో నెహ్రూ, పటేల్ తర్వాత ఎన్నదగిన వ్యక్తి మౌలానా అబుల్ కలాం ఆజాద్.

పార్సీ, అరబిక్, ఉర్దూ భాషలలో సాటిలేని పండితుడు ఆజాద్. ఉర్దూలో గొప్ప రచయిత, పత్రికా రచయిత, సంపాదకుడు, భారత జాతి గర్వించదగిన దేశభక్తులలో ఆయనొకరు. చిన్నతనంలోనే జాతీయోద్యమంలో ప్రవేశించారు. గాంధీజీ ప్రభావం క్రిందికి వచ్చే వరకు తీవ్రవాది. జాతీయ కాంగ్రెస్‌లో చేరి, దానికి 1923 లోనే - తన 35 వ ఏట - అధ్యక్షుడయ్యారు. పాకిస్తాన్ వేర్పాటును అంతగా వ్యతిరేకించిన ముస్లింగాని, హిందువుగాని మరొకరు లేరు. కనుకనే ముస్లింలీగ్ ఆజాద్‌ను తన ప్రధాన శత్రువుగా భావించేది.

మరి రెండు.రోజులలో మౌలానా ఆజాద్ శత జయంతి సంవత్సరం ముగియనున్నది. ఈ సందర్భంలో ఆయన సంస్మరణ - ఇండియా స్వతంత్రం కావడానికి ముందు రోజులలో ఆయన నిర్వహించిన కీలకపాత్ర దృష్ట్యా, దేశం స్వతంత్రమైన తర్వాత దేశ రాజకీయాలలో ఆయన ప్రముఖ పాత్ర దృష్ట్యా, సహజంగానే ఆసక్తి కలిగిస్తుంది. అయితే, ఈ ఆసక్తిని ద్విగుణీకృతం చేస్తున్న అంశం మరొకటున్నది.

ఆజాద్ మరి కొద్ది నెలలకు చనిపోతారనగా తన స్వీయచరిత్రకు భారత జాతీయోద్యమ విశేషాలను, ముఖ్యంగా దేశ విభజన నాటి సంఘటనల వివరాలను జోడించి "ఇండియా విన్స్ ఫ్రీడమ్" అనే గ్రంథం రచించారు. మౌలానా చెబుతుండగా ఆయన అభిమాని హుమయూన్ కబీర్ ఇంగ్లీషులో నోట్సు వ్రాసుకుని గ్రంథ రచన చేసినప్పటికీ, దాన్ని ఆజాద్ రచనగానే పరిగణించాలి.

ఆజాద్ చనిపోయిన సుమారు ఏడాది తర్వాత 1959 జనవరిలో ప్రచురితమైన "ఇండియా విన్స్ ఫ్రీడమ్" అప్పటిలోనే ఎంతో కుతూహలాన్ని, వివాదాన్ని కూడా రేకెత్తించింది. తన సమకాలికులపైన, దేశ విభజనకు దారి తీసిన పరిస్థితులపైన ఆయన దాపరికం లేకుండా అనేక విషయాలు వెల్లడించారు.

కాగా,అసలు గ్రంథంలో 30 పేజీలను అవి మరీ కటువైన నిజాలను వెల్లడిస్తున్నవని భావించినందున ఆజాద్ ప్రస్తుతానికి తొక్కిపెట్టవలసిందని తనతో చెప్పారని, వాటిని ఆజాద్ చనిపోయిన 30 ఏళ్ళకు మాత్రమే ప్రచురించాలని హుమయూన్ కబీర్ గ్రంథ ప్రచురణ కర్తలతో చెప్పడం, ఆ కోర్కె మేరకు కడచిన ఫిబ్రవరిలో ఆ 30 అముద్రిత పుటలను వెలుగులోనికి తీసుకురావలసివుండగా అటు ఆజాద్ వారసులు, ఇటు కబీర్ వారసులు వివాదం లేవదీయడం, చివరికి ఢిల్లీ హైకోర్టు ఆదేశం ప్రకారం ఆ పేజీలను ప్రచురణకర్తలకు

అందజేయగా వారు మొన్న సోమవారంనాడు పూర్తి పాఠంతో గ్రంథాన్ని విడుదల చేయడం జరిగింది.

అయితే, ఆజాద్ పుస్తకంలోని అముద్రిత పుటలు దేశంలో కొన్ని నెలలుగా కలిగించిన సంచలనానికి కారణం గ్రంథ వారసత్వంపై వివాదం కాదు. ఆ పుటలలో ఆజాద్ ఏవో రహస్యాలు వ్రాశారని, అవి కనుక బయటపడితే ఎందరెందరో జాతీయోద్యమ మహామహుల కీర్తి ప్రతిష్ఠలు మట్టిపాలు కాగలవని ఒక ఊహాగానాన్ని ఎవరో ప్రారంభించారు. ఆ ఊహాగానం అందుకుని వివిధ పత్రికలు ఆజాద్ గ్రంథంపై ఆసక్తిని మరింతగా పెంపొందించాయి.

ముఖ్యంగా నెహ్రూకు సంబంధించిన ఏవో రహస్యాలు ఆజాద్ వెల్లడించి వుంటారని చాలామంది ఎదురు చూశారు. రాజకీయంగా తమకు లాభిస్తుందని ఆశ పడ్డారు కూడా.

చివరకు, ఇటీవల కొద్ది రోజులుగా వెల్లడి అవుతున్న ఆజాద్ అముద్రిత పుటల విశేషాలను చూడగా, ఆయన అందులో కొత్తగా వెల్లడించిన - అదివరకు ఎవరికీ తెలియని, లేదా ఊహించని - విశేషాలంటూ ఏమంతగా లేవని విదితమవుతుంది. నెహ్రూకు సంబంధించిన "రహస్యాలు" ఏమీ లేకపోవడం బహుశా కొందరికి ఆశాభంగం కలిగించి వుండవచ్చు కూడా.

ఆజాద్ తన గ్రంథంలో వెల్లడించినవన్నీ చారిత్రిక సంఘటనలే, అవి అందరికీ తెలిసినవే. వాటిపైన, అంతకంటే ఎక్కువగా ఆ సంఘటనలలో పాల్గొన్న తన సమకాలికులపైన, ఆజాద్ వెల్లడించిన కొన్ని అభిప్రాయాలు మాత్రం ఆసక్తి కలిగిస్తాయి.

నెహ్రూ, పటేల్‌లపై ఆజాద్ కొన్ని ఆరోపణలు చేశారు. ముఖ్యంగా దేశ విభజనకు నెహ్రూ అంగీకరించడాన్ని ఆజాద్ నిశితంగా విమర్శించారు. కీలక సమయంలో తాను వైదొలగి కాంగ్రెస్ అధ్యక్ష పదవిని నెహ్రూకు అప్పగించడం తన రాజకీయ జీవితంలోకెల్లా గొప్ప తప్పిదంగా ఆయన పేర్కొన్నారు. 1937 లో యు.పి.లో ముస్లింలీగ్‌ను రాష్ట్ర ప్రభుత్వంలో చేర్చుకొవడాన్ని నెహ్రూ వ్యతిరేకించడం, 1946లో క్యాబినెట్ మిషన్ పథకంపై నెహ్రూ చేసిన ప్రకటన ముస్లింలీగ్ వేర్పాటు ఉద్యమాన్ని బలపరిచాయని ఆయన భావించారు.

అయితే, ఇవి మొదటిసారిగా బయటపడుతున్న విషయాలు కావు. దేశ విభజన నాటి రాజకీయాలను శ్రద్ధగా గమనించిన వారందరికి తెలిసినవే. దేశ విభజనకు నెహ్రూను బాధ్యుడిని చేయడం, అందులో లేడీ మౌంట్ బాటెన్ ప్రభావంలో పడి నెహ్రూ దేశ విభజనకు అంగీకరించారనడం అన్యాయంగా కనిపిస్తుంది. దేశ విభజనను ఆజాద్ వ్యతిరేకించిన మాట నిజమే కాని, నెహ్రూయే కాక తక్కిన ప్రముఖ నాయకులందరు అంగీకరించారు. గాంధీజీ కూడా అనిష్టంగానే తల వూపారు.

ఆజాద్ పేర్కొన్నట్టు క్యాబినెట్ మిషన్ పథకం అమలు జరిగినప్పటికి కాంగ్రెస్, ముస్లింలీగ్‌ల మధ్య ఎంతో కాలం సహజీవనం కొనసాగి వుండేది కాదనడం కాదనలేని విషయం. పాకిస్తాన్ వేర్పాటు ఒక చారిత్రిక, అనివార్య సంఘటన. దాని అనివార్యతను 1942లోనే రాజాజీ

ఊహించారు. అప్పటిలో ఆయనను ఛీత్కరించినవారే పాకిస్తాన్‌ను అడ్డుకొనడం సాధ్యంకాదని అంగీకరించక తప్పలేదు.

అయితే, ఆజాద్ తన పుస్తకంలో పేర్కొన్న విషయాలన్నీ ఆనాటి సంఘటనలకు ఆయన వ్యక్తిగత ప్రతిస్పందనను తెలియజేస్తాయి. వాటిని ఇతరులు యథాతథంగా, తిరుగులేని నిజాలుగా అంగీకరించనవసరం లేదు.

టాల్‌స్టాయ్ తన "వార్ అండ్ పీస్" నవలలో మానవ చరిత్రను మలుపుతిప్పిన మహోదంతాలు ఏ కొద్ది మంది వ్యక్తుల ఇష్టానిష్టాలతోనో ముడిపడి వుండవని ఉద్ఘాటించాడు. అలాగే చరిత్ర కనివిని ఎరుగనంతటి ఘోర రక్తపాతం మధ్య జరిగిన ఇండియా విభజనకు ఏ కొద్ది మంది నాయకులో కారకులు కాదు. అదొక చారిత్రిక అనివార్యత. దానికి సన్నిహితంగా మసలినవారికి కొద్ది మంది వ్యక్తులే బాధ్యులుగా కనిపించడం సహజం.

ఇప్పటికే ఆజాద్ అముద్రిత పుటలు రేకెత్తించిన ఆసక్తి, వాదోపవాదాలు ఇకపై కూడా కొనసాగుతాయని భావించవచ్చు. ఆయన ఆరోపణలకు గురి అయినంత మాత్రాన నెహ్రూ, పటేల్ వంటి మహా వ్యక్తుల దేశ భక్తికి కళంకం రాబోదు.

*(నవంబర్ 9, 1988)*

# కంచికి వెళ్లిన మంచి బిల్లు

విఘ్నేశ్వరుడి పెళ్లికి వెయ్యి విఘ్నాలని సామెత. లోక్‌పాల్ ఏర్పాటు ప్రతిపాదనకు పట్టిన దురవస్థను చూస్తుంటే ఈ సామెత గుర్తుకు వస్తుంది.

అన్యాయంగా, అనుచితంగా లోక్‌పాల్ బిల్లు మరొకసారి బుట్టదాఖలైంది. ప్రతిపక్షాలు తనకు దురుద్దేశాన్ని ఆపాదిస్తాయన్న సంకోచ లేశమైనా లేకుండా, తాను చెప్పే కుంటిసాకులను ప్రజలు కూడా నమ్మజాలరనే లేశమాత్ర భయమైనా లేకుండా కేంద్ర ప్రభుత్వం లోక్‌పాల్ బిల్లును స్వయంగా, చేజేతులా బుట్టదాఖలు చేసింది. ఏ దృష్టితో చూచినా ఈ చర్య సమర్థించరానిది.

లోక్‌పాల్ వ్యవస్థ ఏర్పడితే అవినీతి హఠాత్తుగా పటాపంచలై పోతుందన్న భ్రమలు ఎవరికీ లేవు. కాని, అంతటా అవినీతి అనే అంధకారం అలముకుని వున్న పరిస్థితులలో అదొక సన్నని కాంతిరేఖగా పలువురు భావించారు. ఈసారైనా అది తప్పక ఏర్పడగలదని ఆశలు పెట్టుకున్నారు. ఇప్పుడు ఆ ఆశ లడియాసలయ్యాయి.

ఉన్నతాధికార స్థానాలలో వున్నవారి అవినీతిని ఎండగట్టడానికి స్కాండినేవియన్ దేశాలలో మాదిరిగా మనకు కూడా ఒక "ఒంబడ్స్‌మన్" వ్యవస్థ అవసరమని పరిపాలనా సంస్కరణల సంఘం సూచించిఇరవై ఏళ్లుదాటిపోయింది. ఆ వ్యవస్థకు కేంద్రంలో లోక్‌పాల్, రాష్ట్రాలలో లోక్‌ఆయుక్తఅనే పేర్లప్రతిపాదన కూడా జరిగింది. కొన్ని రాష్ట్రాలలో లోక్ ఆయుక్త వ్యవస్థ ఏర్పడి పనిచేస్తున్నది కూడా.

కేంద్రంలో కూడా అటువంటి వ్యవస్థను నెలకొల్పాలన్న ప్రయత్నం జరగకపోలేదు. కాని, 1968లో లోక్‌పాల్ వ్యవస్థ ఏర్పాటుకు ప్రవేశపెట్టిన బిల్లు లోక్‌సభ 1971లో రద్దు కావడంతో చెల్లకుండాపోయింది. ఆ తర్వాత 1977లో జనతా ప్రభుత్వం ఆ ప్రతిపాదనను పునరుద్ధరించింది. అయితే, అది ప్రవేశపెట్టిన బిల్లు సెలెక్టు కమిటీ పరిశీలనలో వుండగా మరొకసారి లోక్‌సభ రద్దుకావడంతో ఆ బిల్లుకు కూడా పూర్వపు బిల్లుకు పట్టిన గతే పట్టింది.

కేంద్రంలోని కాంగ్రెస్ ప్రభుత్వానికి కాని, జనతా ప్రభుత్వానికి కాని లోక్‌పాల్ వ్యవస్థపై నిజంగా శ్రద్ధాసక్తులే వుంటే, దానికి సంబంధించిన బిల్లును చకచకా చట్టం చేయడం ఏమంత కష్టమై వుండేది కాదు. కాని, దానిపై ఎవరికీ అంత శ్రద్ధ లేనందువల్లనే అది అలా ఎప్పటికప్పుడు మూలపడుతూ వచ్చింది.

చివరికి "మిస్టర్ క్లీన్"గా పేరు తెచ్చుకుని, ప్రభుత్వం నుంచి, పరిపాలనా రంగం నుంచి అవినీతి భూతాన్ని తరిమివేస్తాననే వాగ్దానంతో అధికారానికి వచ్చిన శ్రీ రాజీవ్ గాంధి 1985లో మరొకసారి లోక్‌పాల్ బిల్లును ప్రవేశపెట్టారు. ఆయన ఆదరాబాదరా ప్రవేశపెట్టిన పార్టీ ఫిరాయింపుల నిషేధం బిల్లువలె ఇది కూడా గబగబ చట్టరూపం ధరిస్తుందని అందరు ఆశించారు.

కాని, దురదృష్టవశత్తు అలా జరగలేదు. ఆ బిల్లు పరిధిలోకి ఎవరెవరో వచ్చారు కాని, ప్రధాన మంత్రి రాలేదు. ఇంకా మరికొన్ని సాంకేతిక లోపాలేవో కనబడ్డాయి. దానితోఆ బిల్లును సాకల్యంగా పునఃపరిశీలించే ఉద్దేశంతో జాయింట్ సెలెక్టు కమిటీకి నివేదించారు. ఆ కమిటీ

ఊబిలో ఆ బిల్లు దిగబడిపోయి మరి లేవలేకపోయింది. ఆ కమిటీ చాలాసార్లు సమావేశమైంది, చాలా రాష్ట్రాలు తిరిగి అభిప్రాయాలు సేకరించింది. అయినా, బిల్లును ఒక కొలిక్కి తీసుకురావాలని ప్రతిపక్షాలు తాపత్రయపడినంతగా ప్రభుత్వపక్షం తొందరపడలేదు. తాపీగా "పరిశీలన" సాగించింది. మెజారిటీ ప్రభుత్వ పక్షానిదే కనుక,చివరికి ఇప్పుడు – దాదాపు మూడేళ్ళ తర్వాత – ఆ బిల్లును బుట్టదాఖలు చేయవచ్చునని జాయింట్ సెలెక్టు కమిటీ ప్రభుత్వానికి సూచించింది.

ఈ సూచనకు చెబుతున్న కారణం నిజానికి కారణం కాదు; కుంటిసాకు మాత్రమే. ఒకటవ తరగతి పిల్లవాడిని కూడా నమ్మించలేనంత కుంటిసాకు అది.

ప్రస్తుతం వున్న రూపంలో లోక్‌పాల్ బిల్లు బాగాలేదట. అది కేవలం అవినీతి ఆరోపణలను దర్యాప్తు చేయడానికి మాత్రమే పనికి వస్తుందట కాని, ప్రభుత్వంలో ఉన్నత స్థానాలలో వున్నవారిపై వచ్చే ఇతర ఆరోపణలను – అంటే అలసత్వం, అసమర్థత్వం మొదలైన వాటిని – విచారించడానికి ఉపయోగపడదట. పైగా అవినీతి నిరోధక శాసనం ఒకటి ఇదివరకే వున్నందున ఇది అనవసర మవుతుందట! ఈలోగా ప్రజల ఫిర్యాదుల నిమిత్తం 1988 ఏప్రిల్ ఫస్టున ఒక డైరెక్టరేటు ఎలాగూ ఏర్పడింది కనుక కూడా ఇది అనవసర మవుతుందట.

అందుచేత కేవలం అవినీతి ఆరోపణలే కాక ఇంకా వివిధ విషయాలు కూడా దాని పరిధిలోకి వచ్చేటట్టు సర్వ సమగ్రమైన బిల్లును రూపొందించాలని ప్రభుత్వం ఆలోచిస్తున్నదట. ఈ విషయాన్ని ప్రభుత్వం సెలెక్టు కమిటీకి తెలియజేయడం, సెలెక్టు కమిటీ బిల్లును ఉపసంహరించుకోవచ్చునని ప్రభుత్వానికి సూచించడం జరిగిపోయింది. అయితే కమిటీలో వున్న తొమ్మిది మంది ప్రతిపక్ష సభ్యులు మాత్రం ఈ సూచనను తీవ్రంగా వ్యతిరేకిస్తూ వేరే ప్రకటన చేశారు.

అవినీతినే కాకుండా అలసత, అసమర్థత లాంటి ఫిర్యాదులను కూడా విచారించాలన్న ఆసక్తి వుంటే ప్రస్తుతపు లోక్‌పాల్ బిల్లునే దానికి అనుగుణంగా సవరించవచ్చుకదా? అసలు అటువంటి మార్పులు, చేర్పులు చేయడానికి, లోపాలు సరిదిద్దడానికే కదా సెలెక్టు కమిటీని ఏర్పాటుచేసింది? బిల్లు సమగ్రంగా లేదనుకుంటే సమగ్రంగా చేయడానికి ఎవరు అడ్డు పడ్డారు? అసలు సమగ్రంగా లేదని గ్రహించడానికి ప్రభుత్వానికి మూడేళ్ళు ఎందుకు పట్టింది? మూడేళ్ళ కాల యాపన, అనవసరపు ధన వ్యయం తర్వాత, బిల్లు ఉపసంహరణ ఆలోచన ఎందుకు కలిగింది?

ఈ ప్రశ్నలకు ప్రతిపక్షాలు చెబుతున్న సమాధానాలలో కొంతైనా నిజం లేకపోలేదని ప్రజలు అనుమానిస్తే, దానికి బాధ్యత ప్రభుత్వానిదే. ఈలోగా బోఫోర్స్ కుంభకోణం వంటి అవినీతి ఆరోపణలు శర పరంపరగా ప్రభుత్వం మీద వచ్చిపడ్డాయి. లోక్‌పాల్ ఏర్పడితే ఈ ఆరోపణలను ఎండగట్టడానికి, కూపీ తీయడానికి మరొక చక్కని వేదిక రూపొందుతుంది. ఈ భయంతోనే ప్రభుత్వం లోక్‌పాల్ బిల్లు ఉపసంహరణకు నిశ్చయించిందని ప్రతిపక్షాల ఆరోపణ!

దీని బదులు మరొక "మంచి" బిల్లు ప్రవేశపెడతామని ప్రభుత్వం చెబుతున్నది. అది ఈ లోక్‌సభ వుండగా జరిగే పనికాదు. ఆ తర్వాత నందో రాజా భవిష్యతి!

*(డిసెంబరు 8, 1988)*

# దారుణ మారణ హోమం

ప్రపంచం ఇన్నాళ్లుగా చైనాలో ఏది జరగవచ్చునని భయపడుతున్నదో, ఏది జరగరాదని కోరుకుంటున్నదో అది జరగనే జరిగింది. చైనా సైన్యం వేలాది విద్యార్థులను, ఇతర వర్గాల ప్రజలను నిర్దాక్షిణ్యంగా సంహరించింది.

ఆ సైన్యం పేరు ప్రజా విమోచన సైన్యం. ఒకప్పుడు అది చైనా ప్రజలను చాంకైషేక్ నిరంకుశ పాలన నుంచి విముక్తులను చేసింది. ఇప్పుడు అదే విమోచన సైన్యం ప్రస్తుత నిరంకుశ పరిపాలకులనుంచి విమోచన కోరుతున్న విద్యార్థులను జీవితం నుంచి విముక్తులను చేసింది.

విద్యార్థులు కోరింది మరొక పిడికెడు ప్రజాస్వామ్యాన్ని, మరొక దోసెడు స్వేచ్ఛను, పాలనలో పేరుకుపోయిన అవినీతి తొలగింపును, మరికాసిని సంస్కరణలను. వారు వీటిని కోరడమే చైనా కమ్యూనిస్టు పాలకుల దృష్టిలో మహాపరాధమైపోయింది. దాని ఫలితమే మొన్నటి అమానుష మారణకాండ.

సైన్యం చేతిలో ఎందరు నిహతులయ్యారో స్పష్టంగా తెలియరావడం లేదు. ఒక అంచనా ప్రకారం 1400 మంది. మరొక వార్త ప్రకారం 3000 మంది. గాయపడినవారి సంఖ్య 10 వేలకు పైగానే.

సైనికులు బాష్పవాయువు ప్రయోగించారు, బెల్టులతో విద్యార్థుల ముఖాలపై బాదారు, తలలపై లాఠీలతో మోదారు, ప్రాణ రక్షణకు పారిపోతున్న వారిపై సయితం కాల్పులు కాల్చారు. ధైర్యంగా నిలబడినవారిపై సాయుధ శకటాలను నడిపారు. టాంకుల క్రిందపడి ఎందరో పచ్చడిగా నలిగి చనిపోయారు.

రాజధాని బీజింగ్‌లో లక్షలాది విద్యార్థులు ఆరు వారాలకు పైగా విడిదిచేసి ప్రశాంతంగా ఆందోళన జరుపుతున్న స్థలం పేరు తియనన్మెన్ స్క్వేర్. "తియన్ ఆన్ మెన్" అనే మాటకు చైనీస్ భాషలో "స్వర్గశాంతి ద్వారం" (గేట్ ఆఫ్ హెవెన్‌లీ పీస్) అని అర్థం. ఇకపై దాన్ని అదే పేరుతో పిలవడం కంటె క్రూరమైన వెక్కిరింత వుండదు. దాన్ని ఇక "శ్మశాన శాంతి ధామం"గానే వ్యవహరించాలి. తియనన్మెన్ స్క్వేర్ మొత్తం ఒక బలివితర్దిగా, నెత్తుటి మడుగుగా మారిపోయినట్టు వార్తలు సూచిస్తున్నాయి.

విద్యార్థుల ఆందోళనను అణచివేయడానికి కొన్ని వారాల క్రిందట చైనా ప్రభుత్వం మార్షల్ లా ప్రకటించింది. మూడు లక్షల మంది సైన్యాన్ని పిలిపించింది. అయితే, సైన్యం రాజధాని నగరంలో ప్రవేశించకుండా విద్యార్థుల కోర్కెలను సమర్థిస్తున్న లక్షలాది సాధారణ ప్రజలు అడ్డుకున్నారు. సైనికులు బలవంతంగా నగరంలోకి చొరబడకుండా శివార్లలోనే ఆగిపోయారు.

ప్రజలను, విద్యార్థులను సంహరించడం ఇష్టం లేకనే సైన్యం బీజింగ్ శివార్లలో ఆగిపోయిందని

అప్పటిలో వార్తలు వచ్చాయి. "ప్రజల ఆశయం, సైన్యం ఆశయం ఒకటే" అంటూ ఆందోళనకారులపై చేయి చేసుకొనడానికి సైన్యం నిరాకరించిందని కూడా తొలి వార్తలు తెలిపాయి. దీనికి కారణం చైనా అధినేత డెంగ్ జియావో పింగ్ అధికారానికి వచ్చి, నాలుగు ఆధునికీకరణల పథకాన్ని ప్రవేశపెట్టిన తర్వాత చైనా రాజకీయాలలో సైన్యంపాత్ర, సైన్యాధికారుల ప్రాధాన్యం తగ్గిపోయిందని, ఆ కినుకతోనే ఇప్పుడు విద్యార్థులపై కాల్పులు కాల్చకుండా ప్రభుత్వాజ్ఞలను ధిక్కరించడం జరిగిందని ఊహాగానాలు జరిగాయి. ఇవన్నీ నిజం కాదని ఇప్పుడు తేలిపోయింది.

ఇన్నాళ్ళు సైన్యం రాజధాని శివార్ల వరకు వచ్చి కూడా లోనికి చొరబడకపోవడానికి కారణం చైనా అగ్ర నాయకత్వంలో విభేదాలే కావచ్చు. విద్యార్థులపట్ల ఏ వైఖరిని అనుసరించాలి అన్న విషయమై ఒకవైపు ప్రధాని లీ పెంగ్ వర్గానికి, మరొకవైపు కమ్యూనిస్టు పార్టీ ప్రధాన కార్యదర్శి ఝావో జియాంగ్ వర్గానికి మధ్య అభిప్రాయభేదాలు వచ్చాయి. విద్యార్థులను క్రూరంగా అణచివేయాలని లీ పెంగ్ వర్గం, అతడిని బలపరుస్తున్న అధినేత డెంగ్ జియావో పింగ్ అభిప్రాయపడగా, వారిపట్ల మానవతా దృక్పథం అవలంబించాలని, వారి కోర్కెలపై చర్చలు జరపాలని జియాంగ్ వర్గం వాదించింది. చివరకు డెంగ్, పెంగ్‌లది పైచేయి అయి, జియాంగ్ పదవీచ్యుతుడై గృహ నిర్బంధానికి లోనుకావలసివచ్చింది. సైన్యం కూడా డెంగ్, పెంగ్‌లనే బలపరచింది. ఇక ఆలసించడం ప్రమాదకరమని సైన్యం విద్యార్థులపై విరుచుకుపడింది. మావో తర్వాత మావో విధానాలను కొనసాగించడానికి ప్రయత్నించిన "దుష్ట చతుష్టయాన్ని" (గ్యాంగ్ ఆఫ్ ఫోర్)ను అణచివేసినవాడుగా, మావోయిజంను ఏడునిలువుల లోతున పూడ్చిపెట్టి చైనాను ఆధునికీకరించడానికి ఒక గొప్ప ప్రయత్నం చేసినవాడుగా, ఆర్థిక సంస్కరణలను ప్రవేశపెట్టినవాడుగా డెంగ్ జియావో పింగ్ అధికారం కైవసం చేసుకున్న తొలివాళ్లలో మంచిపేరు తెచ్చుకున్నాడు. కాని, అతడు ఆర్థిక సంస్కరణలతోపాటు రాజకీయ సంస్కరణలను ప్రవేశపెట్టకపోవడంతో, ప్రజల ప్రజాస్వామ్య కాంక్షను అలక్ష్యం చేయడంతో, అవినీతిపట్ల ఉదాసీన వైఖరి అవలంబించడంతో ప్రజలలో, ముఖ్యంగా యువతరంలో అసంతృప్తి కలిగింది. అది ఆగ్రహంగా మారింది. అది సత్యాగ్రహంగా పరిణమించింది. అది కొన్ని వారాలుగా చైనా కమ్యూనిస్టు ప్రభుత్వాన్ని మూల మట్టంగా కుదిపివేస్తున్నది.

ఈ సంక్షోభాన్ని చాకచక్యంతో, అనువయపూర్వకంగా చక్కదిద్దడానికి బదులు, ప్రజాభీష్టం ప్రకారం సంస్కరణలు అమలుచేయడానికి బదులు డెంగ్ జియావో పింగ్ దమననీతిని ప్రయోగించాడు. "అధికారం తుపాకి గొట్టం నుంచే పెరుగుతుంది" అన్నది మావో సుభాషితాలలో ఒకటి. మావోయిజాన్ని వ్యతిరేకించి అధికారానికి వచ్చిన డెంగ్ కూడా అదే సుభాషితాన్ని అనుసరించి ప్రవర్తించడం, తుపాకులను ప్రయోగించి తన అధికారాన్ని కాపాడుకొనడానికి ప్రయత్నించడం విషాదకరమైన "జోక్".

నిజానికి నిన్న మొన్న బీజింగ్‌లో జరిగినంత ఘోరకలి మావో కాలంలో కూడా ఎన్నడూ జరగలేదని విద్యార్థులు అంటున్నారు. "జపాన్ డెవిల్స్" కూడా ఎన్నడూ ఇలా ప్రవర్తించలేదని, ఇది ఫాసిస్టు ప్రభుత్వమని, హిట్లర్‌ను మరిపించే ప్రభుత్వమని విద్యార్థులు హాహాకారాలు చేస్తున్నట్టు వార్తలు వస్తున్నాయి.

ప్రజాస్వామ్యాందోళన వెనుక ఎవరో కొద్దిమంది పెడదారిపట్టిన విద్యార్థులు మాత్రమే వున్నారని, వారి వెనుక ఏదో విదేశీ హస్తం వున్నదని చైనా పాలకులు ప్రపంచాన్ని నమ్మించజూస్తున్నారు. వారాల తరబడి కొన్ని లక్షలమంది విద్యార్థులు సరైన నాయకత్వం లేకపోయినా క్రమశిక్షణతో, స్వచ్ఛందంగా, ప్రశాంతంగా సాగించిన ఆందోళనను కొద్దిమంది కుట్ర అని ప్రచారం చేస్తే ప్రపంచం నమ్ముతుందా? ప్రస్తుతానికి చైనా విద్యార్థులు తమ ఆందోళనను ఉపసంహరించి వెనుకకు తగ్గవచ్చు. కాని, అపూర్వమైన ప్రాణ బలిదానంతో వారు ఇప్పటికే నైతిక విజయం సాధించారు. కోర్కెల సాధనలో అంతిమ విజయం కూడా వారు సాధించాలని ప్రపంచం కోరుకుంటుంది.

*(జూన్ 6, 1989)*

# "రెక్కవిప్పిన రివల్యూషన్"

రెండు వందల ఏళ్ళ క్రిందట సరిగా ఇదే రోజున మానవేతిహాసంలోనే మహత్తరమైన ఒక సంఘటన జరిగింది. ఆనాడు 1789 జులై 14వ తేదీన ఫ్రాన్స్ రాజధాని పారిస్‌లో రాచరికపు నిరంకుశత్వానికి, క్రౌర్యానికి, అమానుషత్వానికి ప్రతీకగా పేరొందిన బాస్టీల్ కారాగారాన్ని ప్రజలు నేలమట్టం చేశారు. ప్రపంచ చరిత్రలో అవిస్మరణీయ ఘట్టంగా వెలుగొందుతున్న ఫ్రెంచి విప్లవం ఆ వెనువెంటనే ప్రారంభమైంది.

బాస్టీల్ మొదట ఎత్తయిన గోడల నడుమ ఒక కోట. దాన్ని 17, 18 శతాబ్దాలలో ఫ్రెంచి రాజులు కారాగారంగా ఉపయోగించేవారు. ప్రముఖులైన బందీలను, రాజ శత్రువులను దాని చీకటి కోణాలలో బంధించేవారు. రాజుకు ఏ మాత్రం కోపం కలిగినా సరే, నిరపరాధులను, అన్నెంపున్నెం ఎరగని అమాయకులను అకారణంగా ఆ కారాగారంలో ఏళ్ళ తరబడి విచారణ లేకుండా ఖయిదు చేసేవారు. అది భూలోక నరకం. లోనికి సజీవంగా వెళ్ళినవాడు సజీవంగా బయటికి రావడం అరుదు. అది ఆనాటి ఫ్రెంచి రాజుల క్రౌర్యానికి ప్రతీక.

బాస్టీల్‌తోపాటు ఫ్రెంచి ప్రజలు ఫ్యూడలిజాన్ని, రాచరికాన్ని కూడా భూస్థాపితం చేశారు. ఫ్రాన్సు నవీన యుగంలో అడుగుపెట్టింది. ఆనాటి ఫ్రెంచి విప్లవకారుల నినాదం "స్వేచ్ఛ, సమానత్వం, సౌభ్రాత్రం". అది యూరప్ అంతటా మారుమ్రోగింది.

ఫ్రెంచి విప్లవం ఒక్కసారిగా యూరప్‌ను పిడుగుపాటులా తాకింది. ఆ తాకిడికి మొత్తం యూరప్ దద్దరిల్లిపోయింది. నిజానికి ఫ్రెంచి విప్లవం ఒక్కసారిగా అగ్నిపర్వతంలా బ్రద్దలైనప్పటికి అది హఠాత్పరిణామం కాదు. ఆనాటి ఫ్రాన్సు విప్లవానికి పరిపక్వంగా వుంది.

ప్రజలు దారుణమైన నిరంకుశ పాలనలో, దుర్భర దారిద్ర్యంలో మ్రగ్గుతూ వుండేవారు. రాజు తర్వాత అధికారమంతా ఫ్యూడల్ ప్రభువులది, చర్చిది. వీరిపై రాజు పన్నులు వేయడానికి వీలులేదు. ఇక పన్నుల భారమంతా సామాన్య ప్రజలపై పడేది. రాజు తన విలాస జీవితానికి, నిరంతర యుద్ధాలకు కావలసిన డబ్బుకోసం ప్రజలపై ఇంకా ఇంకా ఎక్కువగా పన్నులు వేసి పీడించేవాడు. పన్నులు కట్టనివారికి కారాగారాలే గతి.

ప్రజలను విప్లవోన్ముఖులుగా చేయడానికి ఈ దుర్భర పరిస్థితులు చాలు. కాని, వారిని స్వేచ్ఛావాదంతో, ప్రజాస్వామ్య భావాలతో ఉత్తేజపరచి, చైతన్యవంతులుగా చేయడంలో ఆనాటి మేధావుల పాత్ర కూడా అంతే ముఖ్యమైనది. మొదటగా జ్ఞాపకం వచ్చేది రూసో, వోల్టేర్‌లు. రూసో స్వాప్నికుడు. వోల్టేర్ హేతువాది. వారివి విభిన్న దృక్పథాలైనా ఆ ఇరువురు ఫ్రెంచి విప్లవాన్ని సమానంగా ప్రభావితం చేశారు.

"మానవుడు స్వేచ్ఛా జీవిగా జన్మిస్తాడు. కాని, ఎక్కడ చూచినా అతడు సంకెళ్ళలో కనిపిస్తున్నాడు." (Man was born free. But everywhere he is in chains) అనే ప్రసిద్ధ వాక్యాలతో రూసో "సోషల్ కాంట్రాక్ట్" గ్రంథం ప్రారంభమవుతుంది. "నీవు చెప్పేదానితో నేను

ఏకీభవించకపోవచ్చు. కాని, నీ వాక్ స్వాతంత్ర్యాన్ని సమర్థించడానికి నా ప్రాణాలైనా ధారపోస్తాను". అన్నది వోల్టేర్ జీవన సూత్రం. ఫ్రెంచి విప్లవంపై వీరి ప్రభావం ఇంతింతనరానిది.

వీరి తర్వాత దిదిరో నాయకత్వాన ఫ్రెంచి 'విజ్ఞాన సర్వస్వ'కారులను (ఎన్‌సైక్లోపీడిస్టులు) పేర్కొనాలి. అలాగే తన "క్యాటిగారికల్ ఇంపరేటివ్" సూత్రంతో వ్యక్తి స్వేచ్ఛ, ప్రజాస్వామ్యం, సర్వమానవ సమానత్వ, సౌభ్రాత్రాలను ప్రబోధించిన జర్మన్ తత్వవేత్త ఇమాన్యుయెల్ కాంట్ ప్రభావాన్ని కూడా పేర్కొనాలి.

ఫ్రెంచి విప్లవం ఆదిలో ఎంతో ఉన్నత, ఉదాత్త ఆదర్శాలతో ప్రారంభమైనా, రెండు మూడేళ్ళలోనే అది కేవల ఉగ్రవాదంగా మారిపోయింది. విప్లవకారులు జిరాండిన్‌లు, జాకొబిన్‌లుగా చీలిపోయారు. ఒకరు మితవాదులు, రెండవవారు తీవ్రవాదులు. రెండవవారిదే పైచేయి అయింది. వారి నాయకుడు రాబ్‌స్పియర్ భయానక వాతావరణాన్ని సృష్టించాడు. అతడు వేలాది విప్లవకారులనేకాక, ఏ పాపం ఎరుగని నిరపరాధులను కూడా చంపించాడు. "ప్రతి విప్లవం తన శిశువులను తానే కబళిస్తుంది" అనే లోకోక్తి అతని కారణంగానే ప్రచారమైంది.

చివరికి విప్లవం వెర్రితలలు వేసి, రంగంమీద నెపోలియన్ ఆవిర్భావానికి, అతని దండయాత్రలకు, కీర్తిదాహానికి, విస్తరణ పిపాసకు దారితీసింది. యూరప్‌లో అధికభాగం అతని పాదాక్రాంతమైంది. ఆ తర్వాత అతని పతనం, బ్రిటన్ చేతిలో ఓటమి, అది వేరే కథ.

ఫ్రెంచి విప్లవం విపరీత, విషాదకర పరిణామాలకు దారితీసినా అది ప్రపంచ చరిత్రపై చూసిన ప్రభావం అసాధారణమైనది. స్వేచ్ఛా, సమానత్వ, సౌభ్రాత్రాల పునాదిపై నవప్రపంచాన్ని సృష్టించాలని ఆనాటి విప్లవకారులు ఆశించారు. దానితో పోల్చదగింది 1917 నాటి బోల్షివిక్ విప్లవం ఒక్కటే.

"ఆ ప్రభాతవేళ జీవించి వుండడమే ఒక మహానుభూతి. కాగా, యౌవన ప్రాయంలో వుండడం సాక్షాత్తు స్వర్గతుల్యమే" (Bliss was it in that dawn to be alive. But to be young was very heaven) అని మహాకవి వర్డ్స్‌వర్త్ తన్మయత్వంతో ఫ్రెంచి విప్లవాన్ని కీర్తించాడు. అయితే, ఫ్రెంచి విప్లవం రక్తోన్మాదంగా మారడంతో అతని ఉత్సాహం అనతికాలంలోనే నీరుకారిపోయింది.

దేశ దేశాలలో, విభిన్న కాలాలలో ఎందరో దేశ భక్తులను, ఎన్నో స్వాతంత్ర్య సమరాలను ప్రభావితం చేసిన ఫ్రెంచి విప్లవం ఒక బంగరు కల. బహుశా దానిపై వోల్టేర్ కంటె రూసో రొమాంటిక్ వాద ప్రభావమే ఎక్కువేమో, స్వేచ్ఛ, సమానత్వం, సౌభ్రాత్రం ఎంత గొప్ప ఆదర్శాలైనా, అస్పష్టమైన ఆదర్శాలు. అంతకంటె నిర్దిష్టమైన ప్రణాళిక వారికి లేకపోయింది. కనుకనే ఫ్రెంచి విప్లవం విఫలమైంది. ఒక నిర్దిష్ట సిద్ధాంత ప్రాతిపదికపై జరిగిన రష్యన్ విప్లవం విజయవంతమైంది.

బాస్టీల్ పతనం జరిగిన జులై 14వ తేదీ ఫ్రెంచి వారికి జాతీయ దినం, సెలవు రోజు. ఫ్రాన్సు నేడు ఆ మహత్తర సంఘటన ద్విశత వార్షికోత్సవాన్ని మహా వైభవంగా జరుపుకుంటున్నది. ఫ్రాన్సుతోపాటు నియంతృత్వ, నిరంకుశత్వాలను వ్యతిరేకించి ప్రజాస్వామిక స్వేచ్ఛలను ప్రేమించే సమస్త సభ్య ప్రపంచం కూడా ఆ ఉత్సవోత్సాహంలో పాలు పంచుకుంటున్నది.

*(జులై 14, 1989)*

# రాజకీయ భాష

**జ**నరల్ ఎన్నికలు సుమారు మరి అయిదు నెలలలో జరగవలసి వున్నది. అయినా, అప్పుడే రాజకీయవేత్తల భాష పదునెక్కుతున్నది.

ఇప్పుడే ఇలా వుంటే ఎన్నికలు ఇంకా ఇంకా దగ్గరపడుతున్నకొద్దీ రాజకీయవేత్తల పరస్పర దూషణలు ఇంకెంత వాడిగా, వేడిగా తయారవుతాయోనన్న భయానుమానాలు సహజంగానే కలుగుతున్నాయి.

వాతావరణ కాలుష్యాన్ని నివారించవలసిందిగా రాజకీయవేత్తలు తరుచుగా ప్రజలకు ఉద్బోధ చేస్తూ వుంటారు. అయితే, తమ పరస్పర దూషణలతో తామే యథాశక్తిగా వాతావరణ కాలుష్యానికి దోహదం చేయడం శోచనీయం.

రాజకీయాలన్నా, రాజకీయ నాయకులన్నా ప్రజలలో ఒక విధమైన చులకన భావం వున్నది. "ఏ విధమైన శిక్షణ అక్కరలేని ఒకే ఒక వృత్తి రాజకీయాలు" అని ఇంగ్లీషు రచయిత ఆర్.ఎల్. స్టీవెన్సన్ ఏనాడో నిర్వచించాడు. అయితే, దీనికి ఒక చిన్న సవరణ చేయాలి. పరుషమైన భాషలో దూషణ విద్యలో మాత్రం రాజకీయవేత్తలకు శిక్షణ అవసరం. శిక్షణ లేకపోయినా ఈ విద్యలో పలువురు రాజకీయవేత్తలు రాణిస్తున్నారనుకోండి. అయినా, శిక్షణ వుంటే మరింతగా వారు రాణిస్తారు. ప్రత్యర్థిని ఎంత గట్టిగా, ఎంత జుగుప్సాకరంగా తిట్టగలిగితే అంత మంచి రాజకీయవేత్త అవుతున్నాడు.

రాజకీయాలలో అమర్యాదకరమైన భాష, అశ్లీలమైన భాష అంటూ లేదనే చెప్పవచ్చు. "అపశబ్ద భయం నాస్తి అప్పలాచార్య సన్నిధౌ" అని ఒక లోకోక్తి వుంది. ఎటువంటి అపశబ్దమైనా మహాపండితుడైన అప్పలాచార్యుల వద్ద సుశబ్దమైపోతుందట. అలాగే ఎంత అమర్యాదకర భాష అయినా రాజకీయవేత్తలు సాధారణ భాష క్రింద చెలామణి చేయగలరు. "యూ హౌమచ్ అంటే యూ హౌమచ్" (నువ్వెంతంటే నువ్వెంత) అని పరస్పరం తిట్టుకోజాలని వారు ఈ రోజులలో రాజకీయవేత్తలు కాలేరేమో ననిపిస్తుంది.

సాధారణంగా నేటి రాజకీయాలను స్వాతంత్ర్య సమరంనాటి రాజకీయాలతో పోల్చి రాజకీయాల స్థాయి పడిపోతున్నదని కొందరు విచారం వ్యక్తం చేస్తూ వుంటారు. ఆ రోజులలో కూడా రాజకీయవేత్తల మధ్య వివాదాలు, విభేదాలు వుండేవి కాని, వాటిని ఒక పరిధిని దాటనిచ్చేవారుకారు, ఒక స్థాయి కంటె క్రిందికి దిగనిచ్చేవారు కారు. ఆ రోజులలో కూడా వ్యక్తిగత విభేదాలున్నా, నాయకులందరికి ఒక సమాన ధ్యేయం వుండేది. అది పారతంత్ర్యం నుంచి విముక్తి. ఆ లక్ష్యసాధనకు ఆనాటి నాయకులు తమ ఆస్తిపాస్తులతోపాటు అహంకారాలను కూడా త్యాగం చేసి ఒక క్రమశిక్షణకు కట్టుబడి నడుచుకునేవారు. స్వాతంత్ర్యం కనుచూపు మేర దూరంలో కూడా లేని రోజులలో ఏ రాజకీయాధికారాన్ని, ఏ పదవులను ఆశించకుండానే ఆనాటి

నాయకులు త్యాగాలు చేశారు. స్వాతంత్ర్య సంపాదన తర్వాత వచ్చిన రాజకీయవేత్తలకు మాత్రం ధన సంపాదనే ప్రధాన లక్ష్యమైంది. దీనితో రాజకీయాల స్థాయి పడిపోయింది. రాజకీయవేత్తలు ఉపయోగించే భాష స్థాయి కూడా పడిపోయింది. వెనుకటికి అశ్లీల పదాలను ఉపయోగించేవాడిని "సంస్కృతంలో" మాట్లాడుతున్నాడనేవారు. అలాగే దూషణ పదాలను ఉపయోగించేవారిని రాజకీయ భాషలో మాట్లాడుతున్నారని అనవచ్చు.

ఉదాహరణకు ఈ మధ్య రాజ్యసభలో రత్నాకర్ పాండే అనే అధికారపక్ష సభ్యుడు ప్రతిపక్షానికి చెందిన రామ్ జేత్మలానీని "సి.ఐ.ఎ. కుక్క" అని దూషించాడట. తిట్టు కవితలో జేత్మలానీ బహుశా ఎవరికీ తీసిపోరు. ఆయన ప్రధాన మంత్రిని, ఇతరులను రకరకాల పదజాలంతో, ఆరోపణలతో దూషించినవాడే. అయినా పార్లమెంటులో ఒక సభ్యుడిని మరొక సభ్యుడు ఆ విధంగా తిట్టడం ఉత్తమ సంస్కారానికి నిదర్శనం కాబోదు. "డాగ్" (కుక్క) అనేది పార్లమెంటరీ పదమేనా అని శ్రీ పి. ఉపేంద్ర ప్రశ్నించగా నిబంధనల పుస్తకం చూసి చెబుతానని డిప్యూటీ ఛైర్మన్ శ్రీమతి నజ్మా హెప్తుల్లా సమాధానమిచ్చారట. అయితే, ఒక జువాలజిస్టు (జంతు శాస్త్రజ్ఞురాలు)గా తాను సభలో జంతువులను అవమానించడం పట్ల నొచ్చుకుంటున్నానని ఆమె అన్నారట ("ఇండియన్ పోస్ట్" 27-7-89). "అయితే మేము శునకాల కంటె తక్కువ వారమని మీ ఉద్దేశమా?" అని దిగ్భ్రాంతి చెందిన ఒక డి.ఎం.కె. సభ్యుడు అన్నాడట.

ఈ విధమైన నిందాత్మక పదప్రయోగం రాజకీయాలలో సర్వసాధారణమైపోయింది. కొన్నాళ్ళ క్రిందట తెలుగుదేశం పార్టీ పెట్టిన కొత్త రోజులలో శ్రీ ఎన్.టి.రామారావు కాంగ్రెస్‌వారిని మూకుమ్మడిగా కుక్కమూతి పిందెలని, గాదెకింద పందికొక్కులని వర్ణించారు. వారు తిరిగి ఆయనను ముఖానికి రంగు వేసుకుని తైతక్కలాడే వాడనే వర్ణనతో సత్కరించారు. నాటి నుంచి ఈ దూషణ, ప్రతి దూషణల పర్వం కొనసాగుతూనే వున్నది. చాలావరకు ఈ రాజకీయ భాషకు ప్రజలు అలవాటుపడిపోయారు.

అయినా, మొన్న ముఖ్యమంత్రి ఏకంగా దేశ ప్రధానిని పట్టుకుని "దేశద్రోహి" అని నిందించడం శ్రోతలకు చివుక్కుమనే అనిపిస్తుంది. దీనికి సమాధానంగా కేంద్ర మంత్రి శ్రీ వెంగళరావు ముఖ్యమంత్రిని "సి.ఐ.ఎ. ఏజెంట్" అనడం కూడా చెవికి అంతే కటువుగా సోకుతుంది.

మొదటనే పేర్కొన్నట్టు ఎన్నికలు ఇంకా అయిదు నెలలలో వుండగావే ఇలా వుంటే, ఎన్నికలు దగ్గర పడుతున్న కొద్దీ రాజకీయ భాషా కాలుష్యం మరెంత తీవ్రంగా వుంటుందో ఊహించుకోవలసిందే. విమర్శలను విధానాలకే పరిమితం చేసి ఇంతకంటె మృదువైన భాషను ఉపయోగించడం రాజకీయవేత్తలకు సాధ్యంకాదా? "యథా నాయకా తథా అనుచరా" కనుక నాయకులు సరళ భాషను ఉపయోగిస్తే వారి అభిమానులు, అనుచరులు కూడా అదే భాషను ఉపయోగించడానికి మార్గం చూపినవారు అవుతారు.

*(ఆగస్టు 1, 1989)*

# బిల్లును పూర్తిగా విరమించాలి

పరువునష్టం బిల్లుపై దేశంలో వార్తాపత్రికలు, ప్రతిపక్షాలు పాక్షిక విజయం సాధించాయి. కాని, అది చాలదు. పూర్తి విజయం సాధించాలి. ఆ బిల్లు నామరూపాలు లేకుండా విరమణ కావాలి. విరగడ కావాలి. అది పత్రికల, ప్రతిపక్షాల, ప్రజల లక్ష్యం కావాలి.

లోక్‌సభలో పరువునష్టం బిల్లు గత మంగళవారంనాడు ఆమోదం పొందింది. రాజ్యసభలో నిన్న సోమవారం నాడు దాన్ని ప్రవేశపెట్టవలసి వుంది. ఆ తర్వాత దాన్ని రాష్ట్రపతి ఆమోదానికి పంపడం, ఆమోదముద్ర పడితే అది అమలులోకి రావడం మొదలైన తతంగం జరగవలసి వుంది.

కాని, ఈ లోగా దేశ వ్యాప్తంగా పరువునష్టం బిల్లుపై ప్రధాని శ్రీ రాజీవ్‌గాంధియే స్వయంగా పేర్కొన్నట్టు "హాహాకారాలు" బయలుదేరాయి. అయితే, వట్టి హాహాకారాలే కాదు, ఛీత్కారాలు కూడా బయలుదేరాయి. బహుశా కేంద్ర ప్రభుత్వ సభ్యులు, కాంగ్రెస్ పార్టీలో ఒక వర్గం తప్ప, దేశంలో మిగిలిన వారెవ్వరు ఆ బిల్లును హర్షించ లేదు, ఆమోదించలేదు. మీదుమిక్కిలి గర్హించారు, ఛీత్కరించారు.

అభిప్రాయ స్వాతంత్ర్యం ప్రజాస్వామిక జీవన విధాన ప్రధాన సూత్రాలలో ఒకటి. "నీ అభిప్రాయంతో నేను ఏకీభవించకపోవచ్చు. కాని, ఆ అభిప్రాయాన్ని స్వేచ్ఛగా, నిర్భయంగా ప్రకటించడానికి నీకుగల హక్కును పరిరక్షించడానికి నా ప్రాణమైనా ధారపోస్తాను" అని సుప్రసిద్ధ ఫ్రెంచి మేధావి, రచయిత వోల్టేర్ 18వ శతాబ్దంలో ఉద్ఘోషించాడు. అతడు ఆ ఉద్ఘోష చేసేనాటికి ఫ్రాన్సులో నిరంకుశమైన రాచరికపు అరాజకం తాండవిస్తున్నది. అభిప్రాయ స్వాతంత్ర్యం మాట ఉచ్చరించడానికైనా వీలులేని కాలం అది. ఆ రోజులలోనే వోల్టేర్ నిరంకుశమైన రాచరికపు వ్యవస్థకు రొమ్ము ఎదురొడ్డి అభిప్రాయ స్వేచ్ఛను ఆ విధంగా కీర్తించాడు; ఆధునిక ప్రజాస్వామ్య వైతాళికులలో ఒకడైనాడు.

ఒక వోల్టేరే కాదు, ఇంకా ఎందరెందరో మేధావులు, తత్వవేత్తలు, రచయితలు, సంస్కర్తలు ప్రజాస్వామ్యానికి మూలస్తంభాలలో ఒకటిగా అభిప్రాయ స్వేచ్ఛను కీర్తించారు. దానికి భంగం కలిగితే ప్రజాస్వామ్య సౌధం పునాదులు కదిలిపోయినట్టే. కనుకనే, పార్లమెంటరీ ప్రజాస్వామ్యం ఆధారంగా విరచితమైన భారత రాజ్యాంగంలోని పౌరుల ప్రాథమిక స్వత్వాలలో ఒకటిగా భావ ప్రకటన, అభిప్రాయ స్వాతంత్ర్యాలను రాజ్యాంగ నిర్మాతలు ఉల్లేఖించారు. పైకి ప్రత్యేకించి పేర్కొనక పోయినా, వాటిలో భాగమే పత్రికా స్వాతంత్ర్యం.

అందుచేత రాజ్యాంగం 19 (ఎ) ఆర్టికల్ ద్వారా భారత ప్రజలకు ప్రసాదించిన పత్రికా స్వాతంత్ర్యానికే గొడ్డలిపెట్టుగా ఇప్పుడు భారత ప్రభుత్వం "పరువునష్టం బిల్లు - 1988"ను

ప్రతిపాదించడం తీవ్ర వివాదాస్పదమైంది. ఈ ప్రతిపాదన చేయడానికి కారణాలను ఊహించడం కష్టం కాదు. పత్రికలలో పరువునష్టపు వ్రాతలు కొత్త కాదు. అవి ఎప్పుడూ వున్నవే. వాటిని సభ్యతా సంస్కారాలను గౌరవించే వారెవ్వరూ హర్షించరు, సమర్థించరు. వాటిని ఎదుర్కొనడానికి, అణచివేయడానికి, శిక్షించడానికి ఇప్పటికే కావలసినన్ని నిబంధనలు భారత శిక్షాస్మృతిలో వున్నాయి. మరి ఇప్పుడు కొత్తగా ఆ స్మృతిని సవరించి "పరువునష్టం బిల్లు - 1988"ని తీసుకురావడంలో ఆంతర్యం ఏమిటి?

ఈ మధ్య ఒక ఏడాదికి పైగా ప్రభుత్వ యంత్రాంగంలో ఉన్నత స్థానాలలో వున్నవారిపై తీవ్రమైన అవినీతి ఆరోపణలు రావడం, అవి మహాసంచలనం కలిగించడం, ప్రభుత్వాలను అపఖ్యాతిపాలు చేయడం అందరికి తెలిసిందే. ప్రభుత్వం ఆ ఆరోపణలను ఎంతగా మసిపూసి మారేడుకాయ చేద్దామనుకున్నప్పటికి అవి ప్రజల మనస్సులలో మాయని మచ్చలుగా మిగిలిపోయాయి. వాటి ప్రభావం ఉప ఎన్నికలపై పడింది. సాధారణ ఎన్నికలపై కూడా పడేటట్టు వున్నది.

ఈ కారణంగానే, అటువంటి ఆరోపణలను పత్రికలలో వెలువడనివ్వకుండా చేయడానికే భారత ప్రభుత్వం ప్రస్తుతపు పరువునష్టం బిల్లును చాలా హడావిడిగా, ఎవరితో సంప్రతించకుండా, లోక్‌సభలో ప్రవేశపెట్టి, దాని ఆమోదం పొంది అందరిని ఆశ్చర్యపరిచింది. లోక్‌సభ సభ్యులు ఆ బిల్లును ప్రధాని చెప్పినట్టు 9 గంటలసేపు చర్చించి వుండవచ్చు. కాని, ఒక సంచలనాత్మక, వివాదాత్మక ప్రభుత్వ చర్యను, ప్రజాస్వామ్య భవిష్యత్తును నేలపాలు చేయగల చర్యను చర్చించడానికి 9 గంటలు చాలునా? పైగా లోక్‌సభ సభ్యులు చర్చిస్తే చాలునా? ఇటువంటి బిల్లులను ప్రజల ముందుంచి వారి స్వేచ్ఛాభావ ప్రకటనకు కొంత దీర్ఘ వ్యవధిని ఇవ్వడం అనే సత్సంప్రదాయం లేదా? ఆ సంప్రదాయాన్ని ఎందుకు త్రోసిపుచ్చవలసి వచ్చింది? ఎవరో తరుముకు వస్తున్నట్టు హడావిడిగా దాన్ని శాసనీకరించడానికి ఎందుకు తొందర పడవలసి వచ్చింది?

ఈ నిరంకుశత్వపు బిల్లుపట్ల పత్రికారంగంలోనే కాక, ఇతరత్రా కూడా పెల్లుబికిన వ్యతిరేకతను చూసి నిర్ఘాంతపోయినందునే భారత ప్రభుత్వం దాన్ని నిన్న సోమవారంనాడు రాజ్యసభలో ప్రవేశపెట్టకుండా నిలిపివేసినట్టు స్పష్టపడుతూనే వున్నది. ఈ మేరకు ప్రజాభిప్రాయానికి సరైన విధంగా ప్రతిస్పందించినందుకు సంతోషించవలసిందే. కాని, ఇది పాక్షిక ప్రతిస్పందన మాత్రమే. అది చాలదు.

బిల్లును నిలిపి వుంచడమేకాక, దానిపై పత్రికలు, ఇంకా ఈ బిల్లుతో ప్రమేయంగల ఇతరవర్గాల వారందరితోను సంప్రతించి వారి అభిప్రాయాలను సేకరించి పరిశీలించడానికి కేంద్ర ప్రభుత్వం ఏడుగురు సభ్యులతో ఒక సంఘాన్ని నియమించింది. అయితే, ఇది పైకి ఏదో మెహర్బానీ చర్యగా కనిపిస్తుంది. కాని, అది కేవలం భ్రమ. ఆ ఏడుగురు సభ్యులను వివిధ వర్గాల

నుంచి ఎంచి నియమించలేదు. వారందరు కేంద్ర మంత్రులు. అంటే వారికి అభిప్రాయ స్వాతంత్ర్యమే కాదు, అసలు సొంత అభిప్రాయాలంటూ ఏ మాత్రం వుండడానికి వీలులేని వారు. గుడ్డికన్ను తెరిచినా ఒకటే, మూసినా ఒకటే అన్నట్టు వారితో సంఘాన్ని నియమించిన ఒకటే, నియమించకపోయినా ఒకటే. కంటి తుడుపుగా కూడా ఈ చర్య పనికిరాదు. దేశ పరీవ్యాప్తంగా పెల్లుబికిన విమర్శాపరంపరల నుంచి కొంత వ్యవధిని సంపాదించడానికి, ఈలోగా వేడి కాస్తా తగ్గిపోకపోతుందా అనే ఆశతో చేసిన చర్య మాత్రమే. దానివల్ల జరిగేదీ, ఒరిగేదీ ఏమీ లేదు.

ఏమైనా, గత బుధవారంనాటి మా సంపాదకీయంలో మేము పేర్కొన్నట్టు ఈ బిల్లు మన ప్రజాస్వామ్యం పరువు నిలువునా తీసే బిల్లు తప్ప మరొకటి కాదు. దాన్ని భారత ప్రభుత్వం ఉపసంహరించాలి. అది ఉపసంహృతమయ్యేటట్టు పత్రికల నుంచేకాక, అభిప్రాయ ప్రకటనా స్వాతంత్ర్యాన్ని, ప్రజాస్వామ్య స్వేచ్ఛలను ప్రాణ ప్రదాలుగా భావించే వారందరు ఒత్తిడి తేవాలి. నేటి భారతీయ పత్రికల సమ్మె ఈ కృషికి దోహదం చేయగలదని నమ్ముతున్నాము.

*(సెప్టెంబర్ 6, 1988)*

# తూర్పుజర్మనీలో మార్పు

తూర్పు యూరప్‌లో కమ్యూనిజం దెబ్బపై దెబ్బ తింటున్నది. ద్వితీయ ప్రపంచ యుద్ధం తర్వాత స్టాలిన్ నిర్మించిన కమ్యూనిస్టు మహా సామ్రాజ్యం పేక మేడలా కూలిపోతున్నది.

ఒక ఏడాది, రెండేళ్ల క్రిందట కలలో కూడా అసాధ్యమనిపించిన మార్పులు ఇప్పుడు తూర్పు యూరప్‌లో అవలీలగా జరిగిపోతున్నాయి. పోలెండ్‌లో మొదటిసారిగా ఒక నాన్ కమ్యూనిస్టు వ్యక్తి ప్రధాన మంత్రి అయ్యాడు. హంగరీలో కమ్యూనిస్టు పార్టీ తన్ను తాను రద్దుచేసుకుని పాశ్చాత్య తరహా మల్టీ పార్టీ ప్రజాస్వామ్యానికి ఆయత్తమవుతున్నది.

ఇప్పుడు తూర్పుజర్మనీ వంతు వచ్చింది. ఏ దేశం మారినా తూర్పు జర్మనీ మాత్రం మారదని ఈ మధ్య వరకు పరిశీలకులు అంటూ వుండేవారు. స్టాలినిజం కరుడుకట్టిన కమ్యూనిస్టు దేశాలలో అదొకటి. అయితేనేం వున్నట్టుండి ప్రజాస్వామ్య స్వేచ్ఛా కాంక్ష పెను తుపానులా ఆ దేశం మీదకు విరుచుకుపడింది.

అది కూడా తూర్పుజర్మనీలో సోషలిస్టు రాజ్య స్థాపన నలభైయవ వార్షికోత్సవం క్రిందటి నెలలో జరిగిన సందర్భంలోనే ప్రారంభం కావడం విశేషం. పద్దెనిమిదేళ్లుగా అటు దేశానికి, ఇటు కమ్యూనిస్టు పార్టీకి తిరుగులేని అధినేతగా అధికారం చెలాయించిన స్టాలినిస్టు నాయకుడు ఎరిక్ హోనేకర్ ఒక పక్కన ఎట్టి పరిస్థితులలోను కమ్యూనిజంలో సంస్కరణలను అంగీకరించేది లేదని అంటూనే వున్నాడు. మరొకపక్క తూర్పుజర్మనీ అంతటా, అనేక పట్టణాలలో లక్షలాది ప్రజలు ప్రజాస్వామ్య ప్రదర్శనలు ప్రారంభించారు.

ఆ ప్రదర్శనల ఉధృతిని తట్టుకోలేక హోనేకర్ తన పదవులకు రాజీనామా ఇచ్చాడు. అతని స్థానంలో అతని ప్రియ శిష్యుడు ఇగాన్ క్రెంజ్ అధికారానికి వచ్చాడు. ఇతడు కూడా "సోషలిజంపై రాజీ లేదు. ఎట్టి పరిస్థితులలోను సంస్కరణలను ఒప్పుకునేది లేదు" అని ఒకపక్క బీరాలు పలుకుతూనే వున్నాడు. మరొకపక్క మార్పులపై మార్పులు మెరుపు వేగంగా అనివార్యంగా అతడిని ముంచెత్తుతూనే వున్నాయి.

తూర్పు జర్మనీలో వున్నట్టుండి పార్టీ పొలిట్ బ్యూరో మొత్తంగా రాజీనామా చేసింది. దాని స్థానంలో కొత్త పొలిట్ బ్యూరో ఎన్నికైంది. ఇంతలో ప్రభుత్వం కూడా రాజీనామా చేసింది. దాని స్థానంలో కొత్త ప్రభుత్వాన్ని పార్లమెంట్ ఎన్నుకోబోతున్నది. చాలా కాలంగా ప్రధానిగా వున్న విల్లీ స్టాఫ్ స్థానంలో పొలిట్ బ్యూరో సభ్యుడుగా కొత్తగా ఎన్నికైన హోన్స్ మోడ్రో ఎన్నిక కాగలడని వార్తలు తెలుపుతున్నాయి. అతడు పూర్తిగా సంస్కరణవాది. అందుచేత తూర్పుజర్మనీలో కూడా కమ్యూనిజం పెక్కు మార్పులకు లోనుకాబోతున్నట్టే భావించవచ్చు.

నిజానికి కడచిన కొన్ని నెలలుగా ఆ దేశంలో జరుగుతున్న సంచలనాన్ని చూస్తుంటే అతి

త్వరలోనే అక్కడ మార్పులు అనివార్యమని స్పష్టమవుతున్నది. తూర్పు యూరప్‌లోని కమ్యూనిస్టు దేశాలన్నిటిలోకి తూర్పుజర్మనీ పారిశ్రామికంగా అభివృద్ధి చెందినదన్న మాట నిజమే. ప్రజల జీవన ప్రమాణం కూడా అక్కడ చాలా ఎక్కువ.

అయితే, కేవలం ఆర్థికాభివృద్ధి, ఉన్నత జీవన ప్రమాణం, లేదా ఒలింపిక్ క్రీడలలో అఖండ విజయాలు - ఇవి మాత్రమే ప్రజలను సంతృప్తి పరచలేవని, కడుపు నిండా తిండి తర్వాత ప్రజాస్వామ్య స్వేచ్ఛలను కూడా వారు కోరుతారని తూర్పుజర్మనీ ఉదంతం మరొకసారి స్పష్టం చేస్తున్నది. అట్టి ప్రజాస్వామ్య స్వేచ్ఛలను అన్వేషిస్తూ వారు ఇటీవలి కాలంలో వందలతో ప్రారంభించి వేల కొలదిగా పశ్చిమ జర్మనీకి వలస పోతున్నారు.

ఒక్క ఈ సంవత్సరంలోనే 135 వేల మంది తూర్పు జర్మన్‌లు చెకొస్లొవాకియా, హంగరీ, ఆస్ట్రియాల మీదుగా పశ్చిమ జర్మనీకి పలాయితులై వెళ్లారు. ఈ కాందిశీక ప్రవాహాన్ని తూర్పు జర్మన్ ప్రభుత్వం నిరోధించలేక, చూసీ చూడనట్టు వూరుకుంటున్నది. కాగా, రష్యా, పోలెండ్, హంగరీల ఉదాహరణల తర్వాత తూర్పు జర్మనీలో కూడా ప్రజలు ప్రజాస్వామ్యం కోసం అర్రులుచాస్తూ ప్రదర్శనలు చేస్తున్నారు. వారిని బుజ్జగించడం ప్రభుత్వానికి సాధ్యం కావడం లేదు.

ఈ పరిస్థితిలో తూర్పుజర్మనీలో కూడా మార్పులు అనివార్యంగా రాబోతున్నట్టు పరిశీలకులు ఊహిస్తున్నారు. బహుశా బెర్లిన్ గోడను కూడా త్వరలో తొలగించినా ఆశ్చర్యం లేదంటున్నారు. తూర్పు బెర్లిన్ నుంచి పశ్చిమ బెర్లిన్‌కు పారిపోయే జనప్రవాహాన్ని ఆపడానికి తూర్పుజర్మనీ ప్రభుత్వం 1961లో బెర్లిన్ నగరాన్ని రెండుగా చీల్చుతూ ఆ గోడను నిర్మించింది. దాన్ని తొలగించడమే జరిగితే, దాని నిర్మాణం వలె దాని నిర్మూలనం కూడా కమ్యూనిజం వైఫల్యానికి మరొక ప్రతీక కాగలదు.

తూర్పు యూరప్‌లో ఇంకా చెకొస్లొవాకియా, రుమేనియా, బల్గేరియాలు స్టాలినిజానికి, లేదా బ్రెజ్నెవిజానికి చిహ్నాలుగా మిగిలి వున్నాయి. వాటి పాలకులు మార్పులను నిరోధిస్తూ ఇంకా చూరు పట్టుకుని వ్రేలాడుతున్నారు. అయితే, పొరుగు దేశాలలో వరదలా వచ్చి పడుతున్న మార్పులకు వారు కూడా ఎంతో కాలం తట్టుకోలేరనడం నిస్సందేహం. ఆ దేశాలు కూడా నేడు కాకపోతే మరొకనాడైనా ప్రజాస్వామ్య స్వేచ్ఛా పవనాలకు తలుపులు తెరవక తప్పదు.

*(సెప్టెంబరు 10, 1989)*

# "రెడ్డొచ్చె మొదలాడు..."

దాదాపు మూడు దశాబ్దాలుగా వున్న పంచాయతీ సమితుల వ్యవస్థను, అలాగే ఎన్నో దశాబ్దాలుగా అమలులో వున్న తాలూకాల వ్యవస్థను తెలుగుదేశం ప్రభుత్వం లోగడ రద్దు చేయడమే పెద్ద పొరపాటు.

ఎందువల్లనంటే, పాతుకుపోయిన ఆ వ్యవస్థలను రద్దు చేసి, అటు రెవిన్యూ మండలాలను, ఇటు పంచాయతీ రాజ్ మండలాలను ఏర్పాటు చేయడం వల్ల రాష్ట్ర ప్రభుత్వం ఎంతో వ్యయప్రయాసలకు గురి కావలసి వచ్చింది. రాష్ట్ర ప్రజానీకం ప్రారంభంలో ఎన్నో చిక్కులను, ఇబ్బందులను ఎదుర్కొనవలసి వచ్చింది.

కాగా, మూడు సంవత్సరాలపాటు పనిచేసిన తరువాత అటు రెవిన్యూ మండలాలు, ఇటు పంచాయతీరాజ్ మండలాలు ఏదో విధంగా ఇప్పుడు కొంతవరకు కుదుటపడ్డాయి. ఈ కొత్త పరిపాలనా వ్యవస్థకు ప్రజలు అలవాటుపడ్డారు.

ఈ కొత్త వ్యవస్థ ఇంకా గట్టిగా కుదురుకోకుండానే దాని స్థానే పాత తాలూకా, సమితుల వ్యవస్థనో, లేదా తత్తుల్యమైన వ్యవస్థనో ఏర్పాటు చేయాలన్న ఆలోచన అంత అర్జంటుగా రావలసిన అవసరం వున్నదా?

రాష్ట్ర ముఖ్యమంత్రి డాక్టర్ చెన్నారెడ్డి ఇప్పటి మండలాలను త్వరలో రద్దుచేసి, అసెంబ్లీ నియోజకవర్గం పరిధి యూనిట్‌లో పాత సమితి వ్యవస్థనే పునరుద్ధరించాలన్న ప్రతిపాదన ప్రభుత్వపు యోచనలో కలదని చెప్పడం సహజంగానే కొంత ఆశ్చర్యం కలిగించక మానదు.

సందేహం లేదు - పాత ప్రభుత్వం చేసిన కొన్ని నిర్ణయాలు, తీసుకున్న చర్యలు ప్రజలకు ఇబ్బందులు, అసంతృప్తి కలిగించిన మాట నిజం.

అయితే, ఇప్పటి మండల వ్యవస్థ దశాబ్దాలుగా వున్న పాత వ్యవస్థ స్థానంలో ఏర్పడిన కొత్త వ్యవస్థ. అది సమూలమైన మార్పు. దానిని ఇంత త్వరలోనే – మూడు సంవత్సరాలైనా నిండకుండానే – రద్దు చేయడం వివేకం కాగలదా?

ఇలా ప్రభుత్వం మారినప్పుడల్లా ఎంతో వ్యయ ప్రయాసలతో పాత ప్రభుత్వం నెలకొల్పిన వ్యవస్థలను రద్దు చేస్తూపోతే, ఏ వ్యవస్థ పట్టుమని పది కాలాలపాటు అమలులో వుంటుంది? ఇలా "రెడ్డొచ్చె మొదలాడు..." అన్నట్టుగా, ఎప్పటికప్పుడు వ్యవస్థలనే మార్చుకుంటూ పోతే ప్రజలకు తికమకలు, చిక్కులు ఏర్పడవా? ఇది పాత ప్రభుత్వం గైకొన్న అవాంఛనీయమైన చర్యలను సరిచేసే ప్రయత్నంలో ప్రజలకు తిరిగి మరిన్ని చిక్కులు కలిగించడం కాగలదేమో ఆలోచించవలదా?

నిజానికి, పాత ప్రభుత్వం తీసుకున్న చర్యలన్నింటిని రద్దు చేయడం తమ అభిమతం కాదని, వాటి మంచి చెడ్డలను పరిశీలించి, సరి చేయవలసిన వాటిని సరిచేయగలమని కొత్త

ముఖ్యమంత్రి అధికారంలోకి రాగానే పేర్కొన్నారు. కాగా, ఇప్పటి మండలాల వ్యవస్థపై ఆదిలో కొన్ని ఫిర్యాదులు వచ్చినా, ఇప్పుడు వాటి నిర్వహణ తీరుపై అంతగా విమర్శలు వస్తున్నట్టు కనిపించదు. వాటిలో ఏవైనా లోటుపాట్లు వుంటే, సరిచేయాలి.

కొత్తగా వచ్చిన ప్రభుత్వం ఎన్నో సమస్యలను పరిష్కరించవలసి వుంది. శాంతి భద్రతలు, ముఖ్యంగా నక్సలైట్ల సమస్య, ధరల స్థిరీకరణ, కొత్త ముఖ్యమంత్రి చెబుతున్నట్టు ఖాళీ ఖజానా – ఇంకా ఎన్నో పరిపాలనా సమస్యలు.

అయినప్పుడు, ఇప్పుడు మండలాల వ్యవస్థ రద్దు వంటి జటిలమైన – బృహత్తరమైన – సమస్యకు అగ్ర ప్రాధాన్య మివ్వవలసిన అవసరం కనిపించదు.

అలాగే గ్రామాధికారుల వ్యవస్థ పునరుద్ధరణ ప్రతిపాదన కూడా ప్రభుత్వపు పరిశీలనలో వున్నదని డాక్టర్ చెన్నారెడ్డి పేర్కొన్నారు.

ఇదివరకటి గ్రామాధికారుల వ్యవస్థపై రాష్ట్రంలోని కొన్ని ప్రాంతాలలో అసంతృప్తి, విమర్శలు వుండేవి. అయితే, రాష్ట్ర ప్రభుత్వం ఆ వ్యవస్థకు సమర్థమైన - సరైన - ప్రత్యామ్నాయ వ్యవస్థను ఏర్పాటు చేయకుండానే దాన్ని రద్దు చేయడంవల్ల ప్రజలు ఎన్నో చిక్కులకు, ఇబ్బందులకు లోనయ్యారు. అంతేకాదు – ఒక్క కలం పోటుతో ఆ వ్యవస్థకు స్వస్తి చెప్పడం వల్ల వేలాది గ్రామాధికారులకు జీవనోపాధి లేకుండా పోయింది. ఈ సందర్భంలో సుప్రీంకోర్టు కొందరు మాజీ గ్రామాధికారులకు జీవనోపాధి కల్పించే విషయంలో ఇచ్చిన తీర్పును ఇదివరకటి రాష్ట్ర ప్రభుత్వం సరిగా అమలుపరచడం లేదన్న విమర్శలు వచ్చాయి.

కాగా, గ్రామాధికారుల స్థానంలో రాష్ట్ర ప్రభుత్వం నియమించిన విలేజి అసిస్టెంట్ల వ్యవస్థ వల్ల ఇప్పటికే గ్రామాలలోని ప్రజలు ఎన్నో ఇబ్బందులకు లోనవుతున్నారు.

ఇదివరకు గ్రామాధికారులు గ్రామీణులకు ఎప్పుడు కావాలంటే అప్పుడు అందుబాటులో వుండేవారు. రైతులు కట్టవలసిన భూమి శిస్తు వివరాలు, భూమి సర్వే నంబర్లు మొదలైన సమాచారం అందివ్వడానికి గ్రామాధికారులు అందుబాటులో వుండేవారు. అయితే, ఇప్పుడు పది, పన్నెండు గ్రామాలకు ఒక విలేజి అసిస్టెంటు మాత్రమే వుండడం వల్ల రైతాంగం ఇబ్బందులకు గురికావలసి వస్తున్నది.

అందువల్ల – సమర్థమైన – గ్రామీణ ప్రజల ఆదరాభిమానాలను చూరగొనగల – గ్రామ పరిపాలనా వ్యవస్థను రూపొందించడానికి రాష్ట్ర ప్రభుత్వం యత్నించాలి.

ఈ రెండు సమస్యలు అత్యంత జటిలమైనవి. వీటిపై త్వరపడి నిర్ణయాలకు రాకూడదు. సాకల్యంగా ఆలోచించి, శాశ్వతమైన ప్రాతిపదికపై నిర్ణయాలకు రావాలి.

అంతేకాని, పాత ప్రభుత్వం చేసిన నిర్ణయాలన్నింటిని కొత్త ప్రభుత్వం రద్దు చేసుకుంటూ పోతే, మరొక రూపంలో ఇది కూడా రద్దుల ప్రభుత్వమనే పేరు రాదా? కేవలం కక్ష సాధింపు కోసమే పాత ప్రభుత్వ నిర్ణయాలను రద్దు చేస్తున్నారన్న మాట రాదా?

*(డిసెంబరు 13, 1989)*

# ప్రజాస్వామ్య ప్రభంజనం

ద్వితీయ ప్రపంచ సంగ్రామం ముగిసిన కొత్తలో 1946లో బ్రిటిష్ మాజీ ప్రధాని విన్‌స్టన్ చర్చిల్ అమెరికాలోని ఫుల్టన్‌లో ప్రసంగిస్తూ సోవియెట్ రష్యా, కొన్ని తూర్పు యూరప్ రాజ్యాలకు, తక్కిన ప్రపంచానికి మధ్య "ఇనుప తెర" నిర్మించబడిందని పేర్కొన్నాడు. అంటే కమ్యూనిస్టు ప్రపంచానికి తక్కిన ప్రపంచంతో సంబంధం లేదని, అక్కడ ఏమి జరుగుతున్నదో బాహ్య ప్రపంచానికి తెలియడంలేదని ఆయన అభిప్రాయం.

నిజానికి, 1953 మార్చిలో మార్షల్ స్టాలిన్ మరణించేవరకు సోవియెట్ రష్యాపై, తక్కిన కమ్యూనిస్టు ప్రపంచంపై ఆ "ఇనుప తెర" అభేద్యంగా వుండిపోయింది. పాశ్చాత్య రాజ్యాలు ఆ తెరలో నుంచి సోవియెట్ రష్యా మసకగానైనా కనిపిస్తుందేమోనని విశ్వప్రయత్నం చేసేవి. కాని, వాటి ప్రయత్నం ఫలించేది కాదు. అందువల్ల, అవి "ఇనుప తెర" వెనుక జరుగుతున్న సంఘటనలపై రకరకాల వదంతులను, ఊహాగానాలను ప్రచారం చేసేవి.

అప్పటిలో సోవియెట్ రష్యాలో దౌత్యోద్యోగులుగా పనిచేసేవారి పని రెండు వైపులా పదునుగల కత్తితో సాముగా వుండేది. అందువల్లనే, ఆనాడు రష్యాలోని దౌత్యోద్యోగులను అక్కడి ప్రభుత్వం "పర్సనా నాన్‌గ్రాటా" (అవాంఛనీయ వ్యక్తులు)గా ప్రకటించడం తరచుగా జరిగేది.

మార్షల్ స్టాలిన్ మరణానంతరం ఈ పరిస్థితిలో కొద్దిగా - బహు కొద్దిగా - మార్పు వచ్చింది. క్రుశ్చేవ్ హయాంలో సోవియెట్ రష్యా బాహ్య ప్రపంచానికి కొంతవరకు సన్నిహితమైంది. అయితే, ఆ తర్వాత వచ్చిన సోవియెట్ అధినేతల హయాంలో పరిస్థితిలో కొత్తగా ఏ మార్పు రాలేదు.

గోర్బచెవ్ హయాంలోనే సోవియెట్ రష్యాలో "రెండవ విప్లవం" ప్రారంభమైంది. తన గ్లాస్‌నోస్త్ విధానంతో ఆయన సోవియెట్ రష్యాపై గల "ఇనుక తెర"ను ఛేదించివేశాడు. స్టాలిన్ హయాంలో ప్రక్కవారి చెవిలో ప్రభుత్వాన్ని విమర్శించడానికి సయితం భయపడిన దేశంలో పార్లమెంటులోనే ప్రభుత్వాన్ని తీవ్రంగా విమర్శించడం, దేశాధినేత గోర్బచెవ్ భావాలను బాహాటంగా ఖండించడం జరుగుతున్నది. ఈ దశాబ్ది మొదటి అర్ధభాగం వరకు ఇది ఊహాతీతమైన విషయమే.

గోర్బచెవ్ సోవియెట్ "ఇనుప తెర"ను కూల్చేసరికి బాహ్య ప్రపంచంలోని ప్రజాస్వామ్య ప్రభంజనం అప్రతిహతంగా సోవియెట్ రష్యాలో ప్రవేశించింది. దాదాపు ఏడు దశాబ్దాలుగా స్వేచ్ఛా వాయువులు సోకని సోవియెట్ ప్రజానీకం ఆ సుగంధ పరిమళాలను ఆస్వాదించి తన్మయులౌతున్నారు.

సోవియెట్ రష్యాలో కమ్యూనిజాన్ని ఆంతరంగిక పరిస్థితుల మథనం నుంచి ఆవిర్భవించిన అమృతంగా అప్పటిలో భావించారు. అయితే, తక్కిన తూర్పు యూరప్ దేశాలలో అలా కాదు. అక్కడి ప్రజాస్వామ్య పవనాలకు సోవియెట్ రష్యా ఒక మహాపర్వతం వలె అడ్డుగోడగా నిలిచింది. ఆ దేశాలపై స్వేచ్ఛా పవనాలు వీచకుండా నిరోధించింది. మధ్య మధ్య ఆ పర్వతాన్ని ఎదుర్కొనడానికి చెకొస్లొవాకియా, హంగరీ వంటి కమ్యూనిస్టు దేశాలలో ప్రయత్నాలు జరిగినా, ఆ ప్రయత్నాలకు కొండను ఢీకొన్న పొట్టేలు గతే పట్టింది.

కాగా, సోవియెట్ రష్యాలో వీచనారంభించిన ప్రజాస్వామ్య పవనాలు "ఇనుపతెర" లేనందున తూర్పు యూరప్ దేశాలలోకి నిరాటంకంగా ప్రవేశించాయి.

ఈ ప్రభంజనం వల్ల తూర్పు జర్మనీ, హంగరీ, పోలెండ్, చెకొస్లొవాకియా వంటి తూర్పు యూరప్ దేశాలలో దశాబ్దాల తరబడి నిరంకుశంగా, ఏకచ్ఛత్రాధిపత్యంగా పరిపాలిస్తున్న కమ్యూనిస్టు అధినేతల కిరీటాలు నేలరాలిపోతున్నాయి. తూర్పు జర్మనీలో నిర్మించిన బెర్లిన్ గోడ కూలిపోయింది. తమను ఇంత కాలంగా ప్రజాస్వామ్య పవనాలకు దూరంగా వుంచిన కమ్యూనిస్టు పార్టీల పేర్లనే అక్కడి ప్రజలు మార్చివేస్తున్నారు. కొన్ని దశాబ్దాల తర్వాత మొదటిసారిగా కొన్నిచోట్ల కమ్యూనిస్టేతర నాయకులు అధికార పీఠాలపై అధివసిస్తున్నారు. తూర్పు జర్మనీ మాజీ అధినేత హోనేకర్ వంటివారికి గృహ నిర్బంధం తప్పలేదు.

మొన్న బల్గేరియాలో కూడా ప్రజాస్వామ్యప్రియులు "మాకు ప్రజాస్వామ్యం కావా"లంటూ ప్రదర్శనలు జరిపారు.

ఎటుతిరిగీ రుమేనియా, అల్బేనియాలకు మాత్రం ఈ ప్రజాస్వామ్య ప్రభంజనం తాకిడి ఇంకా గట్టిగా తగిలినట్టు లేదు. సినో-సోవియెట్ వివాదం సందర్భంగాకూడా ఈ రెండు దేశాలు సోవియెట్ రష్యాతో కంటె చైనాతో సన్నిహితంగా వుంటూ వచ్చాయి. చైనాలో ఈ సంవత్సరం మధ్యలో విద్యార్థులు ప్రారంభించిన ప్రజాస్వామ్య ఉద్యమాన్ని అక్కడి ప్రభుత్వం అణచివేసినట్టే తాము కూడా ప్రజాస్వామ్య ఉద్యమాన్ని అణచి వేయాలని ఈ రెండు దేశాలు ఆలోచిస్తున్నట్టు కనిపిస్తున్నది.

అయితే, తూర్పు యూరప్ దేశాలనుచుట్టుముట్టిన ఈ ప్రచండ ప్రజాస్వామ్య ప్రభంజనం నుంచి ఈ రెండు దేశాలు ఎంతో కాలం తప్పించుకోలేవు. ప్రజాశక్తి అజేయమైనది, ప్రజావాణి అనుల్లంఘనీయమైంది, ప్రజాభీష్టం అప్రతిహతమైనది కదా!

కాగా, 1917లో రష్యాలో బోల్షివిక్ విప్లవం జరగడం ప్రపంచ చరిత్రలో ఎంతటి మహత్తరమైన సంఘటనో, 1989 లో సోవియెట్ రష్యా, దాని ఉపగ్రహ రాజ్యాలు ప్రజాస్వామ్య పథంలో పయనం ప్రారంభించడం కూడా అంతటి మహత్తర విప్లవమే!

*(డిసెంబరు 15, 1989)*

# మరొక పేక మేడ పతనం

తూర్పు యూరప్‌లో మరొక కమ్యూనిస్టు నియంత పద భ్రష్టుడయ్యాడు. అతడు రుమేనియాలో సుమారు పాతికేళ్లుగా పాతుకుపోయి, పార్టీపైన, ప్రభుత్వంపైన ఏకచ్ఛత్రాధిపత్యం చెలాయించిన నికొలాయ్ సీసెస్క్యూ.

తక్కిన తూర్పు యూరప్ కమ్యూనిస్టు రాజ్యాలకు, రుమేనియాకు ఒక తేడా వుంది. స్టాలిన్ తర్వాత క్రుశ్చేవ్ కాలంలో అతని సంస్కరణవాద ప్రభావం ఆయాదేశాలపై ఎంతో కొంత పడింది. అప్పుడు తమ దుర్భర జీవన పరిస్థితులను భరించలేక ప్రజలు కనీసం తిరుగుబాటైనా చేసేవారు. ఆ తిరుగుబాటులను సోవియెట్ సేనల సహాయంతో ఆయా దేశాల అధినేతలు క్రూరంగా అణచివేసేవారనుకోండి. అది వేరే సంగతి.

కాని, రుమేనియాలో అలా కాదు. క్రుశ్చేవిజం నీడను కూడా రుమేనియా తనపై పడనివ్వలేదు. స్టాలినిజంను యథాతథంగా కొనసాగించింది. రష్యాతో పేచీ పెట్టుకుంది. చైనావైపు మొగ్గు చూపింది. స్వతంత్ర విదేశాంగ విధానం అవలంబించింది. తిరుగు బాటుకు కించిదవకాశం కూడా ఇవ్వకుండా గడుపుతూ వచ్చింది.

అయితే, ఎన్నాళ్లని ఆ దుర్భర పరిస్థితి కొనసాగుతుంది? రష్యాలో గోర్బచేవ్ గ్లాస్‌నోస్త్, పెరిస్త్రోయికా సంస్కరణల ప్రభావం సరిహద్దులు దాటి మొదట పోలెండ్‌పై పడింది. అక్కడ మొట్టమొదటి నాన్ కమ్యూనిస్టు ప్రభుత్వం ఏర్పడింది. తర్వాత హంగరీలో కమ్యూనిస్టు పార్టీ రద్దు అయి అతి త్వరలో మొదటిసారిగా మల్టీ పార్టీ ప్రాతిపదికపై స్వేచ్ఛగా ఎన్నికలు జరగబోతున్నాయి. తూర్పు జర్మనీలో ఆనాడు పారిస్‌లో బాస్టిల్ కారాగారం వలె బెర్లిన్ గోడ బద్దలైపోయి, నిరంకుశ నియంత హోనెకర్ పద భ్రష్టుడు, పరాభూతుడు అయ్యాడు. ఇక చెకొస్లొవాకియా, బల్గేరియా ప్రజలు మాత్రం వూరుకుంటారా? వారు కూడా కమ్యూనిజం బూజు దులుపుకుని, ప్రజాస్వామ్య పథంలో ప్రయాణం ప్రారంభించారు.

కాగా, రుమేనియాలో ఇంత త్వరలో మార్పులు రాగలవని పలువురు ఊహించలేదు. అయితే, ఇరుగుపొరుగు దేశాలలో తిరుగుబాట్ల ప్రభావం దానిపై కూడా పడింది. లక్షలాది ప్రజలు వీథులలోకి వచ్చి ప్రజాస్వామ్య ప్రదర్శనలు చేశారు. కాని తక్కిన తూర్పు యూరప్ దేశాల కమ్యూనిస్టు నాయకుల వలె సీసెస్క్యూ అంత తేలికగా, మర్యాదగా వైదొలగడానికి అంగీకరించలేదు. సైన్యాన్ని, పోలీసులను ప్రయోగించి ప్రదర్శనలను అణచివేయ ప్రయత్నించాడు. ఘర్షణలో ఎనిమిది వేల మంది వరకు నిహతులై వుంటారని అంచనా.

చివరికి సీసెస్క్యూ పాపం కూడా పండింది. పదవి మాట స్టాలిన్ ఎరుగునని దేశం విడిచి పలాయన మంత్రం పఠించడానికి సిద్ధపడ్డాడు. అతడు చైనా పారిపోయాడని కొన్ని వార్తలు,

కాదు, పలాయన ప్రయత్నంలో పట్టుపడ్డాడని కొన్ని వార్తలు.

ఏమైనా, రుమేనియాలో కూడా కమ్యూనిజం తక్కిన తూర్పు యూరప్ దేశాలలో వలెనే చరిత్ర చెత్తబుట్టలోకి చేరుకున్నట్టే. నిజానికి, తూర్పు యూరప్‌లో కమ్యూనిజం ప్రజోద్యమాలలో నుంచి ఉద్భుద్ధమైనట్టిది కాదు. ద్వితీయ ప్రపంచ యుద్ధానంతరం ఆయా దేశాలను ఆక్రమించిన సోవియెట్ సైన్యాలు మొదట్లో పేరుకు మాత్రం మిశ్రమ ప్రభుత్వాల స్థాపన నాటకం ఆడి, చివరకి కమ్యూనిస్టు పార్టీలను అధికార పీఠం ఎక్కించి, కీలుబొమ్మ ప్రభుత్వాల ద్వారా కమ్యూనిజంను స్థాపించడం జరిగింది.

అయితే, ఇండియాతో సహా ఏ దేశపు కమ్యూనిస్టు పార్టీలు ఈ నిజాన్ని అంగీకరించేవి కావు. తూర్పు యూరప్ దేశాలపై, కమ్యూనిస్టు నిరంకుశ ప్రభుత్వాలపై ఈగ వాలనిచ్చేవి కావు. అవన్నీ మార్క్సు మహాశయుడు కలలుకన్న ఆదర్శ రాజ్యాలన్నట్టు ప్రచారం చేస్తూ వుండేవి.

ఇప్పుడు ఆ బండారం బయట పడింది. ఒక్కొక్క తూర్పు యూరప్ దేశమే మిట్ట మధ్యాహ్నపు కారుచీకట్ల (డార్క్‌నెస్ ఎట్ నూన్) నుంచి బయటపడి ప్రజాస్వామ్య. స్వేచ్ఛా కాంతులవైపు ప్రయాణిస్తున్నది. చివరికి ద్వితీయ ప్రపంచ యుద్ధం తర్వాత స్టాలిన్ కబళించిన మూడు బాల్టిక్ రిపబ్లిక్‌లలో కూడా స్వాతంత్ర్యోద్యమాలు విజృంభిస్తున్నాయి. ఇక మిగిలింది జానెడు బెత్తెడు ఆల్బేనియా ఒక్కటే. అక్కడా ఎప్పుడో ప్రజాస్వామ్య భానూదయం అవుతుందనే ఆశించవచ్చు.

కరడుకట్టిన స్టాలినిస్టు దేశం రుమేనియాలో జరుగుతున్న మార్పులు స్వేచ్ఛా ప్రియులు స్వాగతం పలకవలసినవి, ఇరవైయవ శతాబ్దపు ఉత్తరార్థంలోని మహత్తర పరిణామాలలో ఎన్నదగినవి, విజయం పొందాలని అందరు కోరుకోదగినవి.

*(డిసెంబరు 24, 1989)*

# కరిగిపోతున్న కల

ఈ శతాబ్దపు సుందర స్వప్నం కరిగిపోతున్నది. ప్రపంచ వ్యాప్తంగా దశాబ్దాలుగా కోట్లకొలది ప్రజలను ఉత్తేజితులను చేసిన ఒక మధురోహ శిథిలమైపోతున్నది. నరజాతి చరిత్రలో ఇంతకుముందు ఎన్నడూ కనీవినీ ఎరుగని ఒక మహా ప్రయోగం మన కళ్ళ ఎదుటే విఫలమైపోతున్నది.

సోవియెట్ యూనియన్‌లో ఒకటి, రెండేళ్ల క్రిందట ప్రారంభమై, మరీ ముఖ్యంగా ఇప్పుడు పరంపరగా జరుగుతున్న అపూర్వ, మహత్తర పరిణామాలను చూస్తుంటే ఈ భావాలు ఎందరి మనస్సులనో వికలం చేస్తున్నాయి. ఇదంతా ఎందుకు జరిగింది, ఇలా ఎందుకు జరిగింది, దీని అర్థం ఏమిటి, దీని గమ్యం ఏమిటి, లక్షల మంది ప్రజలు ఇంతకాలం ఎందుకు త్యాగాలు చేశారు, ఎందుకు రక్తతర్పణం చేశారు, దేని కోసం, దేని కోసం? అనే ప్రశ్నల తమస్సులు ఎందరి మనస్సులనో ముసురుతున్నాయి.

మాస్కోలోని క్రెమ్లిన్ కుడ్యాల వద్ద ఎప్పుడూ లక్షలాది ప్రజలు సోవియెట్ అగ్రనాయకులకు జయజయ నినాదాలు చేయడమే ప్రపంచం ఎరుగును. కాని, మొన్న రెండు లక్షల మంది ప్రజలు కమ్యూనిస్టు పార్టీ గుత్త అధికారానికి స్వస్తి చెప్పాలని కోరుతూ అపూర్వరీతిలో ప్రదర్శనలు చేశారు.

ఇప్పుడు జరుగుతున్న సోవియెట్ కమ్యూనిస్టు పార్టీ సెంట్రల్ కమిటీ సర్వసభ్య సమావేశం తమ దేశంలో మల్టీపార్టీ ప్రజాస్వామ్యాన్ని గురించి, స్వేచ్ఛా విపణిపై ఆధారపడిన ఆర్థిక వ్యవస్థను గురించి, సొంత ఆస్తి హక్కు పునరుద్ధరణ గురించి చర్చించబోతున్నదట. అంటే ఇంతకాలం వేటిని కమ్యూనిస్టు పార్టీలు వ్యతిరేకించాయో అవే నేడు చర్చా యోగ్యాలైనా యన్నమాట.

కారణాలు ఏవైనా కానివ్వండి. పర్యవసానం ఏమైనా కానివ్వండి. సోవియెట్ యూనియన్‌లో ఇట్టిప్రదర్శనలు, పరిణామాలు జరగడమే ఒక చరిత్రాత్మక విశేషం. అయిదేళ్ళనాడు, లేదా రెండు మూడేళ్లనాడు కూడా ఇటువంటివి సంభవమని ఎవరూ ఊహించలేదు. ఒకవేళ సంభవమని ఎవరైనా ఊహించినా ఇంత త్వరితంగా సంభవమని ఊహించి వుండరు.

ప్రఖ్యాత రచయిత జార్జి ఆర్వెల్ తన నవలలలో, ముఖ్యంగా 1984లో "నియంతృత్వ" (టోటాలిటేరియన్) సమాజ భయానకత్వాన్ని సరిగానే చిత్రించాడు. విశ్లేషించాడు. కాని, ప్రపంచం అటువంటి భయానక నియంతృత్వంవైపు అనివార్యంగా పయనిస్తున్నదని పొరపాటుగా అంచనా వేశాడు. ప్రపంచం అతని అంచనాను ఒక హెచ్చరికగా తీసుకున్నట్టుగా ఆ మహా ప్రమాదపు టంచునుంచి తనను తాను మరల్చుకున్నది.

అది నేటి తూర్పు యూరప్ దేశాలలోను, నేటి సోవియెట్ యూనియన్‌లోను ప్రస్ఫుటంగా కనిపిస్తున్నది. అవి ఆర్వెలియన్ అగాధాంచలం నుంచి వెనుకకు తిరిగాయి. అది ఈ శతాబ్దపు మహాద్భుతాలలో ఒకటి.

తూర్పు యూరప్ దేశాలలో గత సంవత్సరం జరిగిన మార్పులు సామాన్యమైనవి. కావు, పోలెండ్, హంగరీ వంటి దేశాలలో ప్రజలు చాలవరకు శాంతియుతంగా తాము కోరిన సంస్కరణలను సాధించారు. కమ్యూనిస్టు పార్టీ గుత్త అధికారం తుత్తునియలైంది. రుమేనియాలో మాత్రం వేలాది ప్రజల ఘోర రక్తపాతంతో జరిగింది. మొత్తంపై తూర్పు యూరప్ ఒక నూతన శకంలో అడుగుపెట్టింది.

తూర్పు యూరప్‌లో కమ్యూనిజం సహజసిద్ధంగా, ప్రజా విప్లవాలనుంచి రాలేదని, ద్వితీయ ప్రపంచ యుద్ధం తర్వాత సోవియెట్ సేనలు తాము విముక్తం చేసిన దేశాలకు కమ్యూనిస్టు పార్టీ ప్రభుత్వాలను అంటగట్టాయని, అందుచేతనే అక్కడ కమ్యూనిజం విఫలమైందని, దానికితోడు సామ్రాజ్యవాద దేశాలు విద్రోహ చర్యలను ప్రోత్సహించాయని వామపక్షాలవారు ఇంతవరకు వాదిస్తూ తమ్ము తాము సమాధానపరచుకుంటున్నారు.

మరి ఇప్పుడు సోవియెట్ యూనియన్‌లో జరుగుతున్న - జరగనున్నట్టు వార్తలు సూచిస్తున్న - పరిణామాలకు అర్థం ఏమిటి? బోల్షివిక్ మహావిప్లవం జరిగి ఏడు దశాబ్దాలైనా, కమ్యూనిజం అక్కడ ఇంకా సుస్థిరం కాలేదా? అది ఆశించిన ఫలితా లివ్వలేదా? ప్రజాస్వామిక కేంద్రీకరణ (డెమొక్రటిక్ సెంట్రలిజం) సిద్ధాంతం ఆచరణలో కేంద్రీకృత నియంతృత్వంగా మారిపోయిందా?

సోవియెట్ యూనియన్‌ను సోషలిస్టు పితృభూమిగా ప్రపంచపు కమ్యూనిస్టులు భావించే వారు. అక్కడ ఒక నవ సమాజం నెలకొంటున్నదని, ఒక నవ మానవుడు అవతరిస్తున్నాడని, ఆకలిదప్పులు, నేరాలు, ఘోరాలు, లేని ఒక మరో ప్రపంచం ఆవిర్భవిస్తున్నదని వారు నమ్మారు, ఇతరులను నమ్మించారు.

సోవియెట్ యూనియన్ ఒక అగ్ర రాజ్యంగా, గొప్ప పారిశ్రామిక, వైజ్ఞానిక దేశంగా, సైనికశక్తిగా అభివృద్ధి అయిన మాట నిజమే. కాని, ఆ అభివృద్ధి ఖరీదు ఎంతో ఇప్పుడు వెల్లడి అవుతున్నది. ప్రజలను, వారి నిత్యావసరాలను, వారి వ్యక్తి స్వేచ్ఛలను విస్మరించి పారిశ్రామిక, వైజ్ఞానిక, సైనికాభివృద్ధిని సాధించడమే ఆ ఖరీదు. రాజకీయ నియంతృత్వం, ప్రశ్నించే హక్కు నిరాకరణే ఆ ఖరీదు.

ఈ వ్యవస్థలో మార్పులు, సంస్కరణలు తీసుకురాగోరిన సాహసి మిఖాయిల్ గోర్బచేవ్. లెనిన్ తీసుకువచ్చినది మొదటి విప్లవమైతే, గోర్బచేవ్ తీసుకువచ్చినది రెండవ విప్లవం. దీని పర్యవసానం ఎలా వుంటుందో ఇప్పుడు ఊహించడం కష్టం. ఒకవైపు బోరిస్ యెల్ట్సిన్ వంటి సంస్కరణవాదులు గోర్బచేవ్ పెరిస్త్రోయికా బూటకమని, ఇంకా సమూలమైన మార్పులు రావాలని కోరుతుండగా, మరొకవైపు యెగర్ లిగచేవ్ వంటి యథాతథవాదులు గోర్బచేవ్ సంస్కరణలను తీవ్రంగా వ్యతిరేకిస్తున్నారు.

ఈ పరిస్థితిలో గోర్బచేవ్ మధ్యమ మార్గం అనుసరించక తప్పదు. కాని, ఆయన పెరిస్త్రోయికా విజయవంతమవుతుందా, ఆయన వ్యక్తిగత భవితవ్యం ఎలా వుంటుందన్నది ఈనాడు ఒక ప్రశ్నార్థకంగా వ్రేలాడుతున్నది. ఇటు పెట్టుబడిదారీ సమాజంలోని దుర్లక్షణాలను, అటు కమ్యూనిస్టు వ్యవస్థలోని అవలక్షణాలను రెండింటిని పరిహరించి, నిజమైన ఆర్థిక, రాజకీయ ప్రజాస్వామ్య సాధనకై ఆయన ప్రారంభించిన నూతన ప్రయోగం సఫలం కావాలని కోరుకోని వారుండరు.

*(ఫిబ్రవరి 7, 1990)*

# "మహాత్ముని ఆస్థాన కవి"

తనను తాను "తెనుగు లెంక" అని ఆయన వ్యవహరించుకున్నారు. తెలుగువారు "అభినవ తిక్కన"గా ఆయనను అభిమానించారు. విమర్శకాగ్రణి కట్టమంచి రామలింగారెడ్డి "మహాత్ముని ఆస్థాన కవి" అని సంభావించారు,

బుధవారం రాత్రి తన ఎనభై ఎనిమిదవ ఏట నిండు వృద్ధాప్యంలో పండుటాకువలె రాలిపోయిన శ్రీ తుమ్మల సీతారామమూర్తిగారికి ఇవన్నీ అన్వర్థ బిరుదాలే. ఆయన భౌతిక జీవితం పరిసమాప్తమైనా కవితా జీవితం మాత్రం కలకాలం కొనసాగుతుంది.

కొంచెం అటూ ఇటూగా ఆయన సాహితీ సమితి, నవ్య సాహిత్య పరిషత్తు కవులకు సమకాలికుడు. అయినా ఒక జాషువా వలె, ఒక దువ్వూరి వలె, సీతారామమూర్తిగారిది కూడా భిన్న మార్గం, ఒక ప్రత్యేక మార్గం, అది పూర్తిగా తనదే అయిన స్వతంత్ర మార్గం.

భారతదేశం పరాధీనత నుంచి విముక్తి కోసం గాంధీజీ నాయకత్వాన పోరాటం ప్రారంభించిన రోజులలో ఆయన వ్యక్తిగా, కవిగా కళ్ళు తెరిచారు. గాంధీజీ సత్యాగ్రహ సమరశంఖారావం ఆయనను ఆకర్షించింది. నాటి నుంచి ఆయన కవిత దేశభక్తికి అంకితమైంది. ఆయన గాంధీ-పథానువర్తి అయ్యారు.

ఆ కాలమ్మున గౌతము/ డీకాలమునందు గాంధి యిద్దరు హింసా

వ్యాకుల జగతికి శాంతి / శ్రీకరులు దయావిధేయ జీవన నిరతుల్

అని ఒకచోట గాంధీజీకి బుద్ధునితో పోలిక తెచ్చి గాంధీ మార్గంలోనే యావజ్జీవితాన్ని తీర్చిదిద్దుకున్నారు.

"పలికెడిది భాగవతమట, పలికించెడివాడు రామభద్రుండట" అని పోతన చెప్పుకున్నట్టు గాంధీజీ పట్ల గల గాఢ భక్త్యారాధనా భావమే సీతారామమూర్తిగారి చేత "బాపూజీ ఆత్మకథ" కు పద్యానువాదం చేయించింది. "మహాత్మ కథ"ను గ్రథియింపజేసింది. ఈ రెండు బృహత్కావ్యాలు ఈ శతాబ్దపు ఆంధ్ర భారతికి అమూల్యాంకారాలు. ఇవీ, ఇంకా గాంధీజీపై ఆయన వ్రాసిన ఇతర కృతులే కట్టమంచి వారి నుంచి "తుమ్మల సీతారామమూర్తి మహాత్ముని యొక్క ఆస్థాన కవి. ఈ స్థానము శాశ్వతము" అన్న ప్రశంసను సంపాదించాయి.

మహాత్ముని మహిత జీవితం తర్వాత తుమ్మలవారికి కవిగా అమిత ప్రేరణ ఇచ్చిన మరొక గాఢ భావన స్వరాష్ట్రాభిమానం, స్వభాషానురక్తి. "నేను తెలుగువాడను అను నహంకారము నా కెక్కువ. ఈ యహంకారమే నన్ను కవిని చేసినది" అని తుమ్మలవారు స్వయంగా చెప్పుకున్నారు. ఈ గాడ భావ ప్రభావ ప్రేరణతోనే ఆయన రాష్ట్ర గానం, ఉదయ గానం, మరెన్నో లఘు, గురు కావ్యాలు రచించారు. తెలుగు నుడికారానికి, తెలగు భాషా మార్దవానికి, మాధుర్యానికి అవి లక్ష్యప్రాయాలైన రచనలు.

తుమ్మల వారికి పోతన అభిమాన కవి. అయినా ఆయన కవితలో తిక్కనతనమే ఎక్కువగా కనిపిస్తుంది. కట్టమంచివారికి నన్నయత్వం కూడా కనిపించింది. విశ్వనాథవారికి శ్రీనాథుడు, పెద్దన రీతులు సయితం కనబడ్డాయి. పురాంధ్ర కవితా సముద్రాన్ని అగస్త్యుని వలె ఆపోశనం పట్టినవారైనందున అన్ని పోకడలు ఆయనలో కనిపించడంలో ఆశ్యర్యం లేదు.

తుమ్మలవారి కృతులన్నిటిలో "నేను" అన్న లఘు కావ్యం విలక్షణమైది, మృదుమధురమైంది. దానిలో ఆయన జీవితతత్వం, కవితా దృక్పథం ప్రస్ఫుటాలవుతాయి.

మాటమాటయు వాగ్దేవి కోటగాగ / కోటలో దావు లెగజిమ్ము తోటగాగ
దోట నురలెడి క్రొందేనె తేటగాగ / దీర్చినది కైత, మెరుగుదిద్దినది కైత

అని పేర్కొన్న సుకవితా లక్షణం తుమ్మలవారి కవిత్వానికి చక్కగా సరిపోతుంది.

రాష్ట్ర సిద్ధి కొరకు రక్తమ్ము గార్చిన / కవిని నేను గాంధి కవిని నేను
బడలి బడలి తల్లి బాసకూడెము సేయు / కవిని నేను దేశి కవిని నేను

అని సగర్వంగా చెప్పుకున్న శ్రీ తుమ్మల ధన్యజీవి, ధన్యకవి. ఆయన స్మృతికి మా జోహార్లు.

*(మార్చి 23, 1990)*

# బ్రాహ్మీమయమూర్తి పుట్టపర్తి

**చా**లా ఏళ్లనాటి మాట. 1928-29 ప్రాంతాలలో 14 సంవత్సరాల బాలుడు ఒక ప్రౌఢ కావ్యం వ్రాశాడు. ఆ తర్వాత కొన్నేళ్లకు ఆ బాలుడు విద్వాన్ పరీక్షకు కూర్చున్నాడు. తాను వ్రాసిన కావ్యంలో నుంచి ఇచ్చిన ఒక ప్రశ్నకు తానే సమాధానం వ్రాయవలసి వచ్చింది. రెండు వాక్యాలలో సరిపెట్టవలసిన సమాధానాన్ని 40 పేజీలలో వ్రాశాడు.

ఆ ప్రౌఢ కావ్యం పేరు "పెనుకొండ లక్ష్మి." దాని కర్త పేరు పుట్టపర్తి నారాయణాచార్యులు. ఆ కావ్యాన్ని విద్వాన్ కోర్సుకు మద్రాసు విశ్వవిద్యాలయంవారు పాఠ్యగ్రంథంగా నిర్ణయించినందున, ఆ తర్వాత అయనే అది చదివి సమాధానం వ్రాయవలసివచ్చింది.

ఇంత చిత్రమైన, ఆశ్చర్యకరమైన సన్నివేశం సాహిత్య చరిత్రలోనే మరొకటి ఎక్కడా, ఎప్పుడూ వుండి వుండదు. అదీ నారాయణాచార్యులవారి ఆబాల్య ప్రతిభా, పాండిత్య గరిమ.

మరొకటి కూడా చాలా ఏళ్ల నాటి మాటే. మానసికమైన అశాంతితో నారాయణాచార్యుల వారు హృషీకేశంలో గంగానదీ తీరాన తిరుగాడుతూ స్వామీ శివానంద సరస్వతిని కలుసుకున్నారు. ఆనంద కుటీరంలో ఏడాదిన్నరపాటు స్వామీజీకి అంతేవాసిత్వం నెరపారు. ఆచార్యులవారి సకల శాస్త్ర పారీణతకు, బహుముఖ ప్రజ్ఞకు అబ్బురపడి స్వామీజీకి ఆయనకు 'సరస్వతీ పుత్ర' బిరుదం ప్రసాదించారు.

అక్షరాలా ఆయన చదువుల తల్లి ముద్దుబిడ్డడే. మాతృ ముఖరిత కచ్ఛపీ గానామృత ఝరిలో ఓలలాడి సకల కళలను స్వాయత్తం చేసుకున్నారు. ఆయనకు రాని విద్య లేదనడం న్యూనోక్తి. అనలే పండిత వంశం. తండ్రి సంస్కృత పండితుడు. తల్లి సంగీత విదుషీమణి. చిన్ననాటి నుంచే సంస్కృతాంధ్రాలు, సంగీత సాహిత్యాలు అలవడినాయి. స్వయంకృషితో వాటిని మరింత పెంపొందించుకొనడమే కాక, నాట్య విద్యను కూడా అభ్యసించారు. వ్యాకరణం, అలంకార శాస్త్రం, దర్శన, మంత్ర శాస్త్రాలు ఇవన్నీ ఆయనకు కొట్టిన పిండి.

అంతేకాదు, పెద్దన కూర్చిన సమాసంలో చెప్పవలసి వస్తే నారాయణాచార్యులవారు 'భాషాపరశేషభోగి': ఆయన స్వయంగా చెప్పుకున్నారు తన 'పాండితీ శోభ పదునాల్గు భాషలందు' అని. సంస్కృత, ప్రాకృతాంధ్రాలు, ఆంగ్లం కాక, తమిళ, మళయాళ, కన్నడ, మరాఠీ, హిందీత్యాది భాషలు ఆయనకు కరతలామలకాలు. కనుకనే ఇతర భాషల నుంచి ఎన్నో కృతులను ఆయన తెలిగించారు. అలాగే తెలుగు నుంచి ఇతర భాషలలోనికి విశ్వనాథవారి 'ఏకవీర'ను మళయాళంలోనికి వలె - అనువదించారు.

ఆచార్యులవారి కావ్య, కావ్యేతర కృతులు శతాధికాలు. బాల్యంలో వ్రాసిన పెనుకొండ లక్ష్మి కాక, షాజి, విరహ గోపి, సాక్షాత్కారము, పండరీ భాగవతము, అష్టాక్షరీ కృతులు ఇత్యాదిగా ఎన్నో వారికి కీర్తి ఆర్జించి పెట్టాయి. ఒక విలక్షణ కావ్యం 'మేఘదూతం.' పేరును బట్టి కాళిదాస

కృతికి అనుకృతి అనిపిస్తుంది కాని, దాని ఇతివృత్తం భిన్నమైంది. ఒక ఖయిదీ కారాగార క్లేశం అనుభవిస్తూ దూరానగల తన భార్యకు మేఘం ద్వారా సందేశం పంపుతాడు. మార్గమధ్యంలోని తెలుగునాడునే కాక, పీడిత తాడిత ప్రజల దుఃఖ జీవితాన్ని కూడా కవి మానవతావాద దృక్పథం మంచి రసార్ద్రంగా వర్ణిస్తారు.

ఆచార్యులవారి అన్ని కృతులు ఒక ఎత్తు. 'శివతాండవం' ఒక ఎత్తు. అది ఆయన కీర్తికి మూలస్తంభం; సంగీత, సాహిత్య, నృత్య కళల త్రివేణీ సంగమం.

తలపైని చదలేటి యలలు దాండవమాడ
వలల త్రోపుడుల క్రొన్నెల పూవు కదలాడ
మొనసి ఫాలముపైన ముంగురులు చెఱలాడ
కనుబొమ్మలో మధుర గమనములు నడయాడ
కనుపాపలో గౌరి కసినవ్వు బింబింప
కనుచూపులను తరుణ కౌతుకము చుంబింప
కడగి మూడవ కంట గటిక నిప్పులు రాల
కడుబేర్చి పెదవిపై గటిక నవ్వులు వ్రేల
ధిమిధిమి ధ్వని సరిద్గిరి గర్భములు తూగ
అమిత సంరంభ హాహాకారములు రేగ
ఆడెనమ్మా! శివుడు
పాడెనమ్మా! భవుడు

అని ప్రారంభమయ్యే 'శివతాండవ' గేయకావ్యంవంటిది ఆధునిక సారస్వతంలో మరొకటి లేదని శివశంకరశాస్త్రి ప్రస్తుతించారు. ఆ గీతాలను ఆచార్యులవారు స్వయంగా అనేక వేదికలనుంచి ఆడుతూ, పాడుతుండగా చూచి, ఒకనాడు ఆంధ్రదేశం ఆనందపారవశ్యంలో మునిగి తేలింది.

జరా జర్జరితులై, వ్యాధిగ్రస్తులై నారాయణాచార్యులవారు శనివారం తన 76వ ఏట తనువు చాలించడం సాహిత్యాభిమానులందరికి దుఃఖ వార్త. చాలా కాలం క్రిందటే ఆయన 'పాద్యము' అనే కావ్యంలో భగవంతుడిని ఇలా వేడుకున్నారు.

ఎంతగ నేడిపించెదవొ? యీ జడ కాష్ఠము వేడిపించి నీ
సంతము దీర్చుకో! తనువు బాసిన బుణ్యమె పండిపోవు; ని
శ్చింతత బోదు గాని, నను జీవముతో మననిచ్చి కష్టముల్
వంతుకు దెచ్చి, గ్రుమ్మకుము ప్రాణము నీకు నమస్కరించెదన్.

నారాయణాచార్యులుగారు ధన్యజీవితం గడిపి నిశ్చింతతో లోక నాటక రంగం నుంచి నిష్క్రమించినా, కవితా యశఃకాయంతో చిరంజీవిగా నిలిచేవుంటారు.

*(సెప్టెంబరు 2, 1990)*

# మహావీరుడు మండేలా

శతాబ్దాల ప్రపంచ చరిత్రలో పరపీడనకు, హింసకు దాస్యానికి, దోపిడికి గురి అయిన జాతులెన్నో వున్నాయి. కాని, ఆఫ్రికన్ నల్లజాతి ప్రజలకు జరిగినంత అమానుషమైన అన్యాయం బహుశా ఏ కాలంలో ఏ జాతికి జరిగి వుండదు.

ఆఫ్రికన్‌ల వెనుకబాటు తనాన్ని అవకాశంగా తీసుకుని పశ్చిమ దేశాల వారు వారి దేశాలను ఆక్రమించుకున్నారు. పశువుల కంటె హీనంగా పరిగణించారు. బానిసలుగా విక్రయించారు. ఏవిధమైన మానవస్వత్వాలు లేకుండా అన్నివిధాలుగా అణచివేశారు.

కాగా, ఇండియాతో మొదలుపెట్టి పూర్వపు వలస దేశాలు ఒకటొకటిగా విముక్తమవుతున్న క్రమంలో సుమారుగా 1960 ప్రాంతాలనుంచి ఆఫ్రికన్ దేశాలు కూడా పశ్చిమ దేశాల కబంధ హస్తాల నుంచి విముక్తి పొందడం ప్రారంభించాయి. ఇటీవల నమీబియా కూడా విముక్తం కావడంతో దాదాపు ఆఫ్రికా ఖండమంతా స్వేచ్ఛా వాయువులను పీల్చుకున్నట్టయింది.

ఇక మిగిలింది ఒకే ఒక్క ఆఫ్రికన్ దేశం. అది దక్షిణాఫ్రికా. ప్రపంచం ఎంత మారిపోయినా, ఆ దేశంలో శ్వేత జాతీయులు మాత్రం మారడానికి నిరాకరించారు. అత్యధిక సంఖ్యాకులైన నల్లజాతి వారికి వారి స్వదేశంలోనే ఏ హక్కులు లేకుండా చేశారు.

అంతే కాదు, పరమ నికృష్టమైన జాతి విచక్షణను దక్షిణాఫ్రికాలో శ్వేతజాతి మైనారిటీ ప్రభుత్వం అమలు చేసింది. నల్లజాతి వారిచేత అడ్డమైన ఊడిగం చేయించుకుంటూ, వారి శ్రమను దోచుకుంటూ, వారిని మాత్రం తమ పొరుగున నివసించే అవకాశం, తను పాఠశాలలలో చదువుకునే అవకాశం, తమతోపాటు ప్రయాణంచేసే అవకాశం లేకుండా "అపార్టయిట్" అనబడే దారుణమైన రూపంలో అస్పృశ్యతను అమలు చేశారు. ఏమాత్రం ఎవరు అసమ్మతి తెలిపినా రాక్షసంగా అణచివేశారు.

తమకు రాజకీయ, ఆర్థిక, సాంఘిక, తదితర రంగాలలో జరుగుతున్న అన్యాయాన్ని ఎదిరించడానికి నల్లజాతివారు స్థాపించుకున్న సంస్థే ఆఫ్రికన్ కాంగ్రెస్. ఒకనాడు గాంధీజీ దక్షిణాఫ్రికాలో జాతి విచక్షణ విధానాన్ని ఎదిరించడానికి జరిపిన పోరాటాలే వారికి స్ఫూర్తి ఇచ్చాయి. అయితే గాంధీజీవలె ఆఫ్రికన్ కాంగ్రెసు అహింసాయుతంగా పోరాటాలు జరిపి వుండకపోవచ్చు. కాని, వారికి ప్రేరణ మాత్రం గాంధీజీ దక్షిణాఫ్రికాలో నడిపిన ఉద్యమాల నుంచి, ఆయన నాయకత్వాన భారతీయులు ఇండియాలో బ్రిటిష్‌వలస వాదాన్ని పారద్రోలడానికి జరిపిన పోరాటాల నుంచే వచ్చింది.

ఒకప్పుడు ఆఫ్రికన్ స్వాతంత్ర్యోద్యమం ఎప్పటికైనా విజయం పొందేనా అని సందేహం కలగక పోలేదు. అంత దారుణంగా దక్షిణాఫ్రికన్ శ్వేత జాతి ప్రభుత్వపు దమన నీతి దశాబ్దాల తరబడి కొనసాగింది.

అయితే, ఇప్పటికి అది దాదాపుగా చివరిదనదగిన ఘట్టంలో ప్రవేశించింది. 'అపార్టయిట్ - జాతి విచక్షణ - ఇంకా అమలులో వున్నదికాని, అది అంతిమ శ్వాసలు విడుస్తున్నది. దాదాపు ఆఫ్రికా అంతా విముక్తం కాగా, ఒక మూలగా దక్షిణాఫ్రికాలో దమననీతిని కొనసాగించడం సాధ్యం కాదని గ్రహించిన శ్వేతజాతి పాలకులు క్రమంగా పట్టుసడలించారు. ముఖ్యంగా నాయకత్వం మారి ఎఫ్.డబ్ల్యు.డి.క్లెర్క్ ప్రెసిడెంట్ కావడంతో మార్పు త్వరితమైంది. జాతి విచక్షణను ఏవిధంగా అంతం చేసి, నల్లజాతి వారికి ఏవిధంగా హక్కులను, రాజకీయ భాగస్వామ్యాన్ని ప్రసాదించడమా అన్నదానిపై ప్రస్తుతం నెమ్మదిగానైనా మంతనాలు జరుగుతున్నాయి.

ఈ మార్పు ఫలితమే ఆఫ్రికన్ నేషనల్ కాంగ్రెస్ నాయకుడు నెల్సన్ మండేలా విడుదల. శ్వేతజాతి ప్రభుత్వపు కారాగారాలలో 27 ఏళ్ల సుదీర్ఘ ఏకాంత నిర్బంధంలో మ్రగ్గిపోయినా, తన జాతి అంతిమ విజయంపై, ఉజ్వల భవిష్యత్తుపై అచంచల విశ్వాసాన్ని నిలుపుకుని తలవంచక 'మౌన పోరాటం' సాగించిన మహావీరుడు మండేలా.

విడుదల తర్వాత ముందుగా పశ్చిమ దేశాలను సందర్శించినా ఆసియా ఖండంలో తన ప్రథమ సందర్శనకు మండేలా ఎంచుకున్న దేశం ఇండియా. సోమవారంనాడు ఢిల్లీలో అడుగు పెట్టిన తర్వాత మండేలా తాము మహాత్మాగాంధి పోరాటాలతో స్ఫూర్తి పొందిన వారమని, అందుచేతనే భారత సందర్శనకు తాను ఉవ్విళ్ళూరానని చెప్పుకున్నాడు.

గాంధీజీ దక్షిణాఫ్రికాలో జరిపిన పోరాటాల స్ఫూర్తి కారణంగానే స్వతంత్ర భారతదేశం అక్కడి నల్లజాతి ఉద్యమాన్ని మొదటి నుంచి సమర్థిస్తూ వచ్చింది. ఐక్యరాజ్య సమితిలోను, ఇంకా విభిన్న అంతర్జాతీయ వేదికల నుంచి ఇండియా దక్షిణాఫ్రికాలో శ్వేతజాతి ప్రభుత్వం అమలు చేస్తున్న జాతి వివక్ష విధానాన్ని తీవ్రంగా ఖండిస్తూ, నల్లజాతి వారికి నైతిక, రాజకీయ, తదితర సహాయాన్ని అందజేసింది.

ఇప్పటికీ ఇంకా కొనసాగుతున్న నల్లజాతి పోరాటానికి భారతదేశపు నైతిక సమర్థనకు ఒక ప్రతీక మంగళ వారం నాడు నెల్సన్ మండేలాకు జరిగిన "భారతరత్న" బిరుద పూర్వక పురస్కారం. ఖాన్ అబ్దుల్ గఫార్ ఖాన్ తర్వాత ఈ గౌరవాన్ని పొందిన విదేశీయుడు మండేలా. తన జాతి విముక్తికి నిరుపమానమైన త్యాగం చేసిన మహావీరునిగా మండేలాకు భారతజాతి నేడు జయహారతి సమర్పిస్తున్నది

*(అక్టోబరు 17, 1990)*

# విఫలమైన మరొక ప్రయోగం

శ్రీ వి.పి. సింగ్ ప్రభుత్వం అయిదేళ్ళపాటు దేశాన్ని పాలించడానికి బయలు దేరింది. దేశ ప్రజలకు ఏవేవో ఉన్నతాదర్శాలను చూపించింది. కొన్ని ఆశలు రేకెత్తించింది. చివరకు ఏడాది కూడా పూర్తికాకుండా కుప్పకూలిపోయింది.

ఇది విచారకర పరిణామమే కాని, ఆశ్చర్యకర పరిణామం కాదు. మరొక విధంగా జరుగుతుందని ఆశించిన వారు ఎక్కువ మంది వుండరు.

ప్రారంభం కావడమే అది మైనారిటీ ప్రభుత్వంగా ప్రారంభమైంది. ఒకవైపు మితవాద, మతవాద పక్షమైన బి.జె.పి., మరొక వైపు వామపక్షాలు దాన్ని కొమ్ముకాశాయి. ఇది కొద్ది నెలల కంటె ఎక్కువ కాలం కొనసాగడానికి వీలులేని ప్రయోగం.

అంతేకాదు. అసలు జనతాదళ్ నిర్మాణంలోనే లోపాలున్నాయి. అది సహజసిద్ధంగా ఏర్పడిన ఒక పార్టీ కాదు. కొన్ని పార్టీల కలయికతో ఏర్పడింది. మొత్తం పార్టీని ఒక త్రాటిపై నడిపించగల ఒక నాయకుడంటూ దానికి లేడు. ఒకరంటే ఒకరికి పడని - ఎవరికి వారే అధినాయకుల మనుకునే - నాయకులతో కూడిన పార్టీ అది. అసలు ఇన్నాళ్లు అది ఒక పార్టీగా కొనసాగడమే వింత.

అందుచేత ఒకవైపు తనను బయటి నుంచి సమర్థించే పార్టీల నుంచి కలిగే ప్రమాదాన్ని, మరొకవైపు ఆంతరంగికంగా తన సభ్యుల నుంచే ఎదురయ్యే ప్రమాదాన్ని జనతాదళ్ , దాని ప్రభుత్వం ఏక కాలంలో ఎదుర్కోవలసి వచ్చింది. ఇంచుమించుగా, ప్రారంభమైన నాటి నుంచి దాని మనుగడ దిన దిన గండంగానే గడిచింది. ఎప్పటికప్పుడు తనను సమర్థించే పార్టీలతోను, అంతశ్శత్రువులతోను రాజీ పడుతూనే అది కొనసాగవలసి వచ్చింది.

అయితే ఏదో ఒకనాడు బయటి మద్దతు ఉపసంహరణతోనో, లేక లోపలి నుంచి మద్దతు ఉపసంహరణతోనో జనతాదళ్ (నేషనల్ ఫ్రంట్ అనేది కేవలం అతిశయోక్తి) ప్రభుత్వం పతనం కాక తప్పదనే ప్రజలు అనుకుంటూ వచ్చారు. చివరకు బి.జె.పి. మద్దతు ఉపసంహరణతో అది కూలిపోయింది.

బి.జె.పి., దాని రామజన్మభూమి వివాదం కేవలం నిమిత్తమాత్రం. బి.జె.పి. మద్దతు ఉపసంహరణ జరగకపోయినా, అంతర్వైరుధ్యాల కారణంగానైనా జనతాదళ్ ప్రభుత్వం పతనమై వుండేదే. అయిదేళ్లు కొనసాగే గీత దాని నుదుటి మీద లేనే లేదు.

ఇది నిజంగానే విచారకర పరిణామం. కారణం ఒకటే. దేశానికి స్వాతంత్ర్యం వచ్చినప్పటి నుంచి మధ్యలో మూడేళ్లు తప్ప మిగిలిన కాలమంతా కాంగ్రెస్ ఏకచ్ఛత్రాధిపత్యం నెరసింది. ఈ సుదీర్ఘ పరిపాలన, తనకు ఎదురులేదనే అహంభావం కాంగ్రెస్‌ను దాదాపు పూర్తిగా భ్రష్టం చేశాయి. అధికార వ్యామోహం, అవినీతి కాంగ్రెస్‌కు పర్యాయ పదాలైనాయి.

కాంగ్రెస్ కొన్ని విజయాలను సాధించినా, దేశానికి రాజకీయ సుస్థిరత ప్రసాదించినా, వాటిని మించిన లోపాలు, పొరపాట్ల వల్ల ప్రజలకు దానిపట్ల వైముఖ్యం కలిగిన మాట కూడా నిజం. అందుచేత కాంగ్రెస్‌కు జాతీయ ప్రత్యామ్నాయం అవసరమైందన్న విషయంలో భిన్నాభిప్రాయాలకు తావులేదు. అటువంటి జాతీయ ప్రత్యామ్నాయం కోసం ఏళ్ల తరబడి అన్వేషణ సాగింది.

చివరికి 1977లో కాంగ్రెస్‌కు ప్రత్యామ్నాయంగా జనతా పార్టీ అధికారానికి వచ్చింది. అయితే అది వట్టి అతుకుల బొంత పార్టీ కావడంతో రెండున్నర ఏళ్లయినా కాకుండా విచ్ఛిన్నమైంది. ఆ తర్వాత మరొకసారి జాతీయ ప్రత్యామ్నాయం కోసం వేట ప్రారంభమైంది. ఏళ్ల తరబడి సాగింది. చివరికి 1989లో అది సఫలమైనట్టు కనిపించింది. కాని, 1979 నాటి చేదు జ్ఞాపకాల వల్ల కావచ్చు. ప్రజలు కాంగ్రెస్‌ను గద్దె దించి వేసినా, దాని స్థానాన్ని జనతా దళ్‌కు పూర్తిగా అప్పగించలేకపోయారు. దానితో పదకొండేళ్లలో ఈ రెండవ ప్రయోగం కూడా విఫలమైంది.

ప్రజాస్వామ్య సాఫల్యానికి రెండు, లేదా మూడు జాతీయ ప్రత్యామ్నాయాలు వుండి తీరాలి. అధికారాన్ని దీర్ఘకాలం పాటు ఒకే పార్టీకి అప్పగించడం ప్రజాస్వామ్యం నీరసించి నీరు కారిపోవడానికే దారితీస్తుంది. "... సంభవామి యుగే యుగే" అన్నట్టు ఒక పార్టీ పరిపాలన పట్ల, పరిపాలనా శైలి పట్ల ప్రజలకు విసుగు, వైముఖ్యం కలిగినప్పుడల్లా - ప్రజాస్వామ్యం బుజం మార్చుకోవడానికి వీలుండాలి.

కనుకనే పదకొండేళ్లలో జాతీయ ప్రత్యామ్నాయానికి జరిగిన రెండవ ప్రయోగం కూడా విఫలం కావడం విచారం కలిగిస్తుంది. కాని, దీనికి ఏ ఒక్కరిని నిందించి ప్రయోజనం లేదు. ఆ ప్రయోగం జరిగిన తీరులోనే, దాని స్వభావంలోనే, ప్రజలు దానికి రూపకల్పన చేసిన తీరులోనే ఆ లోపం వుంది. అది విజయం కావడానికి వీలులేని ప్రయోగం.

శ్రీ వి.పి. సింగ్ పదకొండు నెలల ప్రభుత్వం సాధించిన విజయాలంటూ పెద్దగా లేవు. ఎన్నిసార్లు చెప్పినా 'ప్రసార భారతి' ఒకటే కనిపిస్తుంది. అది కూడా చిత్తశుద్ధి లేకుండా అరకొరగా చేసిన సంస్కరణ. పది వేల రూపాయిలలోపు ఋణాల మాఫీ కేవలం 'పాప్యులిస్టు' పథకం. అది పేద రైతులకు మెసులుబాటే కాని, అది ఓట్ల కోసం వేసిన ఒక ఎర. అటువంటిదే మండల్ కమిషన్ సిఫారసుల అసులు. వెనుకబడిన తరగతుల సముద్ధరణ నిస్సందేహంగా గొప్ప ఆశయం. దాన్ని అమలు జరపదలచిన తీరే దేశంలో కులాల మధ్య చిచ్చు పెట్టింది.

ఇక శ్రీ వి.పి. సింగ్ గొప్పగా చెప్పుకుంటున్న సెక్యులరిజమ్ పరిరక్షణ వున్నది. ఈ మహదాశయాన్ని తానొక్కడే గుత్తకు పుచ్చుకున్నట్టు, తనను వ్యతిరేకించిన వారందరు సెక్యులరిజమ్ వ్యతిరేకులైనట్టు ఆయన చెప్పుకోవడం పూర్తిగా అభ్యంతరకరం. కేంద్రంలో శ్రీ వి.పి. సింగ్ స్థానంలో ఎవరు ప్రధానిగా వున్నా అయోధ్యలో బాబ్రీ మసీదును కూలగొట్టడానికి అనుమతిని నిరాకరించే వారేననడంలో సందేహం లేదు. బి.జె.పి. కేవలం రాజకీయ లబ్ధి కోసం

ఈ వివాదాన్ని రేకెత్తించింది తప్ప తానే కేంద్రంలో వుంటే బాబ్రీ మసీదును పడగొట్టి దేశాన్ని అల్లకల్లోలం చేయడానికి సాహసించేదా అని అనుమానం.

పోతే, శ్రీ వి.పి.సింగ్ ప్రభుత్వ వైఫల్యాలలో ముఖ్యంగా ఎన్నదగినవి పంజాబు, కాశ్మీర్, అస్సాం, ధరల పెరుగుదల వంటి సమస్యలు. ఇవి శ్రీ సింగ్ ప్రభుత్వానికి వారసత్వంగా వచ్చిన మాట నిజమే కాని, ఆయన పదకొండు నెలల పరిపాలనా కాలంలో అవి పెనుభూతాలుగా తయారైనవనడంలో సందేహం లేదు. ఈ సమస్యల విషయంలో జనతాదళ్ ప్రభుత్వానికి ఒక స్పష్టమైన, నిర్దిష్టమైన విధానమే లేదు. అంతకు ముందు ప్రభుత్వం కంటె సమర్థమైన ప్రభుత్వాన్ని అందజేయగలమనే ఆశ రేకెత్తించి అధికారానికి వచ్చింది. కనుకనే జనతాదళ్‌ను నిర్దిష్ట విధానాల లోపానికి తప్పు పట్టవలసి వస్తున్నది.

ఏమైనా, జనతా దళ్ ప్రభుత్వ పతనం దేశ రాజకీయ సుస్థిరతను చాలా పెద్ద దెబ్బ కొట్టింది. దాని స్థానంలో ఏ ప్రభుత్వం వచ్చినా కొద్ది నెలల మాటే. బి.జె.పి. కోరుతున్నట్టు వెంటనే ఎన్నికలు జరిపితే ఆ పార్టీకి మరికాస్త లాభించవచ్చు కాని, ఫలితాలు ఇప్పటి వాటి కంటె పెద్దగా భిన్నంగా వుంటాయని ఆశించలేము. ఇప్పటి అస్థిరత్వాన్నే తిరిగి తెచ్చిపెట్టుకున్నట్టు అవుతుంది కనుకనే మరికొంత కాలం పాటు ఏదో విధమైన తాత్కాలిక ప్రత్యామ్నాయ ప్రభుత్వంతో సరిపెట్టుకోవలసి వుంటుంది. ప్రజల అభిప్రాయాలు, వారి తీర్పు ఒక విస్పష్టమైన రూపం ధరించడానికి మరి కొంత వ్యవధి అవసరం.

*(నవంబర్ 9, 1990)*

# హింసా రిరంస

మతం భక్తుడికి, భగవంతుడికి మధ్య అనుబంధానికి సంబంధించిన పదం. ఆ పదాన్ని ఉచ్చరిస్తే ఒక పవిత్రత స్ఫురించాలి. ఒక గౌరవభావం కలగాలి.

కాని, ఇప్పుడో? కడచిన మూడు నాలుగు రోజులుగా ఏ తెలుగు పత్రిక తిరగేయండి. మత పిశాచి, మత రక్కసి, మతోన్మాదం... ఇంకా ఇటువంటివే మాటలు.

మతం ఒక పిశాచిగా, ఒక రక్కసిగా, ఒక ఉన్మాదంగా మారిపోయింది. ఆ మాట నెత్తురు పులుముకున్నది. విద్వేషవిషం కక్కుతున్నది. ఆ మాట వింటేనే జుగుప్స కలిగేటంతగా వికృతార్థం సంతరించుకుంటున్నది.

ఇప్పుడు రాష్ట్ర రాజధాని హైదరాబాదులో మతపిశాచి వికటతాండవం వేస్తున్నది. మనస్సులను భక్తిభావంతో, వినమ్రభావంతో, సర్వమానవ సహోదరత్వ భావంతో నింపవలసిన మతం మానవుల మధ్య విద్వేషపు విచ్చు రగిలిస్తున్నది. ఒక మహోన్మాదం వలె ఆవహిస్తున్నది. ఆ ఉన్మాదం ప్రజలను భయ ప్రకంపితులను చేస్తున్నది.

ఒకప్పుడు హైదరాబాదు భిన్నమత సహజీవనానికి, సామరస్యానికి నిలయం. పది పన్నెండేళ్ల నుంచి అది ఉత్తర భారత నగరాలవలె మతకలహాలకు, మత మౌఢ్యానికి నెలవైంది.

మధ్యలో కొన్నేళ్లు మతకలహాల జోరు తగ్గినట్టే తగ్గి ఇప్పుడు తిరిగి ప్రారంభమైంది. సుమారు రెండు నెలలనాడు ఒక సాధారణ సంఘటనతో మతహింస ప్రారంభమైంది. ఇంతలో అయోధ్య సంఘటనల ప్రభావం ఇక్కడ కూడా పడింది. ఎడతెగని హింసాకాండ కారణంగా ఇక్కడ కూడా రోజులతరబడి రెండు వారాలపాటు కర్ఫ్యూ విధించవలసి వచ్చింది.

అయితే అదంతా ఒకెత్తు. ఇప్పుడు కడచిన మూడు నాలుగు, లేదా నాలుగైదు రోజులుగా హైదరాబాదు నగరం పాతబస్తీలో జరుగుతున్న మతహింస మరొక ఎత్తు. క్రితంసారివలె ఈసారి అయోధ్య వివాదపు సాకు కూడా లేదు. అయోధ్యలో ఈ నెల 6వ తేదీన కార్ సేవ సత్యాగ్రహం సందర్భంగా వందలాది అరెస్టులు జరిగినా మొత్తం మీద ప్రశాంతంగా గడచిపోయింది. అంతేకాదు. ఉభయ మతవర్గాల మధ్య ఒకింత అవగాహన సూచనలు కూడా కనిపించాయి.

అయినా, దురదృష్టవశాత్తు ఆ అవగాహన పవనాలు హైదరాబాదులో మాత్రం వీచలేదు. వీచక పోగా మరింత దారుణ హింసారిరంస విల ఃతాండవం చేసింది. బహుశా ఇటీవలి హైదరాబాదు నగర చరిత్రలో ఈ హింసా సంఘటనల సంఖ్య, స్థాయి, తీవ్రత అపూర్వం. నగరపౌరులు ఇంత ఘోరకలిని ఎన్నడూ చవిచూసి వుండరు.

అది మానవత్వం మంటగలసిన వేళ. దానవత్వం మింటికెగసిన వేళ. ఒక్క రోజులోనే మూడు లేదా నాలుగుపదుల సంఖ్యలో హత్యలు జరిగినవేళ. దానికి కొన్ని రెట్లమంది నిర్దోషులు,

నిరపరాధులు క్షతగాత్రులైన వేళ. అధికారుల లెక్కనుబట్టే సోమవారం సాయంత్రానికి 88 మంది మతకలహాలకీలకు ఆహుతి అయిపోయారు. ఇక ప్రజలలో వ్యాపించిన పుకార్ల ప్రకారం మృతుల సంఖ్య దానికి కొన్ని రెట్లు.

సంఘ విద్రోహశక్తుల కత్తిపోట్లకు స్త్రీలు, పురుషులు, వృద్ధులు, శిశువులు అనే భేదం లేదు. చేతికి ఎవరు అందితే వారు కరవాలాలకు ఎర అయ్యారు. పాలచారికలైనా ఆరని పసిడిబుగ్గల పసిపాపల నుంచి ఎనిమిది పదులు దాటిన వృద్ధుల వరకు ఎందరెందరో మత మారణహోమంలో శలభాలుగా మాడి మసి అయ్యారు.

పాతబస్తీలో వాడవాడలా, వీధి వీధినా హృదయ విదారకమైన విషాద గాథలు! పిల్లలను కోల్పోయిన తల్లిదండ్రులు, తల్లిదండ్రులను కోల్పోయిన పిల్లలు, కాళ్ళు తెగిన, చేతులు విరిగిన, తలలు వేరైన అభాగ్యులు, వారి నెత్తుటి కథలు! పాతబస్తీని ఏదో ఉన్మాదం, ఏదో అమానుషత్వం ఆవహించింది.

రాష్ట్ర ప్రభుత్వం నిస్సహాయమైపోయింది. అంతా సవ్యంగా వున్నప్పుడు వీరాలాపాలు పలకడం కాదు. తమ ఘనతను, దక్షతను దండోరా వేసి చాటుకొనడం కాదు. సన్మానాలపై సన్మానాలు చేయించుకోవడం, ఊరేగడం కాదు. ఒక ఉపద్రవం ఉప్పెనవలె ముంచుకు వచ్చినప్పుడే ప్రభుత్వపు సత్తా బయట పడేది.

ఇప్పుడు అధికారంలో వున్న ప్రభుత్వం అనేక రంగాలలో అసమర్థమైపోయింది. కాగా, శాంతి భద్రతల రంగంలో మరింతగా విఫలమైంది. రాజధాని నగరంలో తన కళ్ళ ఎదుట జరిగిపోతున్న ఘోర హింసాకాండను అరికట్టడంలో అశక్తమైపోయింది. ఈ పరిస్థితి పట్ల నిరసనగా ఒక మంత్రి రాజీనామా చేశాడు. మరి ఇరువురో, ముగ్గురో రాజీనామా చేస్తామంటున్నారట. రాష్ట్రపతి పాలన విధించాలని కొన్ని ప్రతిపక్షాలు కోరుతున్నాయి. ఏమి కానున్నదో తెలియదు.

నెలరోజులైనా కాకుండా తిరిగి ఒక భయానక పరిస్థితి నెలకొన్నది. ఆదివారం నుంచి కర్ఫ్యూ ప్రాంతాలను సైన్యం రక్షణలో వుంచారు. కనిపిస్తే కాల్చివేత ఉత్తర్వులు జారిచేశారు. తీవ్ర పరిస్థితి ఏర్పడినప్పుడు తీవ్ర చికిత్స అవసరం. సైన్యం రాకతో, సైన్యం పహరాతో పరిస్థితి త్వరత్వరగా మెరుగుపడుతుందని, ప్రశాంతి నెలకొంటుందని ఆశించాలి. సైన్యం అవసరం, సాధారణ జీవితాన్ని స్తంభీభూతం చేస్తున్న కర్ఫ్యూ అవసరం సాధ్యమైనంత శీఘ్రంగా తీరిపోగలవని ఆశించాలి. ప్రజల జీవితాలతో చెలగాటం ఆడిన సంఘ విద్రోహశక్తుల ఆటకట్టగలదని, హైదరాబాదు నగర గగనంపై శాంతి సామరస్యాల కాంతిరేఖలు కనిపించగలవని ఆశిస్తున్నాము.

*(డిసెంబరు 11, 1990)*

# ప్రపంచాన్ని కుదిపేస్తున్న పరిణామాలు

రష్యాలో 1917 నాటి బోల్షివిక్ విప్లవాన్ని స్వయంగా దగ్గరుండి దర్శించి ఆ మహత్తర సంఘటనలను అమితాసక్తికరంగా పూసగ్రుచ్చినట్టు ఒక నవలలో వలె వర్ణిస్తూ "టెన్ డేస్ దట్ షుక్ ది వరల్డ్" (ప్రపంచాన్ని కుదిపేసిన పది రోజులు) అనే పుస్తకం వ్రాసి పిన్న వయస్సులోనే మరణించిన అమెరికన్ రచయిత, లెనిన్ స్నేహితుడు జాన్ రీడ్ ఈనాడు తిరిగి బ్రతికి వస్తే...?

ఈసారి "టెన్ డేస్ దట్ ఎగైన్ షుక్ ది వరల్డ్" (ప్రపంచాన్ని మరొకసారి కుదిపేసిన పది రోజులు) అని మరొక గ్రంథం వ్రాస్తాడా? జాన్ రీడ్ తీవ్ర వామపక్షాభిమాని. కనుక అతడు ఏ దృష్టితో ప్రస్తుత సంఘటనలను విశ్లేషిస్తాడో తెలియదు గాని, మొత్తంపై అంతటి ప్రతిభాశాలియైన రచయిత వ్రాయదగిన నాటకీయ సంఘటనలే సోవియెట్ యూనియన్‌లో కడచిన వారం రోజులలో జరిగాయి, ఇంకా జరుగుతున్నాయి.

వీటిని గురించి ఒకటే వ్యాఖ్యానించదగింది - అవి అనూహ్యం, విస్మయకరం, విభ్రాంతికరం. ఆరేళ్ల క్రిందట 'ప్రీ గోర్బచేవియన్' రోజులలోనేకాదు, ఏడాది క్రిందట, ఆరునెలల క్రిందట కూడా ఇప్పుడు మాస్కోలో జరుగుతున్న సంఘటనలను ఎవరూ ఊహించి వుండరు. అంతటి ఆకస్మికం, ఆశ్చర్యకరం అయినవి ఆ సంఘటనలు.

మొదటిసారి 74 ఏళ్ల క్రిందట ప్రపంచాన్ని కుదిపేసిన ఆ పది రోజులలో రష్యాలో కమ్యూనిస్టు రాజ్యం ఏర్పడింది. ఇప్పుడు కడచిన వారం రోజులకు పైగా సోవియెట్ యూనియన్‌లో జరుగుతున్న సంఘటనల ఫలితంగా కమ్యూనిజం భూస్థాపితమైంది, లేదా అవుతున్నది.

కమ్యూనిజానికి కాలం చెల్లిందా, ఇంకా కొన ఊపిరితో వున్నదా అన్నది ఇప్పుడు అకడమిక్ చర్చ మాత్రమే. ప్రపంచ రంగస్థలంపై ఎన్ని నాగరికతలు, ఎన్ని మహా సామ్రాజ్యాలు, ఎన్ని రాజకీయ, ఆర్థిక వ్యవస్థలు అవతరించలేదు, అంతరించలేదు? కమ్యూనిజం కూడా ఈ శతాబ్దపు ప్రపంచ రాజకీయ చరిత్రలో ఒక మహత్తర, చారిత్రిక పాత్ర నిర్వహించింది. ఇప్పుడు క్రమంగా కనుమరుగవుతున్నది.

ఇంకా అది స్టాలిన్ నాటి అసలు సిసలు రూపంలో తిరిగి భూమిపై అవతరిస్తుందని కలలు కంటున్న వారిని చూసి జాలి పడవలసిందే తప్ప చేయగలిగింది లేదు. మార్క్సిజం ప్రభావం ప్రపంచ రాజకీయాలపై, వివిధ దేశాల ఆర్థిక జీవనంపై అసలే వుండకుండా నశిస్తుందని కాదు. ఏ సిద్ధాంత ప్రభావం పూర్తిగా ఎన్నటికీ నశించదు. కమ్యూనిజం కూడా అంతే. కాని మార్క్సిస్టు పాఠ్య పుస్తక పండితులు చెప్పే ఛాందస రూపంలో మాత్రం అది తిరిగి వచ్చే అవకాశం లేదు. తిరిగి వస్తే గిస్తే పూర్తిగా రూపురేకలు మార్చుకుని వినూత్న రూపంలో రావలసిందే.

ప్రపంచపు కమ్యూనిజానికి పితృదేశమైన రష్యాలో ఇప్పుడు జరుగుతున్న పరిణామాలను

చూస్తే పైన పేర్కొన్న ఆలోచనలు ఏ మాత్రం నిష్పాక్షిక స్వతంత్రాలోచన చేయగలిగిన వారికైనా కలగకమానవు. డెబ్బదేళ్ల క్రిందట లెనిన్ మహాశయుడు రష్యాలో అధికారం కైవసం చేసుకుని కమ్యూనిస్టు నాయకత్వాన ఏకపక్ష నియంతృత్వం నెలకొల్పాడు. అతని తర్వాత స్టాలిన్ కమ్యూనిస్టు వ్యతిరేకులనే కాదు, కమ్యూనిస్టు పార్టీలోనే తన విధానాలనే కాక, తన మాటను కాదన్న వారిని సయితం అమిత అమానుష క్రౌర్యంతో హింసించి భౌతికంగా "లిక్విడేట్" చేశాడు. లక్షలాది పీనుగుల పెంటల మీద సోవియెట్ కమ్యూనిస్టు సౌధం నిర్మితమైంది. హిట్లర్ నాజీజం ఒక రకం నియంతృత్వమైతే, స్టాలిన్ కమ్యూనిస్టు నియంతృత్వం మరొక రకం.

నికితా క్రుశ్చెవ్ సోవియెట్ కమ్యూనిజాన్ని స్టాలినిస్టు పంథా నుంచి తప్పించడానికి తొలి ప్రయత్నం చేశాడు. కొంత వరకు సఫలుడయ్యాడు. కాని, అతనివి అరకొర సంస్కరణలు కావడం, పరిస్థితులు సంస్కరణలకు పరిపక్వంగా లేకపోవడంతో అతడు త్వరలోనే తెరమరుగయ్యాడు. బ్రెజ్నెవ్ కాలంలో స్టాలిన్ నాటి కారుచీకటి కాదు గాని, మసక చీకటి మాత్రం తిరిగి నెలకొన్నది.

ఏకపక్ష, ఏక వ్యక్తి నియంతృత్వాల క్రింద దేశం ఎంతగా నిస్తేజం, నిర్వీర్యం, నిస్తబ్దం అయిందో గ్రహించి గోర్బచేవ్ పునర్వ్యవస్థీకరణ కృషి మొదలు పెట్టాడు. ఆయన ప్రయత్నాల ఫలితమే గ్లాస్‌నోస్త్, పెరిస్త్రోయికా.

ఆ ప్రయత్నాల ఫలితమే సోవియెట్ సమాజంలో ప్రతి చిన్న, పెద్ద విషయాన్ని కబంధ హస్తాల కర్కశ పరిష్వంగంలో ఇరికించుకున్న కమ్యూనిస్టు పార్టీ పెత్తనం, పలుకుబడి క్రమంగా తగ్గిపోవడం, సోవియెట్ పార్లమెంట్‌కు నాన్ కమ్యూనిస్టు అభ్యర్థులు కూడా పోటీ చేసే అవకాశం కలగడం, పార్టీని, ప్రభుత్వాధికారాల్ని విడదీయడం, బహిరంగ చర్చకు విమర్శకు అవకాశాలు కలగడం మొదలైనవి.

గోర్బచేవ్ ప్రారంభించిన సంస్కరణలు అనుకున్న వ్యవధిలో అనుకున్న ఫలితాలు ఇవ్వకపోవడంతో ఆర్థిక వ్యవస్థ అడుగంటడం జరిగింది. స్వదేశంలో పెక్కు రిపబ్లిక్‌లు యూనియన్ నుంచి విడిపోగోరడం, రష్యన్ రిపబ్లిక్ అధ్యక్ష పదవికి ప్రజలు నేరుగా ఎన్నుకోవడం, ప్రయివేట్ రంగానికి అవకాశం క్రమంగా ఎక్కువ కావడం, సోవియెట్ సమాజం పాశ్చాత్య తరహా ప్రజాస్వామ్యం వైపు నెమ్మదిగా పురోగమించడం, అంతర్జాతీయంగా అణ్వస్త్రాల తగ్గింపు ఒప్పందాలు జరిగి తృతీయ ప్రపంచ యుద్ధ ప్రమాదం దూరం కావడం, ప్రచ్ఛన్న యుద్ధం అంతం కావడం వంటి విశేషాలు ఎన్నో జరిగాయి.

మరొక ముఖ్య పరిణామం తూర్పు యూరప్‌లో సోవియెట్ సేనలు నిలబెట్టి వుంచిన కమ్యూనిస్టు రాజ్యాలు పేక మేడల వలె ఒక్క స్వాతంత్ర్య వీచిక తాకిడికి కుప్పకూలిపోవడం. అయితే అప్పటిలో ఆ రాజ్యాలలో కమ్యూనిస్టు వ్యవస్థ పట్ల ప్రజాదరణ లేదని, స్టాలిన్ బలవంతంగా ఆ వ్యవస్థను వాటిపై రుద్దాడని, కనుకనే, అవి పరిస్థితులు మారగానే పతనమైనాయని పలువురు సరిపెట్టుకోవడం జరిగింది.

కాని, ఇప్పుడు సాక్షాత్తు సోవియెట్ యూనియన్‌లో జరుగుతున్నదేమిటి? ఇప్పటి వరకు జరిగిన పరిణామాలే విభ్రాంతికరం కాగా, కడచిన వారం పది రోజులుగా జరుగుతున్నవి మరెంతో దిగ్భ్రాంతికరం. గోర్బచేవ్ తలుపులు తెరవగా రయ్యిన దేశంలోకి దూసుకువచ్చిన ప్రజాస్వామ్య పవనాలు ఎంత బలమైనవో రెండు రోజులపాటు జరిగిన కమ్యూనిస్టు పార్టీ ప్రముఖుల తిరుగుబాటు వైఫల్యంతో వెల్లడైంది. కడచిన ఆరేళ్లుగా వచ్చిన మార్పు ఇంతింత మాత్రానిది కాదని, ప్రజలు తమకు లభించిన ప్రజాస్వామ్యాన్ని ఎన్నటికీ వదలుకునే పరిస్థితిలో లేరని ప్రపంచానికి విదితమైంది.

1917లో రష్యాలో జరిగింది మొదటి విప్లవమైతే ఇప్పుడు జరుగుతున్నది రెండవ విప్లవం. రోజు రోజుకు జరుగుతున్న పరిణామాలు ప్రపంచాన్ని సంభ్రమాశ్చర్యాలలో ముంచెత్తుతున్నాయి. ఉదాహరణకు లెనిన్ చేతులలో పుట్టి పెరిగిన సోవియెట్ కమ్యూనిస్టు పార్టీయే ఏకంగా రద్దు అయిపోయింది. ప్రపంచంలో మొట్టమొదటి కమ్యూనిస్టు దేశంలోనే కమ్యూనిస్టు పార్టీ అంతిమ శ్వాస విడుస్తున్నది. ప్రెసిడెంట్ గోర్బచేవ్ పార్టీ ప్రధాన కార్యదర్శి పదవికి రాజీనామా ఇచ్చి, దాని కేంద్ర సమితిని రద్దు చేశాడు. రష్యన్ రిపబ్లిక్‌లో అధ్యక్షుడు యెల్ట్సిన్ ఆ పార్టీని నిషేధించాడు. స్వాతంత్ర్యం ప్రకటించుకుంటున్న రిపబ్లిక్‌ల జాబితాలో ఉక్రేన్, బైలో రష్యాలు కూడా చేరాయి. బాల్టిక్ రిపబ్లిక్‌ల స్వాతంత్ర్యానికి యెల్ట్సిన్ గుర్తింపు ఇచ్చాడు. మరి కొన్నిటిని కూడా గుర్తించబోతున్నాడు.

యెల్ట్సిన్ ఒక రిపబ్లిక్ అధ్యక్షుడు మాత్రమే. మరి దేశంలోని ఇతర రిపబ్లిక్‌ల స్వాతంత్ర్యాన్ని గుర్తించడానికి అతనికి ఏమి అధికారం వున్నదో తెలియదు. దీని అర్థం గోర్బచేవ్ ఇప్పుడు నామమాత్రపు ప్రెసిడెంట్ అని, అతడిని పార్టీ తిరుగుబాటుదార్ల నుంచి కాపాడిన యెల్ట్సిన్‌దే ఇప్పుడు పెత్తనమని అనుకోవలసి వస్తున్నది. క్రమంగా అతనిదే పై చేయి అవుతుందేమో చూడాలి. ఇటీవలి తిరుగుబాటుకు గోర్బచేవ్ తప్పులే కారణమని యెల్ట్సిన్ నిందించడాన్ని బట్టి ఈ ఊహ బలపడుతున్నది. ఏమైనా సోవియెట్ దేశంలో ఇప్పటి క్షణక్షణ పరిణామాలు ప్రపంచాన్ని దిగ్భ్రాంతిలో ముంచెత్తుతున్నాయి.

*(ఆగస్టు 27, 1991)*

# "హింసన చణ ధ్వంస రచన"

రాష్ట్రంలో నక్సలైట్ తీవ్రవాదులు పెద్ద ఎత్తున విధ్వంసానికి, లేదా హత్యలకు, హింసకు కిడ్నాపులకు పూనుకున్నప్పుడు తెలుగు పత్రికలకు ఇదొక ఆనవాయితీ అయిపోయింది. ఈ బీభత్సవాదం వల్ల మీరు సాధించబోయేదేమిటి? ఎందుకీ హింసా చణత్వం? ఎందుకీ ధ్వంస రచన? దీనివల్ల ప్రయోజనం ఏమిటి? దీనితో మీరు ఆశించే విప్లవం వస్తుందా? మీరు కోరే భూతల స్వర్గం, సమ సమాజం, వర్గ రహిత సమాజం, న్యాయబద్ధ సమాజం, ఆదర్శ సమాజం వస్తుందా? - అని వేసిన ప్రశ్నలే వేయడం. తీవ్రవాదులు ఆ ప్రశ్నలను పెడచెవిని బెట్టి యథాప్రకారంగా విధ్వంసకాండకు దిగడం, పత్రికలు తిరిగి అమితావేదనతో విజ్ఞప్తి చేయడం, ఆ పిదప యథాప్రకారంగా తిరిగి ధ్వంసనచణ హింస రచన....

ఇదీ నేడు ఆంధ్ర ప్రదేశ్‌లో జరుగుతున్న ఒక తంతు. పత్రికలు ప్రజాభిప్రాయాన్ని ప్రతిబింబించాలని అందరూ హితోక్తులు పలికేవారే. ప్రజాభిప్రాయం ఏకముఖంగా వుండదు. బహుముఖంగా వుంటుంది. పత్రికలు యథాశక్తిగా, తమ పరిమితులలో, ప్రజాభిప్రాయాన్ని - నక్సలైట్ తీవ్రవాదులతో సహా వివిధ వర్గాల అభిప్రాయ నానాత్వాన్ని - ప్రతిబింబిస్తూనే వున్నాయి. పత్రికలు ప్రజాభిప్రాయాన్ని మలచాలంటారు. పత్రికలలో సయితం అభిప్రాయ సామ్యం వుండదు. దేని రాజకీయ, తదితర విశ్వాసాలు దానివి. అయినా, ప్రశాంత, నాగరిక జీవితాన్ని అసంభవం చేసే కుల, మత, వర్గ, భాషా, తదితర సంబంధమైన విభేదాలను పురస్కరించుకొని చెలరేగే వైషమ్యాలు తలెత్తిన ప్రతిసారి, వాటి వల్ల శాంతి భద్రతలు భగ్నమై, భగ్నమైన ప్రతిసారి సంయమనాన్ని, సహజీవన తత్వాన్ని, రాజ్యాంగ శాసన పురస్సరంగా విభేదాలను పరిష్కరించుకోవలసిన అవసరాన్ని పత్రికలు యథావిధిగా ప్రబోధిస్తున్నాయి. నాగరిక, ప్రజాస్వామిక పద్ధతిలో, అభిప్రాయ భేదాలను పరిష్కరించు కోవలసిన అవసరాన్ని ఘోషిస్తూనే వున్నాయి.

పత్రికలకు ప్రజాభిప్రాయాన్ని ప్రభావితం చేసే శక్తి వున్నదని అంటారు. ఇది ఎంతవరకు నిజం అన్న ప్రశ్న తరుచుగా ఉత్పన్నమవుతూ వుంటుంది. అంతటి శక్తే వుంటే మన సమాజంలో ఇంతకంటె ఏ కొంచెమో ఎక్కువ క్రమ శిక్షణ, క్రమ వర్తన, కర్తవ్య పాలన స్ఫురణ ప్రస్ఫుటమయ్యేవేమో ననిపిస్తుంది. అది పత్రికల వైఫల్యాన్ని సూచిస్తున్నదా అని అనుమానం కూడా కలుగుతుంది. అయినా, వైఫల్యానికి వెరచి వెనుకాడడం వల్ల అసలే ప్రయోజనం లేదు కనుక, పత్రికలు తమ విధ్యుక్త కర్తవ్యాన్ని నిర్వర్తించక తప్పదు. చర్విత చర్వణమైనా, నిష్ఫలమైనా, విఫలమైనా, మరల మరల కర్తవ్య ప్రస్తావన చేయక తప్పదు.

నేడు ఈ వాక్యాలు మేము వ్రాయడానికి కారణం రాష్ట్రంలో ఇంచుమించు అనుదినం

జరుగుతున్న రాజకీయ హింసాకాండ, సిద్ధాంతపరమైన హత్యాకాండ, విధ్వంస కాండ. మరీ ముఖ్యంగా కడచిన రెండు వారాలకు పైగా తీవ్రవాదులకు, భద్రతా దళాలకు మధ్య జరుగుతున్న పరస్పరాహరణోద్యోగం. తీవ్రవాదులను మట్టుపెట్టాలని సరిహద్దు భద్రతా దళాల రంగ ప్రవేశంతో జరుగుతున్న ప్రయత్నం ఒక వైపు. మరొక వైపు ఎందుకు, ఏ అంతిమ లక్ష్యాన్ని ఉద్దేశించి చేస్తున్నారో తెలియకుండా, వర్గ శత్రువులుగా తాము భావించిన వారిని అక్కడొకరిని, ఇక్కడొకరిని హత్య చేస్తూ, వందలాది నిరపరాధులు ప్రయాణం చేసే రైళ్ళను, రైలు మార్గాలను ప్రేల్చి వేయడానికి ప్రయత్నిస్తూ, లక్షల ఖరీదు చేసే నిర్జీవ యంత్రాలైన బస్సులను ఎవరి మీదనో కసితో అకారణంగా దగ్ధం చేస్తూ, తమకు ఏ విధంగాను అడ్డురాని అమాయకులను కిడ్నాప్ చేస్తూ, చీటికి మాటికి బంద్‌లు చేస్తూ, తమ దౌర్జన్య వైఖరికి భయపడి బంద్ జరిగితే 'అంతా తమ ప్రయోజకత్వం, తా[illegible]మి కధినాథులమని' భ్రమిస్తూ, తుర్గెనీవ్ నవల "ఫాదర్స్ అండ్ సన్స్"లోని బజారోవ్‌ను తమ హీరోగా, అతడు ప్రవచించిన శుష్కమైన, నీతి బాహ్యమైన నిహిలిజమ్‌నే రివల్యూషనిజమ్‌గా పొరబడుతూ, నిజానికి వ్యక్తిగతమైన, ప్రయోజనరహితమైన టెర్రరిజంతో, తాము ఎటు వెడుతున్నారో, ఎందుకు వెడుతున్నారో, తమ వెంట ఎవరైనా వస్తున్నారో లేదో తమకే తెలియని, తెలుసుకోగోరని, అర్థంలేని ఆవేశంతో, సాధారణ సామాజిక జీవితాన్నే చిందర వందర చేయడమే, చేయగలగడమే తమ శక్తికి నిదర్శనంగా భావించే నక్సలైట్ తీవ్రవాదులు.

వేరొకవైపు ఈ ఇరువర్గాల నడుమ లేగదూడల వలె నలిగిపోతున్న అమాయక సామాన్య జనం. నిజానికి ఈ సామాన్య జన జీవితాన్ని కాలి బంతిగా చేసుకొని వారు ఆట ఆడుకుంటూ వినోదిస్తున్నట్టుగా నిష్పాక్షిక పరిశీలకులకు అనిపిస్తే పొరపాటు కాదు. ఇంతే కాకపోతే తీవ్రవాదులని, మిలిటెంట్లు అని అనబడే వర్గం వారు ఎందుకు ఇలా మండల కార్యాలయాలను, టెలిఫోన్ ఎక్స్‌ఛేంజీలను, రైల్వే స్టేషన్‌లను, ఇతర ప్రభుత్వ కార్యాలయాలను, బస్సులను, జీపులను ఇంకా ఏవి చేతికి దొరికితే వాటిని దగ్ధం చేయడం? ఒక బస్సు ఖరీదు దాదాపు నాలుగు లక్షలుంటుంది. ఒక ప్రభుత్వ కార్యాలయాన్ని నిర్మించడానికి ఏ పది లక్షలో అవుతుంది. మిగిలినవి కూడా అంతే. లక్షలతో, కోట్లతో పని. ఆయా ఆస్తిపాస్తులను దగ్ధం చేస్తున్న తీవ్రవాదులు అన్ని లక్షల రూపాయిల కరెన్సీ నోట్లను కుప్పగా పోస్తే, అవన్నీ తమకు శత్రువైన ప్రభుత్వం ముద్రించినవి కనుక వాటిపై పెట్రోలు పోసి తగలబెట్టగలరా? తగలబెట్టలేకపోతే, అట్టి ధనమే వెచ్చించి శ్రమజీవుల స్వేదంతో సిమెంటు తడిపి నిర్మిస్తున్న భవనాలు మొదలైన వాటిని ఎందుకు అగ్గి పుల్ల గీచి దహనం చేస్తున్నారు? మార్క్సు మహాశయుడు ప్రవచించిన ఏ గతి తార్కిక సూత్రం ఈ సిద్ధాంత నిబద్ధతా ధ్వంసన చణత్వానికి ఆధారం?

తుపాకి గొట్టంలో నుంచి అధికారం వస్తుందని నక్సలైట్లు నమ్ముతారు. నిజానికి ఆ గొట్టంలో నుంచి నెత్తురు వస్తుంది. కన్నీళ్లు వస్తాయి. ధ్వంసం వస్తుంది. అరాజకం వస్తుంది.

నిహిలిజం, సినిసిజం వస్తాయి. అధికారం కూడా వస్తుంది కాని, ప్రజలు స్వచ్ఛందంగా అప్పగించిన అధికారం కాదు. తుపాకి గొట్టంలో నుంచి వెలువడే పొగతో ప్రజలను ఉక్కిరి బిక్కిరి చేసి భయభ్రాంతులలో ముంచెత్తే నియంతృత్వాధికారం వస్తుంది. కొద్దిమంది చేతులలో కేంద్రీకృతమయ్యే అధికారం వస్తుంది. ఇదేమిటని ఎవరూ ప్రశ్నించడానికి వీలు లేని అధికారం వస్తుంది. "పవర్ కరప్ట్స్, అబ్సొల్యూట్ పవర్ కరప్ట్స్ అబ్సొల్యూట్లీ" అన్న విధంగా అదుపు లేక, పొదుపు లేక, దుర్వినియోగపడే అధికారం వస్తుంది. అటువంటి అధికారాన్నే ఆ మధ్య తూర్పు జర్మనీలో, రుమేనియాలో ప్రజలు వదిలించుకున్నది.

ఇవన్నీ ప్రజల పోరాటంలో భాగమని, బంద్‌ల వల్ల, కిడ్నాప్‌ల వల్ల, హత్యల వల్ల, హింస వల్ల, విధ్వంసం వల్ల ప్రజలు విప్లవానుకూలంగా 'ఎడ్యుకేట్' అవుతారని తీవ్రవాదుల భావం కావచ్చు. కాని, వారి భావానికి వ్యతిరేకమైన భావమే విస్తరిస్తున్నట్టు నానాటికీ స్పష్టమవుతున్నది.

సమాజంలో ప్రభుత్వ యంత్రాంగంలో, ముఖ్యంగా పోలీసు యంత్రాంగంలో అంతులేని అవినీతి వున్నది. దాన్ని ఎదిరించి తీరవలసిందే. ఎదిరించడానికి పీడిత దుఃఖిత జనానీకాన్ని సంఘటితం చేయవలసిందే. కాని దానికి పదే పదే పలుమార్లు మేము, ఇతరులు చెబుతున్నట్టు కిడ్నాపులు, వ్యక్తిగత హత్యలు, ప్రభుత్వపు ఆస్తులనే ముద్దు పేరుతో వ్యవహరించబడే సామాన్య ప్రజల శ్రమతో నిర్మితమైన ఆస్తుల విధ్వంసం మార్గం కాదు.

బహిరంగంగా ప్రజల మధ్య సంచరిస్తూ, వారిని విజ్ఞాన పరుస్తూ, తప్పనిసరి త్యాగాలు చేస్తూపోవడమే మార్గం. లక్ష్య సాధనకు త్యాగాలు ఎలాగూ తప్పవు. అయినప్పుడు వాటి వెనుక గల మహత్తరాదర్శాలను ప్రజలు ఒకరు చెప్పనక్కరలేకుండానే గ్రహించగలిగే విధంగా, బహిరంగ, శాంతియుత, ప్రజాస్వామిక 'రణ' క్షేత్రంలో త్యాగాలు చేయడమే యుక్తం కాదా? మంచి లక్ష్యాలను మంచి మార్గాలలోనే సాధించడం అవసరం కాదా?

ఇవే భావాలను వేరు మాటలలో ప్రస్ఫుటిస్తూ కడచిన దశాబ్దాలలో మేము ఎన్నిసార్లు ఎన్ని భిన్న సందర్భాలలో ఈ స్థలంలో, ఈ కాలమ్‌లో వ్రాసి వుంటామో లెక్కలేదు. అయినా, కడచిన కొన్ని రోజులుగా రాష్ట్రంలో వరుసగా సంభవిస్తున్న విషాద, భయానక సంఘటనలు రగిల్చిన ఆవేదన పెగల్చిన భావాలతో మేము ఈ వాక్యాలను మరొకసారి వ్రాయక తప్పడం లేదు. ఇవి కూడా వెనుకటి వాటి దారే పట్టినా మా ధర్మాన్ని మేము నెరవేర్చక తప్పదు.

*(డిసెంబరు 21, 1991)*

# దస్విదానియా!

ఆనాడు శనివారం, 1991 డిసెంబరు 21 వ తేదీ, మానవ చరిత్రలో 1917 నవంబరు 7వ తేదీకి ఎంత ప్రాముఖ్యం కలదో, అంత ప్రాముఖ్యం కల చరిత్రాత్మక దినం.

ఆనాడు ఒక మహా ప్రపంచం, మరో ప్రపంచం మరణించింది. ఎలా మరణించింది?

ఆంగ్ల మహాకవి టి.ఎస్. ఇలియట్ వేరొక సందర్భంలో ఇలా వాపోయాడు:

దిసీజ్ ది వే ది వరల్డ్ ఎండ్స్
దిసీజ్ ది వే ది వరల్డ్ ఎండ్స్
దిసీజ్ ది వే ది వరల్డ్ ఎండ్స్
నాట్ విత్ ఎ బ్యాంగ్ బట్ విత్ ఎ వింపర్"

సరిగా అదే విధంగా దిక్కులు పిక్కటిల్లే శబ్దం చేస్తూ కాదు ఆ ప్రపంచం చనిపోయింది. పేలని టపాకాయలా దాదాపు నిశ్శబ్దంగా మరణించింది. ఒక శకం శాశ్వతంగా కన్ను మూసింది.

ఒక స్వర్గం కూలిపోయింది. ఒక స్వప్నం కాలిపోయింది. ఒక ఆకాశం ముక్కలుగా చీలిపోయింది. ఒక నక్షత్రం రాలిపోయింది.

పర్జన్య శంఖం గర్జించనే లేదు. వస్తానని కబురు పంపిన ఒక నూతన నాగరికత ఏదో కీకారణ్యంలో దారి తప్పి పోయింది. ఒక అద్భుత వాగ్దానం నిరాశా విషాద గానంగా మారిపోయింది. రిక్కల వరకు ఎగరబోయిన ఒక క్రౌంచపక్షి రెక్కలు తెగి గిలగిల కొట్టుకుంటూ చనిపోయింది. ఆశల ఇంద్ర ధనుస్సు పొగమంచులా విచ్చిపోయి శూన్యం మిగిలింది.

మానవ చరిత్ర మరొకసారి మరొక కన్నీటి బొట్టు రాల్చింది. రామరాజ్యం నుంచి, ప్లేటో రిపబ్లిక్ నుంచి, థామస్ మోర్ యుటోపియా నుంచి, రాబర్ట్ ఓవెన్ ఆదర్శ సమాజం నుంచి, రూసో, వోల్టేర్, షెల్లీ వరకు ఎందరెందరో స్వాప్నికులు, భావుకులు కన్న కలల భస్మరాశిలో సరికొత్తగా మరొక చితాభస్మం చేరింది. తుర్గెనీవ్ తన 'వర్జిన్ సాయిల్' నవలలో పేర్కొన్న 'వీల్స్ ఆఫ్ జగ్గర్‌నాట్', శ్రీశ్రీ 'జగన్నాథ రథ చక్రాల్' భూమార్గం పట్టకుండా మధ్యలోనే ఆగిపోయాయి.

ఏడు దశాబ్దాల నాటి ఒక జెండా అవనతమైంది. ఒక జోస్యం క్రూర హాస్యంగా మారిపోయింది. శాస్త్రీయ, చారిత్రిక భౌతిక వాదం ఎక్కడో లెక్క తప్పింది. ఒక థీసిస్ యాంటీ థీసిస్ వద్దనే నిలిచిపోయింది. ఒక మృగతృష్ణ దప్పిక తీర్చకుండానే ఎడారి దారిలో మాయమైంది.

మానవుడు మిగిలాడు. అతడి ఆశలు మిగిలాయి, భయాలు రగిలాయి. అయితే చరిత్ర ఎవరి కోసం ఆగదు. అది మాత్రం ముందుకే సాగిపోతున్నది.

ఆనాడు శనివారం, 1991 డిసెంబరు 21 వతేదీ. సోవియెట్ యూనియన్ ఆఖరి శ్వాస విడిచింది. నిరుడు కురిసిన హిమ సమూహాల వలె కరిగిపోయింది.

ఈ విషాద పరిణామం తప్పదని ఇటీవల కొన్నాళ్ళుగా స్పష్టపడుతూనే వున్నది. మొదట మూడు బాల్టిక్ రిపబ్లిక్‌లు స్వాతంత్ర్యం ప్రకటించుకున్నాయి. అవి అయిదు దశాబ్దాలనాడు దురాక్రమణ ఫలితంగా విలీనమైనవి కనుక ఆ పరిణామం సహజమే.

అయితే తక్కిన రిపబ్లిక్‌లు కూడా అంతే. అన్నీ జార్ చక్రవర్తుల దండయాత్రల ఫలితంగానో, సోవియెట్ 'కైజార్' చక్రవర్తుల జబర్దస్తీ ఫలితంగానో వచ్చి చేరినవే. వాటిలోను స్వాతంత్ర్య పవన వీచికలు వీచడం ప్రారంభమైంది. క్రమంగా అన్నీ క్రెమ్లిన్ కేంద్రాధికారం నుంచి విడిపోవడానికే నిశ్చయించుకున్నాయి.

కడచిన ఆగస్టు కుట్ర నుంచి గోర్బచేవ్‌ను, ఆయన సంస్కరణల ఉద్యమాన్ని రక్షించడంలో ప్రముఖ పాత్ర వహించిన రష్యా అధ్యక్షుడు బోరిస్ ఎల్ట్సిన్ తానే క్రెమ్లిన్‌గా వ్యవహరించడం మొదలు పెట్టాడు. గోర్బచేవ్ నిస్సహాయంగా, నామమాత్రపు ప్రెసిడెంట్‌గా మిగిలిపోయాడు.

ఏ విధంగానైనా యు.ఎస్.ఎస్.ఆర్.ను (యూనియన్ ఆఫ్ సోవియెట్ సోషలిస్ట్ రిపబ్లిక్స్ బదులు యూనియన్ ఆఫ్ సోవియెట్ సావరిన్ రిపబ్లిక్స్‌గానైనా) మిగల్చాలని, ఫెడరేషన్ కంటె పల్చనైన కాన్ ఫెడరేషన్‌గానైనా ఒక కొత్త యూనియన్‌ను ఏర్పాటు చేసి, కనీసపు, నామ మాత్రపు కేంద్రాధికారాలతో దాన్ని కొనసాగించాలని విశ్వ ప్రయత్నం చేశాడు. కాని, ఆయన ఆశలు అడియాసలైనాయి.

కొద్ది రోజుల నాడు రష్యా, ఉక్రేన్, బైలో రష్యా రిపబ్లిక్కులు స్వతంత్ర రాజ్యాల కామన్వెల్తుగా ఏర్పడడానికి నిశ్చయించుకున్నాయి. దానితో యు.ఎస్.ఎస్.ఆర్. సమాధికి ఆఖరి ఇటుకలలో మరొకటి వేసినట్టయింది. ఆ తర్వాత మరి ఎనిమిది రిపబ్లిక్‌లు కూడా కామన్వెల్త్‌లో చేరడానికి సిద్ధపడి ఒడంబడిక పత్రంపై సంతకాలు చేశాయి.

ఇక మిగిలింది జార్జియా. క్రెమ్లిన్ పెత్తనం నుంచి విడిపోగోరిన తొలి రిపబ్లిక్‌లలో అదొకటి. అయినా, అక్కడ స్వతంత్ర రాజ్యాల కామన్వెల్తులో చేరడమా, ఎటూ చేరకుండా వుండడమా అన్న అభిప్రాయ భేదాలు ఏర్పడి, అంతర్యుద్ధం ప్రారంభమైనట్టు తెలుస్తున్నది. బహుశా నేడో రేపో అది కూడా కామన్వెల్తులో చేరితే ఆశ్చర్యం లేదు.

అన్నిటిలోకి పెద్దదైన రష్యా తనకు భద్రతామండలిలో సోవియెట్ యూనియన్ స్థానంలో శాశ్వత సభ్యత్వాన్ని ఇవ్వాలని కోరుతున్నది. అంతేకాదు. సోవియెట్‌కు వ్యతిరేకంగా అమెరికా నాయకత్వాన ఏర్పడిన నాటో కూటంలో సభ్యత్వాన్ని కూడా రష్యా కోరుతున్నదట.

మాస్కో పార్టీ కార్యదర్శి పదవి నుంచి తనను తొలగించిన నాటి నుంచి ఎల్ట్సిన్ గోర్బచేవ్‌కు విరోధి. ఇప్పుడు అతడు పగ తీర్చుకుంటున్నాడు. గోర్బచేవ్‌కు నామమాత్రపు అధ్యక్ష పదవి మిగిల్చినప్పటికి సర్వసైన్యాధ్యక్ష పదవిని మాత్రం తొలగించి దాన్ని సోవియెట్ (మాజీ) రక్షణ మంత్రి షాపోష్నికోవ్‌కు అప్పగించాడు. ఇక గోర్బచేవ్ కూడా నేడో రేపో నామమాత్రపు ప్రెసిడెంట్ పదవికి గుడ్‌బై చెప్పడమే తరువాయి. అయితే, ఆయనను నేరస్థుడుగా పరిగణించి శిక్షించబోమని, గౌరవంగానే చూడగలమని ఎల్ట్సిన్ హామీ ఇస్తున్నాడు.

ఇంతే ఆశ్చర్యకరమైనది, బహుశా ఇంతకంటె విభ్రాంతికరమైనది - సోవియెట్ యూనియన్‌లో కమ్యూనిజానికి పట్టిన దుర్గతి. లెనిన్ తపస్సు, స్టాలిన్ సేద్యం జ్వలించి ఫలించిన సముజ్వలతేజంగా కవులు కీర్తించిన సోవియెట్ కమ్యూనిజం చూస్తుండగానే అంతర్ధానమై పోయింది. టోటాలిటేరియన్ నియంతృత్వం నుంచి దాన్ని మళ్ళించాలని, ఒకనాడు రోజా లగ్జెంబర్గ్ లెనిన్‌తో విభేదించి ప్రతిపాదించిన హ్యూమానిటేరియన్ డెమొక్రాటిక్ కమ్యూనిజంగా దాన్ని పరివర్తింపజేయాలన్న మహదాశయంతో గోర్బచేవ్ ప్రవేశ పెట్టిన గ్లాస్‌నోస్త్, పెరిస్ట్రోయికాలు అసలు కమ్యూనిజంనే కబళించి వేశాయి. కమ్యూనిజం, ప్రజాస్వామ్యం రైలు పట్టాల వలె ఎన్నటికీ కలియని సమాంతర రేఖలని, లెనిన్ ప్రతిపాదించిన డెమొక్రాటిక్ సెంట్రలిజం నియంతృత్వానికి మారుపేరని సోవియెట్ అనుభవం ప్రపంచానికి తిరుగులేని విధంగా రుజువు చేసింది. రెనిగేడ్ అని లెనిన్ ఒకనాడు నిందించిన కార్ల్ కాట్స్కీ ఇప్పటి పరిణామాలు చూసి తన సమాధిలో నుంచే నవ్వుకుంటూ వుండాలి.

అయితే, సోవియెట్ యూనియన్ తిరోధానం సోవియెట్ వ్యతిరేకులు కూడా నవ్వుకోదగిన పరిణామం కాదు. ప్రపంచ చరిత్రలో అదొక మహా విషాదం. ఒక గొప్ప ప్రయోగం విఫలమైంది. మళ్లీ అలాంటి ప్రయోగం చేయడానికి, అట్టడుగు బడుగు జీవుల సముద్ధరణకు మరొక మహా ప్రయత్నం చేయడానికి ఎవరూ ఇప్పటిలో సాహసించలేరు. ఇప్పుడు సాహసిస్తున్నవారు లేరని కాదు. కాని అది పెడదారులు తొక్కుతున్న దుస్సాహసం. విఫలం కాక తప్పని దుస్సాహసం.

చరిత్ర మాత్రం ఎవరి కోసం ఆగడం లేదు. అది ముందుకు సాగిపోతూనే వున్నది తెలియని ఏ గమ్యానికో. ప్రస్తుతానికి మాత్రం ఏడు దశాబ్దాల సోవియెట్ ప్రయోగానికి ప్రపంచం 'దస్విదానియా' (రష్యన్ భాషలో వీడ్కోలు) చెబుతున్నది.

*(డిసెంబరు 24, 1991)*

# నెహ్రూ మోడల్ బదులు రాజాజీ మోడల్

**ఇం**డియా ఆర్థిక విధానం ఇటీవలి వరకు ఒక దిశలో సాగుతూ వుండేది. ఇప్పుడది దానికి వ్యతిరేక దిశలో ప్రయాణం ప్రారంభించింది.

ఇటీవలి వరకు ఇండియా నెహ్రూ నిర్దేశించిన ఆర్థిక పథాన్ని అనుసరించేది. ప్రభుత్వ రంగం, ప్రయివేట్ రంగం, రెండూ కలిసిన మిశ్రమరంగం - మొత్తంపై మనది మిశ్రమ ఆర్థిక వ్యవస్థ.

ప్రభుత్వరంగానికి ఇండియా ఆర్థిక, పారిశ్రామిక విధానంలో ఇటీవలి వరకు పెద్దపీట. ఆర్థిక వ్యవస్థలోని "ఉన్నత శిఖరాలు" (కమాండింగ్ హైట్స్) అన్నీ ప్రభుత్వం చేతిలో వుండాలని, ప్రయివేట్ రంగంతో సహా మొత్తం ఆర్థిక, పారిశ్రామిక, వాణిజ్య రంగాలన్నింటిని ప్రభుత్వమే నియంత్రించాలని నెహ్రూ కాలంలో నిర్ణయం జరిగింది.

దీన్ని 'నెహ్రూ మోడల్' అంటున్నారు. నెహ్రూ స్వయంగా సోషలిస్టు కావడం వల్లనేకాక, ఆనాటి పరిస్థితులలో ఆ విధమైన విధానం మనకు అవసరమైంది. ఇండియా స్వతహాగా పేద దేశం కావడం వల్ల 'క్యాపిటల్ ఫార్మేషన్, క్యాపిటల్ ఎక్యూమలేషన్' తగిన స్థాయిలో జరగలేదు. ప్రయివేట్ రంగం దేశ పారిశ్రామికాభివృద్ధికి అవసరమైన ఇన్ ఫ్రాస్ట్రక్చర్‌ను సమకూర్చగల స్థితిలో వుండేది కాదు. అందుచేత ప్రభుత్వం విధిగా భారీ పరిశ్రమల రంగంలోనికి అడుగుపెట్టవలసి వచ్చింది. అడుగు పెట్టడమేకాక దాదాపు అన్ని రకాల భారీ పరిశ్రమలను తన అధీనంలోనే వుంచుకోవలసి వచ్చింది.

ఈ విధానానికి అనుగుణంగా, వినియోగ వస్తువుల ఉత్పత్తి పరిశ్రమలను ప్రయివేట్ రంగానికి వదలిపెట్టి భారీ, కీలక పరిశ్రమలను ప్రభుత్వం స్థాపించడం జరిగింది. కొన్ని వేల కోట్ల రూపాయిలను ప్రభుత్వరంగంలో పెట్టుబడి చేయడం జరింగింది. ఆ విధంగా మన పారిశ్రామిక రంగానికి ఒక ఇన్ ఫ్రాస్ట్రక్చర్ ఏర్పడింది.

అయితే, తొలి రోజులలో ఈ విధానం అభిలషణీయమైనా, సత్ఫలితాలే ఇచ్చినా, కాలక్రమాన పబ్లిక్ రంగం దేశం మెడకు ఒక గుదిబండ అయింది. పబ్లిక్ రంగం పరిశ్రమలు 'తిండికి తిమ్మరాజు, పనికి పోతరాజు' సామెతలో వలె, ఎంత పెట్టుబడి పెట్టినా దిగమింగడమే తప్ప, లాభాలు ఇచ్చిన పాపాన పోలేదు. ఏవో కొద్ది పరిశ్రమలు తప్ప అధిక భాగం ప్రభుత్వరంగ పరిశ్రమలు నష్టాల మీదనే నడిచాయి. ప్రభుత్వ పరిశ్రమలు కనుక, కార్మికుల మంచి వ్యతిరేకత వస్తుంది కనుక, వాటిని మూసివేయడానికి వీలు లేదు - కొనసాగిస్తే దేశం భరించే స్థితిలోలేదు. సోవియెట్ యూనియన్, తూర్పు యూరప్ దేశాలు ఇలాగే దివాలా తీశాయి. అవి విధిగా తమ ఆర్థిక విధానాలను మార్చుకోవలసిన స్థితిలో, సోషలిజానికి తిలోదకాలు వదలవలసిన స్థితిలో పడ్డాయి.

ఇప్పుడూ ఇండియా కూడా అదే పరిస్థితిలో పడింది. ఉత్పత్తి మందగించడం, అనేక పరిశ్రమలు ఖాయిలా పడడం, నష్టాలు పేరుకుపోవడం, విదేశాలకు చెల్లింపుల విషయంలో బకాయిపడడం, అంతర్జాతీయ ద్రవ్య సంస్థలను ఆశ్రయించవలసి రావడం, దిగుమతులకు పరపతి పుట్టకపోవడం, ఎగుమతులు ఇతర దేశాల పోటీకి తట్టుకోలేకపోవడం వంటి అనర్థాల పరంపర మెడకు చుట్టుకున్న తర్వాత గాని మనం ఇంతకాలం అనుసరించిన ఆర్థిక విధానం ఇక పనికిరాదని, అది వరమీయని వేల్పులా తయారైందని తెలిసిరాలేదు.

ఇప్పుడు విధిగా 'నెహ్రూ మోడల్'ను విసర్జించి మనం కూడా "మార్కెట్ ఎకానమీ" అనబడే మోడల్‌ను అవలంబించక తప్పని స్థితి ఏర్పడింది. అంటే ప్రభుత్వరంగం ప్రాధాన్యాన్ని క్రమంగా తగ్గిస్తూ ప్రయివేట్ రంగం ప్రాధాన్యం ఎక్కువ చేయడం, మార్కెట్ శక్తులకు ఆర్థిక వ్యవస్థను అప్పగించడం.

అయితే, ఇది కేవలం ఇండియా స్వయంశక్తి వల్లనే సాధ్యం కాగల పని కాదు. పారిశ్రామికంగా అభివృద్ధి చెందిన సంపన్న దేశాల సహాయం, భాగస్వామ్యం విధిగా కావాలి. ఇటు స్వదేశీ, అటు విదేశీ ప్రయివేట్ పెట్టుబడులను ప్రోత్సహించడానికి ఇంతకు పూర్వం నెహ్రూ కాలం నుంచి పెరుగుతూ వచ్చిన ఆంక్షలను, నిబంధనలను, చట్టాలను సడలించవలసి వచ్చింది. శ్రీ పి.వి. నరసింహారావు ప్రధాని, శ్రీ మన్‌మోహన్ సింగ్ ఆర్థిక మంత్రి అయిన తర్వాత ఈ సడలింపు కార్యక్రమం ప్రారంభమైంది.

ఈ నూతన ఆర్థిక, పారిశ్రామిక విధానంలో భాగంగానే ప్రధాని శ్రీ పి.వి. నరసింహారావు ఇటీవల విదేశీ పెట్టుబడిదారులకు రెండు చేతులా ఆహ్వానం అందజేశారు. న్యూయార్కులో భద్రతా మండలి శిఖరాగ్ర సమావేశంలో పాల్గొని, తిరిగి వస్తూ మార్గ మధ్యంలో స్విట్జర్లెండ్‌లో ఆగి, అక్కడ జరుగుతున్న ప్రపంచ ఆర్థికవేత్తల సమావేశాన్ని ఉద్దేశించి ప్రసంగిస్తూ, ఇండియా తలపెట్టిన ఆర్థిక సంస్కరణలు తాత్కాలికమైనవి కావని, అవి కొనసాగుతాయని స్పష్టం చేశారు. ఇప్పటివరకు అనుసరించిన ఆర్థిక విధానాన్ని విడనాడుతున్నామని, ఇకపై మరింత ఎక్కువగా ఆర్థిక రంగాన్ని లిబరలైజ్ చేయబోతున్నామని, ఉభయతారకమైన ఈ అవకాశాన్ని విదేశీ పెట్టుబడిదారులు సద్వినియోగం చేసుకోవాలని ఆయన కోరారు.

ప్రధాని ఆహ్వానం ఫలితాలు ఎలా వుంటాయో మరి కొద్ది కాలం గడిస్తేగాని తెలియదు. ఇటీవలి వరకు ఇండియా విదేశీ పెట్టుబడులను ఆచితూచి తప్ప రానిచ్చేది కాదు. అడుగడుగునా అవరోధాలు కల్పించేది. ఇండియాలో పెట్టుబడి పెట్టడమంటే విదేశీ సంస్థలు భయపడుతూ వుండేవి. ఈ భయ సంకోచాలు వదలి పెట్టి ఇప్పుడు మారిన పరిస్థితులలో విదేశీ సంస్థలు ఇండియా వచ్చి తమకు లాభాలు ఆర్జించుకునే క్రమంలో ఇండియా ఆర్థిక పురోగతికి కూడా తోడ్పడాలి. దీనితో ఇండియాలోని ప్రయివేట్, ప్రభుత్వ రంగాలు కూడా తమ స్తబ్దతను వదలించుకుని విదేశీ సంస్థలతో పోటీ పడడానికి, ఆ పోటీలో రాణించడానికి కృషి చేయాలి. ఆ

విధంగా దేశం సర్వతోముఖాభివృద్ధిని క్రమంగా సాధించి, ఇప్పటి వూబిలో నుంచి బయటపడాలి.

ఇదీ పి.వి. ప్రభుత్వపు నూతన ఆర్థిక సంస్కరణల ఆంతర్యం. దీనికి వామపక్షాల నుంచి తీవ్ర ప్రతిఘటన రాక తప్పదు. అలాగే కాంగ్రెస్‌లోనే నెహ్రూ వాదానికి ఇప్పటికీ కట్టుబడి వున్న వర్గాల నుంచి కూడా వ్యతిరేకత రాక తప్పదు. ఈ రెండు వ్యతిరేకతలను పి.వి. మైనారిటీ ప్రభుత్వం తట్టుకుని నిలబడాలి.

కాలం చాలా విచిత్రమైనది. అది ఎప్పుడు, ఏ మార్పులను తెచ్చి పెడుతుందో ఊహించలేము. నెహ్రూవియన్ సంస్కృతిలో మునిగి తేలినవారికి ఇప్పుడు జరుగుతున్న మార్పులు మింగుడుపడవు. ఒకప్పుడు, రాజాజీ నెహ్రూ ఆర్థిక విధానాలను "లైసెన్స్ పర్మిట్ కోటారాజ్" గా తూర్పారపడుతూ, ప్రయివేట్ రంగానికి ప్రతినిధిగా స్వతంత్ర పార్టీని స్థాపించారు. అప్పటిలో ఆయనను అభివృద్ధి నిరోధకుడుగా సోషలిస్టులు, కమ్యూనిస్టులు, కాంగ్రెసువారు అందరూ నిందించేవారు. ఆయన స్వతంత్ర పార్టీ కాలగర్భంలో కలిసిపోయింది.

ఇప్పుడు సరిగా ఆనాడు రాజాజీ అభిమానించిన ఆర్థికాభివృద్ధి మోడల్‌నే దేశం వరించనుండడం ఒక ఆశ్చర్యకర పరిణామం. అవసరం, వాస్తవ పరిస్థితి ఏ పనైనా చేయిస్తాయి. ఏ మార్పుకైనా తల వొగ్గేటట్టు చేస్తాయి.

*(ఫిబ్రవరి 6, 1992)*

# "భారతరత్న"

దేశానికి విశిష్ట సేవలు అందించిన వారికి భారత ప్రభుత్వం ఇచ్చే అత్యున్నతమైన అవార్డు "భారతరత్న". కాగా, రానురాను ఈ అవార్డుకు అర్థం, ఔచిత్యం లేకుండా పోతున్నదా అని అనుమానం కలుగుతున్నది. అది తరుచుగా, ముఖ్యంగా ఇటీవలి కాలంలో వివాదగ్రస్తం అవుతున్నది కూడా.

భారత ప్రథమ ప్రధాని, నవ భారత నిర్మాత జవహర్లాల్ నెహ్రూ, భారత ప్రథమ రాష్ట్రపతి రాజేంద్రప్రసాద్, ప్రఖ్యాత తత్వవేత్త రాధాకృష్ణన్, శాస్త్రవేత్త సి.వి. రామన్ మొదలైన వారికి "భారతరత్న" అవార్డు ప్రదానం చేయడంపై ఎట్టి భిన్నాభిప్రాయం వుండదు. వారు అన్ని విధాలుగా ఆ అవార్డుకు అర్హులు. వారికి ఆ అవార్డు ప్రదానం వారి పట్ల జాతి కృతజ్ఞతా సూచకం, అది జాతి తనను తాను గౌరవించుకోవడం.

అయితే, మరీ ఇటీవలి సంవత్సరాలలో ఈ అవార్డుపై వివాదాలు రావడం ఎంతైనా విచారకరం. దీనికి కారణం ఆ అవార్డు ప్రదానం వెనుక రాజకీయ ప్రయోజనాలున్నాయనే ఒక అభిప్రాయం కలగడమే.

శ్రీ ఎం.జి. రామచంద్రన్ తమిళనాడు ప్రజల ప్రియతమ నాయకుడే; ముఖ్యమంత్రిగా తన రాష్ట్రానికి ఎంతో సేవ చేసినవాడే. అయినా, ఆయన ప్రాంతీయ స్థాయి నాయకుడు. ఆయన స్మృతిని గౌరవించడానికి ఎన్నో ఇతర మార్గాలుండగా భారత ప్రభుత్వం అఖిల భారత స్థాయిలో అత్యున్నతమైన అవార్డు "భారతరత్న"ను ఇచ్చి నెహ్రూ, రాజేంద్రప్రసాద్ వంటి వారి సరసన చేర్చడం అప్పటిలో వివాదాస్పదమైంది. నిజానికి ఇటువంటి వివాదాన్ని రేకెత్తించే విధంగా అవార్డును ఇవ్వడం వల్ల ఎం.జి.ఆర్. స్మృతిని గౌరవించినట్టు కాలేదని, కేవలం ఎ.ఐ.ఎ.డి.ఎం.కె.ను బుజ్జగించి దాని స్నేహం కొనసాగేటట్టు చేసుకొనడానికి కేనన్న అభిప్రాయం కూడా వినబడింది.

నిజానికి "భారతరత్న" అవార్డుగాని, మరొకటిగాని కీర్తిశేషులైన వారికి కాక, మన మధ్య ఇంకా వున్నవారికి ఇవ్వడం ఎంతైనా సముచితంగా వుంటుంది. పోనీ ఎప్పుడైనా కీర్తిశేషులైన వారికి కూడా ఇవ్వవలసి వస్తే, ఏ రెండు మూడేళ్ళ క్రిందటో మరణించిన వారికి ఇవ్వడంలో కూడా ఆక్షేపణ వుండదు. అలాకాక, ఎప్పుడో దశాబ్దాల క్రిందట మరణించిన వారికి ఇవ్వడంతో "భారతరత్న" అవార్డు మరింత వివాదాస్పదమైంది.

ఉదాహరణకు ఇట్టి వివాదం డాక్టర్ అంబేద్కర్ విషయంలో వచ్చింది. ఈ శతాబ్దపు భారత చరిత్రలో అగ్రశ్రేణికి చెందిన వారిలో ఆయన ఒకరు. దళిత ప్రజల సముద్ధరణకు తన జీవితం అంకితం చేసిన చరితార్థుడుగా, స్వతంత్ర భారత రాజ్యాంగ రచయితగా ఆయన భారతీయుల కృతజ్ఞతకు పాత్రుడు. "భారతరత్న" అవార్డుకు సర్వవిధాలా అర్హుడు. అయితే, ఆ అవార్డును

ఆయన బ్రతికి వున్నప్పుడో, లేక మరణించిన తొలి సంవత్సరాలలోనో ప్రకటించివుంటే ఆధునిక భారత చరిత్రలో ఆయన నిర్వహించిన ఉజ్వల పాత్రకు న్యాయం జరిగేది. అలాకాక, దశాబ్దాలనాడు మరణించిన అంబేద్కర్‌కు రెండేళ్ళనాడు ఫ్రంట్ ప్రభుత్వం ప్రకటించడం రాజకీయ ప్రయోజనాలను ఆశించి చేసిన పని అన్న విమర్శ వచ్చింది.

అదే విధంగా, నిరుడు విషాద మరణం చెందిన రాజీవ్ గాంధీకి "భారతరత్న" ప్రకటిస్తూ ఆయనకు మాత్రమే అవార్డు ఇవ్వడం బాగుండదనో ఏమో, దాదాపు నాలుగు దశాబ్దాలనాడు మరణించిన సర్దార్ పటేల్‌కు కూడా ప్రకటించారు. అంత ఆలస్యంగా పటేల్ సేవలను గుర్తించడం, రాజీవ్‌గాంధీతో జతచేసి గుర్తించడం కూడా వివాదాస్పదమైంది.

కాగా, ఈ ఏడాది కూడా "భారతరత్న" ప్రకటన వివాదానికి లోనైంది. భారత స్వాతంత్ర్య సమరయోధులలో నెహ్రూతోపాటుగా, స్మరించగిన నేతాజీ సుభాష్‌చంద్రబోస్‌కు, ప్రథమ శ్రేణి జాతీయోద్యమ నాయకుడు మౌలానా ఆజాద్‌కు వారు మరణించిన ఇన్ని దశాబ్దాలకు "భారతరత్న" ప్రకటించడం పెద్ద విడ్డూరం. ఈ అవార్డు ప్రకటన ఆ మహనీయుల పట్ల దేశ ప్రజల గౌరవాన్ని ఏ విధంగా ఇనుమడింపజేస్తుందో తెలియడం లేదు.

ఈ విధంగా భారత స్వాతంత్ర్యోద్యమంలో పాల్గొన్న మహామహులను ఏటా ఇద్దరి చొప్పున "సెలెక్టు" చేసి "భారతరత్న" ఇచ్చుకుంటూపోతే ఇంకా చాలా ఏళ్ళ వరకు ఆ జాబితా పూర్తికాదు. దాదాభాయ్ నౌరోజీతో మొదలుపెట్టి, గోఖలే, తిలక్, మాలవ్యా, మోతీలాల్, సి.ఆర్. దాస్, అరవింద ఘోష్, సరోజినీదేవి... ఇంకా ఎందరికైనా ఇవ్వవలసి వుంటుంది. అన్నట్టు ఆ మధ్యలోనే ఎప్పుడో మహాత్మా గాంధికి కూడా....

ఒక విషయం చెప్పక తప్పదు. నేతాజీగాని, అంబేద్కర్, పటేల్, ఆజాద్‌లుగాని, పైన పేర్కొన్నవారుగాని చారిత్రక మహావ్యక్తుల జాబితాలో ఎప్పుడో చేరిపోయారు. కాగా, వారిని గురించి భావి పౌరులు చదువుకునేటప్పుడు "వారిని భారత ప్రభుత్వము భారతరత్న అవార్డు కూడా ఇచ్చి గౌరవించెను" అని చదువుకోవాలని అవార్డు ప్రదాతల ఉద్దేశమా?

"భారతరత్న" అవార్డులను భారత జాతీయోద్యమానికే పరిమితం చేయాలని లేదు కనుక, విశ్వకవి రవీంద్రనాథ్ టాగోర్‌కు, ఇంకా వెనక్కిపోతే స్వామి వివేకానంద, రాజారామమోహనరాయ్, ఇంకా చరిత్రలోకి పోతే శివాజీ, అక్బర్, అశోకుడు మొదలైనవారికి కూడా ఇవ్వవచ్చు. వచ్చే ఏడాది నుంచి అయినా, "భారతరత్న" అవార్డును వివాదానికి, పరిహాసానికి దూరంగా వుంచడానికి భారత ప్రభుత్వం ప్రయత్నించగలదని ఆశించవచ్చునా?

*(జనవరి 26, 1992)*

# సత్యజిత్‌రాయ్

**ప**థేర్ పాంచాలి 1955 నాటి చిత్రం. అది కలకత్తాలో విడుదల అయినప్పుడు, ఢిల్లీ, బొంబాయి, మద్రాసు వంటి నగరాలలో ఆదివారాల మోర్నింగ్ షోగానో, ప్రత్యేకాహూతులైన కొద్దిమంది చలనచిత్ర కళాభిమానులకో ప్రదర్శించబడినప్పుడు, దేశవ్యాప్తంగా అది కలిగించిన అపూర్వ సంచలనం ఈ రోజు ఎందరికి జ్ఞాపకం వున్నదో మాకు తెలియదు. బహుశా ఈ తరం వారు అది ఊహించనైనా ఊహించలేరు.

సత్యజిత్‌రాయ్ తీసిన మొట్టమొదటి చిత్రం పథేర్ పాంచాలి ఎలా విడుదల అయింది? మండు వేసవి మధ్యాహ్నవేళ మల్లెల పరిమళాన్ని మోసుకు వచ్చిన మలయానిలవీచికలా, వెచ్చని నుదుటిపై చల్లని కరస్పర్శలా, మనస్సులోని మాలిన్యమంతా క్షాళనం చేసే మానవతా గంగాజలంలా, నడివయస్సు నుంచి బాల్య స్మృతులలోనికి రివ్వున తీసుకుపోయే "టైమ్ మెషీన్" లా విడుదల అయింది.

భారతదేశంలో అటువంటి చిత్రం తీయడం సాధ్యమా? పాటలు, నృత్యాలు, సెట్టింగులు, అందాల హీరో, హీరోయిన్లు లేని భారతీయ చిత్రాన్ని ఊహించడం కూడా కష్టమైన ఆ రోజులలో పథేర్ పాంచాలి ఒక కఠోర వాస్తవికతతో, వ్యథార్త జీవిత యథార్థ దృశ్యాన్ని ఆవిష్కరించింది. అందులో పాటలు లేవు - రవిశంకర్ మనోజ్ఞ నేపథ్య సంగీతం తప్ప. నృత్యాలు లేవు - పది పన్నెండేళ్ళ దుర్గ వర్షాగమనంతో పురివిప్పిన నెమలిలా పరవశించి జడివానలో తడుస్తూ గిరగిరా తిరగడం తప్ప. మయసభను తలపించే సెట్టింగులు లేవు - కూలిపోవడానికి సిద్ధంగా వున్న పూరిపాక తప్ప. అందాల హీరో హీరోయిన్లు లేరు - ఒక నిరుపేద పురోహితుడు, అతని భార్య, ఇద్దరు చిన్న పిల్లలు, తొంభై ఏళ్ల ఒక ముదివగ్గు తప్ప.

కాని ఆ చిత్రంలో భారతదేశపు అమాయిక గ్రామీణ వాతావరణం వుంది. దుర్భర దారిద్ర్యం వుంది. కష్టాలు, కడగండ్లు, కన్నీళ్లు, విధి వెక్కిరింతలు, ఒక శిశువు జననం, ఒక వృద్ధురాలి నిశ్శబ్ద మరణం, మొగ్గగానే రాలిపోయిన ఒక బాలిక అర్థం లేని మృతి వున్నాయి. అదే సమయంలో చల్లగాలికి తల లెగరేసే రెల్లుపూల మొక్కలు, దూరంగా గుప్‌గుప్‌మంటూ నాగరిక ప్రపంచానికి ప్రతీకలాంటి రైలు, గుయ్యిమని శబ్దం చేస్తూ సందేశ సంకేతాలను మోసుకుపోయే టెలిగ్రాఫ్ స్తంభాలు, గతుకుల కాలిబాట, వర్షారంభవేళ కొలను అలలపై తూనీగల నాట్యం; చిన్నపిల్లల గుజ్జనగూళ్లాటలు, వీధి భాగవతం, తుపానుకు పడిపోయిన శిథిల గృహం, చనిపోయి వెల్లకిల పడిన కప్ప, ఖాళీ చేసిన పాడింటిలోకి విధి వికృతపు నవ్వులా జరజర పాకిపోయే తాచుపాము, ఎన్నో వున్నాయి. అన్నీ వున్నాయి కాని, సాంప్రదాయికార్థంలో "కథ" లేదు. జీవితం వున్నది; కఠోర జీవితం వున్నది. ఇంతకంటె మంచి రోజుల కోసం ఆ జీవితం చూసే ఎదురుచూపులున్నాయి.

పథేర్ పాంచాలి తర్వాత ఆయన సుమారు 30 కథా చిత్రాలు, ఇతర చిత్రాలు తీశారు. అయినా, 'సాంకేతిక' నైపుణిలో తప్ప అన్ని విషయాలలోను అదే మేటి. ఆయన ప్రతి చిత్రం దేనికదే సాటి. ఒక చిత్రం నుంచి మరొక చిత్రానికి సినిమా టెక్నిక్‌లో, కథా కథనంలో ఆయన ఎదుగుతూపోయారు. మేరు శిఖరం ఎత్తున ఎదిగారు. గ్రిఫిత్, ఐజెన్ స్టయిన్, చాప్లిన్, బెర్గ్‌మన్, కురోసావాల ఎత్తుకు ఎదిగారు. అనర్గళం, అనితరసాధ్యమైన తన విలక్షణ శైలిలో వారికంటె ఎత్తుకు ఎదిగారు.

రాయ్ చిత్రాలలో ఒక చిత్రం : చిత్రాన్ని పోలిన చిత్రం వుండదు. నూతనత్వాన్వేషణ మార్గంలో రాయ్ నిత్య పథికుడు. అపూ ట్రెలజీ అనబడే పథేర్ పాంచాలీ, అపరాజిత, అపూర్ సంసార్ చిత్రాలు మూడింటిలోను చావు ఉన్నాయి. సుఖానుభూతులన్నీ ఒక రకంగానే వుంటాయిగాని, దుఃఖానుభూతులు దేనికదేనని టాల్‌స్టాయ్ చెప్పినట్టు ఒక మృతిలాంటిది మరొకటి వుండదు.

జల్సాఘర్ చిత్రంలో అవసానదశలో వున్న ఫ్యూడల్ సంస్కృతి తన ఉనికిని నిలబెట్టుకొనడానికి ఎలా పాకులాడుతుందో చూస్తాము. టాగోర్ కథ ఆధారంగా తీసిన చారులత ఒక అసంపూర్ణ మనోహర కావ్యం లాంటిది. మహానగర్, ప్రతిద్వంది, సీమబద్ధ, జనారణ్య చిత్రాలలో దేని ప్రత్యేకత దానిదైనా, ఆధునిక జీవిత సమ్మర్దపు కాళ్ళ కింద పడి నలిగిపోయే మానవత్వపు విలువలను చూస్తాము. తీన్ కన్య మూడు చిత్రాలూ టాగోర్‌కు శత జయంతి నివాళులు. అశని సంకేత్ 1942 నాటి బెంగాల్ క్షామ రాక్షసి కోరలలో చిక్కి విలవిలలాడిపోయిన నైతిక మూల్యాలను నిర్దయగా చూపిస్తుంది. అరణ్యేర్ దిన్ రాత్రి కొన్ని అసాధారణ సన్నివేశాలలో మానవుల నిజస్వరూపాలెలా బయట పడిపోతాయో హాస్యభరితంగా చూపిస్తుంది.

ఇవీ, తన ఇతర చిత్రాలలో సత్యజిత్‌రాయ్ మనలను పోలిన మానవులనే తీసుకుని, ఎవరు ఏ సన్నివేశంలో ఎందుకు ఎలా ప్రవర్తిస్తారో, ఎలా ఆలోచిస్తారో, ఎలా ప్రతిస్పందిస్తారో ఒకసారి ఒక తత్వవేత్తలా, ఒకసారి మనస్తత్వవేత్తలా, ఒకసారి సాంఘిక శాస్త్రవేత్తలా విశ్లేషిస్తూనే, అన్నిటిలోను మానవుల దౌర్బల్యాల పట్ల అర్థమైన, ఆర్ద్రమైన సానుభూతిని కనబరుస్తారు. ఆయన మొత్తం జీవిత కృషిని అంచనా వేస్తే పూర్వసూక్తిని కొంచెం మార్చి "నా నృపః కురుతే చిత్రమ్" అనాలనిపిస్తుంది.

సత్యజిత్‌రాయ్‌ది బహుముఖ ప్రతిభ. రవిశంకర్, విలాయత్ ఖాన్ వంటివారి సహాయం పొందిన తొలి చిత్రాలను మినహాయిస్తే, తన అన్ని చిత్రాలకు తానే సంగీత దర్శకుడు. పాశ్చాత్య శాస్త్రీయ సంగీతం పట్ల ఆయన అభిరుచి, బెంగాలీ జానపద బాణీలలో అభినివేశం జగత్ప్రసిద్ధం. "గోపీ గాయ్‌నే బాఘా బాయ్‌నే" చిత్రంలో ఆయన కట్టిన బాణీలు శ్రోతలను ఉర్రూతలూగిస్తాయి. అదికాక, రాయ్ తన చిత్రాలకు తానే ఆర్ట్ డైరెక్టర్ (టాగోర్, నందలాల్ బోస్‌ల సాన్నిధ్యంలో చిత్రకారుడుగానే ఆయన జీవితం ప్రారంభమైంది), స్క్రీన్‌ప్లే రైటర్, స్క్రిప్టు

రైటర్, కథా రచయిత, ఎడిటర్, పెక్కు సందర్భాలలో తానే ఛాయా గ్రాహకుడు. స్వయంగా రచయిత కూడా అయిన రాయ్ వ్రాసిన డిటెక్టివ్ కథలు, పిల్లల కథలు, సైన్స్ ఫిక్షన్ భారతీయ సాహిత్యంలో చిరస్థాయిగా నిలిచిపోతాయి.

ఆయన చిత్రాలలో పెక్కింటికి స్వర్ణకమలం వంటి అవార్డులు లభించినప్పటికి, అవసానదశలో భారతరత్న అవార్డు లభించినప్పటికి, స్వదేశంలో కంటె విదేశాలలోనే రాయ్ ప్రతిభా విశేషాలకు ఎక్కువ గుర్తింపు వచ్చిందన్న ప్రతీతిలో కొంత నిజం లేకపోలేదు. కాన్స్, వెనిస్, బెర్లిన్ మొదలైన చోట్ల ఆయన చిత్రాలకు వచ్చిన అవార్డులు, ఫిలిప్పీన్స్ ఇచ్చిన మెగ్‌సేసే అవార్డు, బ్రిటిష్ ఫిలిం విమర్శకులు ఒక అర్ధ శతాబ్దపు (1925-75) అత్యుత్తమ చిత్ర దర్శకుడుగా ఆయనకిచ్చిన గుర్తింపు, ఫ్రాన్సు అధ్యక్షుడు స్వయంగా అందించిన లీజియన్ ఆఫ్ ఆనర్, ఆక్స్‌ఫర్డ్ యూనివర్సిటీ అరుదుగా విదేశీయులకిచ్చే ఆనరరీ డాక్టరేట్, అంతే అరుదుగా అమెరికన్ మోషన్ పిక్చర్ అకాడమీ విదేశీయులకిచ్చే స్పెషల్ ఆస్కార్, ఇవన్నీ ఇందుకు నిదర్శనాలు. నోబెల్ బహుమతి గ్రహీత సాల్ బెల్లో తన "హెర్జోగ్" నవలలో ఒకచోట సత్యజిత్‌రాయ్ ప్రశంస తీసుకురావడం సృజనాత్మక సాహిత్యంలోకి కూడా ఆయన పేరు వెళ్ళిందనడానికి గుర్తు.

చివరగా ఒక మాట. ప్రపంచమంతా జేజేలు పలికిందిగాని భారతీయ చలనచిత్ర ప్రముఖులు మాత్రం ఆయనను సరిగా అర్థం చేసుకొనకపోవడం దురదృష్టం. భారతీయ దారిద్ర్యాన్ని తన చిత్రాలలో ప్రదర్శించి పాశ్చాత్యుల ప్రశంసలు సంపాదించుకున్నవాడుగా ఆయనను కొందరు పరిగణించడం వారి మేధా దారిద్ర్యానికి చిహ్నం. తాను కళాఖండాలు తీస్తున్నానని ఆయన ఎన్నడూ అనుకోలేదు. అందరూ చూచి ఆనందించే చిత్రాలు తీయడమే తన ధ్యేయమని, వ్యాపార విజయ దృక్పథం వున్నంత మాత్రాన కళామూల్యాలు లోపించనక్కరలేదని ఆయన విశ్వాసం. ఆ మాటకు వస్తే తనకు స్ఫూర్తి ఇచ్చినవారిలో అమెరికన్ డాక్యుమెంటరీ చిత్ర నిర్మాత రాబర్ట్ ఫ్లాహర్టీ, సోవియెట్ దర్శకుడు అలెగ్జాండర్ డోవ్‌జెంకోలతోపాటు ఎందరో హాలీవుడ్ దర్శకులు కూడా వున్నారనేవాడు రాయ్. సత్యజిత్‌రాయ్ భారతీయ సృజనాత్మకతను ప్రపంచానికి చాటిచెప్పిన మహామహుడు. నేడు ఆయన లేడు. ఆయన చిత్రాలున్నాయి, ఆయన ప్రతిభ వుంది.

*(ఏప్రిల్ 25, 1992)*

# పద్యానికి కరుణశ్రీ

గణ యతి ప్రాసలతో కూడిన పద్యం తెలుగు వాడి సొత్తు. సంస్కృతంతో సహా ఏ భాషా ఛ్చందస్సులోను లేని సొగసు తెలుగు పద్యానిది.

ఆ సొగసైన తెలుగు పద్యాన్ని సొంతం చేసుకున్న మహనీయ కవి కరుణశ్రీగా తెలుగు నేల నాలుగు చెరగుల పేరుపడిన జంధ్యాల పాపయ్య శాస్త్రిగారు. పద్య విద్యను పరాకాష్ఠకు తీసుకువెళ్ళిన కవిశేఖరుడు పాపయ్య శాస్త్రిగారు. తెలుగు పద్యాన్ని ఎంత రమ్జుగా, రమ్యంగా, సరళంగా, మధురంగా, శ్రవణసుభగంగా నడిపించడానికి వీలుందో అంత గాను నడిపించిన ఘనత పాపయ్యశాస్త్రిగారిది. ఆదివారం అర్ధరాత్రి శాశ్వతంగా కన్నుమూసిన కరుణశ్రీ మృతితో తెలుగు పద్యం విలవిలలాడుతుంది, గిలగిల కొట్టుకుంటుంది, వెలవెల పోతుంది. కళ తప్పి వెలుగు కోల్పోతుంది. అంతగా విడదీయరాని సంబంధం వుంది తెలుగు పద్యానికి,కరుణశ్రీకి మధ్య.

తెలుగు పద్యానిది వెయ్యేళ్ళ చరిత్ర. ఈ వెయ్యేళ్ళలో తెలుగు పద్యం ఎన్నో పోకడలు పోయింది. నన్నయదొక పోకడ, తిక్కన దొక పోకడ, శ్రీనాథుని దొకటి, పోతన దొకటి, పెద్దనది మరొకటి.

ఆకాశమార్గాన అందనంత దూరాన విహరించే తెలుగు పద్యాన్ని నేల మీదికి లాక్కొచ్చి, ప్రతి పల్లెటూరిలో ప్రతి నోట పలికించిన ఘనత తిరుపతి వేంకట కవులది. కాగా తెలుగు పద్యాన్ని హుమాయిలా, రుబాయిలా పరువెత్తించిన నేర్పు జాషువాది. వారి తర్వాత అంతగాను, అంతకన్న మిన్నగాను పద్య కవితను ప్రజల మధ్యకు చొచ్చుకుపోయేటట్టు చేసి ఔననిపించుకున్నవారు కరుణశ్రీ.

నాలుగు, నాలుగున్నర దశాబ్దాలనాడు కరుణశ్రీయే ఒక కవితలో "సరస సంగీత సామ్రాజ్య చక్రవర్తి" గా కీర్తించిన ఘంటసాల మధుర కంఠం నుంచి అమృత వాహినిలా జాలువారిన -

అంజనరేఖ వాల్గనుల యంచులు దాట, మనోజ్ఞ మల్లికా
కుంజములో సుధా మధుర కోమల గీతిక లాలపించు ఓ
కంజదళాక్షి! నీ ప్రణయ గానములో పులకింతునా - మనో
రంజని! పుష్ప వృష్టి పయిరాల్చి నిమన్ పులకింపజేతునా!

అనే పద్యంతో మొదలయ్యే కరుణశ్రీ "పాంథ్యశ్రీ" "అద్వైతమూర్తి" కవితలను విని పులకించని తెలుగువారు ఎవరుంటారు?

అలాగే -

అది రమణీయ పుష్పవనమా వనమందొక మేడ, మేడపై
నది యొక మారుమూలగది, ఆ గది తల్పులు తీసి మెల్లగా
పదునయిదేండ్లయీడు గల బాలిక; పోలిక రాచపిల్ల, జం
కొదవెడి కాళ్ళతోడ దిగుచున్నది క్రిందికి మెట్ల మీదుగన్

అని మొదలయ్యే "కుంతీ కుమారి" లో కన్యా మాతృత్వ శోక భారాన్ని ఘంటసాల విషాద మధురంగా వినిపించగా కంటతడి పెట్టని తెలుగువారు ఎవరుంటారు?

పద్యం వ్రాస్తే కరుణశ్రీ వ్రాయాలి. పద్యం పాడితే ఘంటసాల పాడాలి అనేది ఒక నానుడి అయింది. కరుణశ్రీ కవితా మాధుర్యం, ఘంటసాల కంఠ మాధుర్యం - ఆ రెండింటిది ఒక అపూర్వమైన కలయిక. అది తెలుగువారు చేసుకున్న అదృష్టం.

కరుణశ్రీ కవితలో సారళ్య, తారళ్యాల తర్వాత ప్రధానంగా చెప్పవలసింది కరుణ రసావేశం. నవ రసాలలో కరుణపైనే ఆయన మొగ్గు. "ఏకో రసః కరుణ ఏవ" అన్న భవభూతి వాక్కు కరుణశ్రీకి వేదవాక్కు. "కరుణకు, కవికి అవినాభావ సంబంధం" అని, తన కవితకు స్ఫూర్తి కరుణ రసానిదేనని ఆయన స్వయంగా చెప్పుకున్నారు. అందుకే పాపయ్య శాస్త్రిగారు తన కలం పేరే "కరుణశ్రీ"గా పెట్టుకున్నారు. పరమ కారుణ్యమూర్తి గౌతమ బుద్ధుడిని ఎన్ని కవితలలో కీర్తించారో!

కరుణశ్రీ కవితలో మరొక ప్రధానమైన పాయ దేశభక్తి. భగత్‌సింగ్, అల్లూరి సీతారామరాజు వంటి విప్లవవీరులను, గాంధీ మహాత్ముడిని ఎన్నో కవితలలో చదువరుల హృదయాలను ఉప్పొంగించే ఆవేశంతో ఆయన గానం చేశారు. ముఖ్యంగా "అల్లూరి సీతారామ రాజు" కవితలో

రాచరికంపు రక్కసి కరమ్ములు సాచి అమాయిక ప్రజన్
దోచు పర ప్రభుత్వమును దోచిన రాజుల చిన్నవాడ! నీ
రోచితమైన తావక మహోద్యమమాంధ్ర పురా పరాక్రమ
శ్రీ చరణమ్ములందు విరజిమ్మె నవారుణ విప్లవాంజలుల్

వంటి పద్యాలు చదివి ఒడలు గగుర్పొడవని పాఠకుడుండడు.

ఇంకా దైవభక్తి ప్రచోదితమైన కవితలు, రాసిక్య ప్రధానమైన కవితలు, సమకాలిక రాజకీయ, సాంఘిక పరిస్థితులకు స్పందించి వ్రాసిన కవితలు, వ్యంగ్య కవితలు కడచిన మూడు, నాలుగు దశాబ్దాలలో కరుణశ్రీ లేఖిని నుంచి పుంఖాను పుంఖంగా వెలువడ్డాయి. పద్య కవిత వ్రాసినా, గద్య కవిత వ్రాసినా కరుణశ్రీ బాణీ స్పష్టంగా తెలిసిపోయేది. ఆయనదొక ప్రత్యేక శైలి. అయితే గద్య కవితలో కంటె పద్య కవితలోనే ఆయన ముద్ర ప్రస్ఫుటంగా కనబడేది. "కవనార్థంబుదయించినారము...." అని తిరుపతి వేంకటకవులు అన్నట్టు "పద్యార్థంబుదయించి నాడను.." అని చెప్పుకోర్గల కవి ఆయన. పద్య కవితకు రోజులు కాని రోజులలో పద్య కవిత వ్రాసి ఓహో అనిపించుకోవడం ఆయనకే చెల్లింది.

తెలుగు పద్యం పట్ల ఆయన మమకారం ఎంతటిదంటే నన్నయ నుంచి దక్షిణాంధ్ర కవుల వరకు గల ఆంధ్ర కవిత్వంలో రమణీయమైన, బహుజన ప్రచారం పొందిన రసవద్ఘట్టాలను "కల్యాణ కల్పవల్లి"గా సంకల్పించి రసిక పాఠక ప్రీతి కావించారు.

మంచి గంధం వంటిది, మల్లెపూల పరిమళం వంటిది ఆయన వ్యక్తిత్వం. ఎవరినీ నొప్పించని మృదు స్వభావం, సరస సంభాషణా చాతుర్యం ఆయన సొత్తు. వక్తగా అనర్గళ వచోధారతో శ్రోతలను ఆకట్టుకోగలిగిన నేర్పరి. భావ కవితా యుగ ప్రభావం ఇంకా వీడని తరానికి చెందిన వారైనా, దానికి భిన్నమైన మార్గంలో నడిచి తన ప్రత్యేకతను నిలబెట్టుకున్న మధుర కవి. ఆయన "ఉదయశ్రీ" కవితా సంపుటి - బహుశా తెలుగులో ఇంకే గ్రంథానికి లేవన్నిసార్లు - యాభై ముద్రణలు పొందినదంటేనే ఆయన కవిత్వాన్ని తెలుగువారు ఎంతగా ఆదరించారో గ్రహించవచ్చు. ఆయన కవితా స్మృతికి ఇదే మా శ్రద్ధాంజలి. *(జూన్ 23, 1992)*

# కన్యాశుల్కం శతజయంతి

గురజాడ అప్పారావుగారి "కన్యాశుల్కం" నాటకం మొట్టమొదటి ప్రదర్శన జరిగి నేటికి ౨గా నూరేళ్లయింది. ఆ మొదటి ప్రదర్శన జరిగిన విజయనగరంలోనే ఈ రోజున ఆ నాటకం కజయంతి జరుపుకుంటున్నది. ఇది తెలుగువారు గర్వించదగిన సంఘటన. తెలుగు సాహిత్య రిత్రలో ఒక మహత్తర సన్నివేశం.

భాషా, సాంస్కృతిక, తదితర పరిమితుల వల్ల ఇతరులు గుర్తించలేకపోవచ్చుగాని, న్యాశుల్కం ప్రపంచ సాహిత్యంలోని ఉత్తమోత్తమ నాటకాలలో ఒకటి. తెలుగులో దాన్ని ుంచిన నాటకం, దానితో తులతూగే నాటకం ఇంతవరకు రాలేదు.

ఇతివృత్తం నూరేళ్లనాటిది. ముక్కుపచ్చలారని ఆడపిల్లలను కాటికి కాళ్లు జాపుకుని కూర్చున్న వృద్ధులకు అమ్మి పెళ్ళి చేసి, వారు బాల వితంతువులుగా ఇళ్లకు తిరిగి వస్తే, జీవితాంతం జీతభత్యాలు ఇవ్వనక్కరలేని పనిమనుషులుగా ఊడిగం చేయించుకునే దురాచారం ఆ రోజులలో ఆంధ్ర దేశంలో కొన్ని ప్రాంతాలలో, కొన్ని వర్గాలలో వుండేది. ఆ దురాచారం గురించి విజయనగరం మహారాజా ఆనందగజపతి వివరాలు సేకరించగా, వాటి ఆధారంగా, కన్యాశుల్కం ఇతివృత్తంగా అప్పారావుగారు అద్భుత నాటకం వ్రాశారు.

ఆ దురాచారం ఏనాడో అంతరించింది. కన్యాశుల్కం మొదటి కూర్పు 1892 నాటిది కాగా, 1909 లో రెండవ కూర్పు నాటకాన్ని అప్పారావుగారు వ్రాసేనాటికే ఆ ఇతివృత్త సమకాలికత చరిత్ర గర్భంలో కలిసిపోయింది. అయినా, అది ఆధారంగా, ప్రేరణగా గురజాడ వ్రాసిన నాటకం మాత్రం అజరామరంగా మిగిలింది. ఆ ఇతివృత్తానికి కాలదోషం పట్టినా, ఆ నాటకానికి మాత్రం ఈనాటికీ కాలదోషం పట్టలేదు.

కారణం గురజాడవారి రచనా శిల్పం, పాత్ర చిత్రణ, నూరేళ్ల నాడు వ్రాసినా ఈనాటికీ పాతబడని హాస్యం, నేటికీ సమకాలిక మనిపించే సజీవ భాష.

గొప్ప కవిత్వం, గొప్ప సాహిత్యం సార్వకాలికం, సార్వజనీనం కావడానికి కారణం ఏమిటి? రామాయణ, మహాభారతాల నాటి సమాజం నేడు లేకపోయినా, ఆ కావ్యాలు నేటికీ ఎందుకు సజీవంగా నిలిచివున్నాయి? షేక్స్పియర్ నాటకాలలోని రాజులు, రాణులు, ఆ సమాజం నేడు లేకపోయినా అవి ఎందుకు మనల్ని అలరిస్తున్నాయి?

విశ్వనాథవారు ఒకసారి వాక్రుచ్చినట్టు
"ప్రాగ్విపశ్చిన్మతంబున రసము వేయి
రెట్లు గొప్పది నవకథాధృతిని మించి."

ఆ రసవత్తరతా లక్షణం కన్యాశుల్కంలో పుష్కలంగా వుంది.

# ఉద్రేకాలకు స్వస్తి పలకాలి

ఉత్తరప్రదేశ్‌లో కల్యాణ్‌సింగ్ ప్రభుత్వం బర్తరఫ్, అసెంబ్లీ రద్దు, రాష్ట్రపతి పాలన విధింపు - ఇవన్నీ చేతులు కాలిన తర్వాత ఆకులు పట్టుకొనడమే. చేతులు కాలే ప్రమాదం కలదని కేంద్రానికి తెలుసు, కనుక చేతులు కాలడానికి ముందే ఈ జాగ్రత్త చర్యలు తీసుకుని వుండవలసింది.

అలా ముందుగానే జాగ్రత్త పడివుంటే అయోధ్యలో ఆదివారంనాటి ఘోరం జరిగి వుండేది కాదు. ఉత్తరప్రదేశ్‌లో బి.జె.పి. ప్రభుత్వం అనుమతించడంవల్లనే వేలాదిగా, లక్షలాదిగా కార్ సేవకులు నిరాటంకంగా అయోధ్య చేరుకోగలిగారు.దాని ఉదాసీన వైఖరి వల్లనే వివాదాస్పద స్థలం వద్దకు వెళ్లగలిగారు. బాబ్రీ మసీదులోనికి చొచ్చుకుపోగలిగారు.

బి.జె.పి. ప్రభుత్వం కారణంగానే ఉత్తరప్రదేశ్ పోలీసులు ప్రేక్షక పాత్ర వహించారు. కేంద్రం పంపిన భద్రతాదళాలను కార్‌సేవ స్థలానికి చేరుకొనకుండా నిరోధించడం సయితం జరిగింది. మతోద్రేకానికి లోనైన అపార జనసందోహం మసీదును నేలమట్టం చేయడం జరిగిపోయింది.

అంతా జరిగిపోయిన తర్వాత కల్యాణ్‌సింగ్ ప్రభుత్వాన్ని బర్తరఫ్ చేయడంలో విశేషం లేదు. అది ఎలాగూ తప్పేదికాదు. అయినప్పుడు తగినంత ముందుగానే - కొన్ని ప్రతిపక్షాలు హెచ్చరించినట్టు - బర్తరఫ్ చేసివుంటే ఆదివారంనాటి ఘోరకలి తప్పిపోయి వుండేది కాదా?

కాని, కేంద్రం చాలా అమాయకంగా చర్చలపై, బి.జె.పి. కూటానికి నచ్చచెప్పడంపై, చివరి క్షణంవరకు తన దృష్టిని కేంద్రీకరించింది. సుప్రీంకోర్టు తీర్పుపై, కోర్టు ఆదేశాలను పాటిస్తానన్న కల్యాణ్‌సింగ్ ప్రభుత్వపు హామీలపై ఆధారపడింది. బి.జె.పి. కూటం ఎంతగా కార్‌సేవ సన్నాహాలు చేస్తూ, ప్రజలను రెచ్చగొట్టే ప్రకటనలు చేస్తున్నా, ఆఖరి నిమిషంలో సంయమనం వహిస్తారని, అన్నంత పనీ జరగనివ్వరని, వెనుకకు తగ్గుతారని, దానితో పరిస్థితి విషమించబోదని ఆశపెట్టుకున్నది. ఇప్పుడు జరిగినదాని దృష్ట్యా వెనుకకు తిరిగి చూస్తే కేంద్రం ఎంత ఘోరంగా తప్పు అంచనా వేసిందో, ఎంత దారుణంగా విఫలమైందో తెలుస్తున్నది.

జరగరానిది జరిగిపోయిన తర్వాత ఇప్పుడు బి.జె.పి. నాయకులు జరిగిన దానికి విచారం వెలిబుచ్చుతున్నారు. మసీదును కూలగొట్టడం తమ లక్ష్యం కాదని, దాన్ని కూలగొట్టకుండా నివారించడంలో తాము విఫలుర మయ్యామని ప్రకటిస్తున్నారు.

ఈ విచార ప్రకటనలను ఎవరూ నమ్మలేరు. మసీదు విధ్వంసానికి దారితీసే ప్రమాదంగల ఉద్రేకాలను రెచ్చగొట్టి, మానసికంగా, భౌతికంగా అందుకు కావలసిన వాతావరణాన్ని బుద్ధిపూర్వకంగా సృష్టించి, పొరపాటు జరిగిపోయిందని, విధ్వంసం జరగకుండా నివారించలేక పోయామని అంటే విశ్వసించే వారెవరూ వుండరు. ప్రధాన జాతీయ ప్రతిపక్షంగా ఎంతో

బాధ్యతాయుతంగా వ్యవహరించవలసిన పార్టీ దేశాన్ని ఈ విధంగా మహాప్రమాదపుటంచు వరకు తీసుకుపోయి ముందుకు తోసి, 'ఇలా జరుగుతుందనుకోలేదు, పొరపాటైపోయింది' అని విచారం ప్రకటించడం వెనుకగాని, కల్యాణ్‌సింగ్ ప్రభుత్వం రాజీనామా, ప్రతిపక్ష నాయక పదవికి శ్రీ అద్వానీ రాజీనామా వెనుకగాని ఏపాటి చిత్తశుద్ధి కలదో గ్రహించడం కష్టం కాదు.

ఏది ఏమైనా ఇప్పుడు ఇన్నాళ్లుగా యావత్తు జాతి దేన్ని గురించి భయపడుతున్నదో అదే జరిగింది. దేశ రాజధాని ఢిల్లీతో సహా అనేక ఉత్తర భారత నగరాలలోను, దక్షిణాన హైదరాబాదులోను ఉద్రిక్తత నెలకొన్నది. జైపూర్, బొంబాయి, మరికొన్ని చోట్ల మత కలహాలలోను, వాటిని అరికట్టడానికి పోలీసులు చేసే ప్రయత్నాల ఫలితంగాను ఎందరో మరణించారు. మరెందరో క్షతగాత్రులయ్యారు. అపారంగా ఆస్తిపాస్తులు అగ్నిపాలైపోయాయి. ఎన్నో నగరాలలో, పట్టణాలలో నిరవధికంగా కర్ఫ్యూ విధించవలసి వచ్చింది.

ఇది దేశాన్ని ఎక్కడికి తీసుకుపోతుందో తెలియదు. ఆదివారంనాడు అయోధ్యలో జరిగిన ఘోర సంఘటన, దాని ఫలితంగా ప్రారంభమైన హింసాత్మక సంఘటనలు సాటి దేశాలలో ఇండియాను తలెత్తుకొనలేకుండా చేశాయి. మాది సెక్యులర్ ప్రజాస్వామ్యమని సగర్వంగా చెప్పుకుంటున్న జాతికి అవి మాయని మచ్చగా మిగిలిపోతాయి. నాలుగున్నర దశాబ్దాల సెక్యులర్ చరిత్ర తర్వాత దేశం మళ్లీ మొదటికి వచ్చింది. ఇదిఎంతైనా బాధాకర పరిణామం.

ఇప్పటి తక్షణావసరం ఉద్రేకాల ఉపశమనం, మతపరమైన అల్లర్లను అరికట్టడం, తిరిగి ప్రశాంత వాతావరణాన్ని, సహనాన్ని, సంయమనాన్ని పాదుకొల్పడం. ఇందుకుగాను మానసికంగా గాయపడిన వర్గాన్ని సాంత్వనపరచగల చర్యగా బాబ్రీ మసీదును అదే స్థలంలో పునర్నిర్మించాలని కొందరు సూచిస్తున్నారు. అలాగే మసీదు పునర్నిర్మాణంతో పాటు మందిర నిర్మాణం కూడా ఒకేసారిగా జరగాలని మరొక సూచన వచ్చింది. ఈ విధమైన సూచనలన్నింటిని కేంద్ర ప్రభుత్వం అన్ని రాజకీయ పక్షాలతోను చర్చించి ఏది చేయదగునో, ఏదిచేస్తే మతసామరస్య పునరుద్ధరణ జరుగుతుందో, అందరికి సంతృప్తి కలుగుతుందో అది చేయడం అవసరం. ఈ విషయమై ప్రధాని తక్షణం ఒక ప్రకటన చేయడం కూడా అవసరం.

ఈలోగా శాంతిభద్రతలను పరిరక్షించవలసిందిగా, ఉద్రేకాలకు స్వస్తి చెప్పవలసిందిగా, సామరస్యాన్ని, సోదర భావాన్ని, పరస్పర విశ్వాసాన్ని పునరుద్ధరించవలసిందిగా అందరికి వినయపూర్వకంగా విజ్ఞప్తి చేస్తున్నాము.

# అస్తమించిన రవి రావిశాస్త్రి

"అది కొమ్ముల తోటలా వుంది. ఆ కొమ్ములు కత్తుల జంటల్లా వున్నాయి. ఆ జంటలు కెరటాల్లేచినట్టూ కొమ్ములు కదిలినట్టూ లేచి కదుల్తున్నాయి. ఆ కదిలే కొమ్ములు వింత వింత కళ్లతో వికారంగా చూస్తున్నాయి. ఆ చూపుల్లో ఆకలి చాకులున్నాయి. ఆ చాకులికి పాముల మెరుపులున్నాయి. ఆ మెరుపుల వెనుక నిప్పుల నాలికలున్నాయి."

రచయిత ఎవరో చెప్పనక్కరలేదు. ఈ కొద్ది వాక్యాలు చాలు అవి వ్రాసిందెవరో పోల్చుకోవడానికి, అది సంతకం అక్కరలేని వచనం. అది ఆయన సొంత బాణీ. ఉరవడిగా, ఉవ్వెత్తున లేచిపడే అల వెనుక అలలా, ఉపమానం తర్వాత ఉపమానంగా, ఒక మహాసముద్రంలా ఘూర్ణిల్లుతూ, హోరెత్తుతూ, పాఠకుడిని ఉక్కిరిబిక్కిరి చేస్తూ సాగిపోయే ఆ శైలి రావిశాస్త్రి స్వీయ ముద్రాంకితమైన, అనితరసాధ్యమైన అద్భుత శైలి.

మిత్రులకు ఆయన శాస్త్రిగారు, వేలాది అభిమానులకు రావిశాస్త్రిగారు. తెలుగు ఆధునిక సాహిత్యంలో చిరకాలం నిలిచిపోయే రచయితగా రాచకొండ విశ్వనాథ శాస్త్రిగారు. మృత్యువుతో - పోరాడి పోరాడి అలసి బుధవారంనాడు శాశ్వతంగా కన్నుమూసి ఆప్తుల, అభిమానుల హృదయాలలో తీరని వెలితి మిగిల్చి వెళ్లిపోయారు. శ్రీశ్రీ అస్తమయ వార్త తర్వాత ఇంతటి దుర్వార్త వినలేదన్నంత బాధ రగిల్చి భువి నుంచి నిష్క్రమించారు.

తొలి రోజులలో ఏవేవో మారు పేర్లతో వ్రాసేవారు. నలభై ఏళ్లకు పూర్వం భారతిలో 'మెరుపు మెరిసింది' కథానిక వ్రాసినప్పుడు ఎవరీ జాస్మిన్ పేరు వెనుక దాగిన మంచి రచయిత అని పాఠకులు ఆరాతీశారు. ఆ రోజులలోనే, భారతిలోనే "అల్పజీవి" సీరియల్‌గా వెలువడినప్పుడు ఓహో ఈయన రాచకొండ విశ్వనాథశాస్త్రిగారా అనుకుని, తెలుగు కథాగగనం మీద ఒక ఉజ్వల తార ఉదయించినదని సంబరపడిపోయారు. ఇక ఆ పిదప ఆయన కథ తర్వాత కథతో పాఠకుల అభిమానాన్ని కొల్లగొట్టారు.

చలం తన కథలతో ఒక వైపు కొత్త తలుపులు తెరిస్తే, రావి శాస్త్రి మరొక వైపు తలుపులు తెరిచారు. తెరిచి, శ్రీశ్రీ పేర్కొన్న అశాంతులను, అభాగ్యులను, అనాథులను, పతితులను, భ్రష్టులను, బాధాసర్పదష్టులను, దగాపడిన తమ్ముళ్ళను, చల్లారిన సంసారాలను, మెరుపు మెరిసి మాయమైన తర్వాత చీకట్లు ముసిరిన బ్రతుకులను, "ఇది మెరుపు లేని మబ్బు. ఇది తెరిపి లేని ముసురు. ఇది ఎంతకీ తగ్గని ఎండ. ఇది ఇప్పటికీ తెల్లవారని చీకటి రాత్రి. ఇది గ్రీష్మం. ఇది శిశిరం. ఇది దగ్ధం చేసే దావానలం. ఇది చుక్కల్ని రాల్చేసే నైరాశ్యం... ఒక్కటి! ఒక్కటే సుమండీ. ఒక్క జరీ అంచు తెల్లచీర" కోసం ఏకధారగా వరద వరదగా ఏడ్చే విశాలాక్షి వంటి పెళ్లికాని కనెపిల్లలను, ఇంకా ఎన్నెన్నో యథార్థ జీవిత వ్యథార్త దృశ్యాలను చూపించారు.

సమకాలిక సమాజంలోని అసమానతలను, అన్యాయాలను, అక్రమాలను, దౌర్జన్యాలను చీల్చి చెండాడే ఆగ్రహంతో, ఆవేశంతో, అసహనంతో, అదే సమయంలో అట్టడుగు బడుగుజీవుల పట్ల అంతులేని ఆర్ద్రతతో, కరుణతో, జాలితో కథ తర్వాత కథ వ్రాశారు. అంతకు ముందు ఏ రచయిత తొంగిచూడని సమాజపు చీకటి కోణాలను వెలుగులోకి తెస్తూ వ్రాశారు. కవిత్వంలో శ్రీశ్రీ చేసిన పని కథలతో రావిశాస్త్రి చేశారు. తెలుగు కథాసాహిత్యాన్ని ఒక మలుపు తిప్పారు.

అరుదుగా వ్రాసేవారు. తన మనస్సులో కథ, దాని సంవిధానం, పాత్ర చిత్రణం అన్నీ విస్పష్టంగా రూపుదిద్దుకునే వరకు వ్రాసేవారు కారు. ఒక గొప్ప శిల్పంలో వలె అన్నీ దేని స్థానంలో అది అతికినట్టు అమరే వరకు కథ వ్రాసి అచ్చుకిచ్చేవారు కారు. కాని, వ్రాసిన ప్రతి కథ పాఠకలోకంలో గన్‌షాట్‌లా పేలేది. రోజుల తరబడి పాఠకులు దాన్ని గురించి చర్చించుకునేలా వుండేది.

అయినా, కడచిన నాలుగు, నాలుగున్నర దశాబ్దాలలో రావిశాస్త్రి సాహిత్య సృష్టి తక్కువేమీ కాదు. సారో కథలు, సారా కథలు, బాకీ కథల వంటి కొన్ని వందల కథలు, రాజు-మహిషి, రత్తాలు-రాంబాబు, గోవులొస్తున్నాయి జాగ్రత్త, సొమ్ములు పోనాయండి వంటి నవలలు, నిజం, విషాదం, తిరస్కృతి వంటి నాటకాలు, ఇంకా ఎన్నో ఇతర రచనలు ఆయన తెలుగువారికిచ్చిపోయిన సాహిత్య వారసత్వం.

తెలుగువాడైపోయారుగాని రచయితగా రావిశాస్త్రి ఔన్నత్యం ఏ ప్రపంచ రచయితకు తీసిపోదు. ఆయనను పోలిస్తే ఒక చెఖోవ్‌తో పోల్చాలి. ఒక గోర్కీతో పోల్చాలి. మొదటి నుంచి ఆయన చాలా "కాన్షస్" రచయిత. తాను వ్రాసేదేమిటో, ఎవరి గురించి, ఎవరి కోసం వ్రాస్తున్నాడో తెలిసిన రచయిత. "రచయిత అయిన ప్రతివాడూ తాను రాస్తున్నది ఏ మంచికి హాని కలిగిస్తుందో, ఏ చెడ్డకి ఉపకారం చేస్తుందో అని ఆలోచించవలసిన అవసరం వుందని నేను తలుస్తాను... ప్రతి రచయిత తాను ఎవరి మంచి కోసం రాయాలో ఎప్పుడో ఒకప్పుడు నిర్ణయించుకుంటాడని నేను అనుకుంటాను" అని ఆయన చాలా స్పష్టంగా తన సాహిత్య ధ్యేయం గురించి వ్రాసుకున్నారు.

శ్రీకాకుళం, విజయనగరం, విశాఖ జిల్లాల మాండలికాన్ని, ముఖ్యంగా అట్టడుగు వర్గాల భాషను అంత సొగసుగా, అంత పదునుగా, అంత శక్తితో వ్రాసిన రచయిత మరొకరు లేరు. ఆధునిక వచన సాహిత్యంలో ఆయనదొక ఆచార్య పీఠం. ఆయనొక కులపతి. రెండు మూడు దశాబ్దాల యువ రచయితలపై ఆయన రచనల ప్రభావం, వ్యక్తిగత ప్రభావం పడింది. ఇకపై మన సాహిత్య వీథులవలె విశాఖపట్టణ వీథులు కూడా ఆయన లేని లోటుతో వెలవెలపోతాయి.

*(నవంబరు 11, 1993)*

# తలతిక్క నిర్ణయం

చీఫ్ ఎలెక్షన్ కమిషనర్ శేషన్ అందరిని ఒకాట ఆడించేస్తున్నారు. రోజుకొక కొత్త ఆంక్షను ప్రకటిస్తూ, రోజుకొక కొత్త వివాదాన్ని సృష్టిస్తున్నారు. ఈ ఉబలాటంలో తన తలతిక్క నిర్ణయాల సాధ్యాసాధ్యాలనుగాని, ఔచిత్య అనౌచిత్యాలను గాని పట్టించుకుంటున్నట్లు లేదు.

పదవీ స్వీకారం చేసినప్పటినుంచి ఇదే వరస, ఆరునూరైనా పంజాబు అసెంబ్లీకి ఎన్నికలు యథావిధిగా జరిపించి తీరుతానని ఆఖరివరకు అంటూ వచ్చిన శేషన్, ఎన్నికలు మరి 24 గంటలలో జరగవలసివుండగా, హఠాత్తుగా వాటిని రద్దుచేసి అందరిని ఆశ్చర్యంలో, దిగ్భ్రాంతిలో ముంచెత్తారు. అప్పటిలో కేంద్రంలో కాంగ్రెస్ ప్రభుత్వం అధికారంలోకి రానున్నదని గ్రహించి, పంజాబు ఎన్నికలను బహిష్కరించిన ఆ పార్టీకి ప్రయోజనం చేకూర్చిపెట్టాలన్న ఉద్దేశంతోనే ఆ ఎన్నికలను రద్దుచేశారన్న అభిప్రాయం కలిగించారు.

కాని, శేషన్ మహాశయుడికి అలాంటి అభిప్రాయమేమీ లేదని త్వరలోనే అందరికి అనుభవమైంది. చేతికిందికొస్తే చేతిదెబ్బ, కాలికిందికొస్తే కాలిదెబ్బ అని పిల్లలు ఆడుకున్నట్టు, తనకున్న అధికారాలతో ఆడుకున్నారాయన. ఈ క్రమంలో ఆయన వారు వీరు అనే భేదమేమీ కనబరచలేదు. అధికారపక్షానికి, ప్రతిపక్షాలకు సమానంగానే ఆయన అధికార దండ ప్రహారాలు తగిలాయి. ఒక దశలో ఆయనను ఇంపీచ్ చేసి తగిలేద్దామనే ఆలోచన కూడా కొన్ని పార్టీలు చేశాయి.

స్వ, పర అనే దురభిమానాలేవీ లేకుండా అందరికీ సమానంగానే చురకలు తగిలిస్తున్నందున శేషన్‌కు వేరే దురుద్దేశాలేమీ అంటకట్టడానికి వీలులేని మాట నిజమే. నాలుగు దశాబ్దాలుగా భ్రష్టుపట్టిపోయి, కుళ్ళిపోయి, దుర్భర దుర్గంధం వ్యాపింపజేస్తున్న మన ఎన్నికల వ్యవస్థను సమూల ప్రక్షాళనం చేసి నిసర్గ సుందరంగా ప్రకాశింపజేయాలనే సదాశయమే ఆయనకున్నదని అనుమానించడంలో తప్పు లేకపోవచ్చు కూడా. పెక్కు సందర్భాలలో ఆయన అభినందనీయమైన నిర్ణయాలే చేశారు. ఎప్పుడు ఎందుకు ఎవరిమీద తన కత్తివేటు పడుతుందో అనే భయాన్ని ఆయన అన్ని పార్టీలలోను కలిగించారు కూడా. ఈ భయం మూలంగానే ఆ మధ్య జరిగిన ఉత్తరాది రాష్ట్రాల అసెంబ్లీ ఎన్నికలు ఆనవాయితీకి భిన్నంగా, ఫిర్యాదుకు తావులేకుండా జరిగిపోయాయి.

నిజమే. కాని, ఎన్నికల వ్యవస్థను సంస్కరించాలన్న ఆయన ఉత్సాహం వుండుండి కట్టలు తెంచుకుని ప్రవహిస్తున్నట్టు కనిపిస్తుంది. దాని ఫలితమే తరచుగా ఆయన చేస్తున్న వివాదాస్పద నిర్ణయాలు. ఈ వివాదాస్పదత్వానికి సరికొత్త ఉదాహరణ మొన్న కర్నూలు లోక్‌సభ ఉప ఎన్నిక సందర్భంలో ఆయన ఆంక్షలు.

కర్నూలు ఉప ఎన్నిక వచ్చే మే 26వ తేదీన జరుగుతుందని మార్చి 3వ తేదీన ఎన్నికల కమిషన్ ప్రకటించింది. తేదీ ప్రకటన జరిగింది కనుక, ప్రకటన జరిగిన తేదీనుంచి ఎన్నికల కార్యక్రమం ముగిసేవరకు కర్నూలు లోక్‌సభ నియోజకవర్గంలో అధికార పర్యటనలు, అభివృద్ధి కార్యక్రమాలు ఏవీ జరగరాదని ఎన్నికల చీఫ్ కమిషనర్ శేషన్ ఆంక్షలు విధించారు. దీనితో ఆ నియోజకవర్గంలో అదివరకే నిర్ణయమైపోయిన కార్యక్రమం ప్రకారం పర్యటిస్తున్న ముఖ్యమంత్రి విజయభాస్కరరెడ్డి తన పర్యటనను అర్ధంతరంగా రద్దుచేసుకుని తిరిగి పోవలసి వచ్చింది.

ఈ సందర్భంలో చాలా ప్రశ్నలు తలెత్తుతాయి. ఎన్నిక తేదీకి సరిగా నెలరోజుల ముందుగా ఎన్నిక నోటిఫికేషన్ వెలువడాలి. నోటిఫికేషన్ వెలువడిన తర్వాత మంత్రులు అధికార పర్యటనలు పెట్టుకున్నా, అభివృద్ధి కార్యక్రమాలు ప్రకటించినా అది ఎన్నికల నియమావళికి ఉల్లంఘన అవుతుంది. దానిపై చర్య తీసుకునే అధికారం ఎన్నికల కమిషన్‌కు వుంటుంది.

అలాకాక, నోటిఫికేషన్ తేదీకి 50 రోజుల ముందే ఎన్నికల తేదీని 'ఎనౌన్స్' చేసి, ఎనౌన్స్‌మెంట్ తేదీనుంచే అధికార కార్యక్రమాలేవీ జరపరాదని ఆంక్ష విధించడం సబబేనా? కర్నూలు ఉప ఎన్నిక మే 26 కనుక, నోటిఫికేషన్ ఏప్రిల్ 26న వెలువడాలి. ఆ విషయం మార్చి 3వ తేదీననే ప్రకటించి, ఆ క్షణంనుంచే అధికార కార్యక్రమాలపై నిషేధం ఎలా విధించారు? యాభై రోజుల ముందుకాక నూటయాభై రోజులముందే ఎన్నిక తేదీని ప్రకటించినా, ఆనాటినుంచే ఈ నిషేధం వర్తిస్తుందా? శేషన్ అలా ప్రకటించరని హామీ లేదు. ఆయన టి (తలతిక్క) ఎన్ (నిర్ణయాల) శేషన్ కదా?

ఈ లెక్కన నవంబరులో జరగవలసిన అసెంబ్లీ ఎన్నికల తేదీని కూడా ఇప్పుడే ప్రకటించి, అప్పటివరకు రాష్ట్రంలో ఏ అధికార కార్యక్రమాలు జరగరాదని నిషేధించవచ్చునా? ఇలా జరుగుతుందని కాదుకాని, చీఫ్ ఎలెక్షన్ కమిషనర్‌కు సర్వాధికారాలు వున్నాయని అంగీకరించిన తర్వాత ఇటువంటి అవకతవకలన్నీ సంభవమే కదా?

కర్నూలులో ముఖ్యమంత్రిపై ఆంక్షను కొందరు హర్షించారు. కాని, అది పూర్తిగా శేషన్ నిరంకుశాధికార వినియోగంగానే భావించాలి. స్వేచ్ఛగా, న్యాయంగా ఎన్నికలు నిర్వహించవలసిన బాధ్యత ఎన్నికల కమిషన్‌దే కాని, ఆ బాధ్యతా నిర్వహణ పేరుతో దాన్ని నిరంకుశాధికారాలు చెలాయించనివ్వడం మంచిది కాదు.